# కళ్యాణరాముడు



రచయిత: చామర్తి కూర్మాచార్యులు
సింగుపురం

# సమర్పణ

ఆరుకాండలు కావివి, యారుపూలు
నీదు చరణాల కర్పింతు నిండు భక్తి
చరిత నీయది గైకొని కరుణ జూడు
జానకీరామ శ్రీరామ శరణు శరణు.

ఇట్లు
ర చ యి త



ఆనందనిలయుడైన శ్రీ శ్రీనివాసునకు

నా నమః కుసుమాంజలులు

# కళ్యాణ రాముడు

రచన: విద్యావినోద, భాషాప్రవీణ పండిత

చామర్తి కూర్మాచార్యులు

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి

ద్రవ్యసహాయముతో ముద్రింపబడినది

వదాన్యుల ఆర్థిక సహాయముతో ప్రచురింపబడినది

# కళ్యాణ రాయుడు



ప్రతులు : 1000

ముద్రణ : తిరుమల తిరుపతి దేవస్థానము

వారి ద్రవ్య సహాయముతో

దొరకుచోటు : సి. హెచ్. శ్రీనివాసాచార్యులు

శ్రీముఖలింగం - 532428



మరియు

సి. హెచ్. కూర్మాచార్యులు

భైరిసింగుపురం

(వయా) ఆముదాలవలస

శ్రీకాకుళం (జిల్లా)

రచయిత : చామర్తి కూర్మాచార్యులు

# నా మాట

పాఠకులకు నమస్కారాలు,

కళ్యాణరాముడు అంటే రామకథయే. ఆరుకాండలు ఆరు పూలనుపేర వ్రాశాను. చాలా వరకు వాల్మీకినే అనుసరించాను. గోవిందరాజులుని కూడా దృష్టిలో నుంచుకున్నాను. పాఠకులకు చదవడానికి, ఉత్సుకత కలగడానికి "నవల" తీరున వ్రాయ ప్రయత్నించాను. చదువుతారు కదూ!

కలంతోగిలికే ప్రతీవాడు రామకథను వ్రాస్తున్నాడు. వ్రాస్తాడు. నేను అదే చేశాను. ఆ వ్రాత ఇహపరసాధనమంటారు. పెద్దలు. రాముడు కరుణిస్తాడంటారు. వ్రాసేవాడు, చదివేవాడు రామునకు ప్రీతిపాత్రులు. పలువిధాల, పలుభాషలు, పలుదేశాలలో వ్రాసారు కవులు. రామకథ రమణీయమైనదే. భారతీయ సంస్కృతికి ఆదర్శమైనది. పరానికి మార్గదర్శక మైనది. ఇహానికి అనుసరణీయ మైనది. మానవ మనుగడకే అది మాన్యమైన మూలసూత్రం ఎందుకంటే

నాయకుడు రామునిగా అవతరించిన శ్రీమహావిష్ణువు. ధర్మాన్ని స్థాపించడానికి, దుష్టుల శిక్షించి, శిష్టుల రక్షించడానికి త్రేతాయుగంలో అవతరించాడు. సీతమ్మ శ్రీమహాలక్ష్మియే. ఆ ఆదిదంపతులు లోకకళ్యాణార్థం సీతారాములుగా అవతరించారు. వారి కథ వాల్మీకి తొలుతపౌలస్త్యవధ మనుపేర వ్రాశాడు. అదే రామా యణం. అదే రామకథ.

పితృభక్తి, సహనం, త్యాగము, భ్రాతృత్వము, కారుణ్యము శరణత్వము, మున్నగు చాలా విషయాలు మనకు ఆదర్శాలు. జగత్కళ్యాణ దాయకమైన రామకథ కళ్యాణరాముడు చదవండి.

నా పాత్రలో దొసగులు ఉంటాయి. మన్నించండి. మంచిని గ్రహించండి. రాముని కృపకు పాత్రులుకండి. దయవుంచి తమ ఆశీస్సులు అందించండి. నా మాట మన్నిస్తారు కదూ!

సెలవు

ర చ యి త

**చామర్తి కూర్మాచార్యులు**

సింగుపురం.

---

## ★ పాఠకులకు విజ్ఞప్తి ★

అనివార్యకారణాలచే అక్షరదోషములు దొర్లబడ్డాయి. కథాగమనమునకు ఈ దోషములు అడ్డురావని, మలి ముద్రణలో వీటిని సవరించగలవని మనవి చేయూచూ........

ర చ యి త.

---

# శు భా కాం క్ష

**డా॥ ఆర్. వి. వి. గోపాలాచార్యులు,**
ఎం ఏ. ఎం.ఇడి. పి. హెచ్.డి,
తెలుగు ఉపన్యాసకులు,
ప్రభుత్వ సమగ్ర విద్యాబోధన కళాశాల,
రా జ మం డ్రి.

శ్రీమాన్ చామర్తి కూర్మాచార్యులు వారు వ్రాసిన గ్రంథం "కళ్యాణరాముడు" చూచే భాగ్యం కలిగింది. సంప్రదాయ విధానంలో కావ్యాలను, వ్యాకరణాది శాస్త్రగ్రంథాలను క్షుణ్ణంగా చదువుకున్న వీరిరచనపై అభిప్రాయం వ్రాయుడం నా అల్పజ్ఞతను చాటుకోవడమే అవుతుంది.

"గద్యం కవీనాం నికషంవదన్తి" అన్న ఆర్యోక్తి గద్యరచనలో గల క్లేశాన్ని వివరిస్తుంది. అటువంటి గద్యరచన శ్రీ చామర్తివారి చేతబడి సర్వాంగ సుందరంగా రూపురేఖలు దిద్దుకుంది. దీనికి కారణం ఒక్కటే, అచంచలమైన రామభక్తి. వీరి రచనలో తన్మయత్వం అడుగడుగునా కన్పిస్తుంది. "ఆతని మేనిచ్ఛాయ నల్లకలువలలోని నైల్యమో లేక సముద్రములోని నీలిమయో........ లేక మూడింటి సమవాయయో" ఇలా ప్రవాహం లాగా వీరి లేఖినినుండి భగవద్వర్ణనలు ఎడతెగకుండా వెలువడ్డాయి.

కళ్యాణరాముని పేర జగత్కళ్యాణ కారకమైన రామకథను పట్టాభిషేక పర్యంతం అందమైన గద్యరూపంలో వ్రాసిన శ్రీమాన్ చామర్తి కూర్మాచార్యులవారు ఇటువంటివె మరిన్ని కావ్యాలు వ్రాయాలని, అవన్నీ తెలుగు పాఠకలోకానికి అందాలని మనసారా కోరుకుంటున్నాను.

ఆ కళ్యాణరాముడు వీరికి ఆయురారోగ్య ఐశ్వర్యాలను కల్గించి సర్వధా రక్షించుగాక: అని ఆకాంక్షిస్తూ........

సెల్వు,
**డా॥ ఆర్. వి. వి. గోపాలాచార్యులు**
రాజమండ్రి.

    

సాహిత్యశిరోమణి, సాహిత్య విద్యాప్రవీణ,
భాషాప్రవీణ, వేదాంతభూషణ,
ఆయుర్వేదాచార్య,
**శ్రీమాన్ మహేంద్రాడ వెంకట జగన్నాథస్వామి**
కళింగపట్నం.

శ్రీరామ జయరామ, జయజయ రామ

విద్యావినోదులు, భాషా ప్రవీణులు, శ్రీరామ చరిత్ర పారాయణ పరాయణులు పాంచరాత్ర తంత్ర నిష్ణాతులు సదాచార్య కటాక్ష పరిపూర్ణులునగు ఉ॥ వే॥ శ్రీమాన్ చామర్తి కూర్మాచార్యుల వారు నేర్పుతో కూర్చిచూపిన "కళ్యాణరాముని" కనులారా గాంచితిని ముదమందితిని.

కవికోకిల, మునిసింహుడు ఆదికవియగు వాల్మీకి సత్కృతిని నేటియువత తమితో చదివి ఆనంద మొందునంత సులువుగా మలచి కొంగ్రొత్త తీరులలో "కళ్యాణరాముడ" ను పేర అదికావ్యమునే తెనుగున వెలయించినారు. వీరిదివరకు "సల్లాపములు" "పురుషోత్తముడు" మొదలగు రచనలను పాఠకులకు అందించిన కవివరులు. తెలుగువచన రచనలో అందెవేసినచేయిగా వాసినందినారు

ఈ కళ్యాణరామ సత్కృతి ఔచిత్యము నతిక్రమించక నవరసభరితమైన, మృదుపసమన్వితమై, శ్రీ సీతారామ కళ్యాణగుణ సముత్కటమై, ప్రసన్నగంభీరభావ సముజ్వల సమన్వితమై యొప్పు చున్నది. శ్రీకవిగారి పరమసాత్త్విక చిత్తవృత్తి కళ్యాణరాముని రచనలో స్పష్టముగా గోచరించుచున్నది.

ఈ సత్కృతి శ్రీమంతుడు, శ్రీపతి, శ్రీనిధియగు శ్రీనివాసుని కటాక్షమున నచిరకాలములో ముద్రితమై చదువరులకు పరమా నందము కలిగించుగాక యని ఆ దేవునికంజలిఘటించి ప్రార్థించు చున్నాడను.

ఇతి సహృదయ విధేయుడు

**మ॥ వె॥ జగన్నాథస్వామి**

కళింగపట్నం.

   

## మున్నుడి

**శ్రీమాన్ ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు**
కార్యదర్శి, ఉపనిషన్మందిరం.
శ్రీకాకుళం.

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

ఉ॥ వే॥ శ్రీమాన్ చామర్తి కూర్మాచార్యులుగారు రచించిన "కళ్యాణరామం" ను చూచే భాగ్యం కలిగింది. భారతీయ భాషలలో రామకథకున్న ప్రాచుర్యం మరే పురాణగాథకు లేదన్న సత్యం

అందరంగీకరించినదే. ఒక్క భారతదేశంలోనేగాక రామకథ విశ్వ సాహిత్యంలో ఎన్నో రూపాలతో దర్శనమిస్తుంది. కావ్యంగా నాటకంగా ఆభాణకంగా, చంపువుగా, పెక్కు జనప్రియ ప్రక్రియలలో శ్రీరామ కథ పండిత తదితర జనరంజకంగా నేటికిని ఆదరింపబడుతు ఆరాదించబడుతుంది.

శ్రీమాన్ ఆచార్యులవారి ఈ రచన వ్యాఖ్యానసాపేక్షమైన కావ్యంగానో రాద్ధాంతసిద్ధాంత భూయిష్టమైన శాస్త్రగ్రంథంగానో పరిభాషా పరివేషముతో సామాన్య పాఠకునకు దూరంకాని నూతన పద్ధతిలో సులభసుందరమైన పదబంధంతో ఆధునిక యువకులు సహితము కుతూహలపడే వచనరచనలో శ్రీరామాయణతత్త్వాన్ని మహర్షి హృదయాన్ని అందించే హృదయంగ మా ప్రయత్నమే ఈ "కళ్యాణరాముడు" తర తరముల సంప్రదాయమునకు వారసులుగా మేధోహృదయాలను రెండింటిని ఉపయోగించి పెక్కు పర్యాయములు రామాయణాన్ని పఠించి, ప్రవచించిన అనుభవంతో సాధారణంగా శ్రోతృవర్గంలో కలిగే శంకలకు సమాధానాలు లభించే రీతిలోసాగిన ఈ రచన నేటి పాఠకలోకమునకు అత్యంతోపయుక్తమై భాసిల్ల గలదని, ఇది యొక కల్పవృక్షమై, ఆశ్రయించిన వారికి తాపోపశమన మొనర్చి నిర్వృతిని ప్రసాదించగలదని విశ్వసించుచూ

దీనిని శ్రద్ధగా పఠించవలసినదిగా పాఠకులనాహ్వానించుచున్నాను. సమగ్రమైన ఇట్టి కృషిసల్పిన శ్రీ ఆచార్యులవారికి అంజలించుచున్నాను.

చరితం రఘునాధస్య శతకోటి ప్రవిస్తరం।
ఏకైక మక్షరంప్రోక్తం మహాపాతకనాశనమ్॥

ఇట్లు
**ఆ. లక్ష్మీనారాయణాచార్యులు**
శ్రీకాకుళం.

# -: కృతజ్ఞతలు :-

కళ్యాణరాముడను నా కృతిని పరిశీలించి తమ అమూల్యములైన అభిప్రాయములు ఒసంగిన పండిత ప్రాకాండులకు, కోరిన వెంటనే ఈ పుస్తకము పరిశీలించి ముద్రణ వ్యయమునకు 50% (రు॥ 1500/-లు) చేయూత నిచ్చిన శ్రీతిరుమల తిరుపతి దేవస్థానము వారికి మరియు ఇతోధికంగా తోడ్పడిన దాతలకు శతధా ధన్యవాదములర్పించు చున్నాను.

నా రచన శుద్ధప్రతి తయారు చేయుటలో తగు విధముగా సహకరించిన శ్రీముఖలింగం వాస్తవ్యులు బంకుపల్లి శ్రీహరిశర్మ సోదరులకు శుభాశీస్సు లందించు చున్నాను.

చక్కనిముద్రణా సౌకర్యములు కలిగించి ఈ పుస్తకమును సర్వాంగ సుందరంగా ముద్రించి సకాలములో అందించిన శ్రీ శ్రీనివాస పవర్ ప్రింటర్స్. నరసన్నపేట వారికి, కవరుపేజీని ముచ్చటగా తీర్చిదిద్దిచ్చిన శ్రీ పురాణపండా రాధాకృష్ణమూర్తి, రాజమండ్రి వారికి కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

ఎందరో మహానుభావులు స్వహస్త పరహస్తాలతో ఈ పుస్తకమును వెలుగులోనికి తెచ్చినందులకు వారందరికీ ఆ కళ్యాణ రాముడు కరుణించుగాక యని మనసారా కోరుకుంటూ సెలవు....

ఇట్లు
రచయిత
**చామర్తి కూర్మాచార్యులు**
సింగుపురం

# కళ్యాణరాముడు

రచయిత:- చామర్తి కూర్మాచార్యులు

## ప్రథమ పుష్పం

అతడు నిత్యానందుడు. అంతటా ఉంటాడు. అవసరమైతే మన కోసం అవతరిస్తాడు, మనబాగుకోసం శ్రమిస్తాడు, కష్టాలు అనుభవిస్తాడు, గుణపాఠం చెబుతాడు. అతని ఆదిఅంత్యములు ఎవరికి తెలియవు. అతడు పరమపురుషుడు.

ఇది అతని గాథ. ఏనాటిదో! కథ కాని కథ నిజమైనగాథ ఎంత పాతదనమునైనా క్రొత్తదనం కోసం నా ప్రయత్నము. ఇది ఈనాటిదికాదు, నెలనాటిది కాదు, సంవత్సరం నాటిది కానేకాదు. యుగాలనాటిది కాదు, యుగయుగాలనాటిదీగాధ. వేదాలకు సమ్మతమైన గాధ. ఉపనిషత్తులుసూచించే బోధ. మానవ మనుగడకే అది యొక హితబోధ.

జ్ఞానులకు. భక్తులకు సుధ, నాస్తికులకు అజ్ఞానులకు వ్యథ బుధులు మెచ్చింది, కవులు వ్రాసింది, గాయకులు పాడింది, జనులు చెప్పుకునేది. అది ఎంత ప్రాతదైన సరి క్రొత్తగానే యుంటుంది నాకైతే మరీ బాగుంటుంది. రక్తి, భక్తి, భుక్తి, ముక్తి కలిగించేది. అందరికి ఆసక్తి కలిగించేది. అని బుద్ధి పుట్టి పెద్దలు చెప్పబట్టి ఆదైవమునకు దండం పెట్టి వ్రాయటానికి ప్రారంభించాను.

గద్య; పద్యాలు, పాటలు పదాలు కాని మాటలు ఆమాటలు కూడా నాకు తోచినట్లు దేవుడు తోపించినట్లు.

ఆ కథకు నాయకుడు, మూలపురుషుడు, పురుషోత్తముడు మనకందరకు తెలిసినవాడే మనం ఇళ్ళలోను, గుళ్ళలోను పెట్టుకుని అతని ప్రతికృతిని భక్తితో పూజిస్తాం, భజిస్తాము, సేవిస్తాం ఆనంది స్తాము కథాక్రమంబెట్టిదంటే?

## ॥ బాల్యము ॥

ఆనందం, అందము మూర్తీభవించినది అరూపము కొంద రంటారు ధర్మమే రూపుదిద్దుకొన్నది అని మనకు కనిపించే రూపము అందము మాత్రమే. అతని మేలిచ్ఛాయ నల్లకలువలులోని నైల్యమో లేక సముద్రంలోని నీలియో మేఘాలలోని కాలియో లేక ఈమూడింటి సమవాయమో అనిపిస్తుంది. కలువలలోని సౌకుమార్యము, సముద్ర ములోని దయా, గాంభీర్యాలు మేఘాలలోని నైల్యం అతని శరీరా నినికున్నాయి. దయా, గాంభిర్యాలు అతని స్వభావములు అవి క్రియారూపంలోనే భాషిస్తాయి. అవి మనకు కనబడవు. కమల దళా ల్లాగ దీర్ఘమైయుండిన ఆ కన్నులనుండి వెలువడిన చూపులు వెన్నెల లు కురిపిస్తాయి ఎత్తైన కోటేరు లాంటి ముక్కు సంపెంగతో సరిపో తుందంటారు. దొండపండులాంటి అధరాలు ఎప్పుడూ చిరునవ్వులు చిందిస్తూఉంటాయి. పువ్వులు విరబూసినట్లే ఉంటాయి, మునుకుల వరకు చేతులు సువిభక్తాలై యుండి అరచేతులు అరుణిమ కలిగి కెందామరలను మరిపిస్తాయి, విశాలం, పీనము అగు వక్షస్థలం ఎగుభుజాల నడుమ హృదయ వైశాల్యమును సూచిస్తుంది కరి కరోపమము లైన అరికాళ్లు చక్రవర్తి చిహ్నములై శంఖచక్రాది గుఱుతులు కలిగి అరుణ కమలాలతో సాటియైన అతని పాదములు వాటి తాకిడి చేతనే పుడమి తల్లి ధన్యమై పులకించిపోతుంది గాలికి కొద్దిగా చలిస్తున్న

ముంగురులు కల అతని తలపైనున్న నవరత్నఖచితమైన మకుటము దానిపై కలికితురాయి గాలికి కొంచము నాట్యముచేస్తూరమణీయుంగా వుంటుంది. కర్ణాభరణములు, కంఠాభరణములు, కంకణ అంగుళీయక ములు చాలా అకర్షణీయముగా వున్నాయి. పచ్చని పతకాలు గల బంగరు మొలతాడు పచ్చని పట్టుపుట్టముపై ప్రకాశిస్తున్నది. బంగరు సరిగంచులు గల ఎఱ్ఱని ఉత్తరీయము కటిని అలంకరింపబడి యున్నది. ఆ దివ్యసుందర రూపుడు వీటిని అన్నిటిని ధరించి చేసి నందులకే ఆ ఆహార్యమునకు సార్థకత కలుగజేయుచున్నది. అతడు రాచబిడ్డయని చెప్పకయే తెలియజేయుచున్నది. అతనిపేరు ఏమిటి? తల్లిదండ్రులు పెట్టినపేరు రాముడు. అందుచేత అనాటినుండి నేటి వరకు అతనిపేరు రాముడే. ఏమీ మారలేదు, మార్చుకోనూలేదు.

అతనికి ముగ్గురు సోదరులు ఉన్నారు. వారు సవతితల్లి బిడ్డలు ఐనా అలా అనిపించరు. ఏకోదరులువలే చూపరులకు అనిపిస్తారు. వారికి పేర్లున్నాయి. ఒకడు భరతుడు, రెండవవాడు లక్ష్మణుడు, మూడవ వాడు శత్రుఘ్నుడు. రూపము, గుణము, వయస్సు ఈ నల్వురుకు ఒక్కటే. భరతుడు మాత్రము కొంచము రాముని రంగు కలిగి యుంటాడు. లక్ష్మణ, శత్రుఘ్నులు కొంచం రాగి కలిసిన బంగారు వన్నె కల్గియుంటారు. వీరి బాల్యమును, తల్లిదండ్రులను మున్నగు విశేషములు తెల్సుకోవాలంటే పది వసంతాలు వెనుకకుపోయి చూడాలి అవేళ అప్పుడే సుప్రభాతము అవుతున్నది. తూర్పున వెలుగు రేఖలు ఆకాశానికి బంగారుపూత పూస్తున్నాయి. ప్రత్యూష పవనాలు సరయూ నదిలో స్నానమాడి కెరటాలమీద తేలియాడుచూ క్రమ క్రమముగా మెలమెల్లగా చల్లగా నలుదిక్కులా వ్యాపిస్తున్నాయి. బద్ధకంగా ఒల్లు విరుచుకొని నగరం కళ్లు తెరచింది. నగరు వాసులు

ఒకరు, ఇద్దరు, పలువురు ఇట్లానే స్వకార్య నిరతులౌతున్నారు. ఆ నగరం పొడవు రెండు యోజనాలు; అంటే ఎనిమిది మైళ్లన్నమాట మూడుయోజనాలు విస్తీర్ణము కలిగియున్నది. చాలా ప్రాచీనకాలం నాటిదైనా సరికొత్త నిర్మాణంలా కన్పిస్తుంది. ఎవరో ఎప్పుడో మనువు అనువాడు నిర్మించాడట. రాజమార్గాల కిరువైపులా మహోన్నత ప్రాసాదాలు కలవు. నాలుగుదారుల కూడలిచోట రావి, మర్రి, మొదలగు వృక్షాలు కలిగి పక్షులకు ఆవాసము, పాంధులకు నీడనిచ్చి సేద తీరుస్తున్నాయి. అక్కడ ఉద్యానవనాలు వాటిలో జలయంత్రాలు కలిగి ప్రజలకు విశ్రాంతిని, ఆనందాన్ని కలుగ జేస్తున్నాయి

ఆ నగరం పేరు అయోధ్య. అంటే శత్రువు చొరడానికి అది సాధ్యం కాదన్నమాట. ఆ నగరంలో నాల్గు వర్ణాలవారు వున్నారు. అన్ని వృత్తులవారు అక్కడే వున్నారు. ఎల్లప్పుడూ దిగులెరుగని ఆనందంతో వారు ఉంటారు. తమ తమ ధర్మాలను నిర్వహిస్తూ పరస్పర సహకారంతో ఆయురారోగ్య భాగ్యాలతో ఉన్నారు.

ఆనాటి ఉపయాన స్నాన సంధ్యాది కార్యాలు ముగించుకొని పురుషులు, స్త్రీలు, ఆబాలవృద్ధులు అలంక రించుకొని బంగారు పళ్లెరములతో పండ్లు, పువ్వులు, తినుబండారాలు పట్టుకొని ఆనందంతో ఒకరితోఒకరు ఏదేదో చెప్పుకుంటూ సందడిగా కోటవైపునకు వెళ్లుచున్నారు. పట్టణమంతా పరిపరి విధాలుగా అలంకరింపబడి వీణా వేణు మృదంగ వాద్యాలతో, అగరు, సాంబ్రాణీ, గుగ్గులు ధూప దీప ధూమములతో సురభిళమైన రాజ ప్రాసాదానికి చేరుకున్నారు. ఇంకను వచ్చేవారు వస్తూనే యున్నారు. అందరకు స్వాగతాలు సాదరపూర్వకంగా జరుగుచున్నాయి.

అది రాజభవన సింహద్వారము దానికిరువైపులా గెలలుకల అరటిచెట్లు, పోకబోదెలు నిలిపారు. వాటిపై భాగాన ద్వారానికి మామిడి చిగుళ్లతో కూడిన పూల తోరణాలు కట్టారు. ద్వారపాలకులిరువురూ ఆ వచ్చేవారిని సగౌరవంగా లోనికి పంపిస్తున్నారు. ప్రధానమైన రాజసింహద్వారముకల ప్రాసాద శిఖరాగ్రమున దేవకాంచనవృక్షము గురుతుగాగల జెండా రెపరెపలాడుతూ ఎగురుతూయున్నది. నాలుగు రాజప్రసాదాల నడుమ విశాల స్థలంలో ఎత్తైన పందిరి వేయబడింది దానికి మామిడి, పూల తోరణాలు కట్టారు. స్థంబాలకు అరటి, పోక చెట్లను అమర్చారు. అవి పూలతీగెలతో అల్లుకొని యున్నాయి. గంధోదకంతో అంతటా కలయంపి జల్లి ముత్యాలతో ముగ్గులు వేసారు నేల మెత్తని ముఖమూలు ఏవాటీలు. రత్న కంబళ్లు పరువబడి యున్నాయి. ఆగంతకులు వచ్చి కూర్చుంటుయున్నారు. పలువురు రాజబంధువులు, రాజులు తగు ఆసనాలను అధిష్టస్తూ యున్నారు. ధృష్టి, జయంతుడు, విజయుడు, సురాష్ట్రుడు, రాష్ట్రవర్ధనుడు, అశోకుడు, ధర్మపాలుడు. సుమంత్రుడు అను ఈ అష్ట ప్రధానులు వచ్చి తమకే విధించబడిన ఆసనములపై నధిష్టించారు. వశిష్ఠుడు, వాసుదేవుడు, జాబాలి, గౌతముడు, కాశ్యపుడు మొదలగు రాజ పురోహితులు, కృష్ణాజినములపై కూర్చొని యున్నారు. బంగరు పీటలపై మహారాజగు దశరథుడు అతని అర్ధాంగులైన కౌశల్య సుమిత్ర, కైకేయిలు, సర్వాలంకార శోభితలై అధిష్టించారు. పురోహితులు మంత్రాలు చదువుచున్నారు. నడుమ నడుమ అక్షతలు పువ్వులు చల్లుతున్నారు, ముత్యాల ముగ్గులనడుమ గంధ తైలావ శిక్తముల్తైన దీపములు వెలుగుచున్నాయి, వెండి, బంగారు పళ్లె రాలలో పండ్లు, తమలపాకులు, వక్కలు, బియ్యము. అక్షతలు, పూలు, నూతన పత్రములు, పరిమళ ద్రవ్యములు, అన్నీ సమకూర్చ

బడ్డాయి. పాలు, పెరుగు. తేనె, నెయ్యి, వలయు సంభారము లన్నియు సమకూర్చబడ్డాయి. ఆత్మీయులైన పుణ్యస్త్రీలు సలుపురు శిశుపులను మెత్తని పొత్తిళ్లలో నిడుకొని తీసుకువచ్చి కౌశల్యాది రాణుల ఒడిలో కూర్చుండబెట్టారు. అంతటా చిన్న కలకలము ఆనందంతో వ్యాపించింది. ఆ సందడి నడుమ వషిష్టుడు రాజును చూచి ఈలాగు అంటున్నాడు,

"ప్రభు! కార్తాంతింతుకులు ఛిరంజీవుల జాతకాలు వ్రాసి తీసుకువచ్చారు"

దశరథు: "గురువర్యా! చదివి వినిపించండి" అన్నాడు.

వసిష్టుడు: అవహిత మనస్కులై ఆలకించండి ప్రభూ! స్వస్తిశ్రీ చాంద్రమాన సంవత్సర చైత్ర శుద్ధ నవమీ పునర్వసు నక్షత్రయుత చతుర్ధ చరణ కర్కాటక లగ్నమందున సూర్యుడు, గురుడు, అంగారకుడు. శని, ఈ ఐదు గ్రహములు తమ తమ ఉచ్ఛ స్ధానములలో నుండగా, చంద్రునితో బృహస్పతి చేరినప్పుడు ఛిరంజీవి కౌసల్యా తనయుడు విష్ణువు యొక్క అర్ధాంశముతో జన్మించినాడు,

దశరధుడు! మిగిలిన ముర్వురి జాతకముల గూర్చి తెలియ జేయండి గురువర్యా!

వసిషుడు: వినండి ప్రభూ! పుష్యమీనక్షత్ర మీనలగ్నములో కైకేయి సుతుడు ఆశ్లేషయందు కర్కాటకమున సూర్యుడు వుండగా సుమిత్రాదేవి కవలలను ప్రసవించారు.

దశరథుడు: బాగు బాగు ! ఫలితాలను కూడా సెలవీయరాదా

వసిష్ఠుడు: ప్రభూ! ఆయుష్మంతులైన ఈ నల్వురు తనయులు నీ పూర్వపుణ్య వశమున నీ యింట జన్మించేరు. వేలాది సంవత్సరాలు ఆయుర్దాయ భాగ్యాలు కలిగి అఖండకీర్తి నార్జిస్తారు. నల్వురు ఆ విష్ణువుయొక్క అంశ చేత జన్మించుటవలన నాల్గు విధాలైన మార్గములుగా ధర్మమును ప్రజలలో వ్యాపింప చేస్తారు. అదియును వారి ప్రవృత్తి చేతనే వ్యాపిస్తుంది. సకలప్రజారంజకులై పాలన సాగిస్తారు. మీయొక్క యజ్ఞ, దాన తపస్సులు ఫలించేయి. ఇక ప్రజానంద కారకులైన ఈ శిశువులకు నామకరణములను నిర్వహిద్దామా ?

దశరథుడు: ఆచార్యా! తమ ఆశీర్వాద ప్రభావము వలననే ఇది అంతయూ సమకూరినది. మా వంశాంకురాలు సత్ శ్రేయస్సును పొందుతారు. అదియే మా కోరిక. అనంతర కార్యం సర్వజ్ఞులగు తమరే సాగించండి గురుదేవా! అని అనగానే బంగారు పళ్లెరము నిండా ముత్యాలు కొనిరాబడ్డాయి. వశిష్ఠుడు దానిని దశరథమహారాజుకు ఇచ్చి బంగారు శలాకతో ముత్యాల పళ్లెంలో మూడు రేఖలు గీయించాడు. తరువాత రాజుచేత ఈవిధంగా అనిపిస్తున్నాడు.

మంత్రి: మాసనామ్న-నక్షత్రనామ్న-వ్యవహారికనామ్న అని రాజుపై పూర్ణ సాభిప్రాయముగా చూచాడు వసిష్ఠుడు.

ధశరధుడు: ఆర్యా! మా కులపురోహితులు మీరు సర్వజ్ఞులైన తమకు తెలియనిదేముంది? తమరే నామకరణం జరిపించండి అనిపలికాడు వసిష్టుడు కొంచెం ఆలోచించి ఆ పళ్లెరంలో వ్రాయుండి ప్రభూ! "శ్రీరామచంద్రవర్మ, ఆ క్రింది రేఖలో భరతవర్మ, ఆ క్రింది రేఖలో

లక్ష్మణ, శత్రుఘ్నులుగా వ్రాయించాడు. ఆ పవిత్రమైన నామాక్షరములకు షోడశోపచార పూజలు గావించి, మధు, శర్కర, మిశ్రిత క్షీరాన్ని నివేదించాడు. పిమ్మట నామాక్షరములను పూజించిన అక్షతలను క్రమంగా రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల శిరస్సులపై ఉంచి "వర్ధస్వ" అని పురోహితుడు ఆశీర్వదించాడు, అందరూ అక్షతలు మాతా పితృ శిశువులపైన చల్లినారు. ఆ తల్లులు అక్షతులు పిల్లల కళ్లలలో పడకుండునట్లుగా తమతమ పైట చెరగులు చాటు చేస్తున్నారు. శ్రావ్యమైన వాయిద్యాలు మ్రోగుతున్నాయి, ఎక్కడ నుండో ఒక వాయువీచిక చల్లగా మెల్లగా పందిరిలోకి వ్యాపించింది. గాలి తరగల మీద పరిమళాన్ని వ్యాపింపచేస్తుంది. అనాఘ్రాతమైన అపూర్వమైన ఆపరిమళము అక్కడనున్న సభ్యులకు సంభ్రమాశ్చర్యముల కలుగజేస్తున్నది, నలుమూలల నుండి చిన్నచిన్న పువ్వులు జల్లులుగా కురుస్తున్నాయి. అవి ఆ పిల్లల మీద పడుచున్నవి. ఆ పసి పిల్లల బోసినవ్వులు ఆ పువ్వులను వెక్కిరింప చేస్తున్నాయి. ఆ పువ్వులు మల్లికాదు, జాజికాదు, సంపెంగ ఇవేమి మరిగులాబిలా? అవియుకాదు. రంగు రంగులు చిన్న చిన్నవి. కొన్ని పెద్దవి, అపూర్వ సువాసనలు కలవి. అవి కల్పవృక్ష ప్రసూనములు. సన్న సన్నగా శంఖధ్వానాలు వీణా విపంచిక మిశ్రిత రాగములతో అస్పష్టమైన ధ్వనులతో ఏవరో గానములు చేస్తున్నట్లు ఉన్నాయి. ఎవరు? ఎవరూ కనపడరు ఎక్కడ నుండి ఈ పువ్వులు? ఎక్కడ నుండి ఈ గానము అందరూ సంభ్రమాశ్చర్యములతో చూస్తున్నారు ఈ ఉత్సవము, దశరథుడు జరిపించిన పుత్రోత్సవమే కాదు ఇది దేవతల పండుగ ప్రపంచ కళ్యాణహేతువు. ముల్లోకాలకూ పండగే వారి వారి కోరికలు తీరే సమయం ఆసన్నమైనది. కనుకనే అదృశ్యంగా తమ తమ సంతోషాలు ఈ విధంగా వ్యక్తం చేస్తున్నారని ఎవరికి తెలుసు? వశిష్టునికి తెలుసు. కొందరు ఋషిపుంగవులకు మాత్రమే తెలుసు,

దశరధునకు తెలిసినదల్లా పుత్రోత్సవమే. తనకు అమిత ఆనందమును కలిగిస్తున్నదని. తమ బిడ్డలు ఆయు రారోగ్యములతో వర్ధిల్లాలని, తన కాంక్ష చిరకాలానికి నెరవేరిందని ఆనందంతో పొంగి పోతున్నారు. దశరధుడు ఉత్సవమునకు వచ్చిన పిల్లలందరకూ బట్టలు. తినుబండారములు పంచిపెట్టాడు. నగర వాసులంతా ఆ దినము రాజభవనంలో షడ్రసోపేతమైన విందులు ఆరగించారు. వివిధములైన వినోద కార్యక్రమాలుజరిగాయి. కేవలము రాజభవనం లోనే కాకుండ అయోధ్య నగరము అంతటా ఆనందోద్సాహాలు వెల్లి విరిసాయి. రాణులు ముగ్గురు తమ బిడ్డలకు పాలు త్రావించి బంగారు తూగుటుయ్యాలలో పరుండబెట్టారు. లాలలు, జోలలు, యాలలు, ఉయ్యాలలు పాడుతున్నారు. అంతఃపుర పరివారమంతా ఆనందంతో నిండిపోయింది.

సన్నగా కౌసల్యాదేవి "రామాలాలి-నీలమేఘశ్యామా లాలి- తామరసనె దశరధ తనయా లాలి'' అని పాడుచున్నది. కానీ ఆ బిడ్డలు పడుకుంటేనా ? రెప్పలల్లార్చి మిణుకు మిణుకు చూస్తున్నారు బోసినవ్వులు నవ్వుచున్నారు. అలకలు గాలికి అటునిటూ కదులు చున్నవి. ఎర్రని నోట తన బొటనవ్రేలు నుంచి అంతలోనే అటూ ఉటూ చేతులు కదులుస్తున్నారు. కౌసల్యా తనయుడు ఒక్కమారుగా గుక్కపట్టి బిగ్గరగా ఏడవ మొదలుపెట్టాడు. ఆ అమ్మ అనేక విధాలుగా లాలించింది. కానీ ప్రయోజనం లేకపోయింది. ఆ తల్లికి మతిపోయింది. రాముడు ఏడుపు మానలేదు, ఏమి చేయుటకు తోచ లేదు. కైకను పిలచింది, సుమిత్రకూడా వచ్చినది. "ఉండక్కా నేను ఊపుతాను ఓ .... ఓ .... ఓ .... "ఓ అచ్చుతానంద జో జో ముకుందా లాలి పరమానంద రామ గోవిందా తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించి, నాలుగు వేదాలు గొలుసులుగా అమర్చి" ........ రాముడు ఏడుస్తూనేయున్నాడు. పాటపాడుతునేయున్నది సుమిత్ర

రాముడు ఉయ్యాలలను ఒక్క తాపు తన్నాడు. కట్టిన గొలుసులు ఘల్లు మన్నవి. అది వేదధ్వని కాబోలు. అది సుమిత్రకే తెలియాలి మరి. పెద్ద ఆవిడ అవతార తత్వం గూర్చి పాడితే చిన్న అవిడ పరతత్వం గూర్చి పాడింది. కాని రాముని ఉద్దేశ్యమేమిటో ? ఎవరు ఏవిధంగా లాలించినా లాభం లేకపోయినది, పెద్ద ముత్తైదవులు వచ్చారు. ధృష్టి తగిలిందేమో అన్నారు. దిష్టి తీసారు, కానీ ఏడుపు మానలేదు. ఈ సంగతి రాజునకు తెలిసినది. నిలిచిన పాటున పరుగున వచ్చారు ఎవరికి ఏమియు తోచలేదు. మంత్రిని పిలిపించారు. సుమంతుడు వచ్చాడు. కొంచం అలోచించి అమ్మా! లక్ష్మణ కుమారుని తీసుకొని వచ్చి రాముని ప్రక్కన పరుండబెట్టండి అన్నాడు. వెంటనే సుమిత్ర లక్ష్మణుని రాముని ప్రక్కన పరుండ బెట్టెను. రాముడు ఛప్పున ఏడుపు మానినాడు. చిరునవ్వులు చిందించాడు. తమ్మునివేపు తిరిగి చేతులతో మాటిమాటికి తాకుతూ యున్నాడు. ఇటు భరతుడు బిక్క మొగము వేశాడు, వాని తొట్టెలో శత్రుఘ్నుని పరుండ బెట్టారు. వారిద్దరూ నవ్వులు రువ్వుకొంటూ చేతులతో ఏవో సంజ్ఞలు చేసు కొంటున్నారు. తనయులు అనందంతో ఆడుకొనుట చూచి తల్లుల ప్రాణములు కుదుటపడినవి. రాజు తృప్తి చెందాడు. ఇకమీదట వీరు వేరువేరుగా వుండరని అనుకొన్నారు.

కాలచక్రం గిర్రున తిరిగి పోతున్నది. ఆటలలో పాటలలో అవ్యక్తావ్యక్తములైన జిలిబిలి పలుకులతో అతనితండ్రులకు నలుగురు తనయులు మిక్కిలి ఆనందాన్ని కలిగిస్తున్నారు.

నగరవాసులందరు ఆ రాచబిడ్డల అందాన్ని, ఆటపాటల్ని అన్యోన్యతను చూచి సంబర పడిపోతున్నారు. ఈ విధంగా రామ లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు పది వసంతాలు గడచి పది పుట్టిన రోజు పండగలు గడిచాయి. పదకొండవ సంవత్సరములో ఎథా శాస్త్రం వారికి ఉపనయనములు జరిపించాడు వశిష్టుడు. వారలకు లౌకికపు

విద్యలతో పాటు వేదములు వేదాంగములు ధనుర్వేదము క్షాత్రవిద్య ఉపదేశించాడు. సకలవిద్యలు వారికి సునాయాసంగా పట్టుబడ్డాయి అని చెప్పేకంటె సకాలంలో ఆ విద్యలన్నియు వాటంతట అవే వీరిని చేరుకొన్నాయి అంటే బాగుంటుంది. వీరు సామాన్యులా మరి?

విష్ణువంశ సంభూతులు అదే ఒకనాడు దశరధుడు వశిష్టుని అడిగాడు ఈ పిల్లలు విష్ణువంశ కలవారు ఎట్లనిరి.

రాజా! నీ అనుమతితో సరయూనది ఉత్తరతీరంలోయాగ శాల నిర్మించబడ్డది కదా! అక్కడకు ఋష్యశృంగుని రావించి మీరు అశ్వమేధ యాగమును చేశారు. సమర్థులు, సకలశాస్త్ర పారంగతులు అగు ఋషులు, ఋత్విక్కులు, హోత, ఉద్గాత, బ్రహ్మలుగా వ్యవహ రించి అధ్వర్యులు ఆ యజ్ఞాన్ని నిర్వర్తిస్తున్నారు. అప్పటిలో దేవత లంతా ఒక ప్రదేశంలో సమావేశమయినారు. వారంతా యజ్ఞార్థము ఋత్విక్కులు చేత అహూతులైనవారే. వారు బ్రహ్మను పురస్కరించు కొని విష్ణుదేవుని సమీపించారు. లోక కళ్యాణార్థము దుష్టశిక్షణ, శిష్ట రక్షణకోసం మనుష్య రూపంపొంది, ఈ రాజునకు పుత్రునిగా అవతరించమని ప్రార్థించారు. అందుకునారాయణుడు అంగీకరించాడు అతని ప్రేరణచేతనే యజ్ఞపురుషుడు హోమాగ్నినుండి ఉద్భవించి నీకు పాయస పాత్రను అందించడం జరిగింది. దానిని వాని ప్రేరణ చేతనే మీ ముగ్గురు భార్యలకు ఇవ్వడం జరిగింది. కనుకనే వారిని విష్ణువంశ సంభవులు అన్నారు. ఇది దేవరహస్యం ఈ సంగతి నాకు కొందరు ఋషులకు మాత్రమే తెలిసింది అని వశిష్టుడు ముగించాడు.

వింటున్నాడే కాని దశరధమహారాజు మనస్సు అంతా రాముని మీదనే ఉన్నది. ఓహో రాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు నా జన్మము తరించిపోయినది. ఆ నలుగురు ప్రాణాలు నా ముసలిప్రాణం ఐదవది. నిజముగా కౌసల్యాదేవిదే అదృష్టం.

కోసలరాజు అయిన భానుమంతుని పుత్రిక నా పాలిట భాగ్యదేవత. కేకయరాజుగు అశ్వపతి యైన కైకేయి, ఆమె సౌందర్యం, సౌకుమార్యం, అనురాగం ధైర్యసహాసాలు లోకంలో ఎవరికి ఉంటాయి నిజంగా ఆ నాడు సంభరాసురుని సంహారముతో నాకు అమె చేసిన సహకారం, అధీరత్వం ఎట్లు మరువగలను. ఇకసుమిత్ర నాకునిజంగా మిత్రురాలు. ఆమె నాకు నచ్చెలి. విజ్ఞానఘని, అగతాన గతాలు ఆమెకు బాగుగాతెలుసు. ఎప్పుడూ చిరునవ్వులు చిందుస్తూనే ఏదో ధ్యానిస్తూనే ఉంటుంది, అదేమిటి అట్లా ఉన్నావని నేనంటే మిమ్మల్నే తలుస్తున్నానంటుంది. ఆ స్నేహం మరువరానిది. ఆ ముప్పురూ గంగ, యమునా, సరస్వతులు, హ్రీ, శ్రీ, భూలవంటివారు. వారికి వారే సాటి – ఇది దశరథమహారాజు ఆలోచన.

## యాగ రక్షణ

ఇంతలో ప్రతీహారి లోపలికి వచ్చాడు "ప్రభూ: ద్వారము వద్ద విశ్వామిత్ర మహర్షిలవారు వేంచేసి యున్నారు. సెలవయితే లోనికి ప్రవేశపెడతా"నన్నాడు

కాదు కాదు నేనే వారిని స్వయంగా ఆహ్వానిస్తాను అంటూ దశరథుడు ఎదురేగాడు,

గురువర్యా: నా జన్మ సార్థకమైనది. ఈఆనంద సమయం లో మహా ప్రభావ సమన్వితులు విశ్వామిత్రులవారు దయచేశారు. వారు విశ్వానికే మిత్రులు. అట్టి మహనీయులను గౌరవించి పూజించుట నా ధర్మం. రండి గురుదేవా వారికి స్వాగతం పలికి ఆహ్వానిద్దాము అని తగుపరివారాన్ని పురస్కరించుకొని వశిష్టులతో కూడా వెళ్లి మునిపుంగవునకు స్వాగతంపలికి సగౌరవంగా ఆస్థానానికి తీసుకొనివచ్చాడు దశరథుడు.

దండ కమండాలు ధరియించి, జడలు మకుటములుగా శిరమున ముడిచి, చెంగావి వసనోత్తరీయాలతో విశ్వామిత్రుడు ఆస్థానంలో తనకై నిర్దేశించిన ఆసనముపై కూర్చున్నాడు.

అర్ఘ్యం, పాద్య, మధుపర్కముల నొసగి కుశల ప్రశ్నలు వేశాడు దశథుడు

బ్రహ్మర్షీ! తమ రాకచే నా జన్మ, నా గృహము, నా వంశంపావనమైనది. ముత్యములవంటి బిడ్డలతో నా వంశం చిగురించింది. తమ ఆశీర్వాదంచేత మూడు పూవులు ఆరుకాయులు మాత్రమేకాదు అనంత ఫలదం అవుతుంది. తమ దర్శన భాగ్యంచేత మిమ్మలను సంతోషపెట్టాలనివుంది. ధనం, ధాన్యం, భోగ. భాగ్యాలు ఈ రాజ్యసర్వస్వం తమ కటాక్షమే నన్ను కృతార్థుని చేయటానికి ఏమైనా కోరండి, చంద్రునికి నూలుపోగు లాగ సమర్పించుకొని ధన్యుడనవుతాను. అని దశరథుడు పలికాడు.

విశ్వామిత్రుడు నవ్వుచూ తన గడ్డమును నిమురుకొంటూ చాలా ఆనందము నీవు అంతటి వాడవే నీ వంశమే సత్యసంధమైనది హరిశ్చంద్రుడు రాజ్యాన్ని ధారపోయలేదా, తన శరీరాన్ని శిబి చక్రవర్తి ముక్కలు ముక్కలుగా కోసి శ్యేనమునకు సమర్పించ లేదూ! నీ ఆశయం మెచ్చదగినది. నీ సత్య సంకల్పం వలన మానవ కోటికి మాత్రమే కాదు ముల్లోకాలకు శ్రేయోదాయక మవుతుంది. కోరమంటావా రాజా! అన్న విశ్వామిత్రుని మాట విని

తమ అనుగ్రహం. సంశయించుటకు ఏమున్నది ముని పుంగవా త్రికరణ శుద్ధిగా మీరు కోరినది సమర్పించు కొంటాను. సెలవియ్యండి అన్నాడు దశరదుడు.

అప్పుడు విశ్వామిత్రుడు తన ఆసనమునుండి కొంచెము ముందుకువంగి భేష్ రాజా తప్పక కోరుతున్నాను విను. నీకు జనించిన ఆ బిడ్డలలో రాముని నావెంట పంపించు. వాడు నే చేయ బోయే యజ్ఞమును రక్షిస్తాడు. జగద్ధితమైన ఈ కోరిక నీవే తీర్చాలి యజ్ఞవిఘ్నకారులైన మారీచ సుబాహువులు మున్నగు అసురులను సంహరించి యజ్ఞాన్ని నిర్విఘ్నంగా ఆతడు కాపాడగలడు అన్నాడు విశ్వామిత్రుడు. ఆ మాట వినగానే మొదలు తెగిన అరటిచెట్టువలే సమ్మోహితుడై దశరథుడు పడిపోయాడు. వెంటనే పరిచారికులు ఉపచారాలు చేశారు. ముఖము వివర్ణమైనది. కన్నులనీరు గిర్రున తిరిగింది కంఠం గద్గదికమైనది. నాలుకతో పెదవులను తడుపుకొంటు న్నాడు. అతి దీనవదనుడై చేతులు జోడించి దశరథుడు ఇలా పలుకుచున్నాడు.

బ్రహ్మర్షీ! నా పాలిట భాగ్యదేవత నా పితృహృదయాన్ని పరికించండి ప్రొద్దువాటారు వేళకు లేక లేక కనుక్కొన్న చిన్నారులు నోములు, వ్రతాలు, దానాలు, ధర్మాలు, యజ్ఞాలుచేసి మిము బోంట్ల పెద్దల ఆశీర్వాదము చేత వడసిన వంశాంకురాలు వీరు. అకృతాస్త్రులు అజ్ఞానులు, బాలురు అందులో నా రాముడు నా బహిప్రాణము నా జీవన వసంతము. నాకొన ఊపిరి. వాడు లేకుండా, చూడకుండా క్షణమైనా మనలేను. కటాక్షించండి గురుదేవా ఇలా పరిదేవనము చేశాడు.

విశ్వామిత్రుడు కనుబొమలను చిట్లించాడు. మాటలు పరుషంగానే వినేవారలకు వినపడుచున్నవి. దండ, కమండలాలు చేత సవరించుకొన్నాడు. రాజా! నీవేనా ఈమాట అంటున్నది? ఇదేనా నీ సత్యవాక్కు? నీ వంశ మర్యాద ఇదియేనా? నీ మూలంగా ఎంత కలంకము వంశమునకు అంకురించునో ఆలోచించావా, పుత్ర వ్యామోహంతో మాటతప్పి ఏవేవో పలుకుచున్నావు. రాముడు ఎవరను

కొన్నావు. నీ మనస్సులో నీకొడుకు మాత్రమే కాదు, పరిజారక్షకుడు. అకృతాస్త్రుడు కాడు సకల శస్త్రాస్త్ర విధుడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణా తత్పరుడు, అతని సౌర్య పరాక్రమము నాకు తెలుసును. నీకేమి తెలుసు ఈ వశిష్టుని అడుగు చెపుతాడు తపః సంపన్నులైన ఋషీశ్వరులకు తెలుసును. మారుమాటాడక వెంటనే నావెంట పంపించు నీకు మేలు కలుగుతుంది అన్నాడు విశ్వామిత్రుడు

వెంటనే పశిష్టుడు కలుగ జేసుకొన్నాడు. ప్రభూ పంపించండి ఆలోచింపవలదు, రామునికి క్షేమము లోకానికి మేలు కలుగుతుంది అన్నాడు. దశరథుడు కొంచెం కుదుట పడ్డాడు. రామలక్ష్మణులు ధనుర్ధారులై ఇటకు రావలసినదిగా సేవకుని ద్వారా అంతఃపురానికి కబురు పంపాడు. రామలక్ష్మణులు ఆయుధపాణులై వినీతవేషులై వచ్చారు. "పితృభ్యోనమః" అని తండ్రికి నమస్కరించారు. పిమ్మట వశిష్ట విశ్వామిత్రులకు పాదాభివందనం చేశారు. దశరథుడు వారిని అంకమున చేర్చుకొని అదిగో వారు మన పాలిట భాగ్యదేవతలు విశ్వామిత్రులవారు. వారివెంటపోయి వారి ఆజ్ఞకు బద్ధులై ప్రవర్తించండి. మీకు క్షేమము కలుగుతుంది. అని పలికి విశ్వామిత్రునివేపు తిరిగి ఆర్యా నా ప్రాణాలను తమ అరచేతులందు పెడుతున్నాను.

పదహారు సంవత్సరాలైన పైబడని ఈ బిడ్డలు తమ అనుగ్రహానికి పాత్రులు అని రామలక్ష్మణులను విశ్వామిత్రునకు సమర్పించాడు దశరథుడు.

ఆ సోదరులు వినయ, విధేయతలతో విశ్వామిత్రుని వెంట పయనులైనారు, ముఖమున అలకలు ఆల్లాడగా కళాపధారులై తమ కాంతులచే దిక్కులన్నియు ప్రకాశింపజేస్తూ బయలుదేరినారు. సింహ శార్దూల విక్రములు అయినప్పటికి కుసుమ సుకుమార శరీరులు.

సూర్యచంద్రులవలే ఆ రామలక్ష్మణులు బ్రహ్మర్షి వెంటపోతున్నారు. భుజాలకు ధనస్సులు, మొలలో ఖడ్గాలు, మూపున అమ్ములపొదులు మొలకు పట్టుదట్టీ, ముఖమున చిరునవ్వులు, మనసున భక్తిప్రపత్తులు కలిగి కౌసుకుని ఆడుగుజాడలలో కదలిపోతున్నారు క్రమక్రమంగా

ఆయోధ్యానగరాన్ని అతిక్రమించారు. సరయూనదీ దక్షిణ తీరాన్ననుసరించి ఆర్ధయోజనము నడచేసరికి సాయంత్రమైనది సంధ్యానుష్టానాలు ముగ్గురు ముగించారు.

రామభద్రా! ఆచమనము చేయుము ప్రాక్దిశగా కూర్చొ నీకు రెండు మంత్రములనుపదేశిస్తాను. అని గాధిసుతుడు పలికాడు. రామలక్ష్మణులు శుచులై ప్రాఙ్ముఖులై గురుపర్యుల కభిముఖంగా కూర్చున్నారు. బ్రహ్మర్షియగు విశ్వామిత్రుడు బలా, అతిబలా అను రెండు మంత్రములు ఉపదేశించాడు.

"రామా! ఈ రెండు మంత్రాలు బ్రహ్మ నిర్మితాలు వీటి ప్రభావముఅమోఘము, శ్రమ, ఆకలి, దప్పులు దరికిచేరవు, తేజో రూపములు వసివాడవు. బుద్ధి, జ్ఞానము, తేజస్సు, పరాక్రమము ప్రవృద్ధములౌతాయి. శాత్రవులు తేరిచూడలేరు. ఈ మంత్రములను నా తపఃప్రభావముచేత సంపాదించాను. వాటిని ఇప్పుడు సత్పాత్రులగు మీకు ప్రతిపాదన చేశాను" అని విశ్వామిత్రుడు మంత్ర ప్రభావాన్ని వారికి విశదీకరించాడు.

రామలక్ష్మణులు వినయ వినమితోత్తమాంగులై శ్రద్ధాళువులై ప్రతిగ్రహించారు. అప్పుడు ఆ ముగ్గురూ శేరాగ్నులవలె ప్రకాశించారు.

ఆరాత్రి ఫలమూలాశనులై సరయూతీరాన కుశాస్తరణులై శయనించారు. ఆనిశి వారికి సుఖంగానే గడిచి పోయినది.

తూర్పున వేగుచుక్క పొడచూపింది. గాలి శీతల సుఖ స్పర్శగా వీస్తున్నది. అరుణోదయం కాబోతున్నది. పక్షులు రెక్కలల్లారుస్తూ కిలకిలధ్వానాలు చేస్తున్నాయి. కుసుమాలు వికసిస్తూ సౌరభాలు వ్యాపింపజేస్తున్నాయి. నదీతరంగాలతో వినులకు కలకల ధ్వనులు చేయుచున్నది. తూర్పుదిశాసతి ముఖాన ధరించిన సింధూర తిలకంలాగ రవిబింబము ఉదయిస్తున్నది.

"తపస్వి యగు విశ్వామిత్రుడు నిద్రలోకూడా చిరునవ్వులు చిందించు రామ లక్ష్మణుల సౌందర్యాన్ని చూసి పరవశించి పోతున్నాడు. అరుణ కమలాల్లాంటి వారి చరణాలు స్పృశించి కనుల కద్దుకొన్నాడు. ఈ మహనీయుల దివ్య దర్శనంతోపాటు, సేవా భాగ్యం నాకు లభించింది. బ్రహ్మాదులకు కూడా సాధ్యపడక పరితపిస్తుంటారు. నేడు నాకు వీరి సేవాభాగ్యం కలిగినందుకు నా జన్మ తరించిపోయింది". అని ఉప్పొంగి పోయాడు.

మంద్రంగా, మధురంగా వారిని మేలుకొలుపుతున్నాడు. "కౌసల్యా సుప్రజా రామా పూర్వా సంధ్యాప్రవర్తతే, ఉత్తిష్ఠ నర శార్దూలా కర్తవ్యం దైవ మాహ్నికం" సంధ్యాసమయమైంది. వంశానికి మూలపురుషుడైన సూర్యభగవానుడు ఉదయిస్తున్నాడు. ప్రాభాతిక సంధ్యాది దైవకార్యాలకు సమయమాసన్నమైనది. రామా నీకు సుప్రభాతమగు గాక!

రామలక్ష్మణులు మెల్ల మెల్లగా కన్నులు తెరచారు. అరుణ కిరణాలను మరిపించే తమ కమలాల్లాంటి కన్నులు తెరిచారు. లేచి తమ గురువర్యులకు నమస్కరించి స్నాన సంధ్యాద్యనుష్ఠానములు ముగించారు. మంద్రమైన మేఘ గర్జనవలె రామలక్ష్మణులు ఇలా పలుకుచున్నారు. గురువర్యా! ఆజ్ఞాపించండి కింకరులమైన మేము

తమ ఆజ్ఞకు బద్ధులము అన్నారు.

పదండి నాయనలారా! మనమిపుడు సిద్ధాశ్రమమునకు చేరాలి. అక్కడే మన యజ్ఞభూమి పదండి. ఆ........ అటుకాదు ఇటురండి ఈ మార్గం గూండా నడవండి అని దారిచూపాడు విశ్వామిత్రుడు.

ముగ్గురూ వడివడిగా నడుచున్నారు. నిర్జనము, నిస్తేజము భీభత్సముగా నున్నది ఆ ప్రాంతము. అంతట కంకాలాలతో కపాలాలతో కంకగృధ్ర గోమాయువులతో భయంకరముగా ఉంది. కళ్మలమై. దుర్గంధ భూయిష్టమై రోత, భీతి కలిగిస్తున్నది గురువార్యా! ఈ ప్రదేశము అన్నాడు రాముడు.

అవును దీనినే తాటాకవనమంటారు! ఇది దాటితేనే సిద్ధ ఆశ్రమము. అని అంటూ ఉండగానే రామలక్ష్మణులు ఆవనంలో ప్రవేశించారు. ఆశ్చర్యంగానూ, ప్రశ్నార్థకంగాను గురువర్యుని తిలకించారు.

" ఇది ఈనాడు ఇంత బీభత్సంగా ఉందంటే దానికి ఆ తాటక అనే యక్షిణి కారణం. ఇది రెండు దేశాలు " మలద రెండవది కరూశ " ఈ దేశాలు ఒకప్పుడు దేవతానుగ్రహంవల్ల పాడిపంటలతో ఆయురారోగ్యములతో జనులు ఇటు సుఖజీవనం చేశావారు. ఎల్లప్పుడు కలకలలాడుతూ ఉండేది. " అని చెపుతూ విశ్వామిత్రుడు ముందుకు నడుస్తూఉంటే రామలక్ష్మణులు ఆశ్చర్యంగా వింటూ అనుసరిస్తున్నారు. పూర్వం ఇంద్రుడు ఉత్తరాసురుని సంహరించాడు అతనికి బ్రహ్మహత్యాదోషం సంభవించింది. దేవతలు ఈ ప్రదేశంలో తమ ప్రభువు యొక్క బ్రహ్మహత్యాదోషమైన మల-కరూశములను తొలగునట్లు ఆశీర్వదించారు. పిమ్మట ఆ దోషమువలన దూష్యము

కాకుండా వరములొసంగుట చేత ఈ దేశంలోని జనులు సుఖైక జీవనులుగాను భూమి పాడిపంటలతోకూడియుండేటట్లు ఆశీర్వదించారు

ఇలా విశ్వామిత్రుడు చెపుతునేయున్నాడు మరి ఈ దుస్థితి ఎందుకు కలిగింది గురువర్యా! అని రాముడు ప్రశ్నించాడు.

విశ్వామిత్రుడు :— అదే చెప్పుచున్నాను నాయనా విను, సుకేతువు అను యక్షుడు సంతానంకోసం తపస్సు చేశాడు. బ్రహ్మ సంతసించి వానికి ఒక కుమార్తెను ప్రసాదించాడు. దాని పేరు తాటకి. దానికి పది ఏనుగుల బలము కలుగునట్లు కటాక్షించాడు. తండ్రియైన సుకేతుడు జంభుని కొడుకైన సుందునకు భార్యగా ఇచ్చాడు. ఆ యక్షిణికి మారీచుడు అను కొడుకు గలడు. వరప్రభావము వలన మదముతో ఆ తల్లీ-కొడుకుల సుందరమైన ఈ దేశాన్ని సర్వనాశనం చేశారు. ఒకనాడు ఈ ప్రాంతంలో తపస్సు చేసుకొంటున్న అగస్త్యుని హింసించ దలచారు, ఆ మహర్షి ఆ తాటికిని రాక్షసిగను, మారీచుని భైరవునిగాను శపించాడు.

పాపసంకల్పము కలిగి హింసాస్వభావము కలవారలకు ఈ దుస్థితి ఇంతకంటే అదమస్థితి చివరకు ప్రాణనష్టము కలుగుట సహజమైనదే. అది మొదలు వీరు మనుజాసనులై ఈ ప్రాంతమంతా ఇటువంటి బీభత్సాన్ని సృష్టించారు. అని విశ్వామిత్రుడు చెప్తుండగా రామలక్ష్మణులు ఆ వన మధ్యానికి వచ్చేశారు.

అంతలో వినబడింది మేఘంలేని పిడుగులాగ ఆ కంఠధ్వని ఆడిగో వచ్చేసింది తాటకి. ధనస్సును సంధించు రామా! ఆడదని ఆలోచించకు మనుజాసని దేశాన్ని మాపేసింది. దాన్ని సంహరించు. అని విశ్వామిత్రుడు హెచ్చరిస్తూండగానే ఆ తాటక రోదసీ కుహరాన్ని ప్రతిధ్వనించేలా అరుస్తూ వచ్చేసింది. అది స్త్రీలాగ లేదు. నడిచే

పల్లకొంప, కళ్లు పళ్లు ఉన్నాయి. నోరు ఒక గుహ. చేతులున్నాయి మద్దులలాగ ఒక చేతిలో శూలము ఉంది. దానికి గ్రుచ్చబడిన మనుజులు జంతువులు గిలగిలా తన్నుకొంటున్నారు. రెండవ చేతి మాంసకబలాన్ని నోటకుక్కుకొంటున్నది. వికటాట్టహాసాలు వికవికలు కలిగి అడుగుతీసి అడుగువేస్తే పాషాణాలు ఎగిరిపోతున్నాయి, కళ్ళు అగ్నిగోళాలవలె ఉన్నాయి. మెడలో కపాళమాలికలు గలగల లాడుతున్నాయి. రక్తమాంస వసాదిగ్ధమైన శరీరం నుండి దుర్గందం నలువైపుల వ్యాపిస్తూ ఉన్నది. ఆ రక్కసి తిన్నగా మనవైపే వచ్చేస్తున్నది. రామా ఆలసించకు బాణం విడిచిపెట్టు. సంధ్యాకాలం సమీపిస్తున్నది. రాక్షసులకిప్పుడే బలమధికమవుతుంది. అన్నాడు విశ్వామిత్రుడు.

వెంటనే రామునిచేత ఆకర్ణాంతము ఆకర్షింపబడిన ధనువు నుండి శరము రివ్వున ధ్వనిచేస్తూ తాటకి గుండెలకు తగిలినది. ఆ బాధకు తాళలేక పెదగా అరుస్తూ కొండలాగ కుప్ప కూలిపోయింది ఆ రక్కసి.

భగవంతుడు బలమునిచ్చాడు. అది అంగబలం కానీయండి లేక అర్థబలం కానీయండి, విద్యాబలం కానీయండి, చివరకు బుద్ధి బలం కానీయండి, దానిని దుర్వినియోగం చేస్తే ఏమవుతుందో అదే తాటకి విషయంలో ఐంది. విశ్వామిత్రుడు ఆనందంతో రాముని ఆలింగనం చేసుకొన్నాడు. నేటితో ఈ రక్కసి పీడ వదలింది. ఇక నుండి ఇక్కడి ప్రజలు పూర్వంవలె సుఖజీవనం చేస్తారు. ఈ రాత్రికి ఇక్కడనే గడుపుదాము రామా! అన్నాడు.

తాటక వనంలో గురుశిష్యులు ఆ రాత్రి సుఖంగా గడిపారు పక్షులు కిలకిలా ధ్వనులు చేస్తుంటే ప్రత్యూష పవనాలు హాయిని కొలుపుతున్నాయి. ప్రాంత సరోవరాలనుండి క్రౌంచ కలహంస,

కోకిలాదిపక్షులు మధురధ్వనులు చేస్తుండగా కెందామరల సౌరభ్యం నాసాపర్వం గావిస్తున్నది. ఆ ప్రభాతంలో ముగ్గురు మేల్కొని యథోచిత స్నాన సంధ్యానుష్టానములు నిర్వర్తించారు.

రామా ప్రాఙ్ముఖుడవై ఆచమించుము. ఆలస్యం చేయకు అని విశ్వామిత్రుడు చెప్పగా రాముడు ఆచమించి గురువునకు సాష్టాంగపడి సమ్ముఖమున అధివసించాడు. నాయనా! నీకు అస్త్ర మంత్రాలు ఉపదేశిస్తాను. అవహితుడవై గ్రహించు అని కృశాశ్వుని తనయులు అనగా అతనిచేత ద్రష్టములైనవి. నేను తపస్సు చేత వానిని పొందితిని. నీకు ఉపదేశిస్తాను. దీనివలన సర్వకాలములలోను నీ శత్రువులు సంహరింపబడతారు. అఖండ కీర్తిని సంపాదిస్తావు. ముందుగా నీవు సంహారాస్త్రాలు ప్రతిగ్రహించు.

దండచక్రము, ధర్మచక్రము, విష్ణుచక్రము, ఇంద్రచక్రము రెండు గధలు, సువిశాల ఖడ్గపాలు, బ్రహ్మశిర, పాశుపత, ఆగ్నే, వాయు, వరుణ, సర్ప, మోహన స్తంభనాది మహాస్త్రాలు ఇవి. అభేద్యాలు సర్వసంహారకాలు ఈ ఉపసంహారకాలు గ్రహించు.

సత్యమంత, సత్యకీర్తి, ధృష్ట, రభస, పరాఙ్ముఖ, అవాఙ్ముఖ లక్ష్యాలక్ష్మ, దృఢ, నాభ, సునాభ, దశాక్ష, శతాక్ష, శతపత్ర, దశశీర్ష, సహస్రశీర్ష, జ్యోతిష, కౌమన, జృంభిణ మొదలైనవి.

శ్రీరామచంద్రుడు వీటినన్నింటిని శ్రద్ధాసమన్వితుడై ఆయామంత్రాలు ప్రతిగ్రహించి జపించాడు. ఆ అస్త్రసమూహము స్వభావాను రూపములతో వికృతములు కొన్ని, జ్వాలలు కలిగి కొన్ని ధూమాకృతులు, వివిధ భయతరరూపాలతో రామునికి ప్రత్యక్షమై అభివాదనములు చేసినవి. ప్రభూ! ఆజ్ఞాపించండి అని మోకరించాయి.

నే తలచినపుడు మీరు రావచ్చు అని రాముడు వాటికి సెలవు ఇచ్చి పంపించివేశాడు.

గురువర్యా! యాగభూమి ఎక్కడ ఆ రాక్షసులు ఎప్పుడు వస్తారు. ఇంకెంత దూరం పయనించాలి. అన్న రాముని మాటలకు ఆ మౌని నాయనా! అదిగో సిద్ధాశ్రమము సమీపిస్తున్నాం. అక్కడనే మేము యజ్ఞము చేసేది. ఆ ప్రదేశంలోనే శ్రీమహావిష్ణువు నూరు యుగాలు తపస్సు చేశాడు. కశ్యప ప్రార్థనచేత వామనుడై జన్మించాడు

ఆ మహాపురుషుడు బలి యజ్ఞవాటములో బక్షించి ముల్లోకాలు ఆక్రమించిందిక్కడే. కొందరు మహర్షులు తపస్సుచేసి సిద్ధిని పొందినది ఇదే సిద్ధాశ్రమము సమీపించాము. ఆశ్రమవాసులైన పలువురు తాపసులు విశ్వామిత్రునకు, రాజపుత్రులకు స్వాగత మిచ్చారు. అందరూ పరమానందభరితులై వన్యఫల కందమూలాదులు ఆరగించి ఆ రాత్రి విశ్రాంతి తీసుకున్నారు.

పక్షులు సామగానాలతో తాపసులు మేల్కొని కాల్యకరణీయములు నిర్వర్తించారు. రామలక్ష్మణులు మునిపుంగవునికి నమస్కరించి ఎదుటనిలబడ్డారు. విశ్వామిత్రుడు వారిని చూచి నాయనలారా! మేము చేయబోయే ఈ యాగము ఆరుదినాలు దీక్ష గలది. ఈ దినములలోనే మారీచ, సుబాహులు సపరివారంగా దృశ్యాదృశ్యమై విఘ్నమాచరిస్తారు. కావున జాగరూకతతో గమనించండి. అని చెప్పి మహర్షులతో కూడి మౌనియై యజ్ఞదీక్షను ప్రారంభించాడు.

కొందరు మునులు వ్యాఘ్రాజినము పైని, కొందరు కృష్ణాజినముపైని ఇంకొందరు దర్భాసనము పైని ఆశీనులై మంత్రోచ్ఛారణీ గావిస్తున్నారు. దేవతలనాహ్వానించి ఘృతాదులతో అహూతుల నొసంగుచున్నారు.

" లక్ష్మణా! మనమీ ఆరుదినములు భద్రంగా యాగ సంవరక్షణ చేయాలి. అప్రమత్తుడై ధనుర్బాణాలు సజ్జీకృతం చేసియుండు. నేనును సంశిద్ధుడనై అంతటా పరిక్రమిస్తుంటాను " అని శ్రీరాముడు ధనుర్బాణాలు దాల్చి అప్రమత్తుడై అటునిటు సంచరిస్తున్నాడు. అహోరాత్రులు నిద్రాహార, విశ్రాంతులు లేక ఆ రామలక్ష్మణులు అంతటాతామై సంచరిస్తూ ఆయజ్ఞాన్ని కాపాడుచున్నారు

ఆనాడు ఆరవదినము. యజ్ఞము పరిసమాప్తము కాబోవుతున్నది. తాపసులు స్పష్టతర ఉచ్చారణతో ఉచ్చైస్వరముతో మంత్రములు పఠిస్తూయున్నారు. హోమగుండములో " వసోర్ధారాం జుహోతి " అను మంత్రముతో పూర్ణాహుతి చేస్తున్నారు.

ఇంతలో ఆకాశమంతటా చీకట్లు అలముకున్నాయి. దట్టమైన మాయామేఘాలు వ్యాపించాయి. భయదమైన ఉరుములు, మెఱుపుల మధ్య మారీచ సుబాహులు తగు రాక్షస పరివారంతో మింటినడుమ కన్పించారు. మాంస, అస్థిశోణితాలతో యజ్ఞమును విధ్వంసము చేయ చూస్తున్నారు. రాముడు లక్ష్మణుని హెచ్చరించి. ధనుస్సునకు శరమును సంధించి గుణము ఆకర్ణాంతము ఆకర్షించాడు. మానవాస్త్రమును అభిమంత్రించి మారీచునిపై ప్రయోగించాడు. అది వానివక్షముతాకి ప్రాణంతీయక సముద్రంలో నూరుయోజనముల దూరంలో పడేటట్లు విసరివేసినది. లక్ష్మణుడు సంభ్రమంగా ఆగ్నేయాస్త్రము ప్రయోగించి సుబాహుని నేలపడవైచాడు. వాయువాస్త్రము వలన పల్వురు రక్కసులు హతులైరి. కొందరు ఎక్కడికోచిమ్మివేయబడ్డారు

యజ్ఞం ప్రశాంతంగా నిర్విఘ్నంగా ముగిసింది. విశ్వామిత్రుడు పరమానందంతో రామలక్ష్మణులను ఆలింగనం చేసుకొన్నాడు. రామలక్ష్మణులారా! మీ ప్రతాప సామర్ధ్యమువలన యజ్ఞము నిర్విఘ్నముగా ముగిసినది. అని ఆశీర్వదించాడు.

మహర్షులు రామలక్ష్మణులను పరమానందంతో ప్రశంసించారు.

రామలక్ష్మణులు మిక్కిలి వినయ విధేయతలతో గురువర్యా! ఆజ్ఞాపించండి. మీ కింకరులం. యిక ఏమిచేయవలెనో ఆనుమానించక ఆజ్ఞాపించి మమ్ములను ధన్యులను చేయండి అని చేతులు జోడించి వినమ్రులై నిలచారు.

## మిథిల

మహర్షులు సంతసించి రామభద్రా! మేమిప్పుడు జనక మహారాజు చేయు యజ్ఞ దర్శనార్థము వెళ్ళుచున్నాము. ఆ యజ్ఞము మహోత్కృష్టమై జగన్మంగళ దాయకమైనది. నీవుకూడా పూజ్యులగు గురువర్యులతో మిథిలానగరమునకు రాగోరుచున్నాము. మిథిలేశుని వద్ద దైవదత్తమైన ధనస్సు ఉన్నది. దానిని దేవదానవ తిర్యఙ్మనుష్యాదులు ఎక్కుపెట్టలేరు. అసురులు తేరి చూడరానిది. నీవు చూడదగినది. తప్పక మీరు మాతో రావల్సినదని చెప్పారు.

విశ్వామిత్రునితో కూడి రామలక్ష్మణులు, తాపసులు ఉత్తర దిశగా ప్రయాణం చేస్తున్నారు. నూరుబండ్లపై బయల్దేరినారు. వాటిపై అగ్నిహోత్రాదులనుంచి యజ్ఞదర్శన లాలసులై బయల్దేరినారు. ఆ ఋషులను దారిలో జింకలు, దుప్పిలు, నెమళ్లు, చమరీ మృగాలు వెంబండించాయి. పక్షులు కలకల ధ్వానాలు చేస్తున్నాయి. ఈవిధంగా ఆశ్రమ జీవులువారికి వీడ్కోలునిచ్చాయి. పర్వతారణ్య నదీనద సౌందర్యాన్ని సందర్శిస్తూ ఆనందభరితులై ఆ తాపసబృందం సాయం సమయానికి శోణానదీ తీరానికి చేరుకుంది. ఆ రాత్రి ఫలాదులు భుజించి విశ్రమించారు. ఆ సమయంలో రాముడు ఆ నదీ పరిసరములను గమనిస్తూ ఈ ప్రదేశ విశేషములను తెలుపవల్సినదిగా

గురువర్యుల నర్థించాడు. విశ్వామిత్రుడు చాలా సంతోషించి రామా! ఈ ప్రాంతంఅంతయూ విశిష్టమైన చరిత్ర కలదు. పూర్వం కుశికుడు అనే బ్రహ్మమానసపుత్రుడు ఉండేవాడు. వానికి వైదర్భి యను అనుకూలవతియగు భార్యకలదు. వారలకు కుశాంబుడు, కుశనాభుడు అమూర్త రజసుడు, వసువు అను నల్వురు కుమారులు అదిగో అటు చూశావా! అది గిరివ్రజమనే పట్టణం దానిని వసువు అను నాల్గవవాడు పాలించేడు. ఐదుకొండల నడుమ ఆ పట్నం కలదు. దాని చుట్టు "మాగధి" అనే నది ప్రవహిస్తున్నది. కనుక ఆ ప్రాంతాన్ని "మాగధ" అంటారు. ఇదిగో ఇటు చూడు ఇది కౌశాంబి అనే నగరం దీన్నిని కుశాంబుడు అనేవాడు పాలించేడు. అదిగో అది ధర్మారణ్యం అంటారు. అక్కడే అమూర్త రజసుడు దానిని పాలించేడు. ఇదిగో దీని పేరు మహోదయం. దీనిని కుశనాభుడు పాలించేడు. కుశనాభుడు అప్సరసయగు ఘృతాచియందు నూరుగురు కుమార్తెలు పుట్టేరు. వారందరు సర్వాంగ సుందరులు ఉత్తమగుణ సంపన్నులు తండ్రి మాట జవదాటరు. వారిని వాయువు తనకు భార్యలుగా కావల్సినది అని కోరేడు. క్షమాపతులు పితృభక్తి తత్పరులగుటచేత ఆ కన్యలు తిరస్కరించగా ఆ వాయువు వారి శరీరంలో ప్రవేశించి విరూపిణులుగా చేశాడు. అనగా వాతరోగులైనారు. అదే సమయమున "చూళి" అను ఋషి తపస్సు చేస్తున్నాడు. ఆతనికి ఊర్మిళయను గంధర్వి కుమార్తె సోమద అను కన్య శుశ్రూష చేసినది. ఆమెయందు బ్రహ్మదత్తుడు అను మానసపుత్రుని వడసింది. ఆ బ్రహ్మదత్తునకు కుశనాభుడు తన కన్యాశతమునిచ్చి వివాహము చేయుగా వారందరూ కురూపతవదలి పూర్వ సౌందర్యవతులైనారు. కుశనాభునకు పుత్ర సంతానము లేదు. అందువల్ల 'ఇష్టి' ని ఒక దానిని చేశాడు. కొంత కాలానికి అతనికి "గాధి" అను సుపుత్రుడు కలిగేడు. ఆ మహానీయుడే మా తండ్రి. ఈ ప్రదేశమంతయు మా పూర్వులది. నా సోదరియైన సత్యవతి ఋచుకుడనే భర్తతో సశరీరంగా స్వర్గాన్ని అలంకరించింది. ఆమె మాయందుండే స్నేహము సేవా తత్పరతతో నదిగా

ప్రవహించింది. అక్కడనే నేను భగినీ స్నేహముతో ఆ నదీతీరంలో నివసిస్తూ ఈ సిద్ధాశ్రమానికి వచ్చాను. నీ పరిశ్రావ సౌమిత్ర్యాలవల్ల సిద్ధుడనైయ్యాను అని తన చరిత్రను కౌశికుడు ముగించాడు. ఆ రాత్రి సోనానదీతీరంలో పూజ్యులైన గురువర్యుల చరిత్రను మననం చేస్తూ విశ్రమించాడు. మరుచటి రోజు వారంతా ప్రయాణం సాగించారు. దారిలో అరణ్యాలు పుష్పాలు రాలుస్తున్నాయి. ఈ మహర్షి బృందానికి స్వాగతార్ఘ్యాన్ని ఇస్తున్నట్లున్నాయి. శీతల పవనాలు హాయిని చేకూరుస్తున్నాయి. పక్షిరుతములు స్వాగతాలు పల్కుచున్నాయి. దుప్పులు, లేళ్లు, కుందేళ్లు, చమరీమృగాలు ఎక్కడికక్కడే తారసపడుతున్నాయి. ఆ అడవిలో కొందరు ఆటవికులు చదురుమదురుగా కన్పిస్తూ ఈ మహర్షి బృందానికి నమస్కరిస్తూ తప్పుకుంటున్నారు. "గంగే మంగళ తరంగిణి జయహో జయహో, పాపహారిణి, త్రిలోకపావని జయహో। శంకర జటాజూట నిర్ఝర దారావాహినీ జయహో జయహో" యిట్టి నినాదాలు మధ్య భాగీరథీతరంగ గలగల ధ్వనులు సుదూరమునుండే వినబడుతున్నాయి. శీతల పవనాల శరీరములకు గగుర్పాటు కల్గిస్తున్నాయి. జలకుక్కుట, చక్రవాక, బక, క్రౌంచ సారసాది జలపక్షులు సుస్వరములు వీనులవిందు కొలుపుతున్నాయి;

"రామా! అదిగో జహ్నవీని సమీపించాము. ఎడనెడ ఇసుక తిన్నె లనడుమనుండి వయ్యారంగా వంపులు తిరుగుచూ ప్రవహిస్తున్న భాగీరథినిదర్శించుము. పైరుపచ్చల పావడ దాల్చి కాశకుసుమములు కబరీభరము నదునిమి, ఉదయారుణ అరుణకిరణ ప్రసారకాంతిచే రక్తాంచుకము పల్లెవాటు ధరించి తేలినీటి నురుగుల చిఱునవ్వులు చిందిస్తూ గాలికి చలించు వెలిదామరలచే లోలాక్షియై కొండకచో దుముకుచు, తూలుచు, జారుచూ పరుగిడుచు కన్నెపిల్ల చేష్టలు చేయుచు వయ్యారాల నెఱపుచున్న హైమవతిని నమస్కరించు" అని కౌశికుడు పల్కగానే రామలక్ష్మణులు భక్తిపూర్వకముగా

నమస్కరించారు. మహర్షులు కూడా ప్రణమిల్లిరి.

ఆనాటి సుప్రభాతమున గంగాతీరము చేరి అఘమర్షణాది మంత్రములుచ్చరిస్తూ స్నానసంధ్యాద్యనుష్ఠానములు ముగించారు. మహర్షులు పితృతర్పణాదులు గావించారు. అగ్నిహోత్రాలు వేల్చారు.

" రామచంద్రా! మీ పూర్వజుడైన సగరచక్రవర్తి పుత్రులచే త్రవ్వబడినమార్గము ననుసరించి ఈ గంగామతల్లి సముద్రుని చేరింది భగీరథుడు తన తపఃప్రభావముచే పితరులను తరింపజేయుటకు దివి నుండి భువికి ఈ పెయ్యద్గంగను ప్రవహింపజేశాడు. తొలుత శివ జటాజూటమున నిలిచి అందుండి ఏడు పాయలుగా భూమిపై ప్రవహించినది. దేవ తిర్యఙ్మనుష్యాదులందరూ ఇందు అవగాహము చేసి పాపనిర్ముక్తులౌతారు. పవిత్రమైన ఈ గంగావతరణ చరిత్ర వినికిడి చేతనే సకల శుభాలు చేకూరును " అని విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు గంగాచరిత్రను విశదీకరించాడు. వారెల్లరూ పావనిగంగామాతకు నమస్కరించి ఆ రాత్రి అచట నివసించి మరునాడు అచట నుండి ప్రయాణం సాగించారు.

... కజ సమర్థమైన ఒకనావనధిష్టించి గంగానదీ ఉత్తరతీరమునకు చేరుకున్నారు.

రామభద్రా! అటుచూడుము. రమణీయోద్యాన పరివృత్తమైన ఆ పట్టణము అదే 'విశాల' అను నగరము. దానిని ఇక్ష్వాకు వంశీయుడగు విశాలుడను రాజు నిర్మించేడు. పాడిపంటలతో కూడి ప్రజలు ఆయురారోగ్యములతో సుఖముగా ఉంటారు. ఈ పురవాసులు నిరంతరము వ్యాధి చోర, దుర్భిక్షాదులులేక సకలసంపదలతో ఆనందముతో వర్ధిల్లుతుంటారు. ఇప్పుడు దీనిని సుమతి అను రాజు పాలిస్తున్నాడు. ఈ రాత్రి అచట వసించి పురల పయనింతము " అని కౌశికుడు

పలికినాడు.

సుమతి మహర్షుల ఆగమన వార్తలనువిని వారలకు ఘనమగు స్వాగతమొసగెను. సకలసౌకర్యాలు కల్గించెను. తేజశీలురైన రామ లక్ష్మణులజూచి అబ్బురపడ్డాడు. ఋషిమండలి ఆ రాత్రి గడిపి మర్నాడు అరుణోదయమున సుమతి అనుమతి వడసి ప్రయాణం సాగించారు.

అది మిధిలానగర ప్రాంత ప్రదేశము అక్కడొక ఋష్యాశ్రమము. ఆ ఆశ్రమమంతా రమణీయముగానే ఉంది. పచ్చటి చెట్లు చెట్లపైన చిలుకలు, ఆ చిలుకలపలుకులు ఎట్టివారినైన ఇట్టే ఆకర్షిస్తాయి. అందమైన పువ్వులు, మధురమైన పండ్లు, కమ్మనైన సువాసనలు వెదజల్లుచున్నాయి. కన్నుల పండుగగానున్న ఆశ్రమ పరిసరాలలోకాని ఆశ్రమంలోకాని మనిషి సంచారంలేదు, ఇంత చక్కనైన ఆశ్రమము జనసంచారం లేకపోవుట ఆశ్చర్యంగానే ఉన్నది. అదే అడిగాడు రాముడు. ఆచార్యా! " ఈ ఆశ్రమము ఎవరిది? నిర్మానుష్యంగా ఉన్నది ఎందుకని?

ఆశ్రమంలో అడుగుపెట్టేడు శ్రీరామచంద్రుడు ఆతని చరణస్పర్శచేత శిలీభూతమైన ఒక ప్రదేశములో అందమైన అతివ సాక్షాత్కరించినది. తన రెండుచేతులు జోడించి నిమీలితార్థనేత్రయై ఆనందాశ్రువులు రాల్చింది. తర్వాత దివ్యమానవమంగళ విగ్రహాన్ని ఆపాదతలమస్తకాన్ని తనివితీరా చూసింది. కాళ్లపైపడి నమస్కరించింది.

ప్రభూ! రామచంద్రా ధన్యురాలైతిని నీ దర్శనం చేత నీపాదస్పర్శచేత నా శాపవిముక్తి అయినది. నిన్ను జగదభిరాముడైన శ్రీరామునిగా గుర్తించాను. శ్రీమన్నారాయణుడవగు నీవు

" నను పాలింపానడచి వచ్చితివి ప్రభూ " నా మౌర్ఖ్యతచేత, నాదుష్ప్రవృత్తిచేత పతిదేవునిచే శస్తురాలైనైన పతితను. ఓ పతిత పావనా! ఇంతకాలము – అదెంతకాలమో ఇక్కడ నేనిహారినై భస్మశాయినై శీతాతపములకోర్చి శిలాసదృశంగా ఈ ప్రదేశంలో పడియున్నారు. దుష్ప్రవృత్తి ఎట్టివారినైన ఆపదలపాలు చేయక మానదు. నేటికి నీ అనుగ్రహమువల్ల నీ పాదస్పర్శచేత చరితార్థురాలనైతిని. అని అహల్య తన వృత్తాంతముపలికి రాముని పాదములపైబడి మోకరిల్లినది. గౌతముడు అంతలో అరుదెంచి రామునకు నమస్కరించి భార్యసహితుడై అర్ఘ్యపాద్యాది విధులచే పూజించాడు

రామభద్రా! ఈ మహర్షిసత్తముడు గౌతముడు ఈ మహభాగ అహల్య, ఈతడు శపించుట చేతనే ఈ ఆశ్రమము నిర్మానుష్యమైంది. అహల్య మానవ మాత్రులకు ఎరికి కానరాకుండా పోయింది. యిప్పుడు నీతేజ సామర్థ్యములచేత, మహిమా విశేషంచేత ఈ ఆశ్రమము పూర్వవైభవం పొందగలదు. అని విశ్వామిత్రుడు శ్రీరామునికి వివరించాడు.

ఋషీశ్వరులెల్లరూ శ్రీరామచంద్రుని మహత్యమును అనేక విధములా ప్రసంశించారు. స్నేహము, భయము, భక్తి, విశ్వాసములు కలిగి అటనుండి ఈశాన్య దిశగా ఆ ఋషి సంఘము బయల్దేరి మిథిలానగర సమీపానికి చేరుకున్నది.

దూరమునుండి సీరధ్వజము రెపరెపలాడుతూ కన్పడుతున్నది. సమీపించినకొలది. శ్రావ్యమైన మంగళ తూర్యనాదాల మధ్య జనకాధ్వరోచ్చరిత ఋత్విత్వట్య వేదోఘములు ఉదాత్తానుదాత్త స్వరిత సమన్వితమైన, స్వాహా, స్వధావషట్ యిత్యాది మంత్ర పల్లవములతో కూడిన మంత్రోచ్చారణము వినవచ్చుచున్నది. కపోత సదృశమైన హోమ, ధూమానురంజితమైన ద్యోతలము కలిగియున్నది. ఋషిసత్తములు కార్యకరణ

వ్యగ్రులై ఇటునటు సంచరించుచున్నారు. సువిశాలమైన ప్రాసాదముల మధ్యమున చతురస్రమైన వేదిక కలదు. దానిపై ముత్యాల రంగవల్లులుదిర్చి చూతపల్లవాంకుర కుసుమాక్షతలతో అలకరింపబడిన సువర్ణకలశలలో యథావిధి దేవతలనాహ్వానము గావించుచున్నారు. వేదిక నలువైపులా నాల్గు హోమగుండములు, నిర్మితములై అందు అగ్నిహోత్రములో ఋత్విక్కులు హోమము చేయుచున్నారు. ఋత్విక్కులు, హోతలు అధ్వర్యులు పర్యవేష్టించి యజ్ఞకర్మల నిర్వహిస్తున్నారు. ఉద్గాతలు ఉచ్చైశ్స్వరమున సామవేదమును గానము చేయుచున్నారు. సర్వకర్మద్రష్టయై బ్రహ్మ అంతటా పర్యవేక్షిస్తున్నాడు. ద్వాదశ దినపరిమితముగా ఆ యజ్ఞము నిర్వహింపబడుతున్నది. యజ్ఞదీక్షితుడై అచట అధివసించియున్నాడు. జనకమహారాజు.

ప్రతిహారడొకరు అరుదెంచి ప్రాంజలియై విశ్వామిత్రుల వారు యాగదర్శనార్థము అరుదెంచినారని పలుకగా జనకుడు వెంటనే పురోహితుడైన శతానందుని కొందరు ఋషులను పురస్కరించుకొని యాగశాల వెలుపల నిలచియున్న విశ్వామిత్రుని సమీపించినాడు. భక్తిపూర్వకముగా నమస్కరించి స్వాగతము పల్కినాడు.

బ్రహ్మఋషివర్యా! తమరాక చేతనే నా యజ్ఞము సఫలమైనది. తమ దర్శనంచేత పునీతుడనైనాను. యజ్ఞం పరిసమాప్తి అయిన వరకు మహర్షులతో కూడా దయచేసి మమ్ములను ధన్యులను చేయండి. సూర్యచంద్రులు పుడమి నవతరించినట్లున్న ఈ సుకుమార బాలురు ఎవరు? నన్ను తరింపజేయుటకు దయచేసిన సనాతనులైన నరనారాయణులవలె నున్నారు. అని పలికేడు.

రాజా! వీరు ఇక్ష్వాకు కులజులైన దశరథావనీశుని సుపుత్రులు రామలక్ష్మణులనువారు. సిద్ధాశ్రమమున పలురక్కసి మూకలను పరిమార్చి నాయజ్ఞమును సఫలీకృతము చేసినారు. ఆ పుణ్యదంపతులైన

అహల్యా గౌతములచే పూజింపబడినారు. నీ వద్ద నీ పూర్వుల చేతను నీచేతను చిరకాలమునుండి ఆరాధింపబడుతున్న శివశరాసనమును సందర్శించవచ్చారు. అని విశ్వామిత్రుడు పలికాడు.

శతానందుడు సాధు! సాధు! అని రామలక్ష్మణుల అభినందించాడు తన తల్లి శాప విమోచనమునందు, తండ్రియగు గౌతమునితో ఆశ్రమంలో ఉన్న సంగతియు—వారి కుశలవార్త విని ఆనందించాడు. విశ్వామిత్ర మహర్షియే తమపాలిట దైవమని తలచి రామలక్ష్మణుల నటకు తోడ్చుకు వచ్చినందులకు మునికి పాదాభివందనం చేశాడు.

రామభద్రా! మాజననీ జనకుల కుశలవార్త విన్నాను అమిత దయాస్వభావ సంపన్నుడైన ఈ విశ్వామిత్రుడు మిమ్ములను వెంటతోడ్కొని వచ్చి తన యజ్ఞమును నిర్విఘ్నముగావింప జేసినాడు. నా తల్లి శాపమున తొలగింపజేసినాడు.

"గాధిసుతుడైన ఈ కౌశికుడు 'శబల' అను కామధేనువు నుద్దేశించి వసిష్టునితో స్పర్థించినాడు. చిరకాలం తపస్సుచేసి ఈశ్వరుని వలన సకల శస్త్రాస్త్రములు సంపాదించాడు. సృష్టికి ప్రతిసృష్టిచేసిన మహామనిషి. క్షాత్రాన్ని వదలి చివరకు బ్రహ్మర్షిత్వాన్ని సాధించిన ప్రజ్ఞాశాలి. గాయత్రీ మహామంత్ర ద్రష్ట" అని శతానందుడు విశ్వామిత్ర మహర్షి మహత్యమును తెలియ పరచాడు. ఆ రాత్రి జనక మహారాజుచే సత్కరించబడి ఆ ఋషి సంఘము విశ్రాంతి తీసుకున్నది.

## ధనుర్భంగము

మరుచటి దినమున ప్రాభాతిక కృత్యము ముగించి రామ

లక్ష్మణులతో కూడియున్న విశ్వామిత్రుని జనకమహారాజు సమీపించి అభివందనం చేశాడు. బ్రహ్మర్షివర్యా! తమరాకచే. నేచేయు యాగము సఫలమైంది. దయచేయుడు యజ్ఞశాలకు. రాకుమారుల తోడ్కొని తమ సాన్నిధ్యంలో యాగం నిర్విఘ్న పరిసమాప్తి గాగలదు. శలవు ఇవ్వండి. ఈ సేవకునికి ఏమి ఆజ్ఞఅని వినయంగా జనకుడు పలుకగా

రాజా! దశరథ కుమారులైన ఈ సుగుణ సంపన్నులకు నీచే ఆరాధింపబడుచున్న ఆ హర ధనస్సును చూపించు అన్నాడు విశ్వామిత్రుడు.

పిమ్మట యజ్ఞశాలలో సమస్తఋషులతోను, రామలక్ష్మణులతోను ఉచితాసనముల విశ్వామిత్రుడు అలంకరించినాడు. ఋత్విజులు యధాశాస్త్రముగా మంత్రములను నుచ్చరించుచూ హోమము జరుపు చున్నారు, జనకుడు ధనుశ్శ్రేష్టమును తీసుకొని రావలసినదిగా సేవకులకాజ్ఞాపించి విశ్వామిత్రునితో ఇలా పల్కుచున్నాడు

మహర్షివర్యా! ఈ ధనువు మహేశ్వరునిది. పూర్వము దక్షాధ్వరధ్వంసము చేసిన తరువాత ఈ ధనుశ్రేష్టమును మా పూర్వీజుడైన 'దేవరాతున' కు ఒసగెను. అతడు అతని తర్వాత పల్వురు రాజులు నేను నేటివరకు గంధ పుష్పాక్షతాదులతో పూజిస్తూ వచ్చాము బ్రహ్మర్షివర్యా! తర్వాత మాయింట మహలక్ష్మి వెలసింది. నిజంగా మహాలక్ష్మియే ఆమెవలననే నాకీ సకల సంపదలు, భోగ భాగ్యములు కలిగినాయి. ఆమె శ్రీమన్నారాయణుని అర్థాంగియే అని నా నమ్మకము. ఆమె అపురూప తేజోవిశేశాలు నిరుపమానములు. స్వామి హృదయ విహారిణియైన నారాయణి. నా గృహాన్ని, నన్ను, నా వంశాన్ని పావనం చేయడానికే వెలసింది.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులు అత్యంత కౌతుకముతో వింటున్నారు. మరల జనకుడు చెప్పడానికి ప్రారంభించాడు.

నేను యజ్ఞము కొరకు నాగలితో క్షేత్రమును దున్నుతున్నాను. ఆ నాగలిచాలులో నా భాగ్యదేవత అనునట్లు చంద్రరేఖ వలె పుత్తడిబొమ్మ వలె చిన్నారి శిశువు లభించింది. ఆమెకు 'సీత' అను నామకరణం చేశాను. ఆమె క్రమంగా శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానమై నేటికి విద్యావయోరూప గుణావిలాసాదులతో నాయింట మహాలక్ష్మియై నడయాడుచున్నది. పద్మాసనాన్ని వీడి పంటవెలది గర్భాన్న కొలది కాలముండి నాయింట వెలసిన ఆ మహాలక్ష్మి ఈమెయే. నాజన్మ తరించినదని మురిసిపోయి, అట్టి సుగుణవతిని, విద్యావతిని, రూపవతిని, సత్పాత్ర ప్రతిపాదనమే ఇహపర సాధనమని తలచితిని. ఇంతలో సకల రాజన్యులు ఆమెను వివాహమాడుటకు ముందుకు రాసాగిరి. అప్పుడు నేను వారితో "నా సుత వీర్యశుల్క" అని ప్రకటించాను. ఎవరు ఈ ధనువు నెత్తెదరో వారికి సీతనిచ్చి పాణిగ్రహణము చేయగలనని స్పష్టముగా చెప్పెను.

దేవతలు, దానవులు, రక్షసులు, గరుడులు, గంధర్వులు, కిన్నెరాదులెందరో ఈ హరధనువును కదుల్చుటకు ప్రయత్నించిరి. కానీ సాధ్యపడలేదు. ఇక మనుష్యులైన ఈ రాజలోకము తేఱిచూడనైనా చూడలేకపోయినది. "యజ్ఞ సంస్కృతమైన పురోడాశమును నక్కలకు కుక్కలకు ఎట్లు వశము చేస్తాను" అందరు రాజన్యులు కలయగట్టుకొని యుద్ధంచేసి నన్ను జయించి సీతను ఆక్రమింప జూస్తున్నారు. అని చెప్పుచుండగానే

ప్రావృట్కాల జలధర గర్జాంకారిణియగు ఒక ధ్వని విన వచ్చినది. ఐదువందలమంది బలశాలురు అయిన సేవకులు అయస మంగసాన్ని ఈడ్చుకొని వచ్చుచున్నారు. దానికి ఎనిమిది చక్రాలు

న్నాయి. ఆ చక్రనేమి ధ్వనియే ఆ గర్జనయని రామలక్ష్మణులు తెలుసుకున్నారు. ఆ సేవకులు మందసాన్ని వారిసమక్షమున నిలిపి, దీర్ఘవిశ్వాసములతో చమటలు తుడుచుకుంటూ, అటు నిలిచారు. యజ్ఞ దిదృక్షాగతులైన రాజులు, మౌనులు, పౌరులు నానాదేశముల నుండి అరుదెంచిన జానపదులు, భవిష్యద్విషయాన్ని గూర్చి వివిధ రీతుల చెప్పుకుంటున్నారు.

పూజ్యులైన విశ్వామిత్రుల ఆజ్ఞపొంది ఆ మహర్షికి పాదాభివందనంచేసి రామలక్ష్మణులు ఆ మంజూషను సమీపించారు. వారిరువురు ఆ సమయంలో జనకునకు, విశ్వామిత్రునకు, యజ్ఞనిర్వాహకులగు ఋషులకు అవాఙ్మానుష గోచరులైన దివ్యపురుషులవలే గోచరిస్తున్నారు. అనిమిషులై దర్శిస్తున్నారు కొందరు, అర్ధనిమీలితులై మనసులో ఏమేమో ధ్యానిస్తున్నారు కొందరు.

ఋత్విక్కులు "నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహితన్నో విష్ణుః ప్రచోదయాత్ స్వాహా" అని జపిస్తూ అగ్నిలో హోమం చేస్తున్నారు. ఆజ్యాన్ని, హవిస్సుని సమర్పిస్తున్నారు. యాగాగ్ని ప్రజ్వలితమై దివ్యమైన ప్రకాశాన్ని కలిగియుంది.

శ్రీరామచంద్రుడు మంజూషబీగము నెడలించి కవాటమును తెరచినాడు. లక్ష్మణుడు చేతులు కట్టుకొని పరీక్షిస్తున్నాడు. ఆ పెట్టి నుండి దివ్యకాంతులు వ్యాపించాయి. కొంత తడవునకు ఆ కాంతి పుంజము మందగించినమీదట శ్రీరాముడు ధనువును సందర్శించాడు

ఆ ధనువు కాలాయస నిర్మితమైనది. లస్తకమునకు (నడిమి భాగమునకు) ఇరువైపులా రెండు పొడవైన కొండచిలువలవలే సుస్పష్టమై ఆ ధనువు కన్పడుచున్నది. ధనువుపైగల మచ్చలు అజగరము యొక్క మచ్చలుకావు. నవరత్నములుదానికిసముచితంగ

తాల్పబడియున్నాయి. ఆ ప్రక్కనే పొడవైన అల్లెత్రాడు కబుసము విడిచిన తాచువలేనున్నది. రాముడు వాటిని పరికించాడు.

గురువర్యా! ఈ ధనువునెత్తుటకు అనుమతినివ్వండి. అని రాముడు పలికాడు విశ్వామిత్రుడు కనులతోనే ముదలయొసగేడు. అంతట శ్రీరాముడు ఆ ధనువు నడిమిభాగమునకు పిడికిలితో బిగియబట్టి వెలుపలకు ఆకర్షించాడు. నిటారున వామకరమునిల్పి ఆ ధనువును వంచి గుణమును సంధింప ప్రయత్నించినాడు. ఆ ధనువు దిక్కులు పిక్కటిల్లునట్లు ధ్వనిచేయుచు నడిమికి విరిగిపోయినది.

శివచాపఖండన సమావిర్భావ నిర్ఘోషము ఫెళ, ఫెళార్భాటులతో కొన్ని వేల వేడివెలుగుల కాంతులు వెదజల్లుచూ, వేలకొలది పిడుగులు ఒక్కుమ్మడి పడినట్లు ధ్వనించింది. ఆ ధ్వనికి అసనములనలంకరించినరాజులు ఎక్కడికక్కడే సమ్మోహితులై పడిపోయినారు. ఆసనాలు త్రుళ్ళి వారిపై పడినాయి. జానపదులు భీతులై దిక్కుతెలియక అటునిటు పరిగెడుతున్నారు, పడుతున్నారు. లేస్తున్నారు. ముందువారిని గమనించినట్టులేదు, ఒకరినొకరు తోసుకుంటూ దిక్కుతెలియక పరిగెడుతున్నారు. సుదూర తరుశాఖాగ్రమున వసించు పక్షులు గగ్గోలున రవ్వున ఆకాశమునకెగిరిపోతున్నాయి. పర్వతగుహాలు ప్రతిధ్వనించాయి. భూమి ఎడనెడ బీటలు వారాయి.

ఋత్విక్కులులేచి దండాగ్రహస్తులై కరములుచాచి "త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వం, ఇంద్రస్త్వం, రుద్రస్త్వం, ప్రజాపతిః త్వంతదాప ఆపో జ్యోతి రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం" అని ప్రార్థిస్తూయున్నారు. జనకుడు విశ్వామిత్రుడు అంతర్ముఖులై అర్ధనిమీలిత నేత్రులై ఏమో ధ్యానిస్తూయున్నారు.

లోగుట్టు పెరుమాళ్ళకెరుకైతే, పెరుమాళ్ళ గుట్టు పెద్దలకే

[illegible] ఐదా! మరి. మింటనుండి విరివిగా పుష్పవృష్టి కురిసింది. సుఖస్పర్శకరమౌతూ గాలి పరిమళాన్ని వ్యాపింపజేస్తున్నది. అందరూ [illegible]చేసుకున్నారు. సద్దుమణిగింది. సభ్యులందరూ ఆవిచిత్రమైన అనుభూతిని మనస్సున మననము చేసుకుంటున్నారు. జనకచక్రవర్తి వినమ్రుడై రాముని సమీపించాడు. స్నేహభక్తి విశ్వాసాలు ముప్పిరి గొన్న మనస్సుతో రెండుచేతులు పట్టుకున్నాడు.

శ్రీరామా! నేటికి నాజన్మ సఫలమైనది. నా వంశం చరితార్థమైంది. నా యజ్ఞం ఫలస్వరూపం దాల్చింది. ఆయోనిజయగు నాతనయను ప్రతిగ్రహించి నన్ను కృతార్థుని చేయమని పలుకుచూ విశ్వామిత్రునివైపు తిరిగి మహర్షివర్యా! మీ అనుగ్రహంవల్ల నా ప్రతిజ్ఞనెరవేరింది. తమ అనుమతితో అయోధ్యాధీశునకు ఈ శుభ వార్తను తెలియజేస్తూ వారినిచటకు విచ్చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాను. ఆజ్ఞాపించండి. అని పలికాడు.

విశ్వామిత్రుడు సంతోషంతో సత్వరముగా వేగరులను అయోధ్యకు పంపించు, వైవాహిక ప్రయత్నం శీఘ్రముగా నిర్వర్తించు. యజ్ఞాంతమందు వివాహము జరుగగలదు. నా జీవితానికి సాఫల్యము లభించింది. నేను వచ్చిన కార్యం నెరవేరింది. వీరలు మహాపురుషులుగా గమనించియే ఉంటావు. మనం నిమిత్తమాత్రులం. సీతారాముల వైవాహికశోభను సందర్శించి కృతార్థుడనై వెళతాను. అని జనకునితో పలికాడు.

బ్రహ్మర్షియైన విశ్వామిత్రుని పలుకులు ఆలకించి జనకుడు శీఘ్రగాములైన సేవకులను అశ్వములపై అయోధ్యకు పంపాడు. జరిగిన విషయం దశరథమహారాజునకు మనవిచేసి సగౌరవంగావారిని మనవెంట తోడ్కొనిరండు అని ఆజ్ఞాపించాడు. ఆ వేగరులు అశ్వారూఢులై [illegible] మూడుమజిలీలు చేస్తూ ఆయోధ్యనగరాన్ని

చేరుకున్నారు. తమరాకను దశరథమహారాజుకు తెలియజేశారు.

దశరథుడు వారికి సగౌరవంగా రావించాడు. దూతలు నమస్కరించి మిథిలేశ్వరుని మాటగా కౌశికుని రక్షతో చిరంజీవులు రామలక్ష్మణులు మిథిలానగరంలో క్షేమంగా ఉన్నారు. ఉంకువగా నిర్ణయించబడిన శివధనుర్భంగము గావించారు. తమ ఆజ్ఞ అనుగ్రహ ములతో జానకీపాణి గ్రహనాన్ని నిర్వర్తింపజేసేందుకు జనకమహా రాజు ఈ శుభసమాచారాన్ని తమకు నివేదింప పంపించారు. అని అటజరిగిన వృత్తాంతమును భటులు దశరథమహారాజునకు మనవి చేశారు.

దశరథుడు చిరంజీవుల క్షేమ సమాచారములతో కూడా వైవాహిక శుభాహ్వానము తెలుసుకొని పరమానంద భరితుడైనాడు. అంతఃపురమునకు శుభ సమాచారము తెలుపబడినది.

దశరథుడు వెంటనే మంత్రులను, పురోహితులను, కోశాధ్య క్షులను రావించి వారలతో సంప్రదించివలయు ధనసంపదలతో సపరి వారంగా మిథిలకు బయల్దేరినాడు. ఏనుగులు, గుఱ్ఱాలు, రథములు సైన్యము వెంటరాగ, బంధుమిత్ర పరివృతుడై మిథిలానగరమునకు పయనమైనాడు.

## కళ్యాణము

ఇట మిథిలాపురాధీశుడైన జనకమహారాజు వివాహసమయ సముచిత సన్నాహాలను ముమ్మరంగా చేపట్టినాడు.

ఇంతలోనే వేగురులరుదెంచి " దశరథమహారాజు సపరి వారంగా వేంచేస్తున్నారని " తెలియపరచారు.

జనకమహారాజు తక్షణమే వాద్య, విశేషములతోనూ, పరివార సహితుడై మంత్రి పురోహితాదులతో ఎదురేగి సగౌరవంగా స్వాగతంపలికాడు. నగరిలోకి తోడ్కొనివచ్చి సమున్నత సౌధమును విడిదిగా యిచ్చాడు. శతానందుడు మొదలగువారు వశిష్టునికి నమస్కరించారు. రామలక్ష్మణులు పితృపాదులకు పాదాభివందనం చేశారు పరస్పరక్షేమ సమాచారములు నిర్వర్తించిన పిమ్మట జనకమహారాజు వారలకెల్లరకు దివ్యసౌధమున రాజోచితములైన సకల సపర్యలు నిర్వర్తింపచేసినాడు. జనకుడు సముచిత సమయమున ఎల్లరు ఆసీనులైన పిమ్మట వశిష్ఠధౌమ్యాదుల అనుమతితో దశరథమహారాజు నుద్దేశించి పలికెను—

మహారాజా! కుసుమ సుకుమార శరీరులైనను, మహాపరాక్రమశాలురు, దేవతుల్యులు అయిన నీ కుమారులు నా అదృష్టవశంన ఇక్కడకు వచ్చారు. అవి చలితానన్య సాధ్యమైన హరధనువును భగ్నం గావించినాడు. వీర్య శుల్క యగు నా కుమార్తె సీతను నీ కుమారుని సపత్నిగా ప్రతిగ్రహింప ప్రార్థిస్తాయున్నాను. అని పలికాడు.

పిమ్మట దశరథుడు సంతోషంతో ఆర్యా! ప్రతిగ్రహము ధాతృవశము గదా! అని పలుకగా జనకుడు సంతోషించి మరుసటి దినమున గోదానాది కార్యక్రమములు నిర్వర్తించ తగినదిగా నిశ్చయించుకొని జనకుడు తన మందిరమున ప్రవేశించినాడు.

రాత్రి సుఖంగా విశ్రాంతినొందిన తరువాత మరుసటి దినమున మంగళవాద్య విశేషములతో మేల్కొని సౌఖశాయనుకులు పృచ్ఛ చేయుచుండగా దశరథమహారాజు సపరివారంగా స్నానసంధ్యానుష్ఠానములు ముగించారు. మంత్రి పురోహితాది పరివారంతో పర్యవేష్టించి కూర్చున్న తరువాత జనకమహారాజు శతానందునితోను, తగు

..వారంతోను దశరథుని ఆశీనందించి సమీప ఆసనమున అధివశించాడు. అట్టితరి విశ్వామిత్రుడు వశిష్ఠాదుల అనుమతితో జనకుని ఉద్దేశించి

ఆర్యా: ఇక్ష్వాకులకు విదేహులకు పరస్పర సంబంధము సర్వవిధముల సముచితంగానే యున్నది. ఈ రెండు వంశాలు బల పరాక్రమాల్లోను విద్యావైదుష్యాల్లోను కీర్తిప్రతిష్టల్లోనూ, లోక ప్రసిద్ధిగాంచినది. ఈ రెండు కులములతో సాటియైనది వేరొకటి లేదు కనుక నీ కనిష్ట సోదరుడైన కుశధ్వజుని కుమార్తెలకు మాండవీ శ్రుతకీర్తులను భరత, శత్రుఘ్నులకు నీ పుత్రిక యగు ఊర్మిళను లక్ష్మణ కుమారునకు వీర్య శుల్క యగు సీతను శ్రీరామునకొసగి కళ్యాణం జరిపించ కోరుచున్నాము. అని పల్కివిరమించెను.

ఆ మాటలకు రాజు ఋషులతోపాటు అందరును మహదానందమును చిందినారు. వెంటనే జనకుడు సాంకాశ్యమునకు ధూతనుపంపి కుశధ్వజుని రావించినాడు. ఈ శుభవార్తను తెలుపగా అతడునూ మిక్కిలి సంతసించినాడు. తన కుమార్తెలకు సముచిత సంబంధమును విని సపరివారుడై మిధులకేతెంచినాడు. రాచనగరు పెళ్ళిసందడితో కళకళలాడిపోయింది.

దశరధుడు పితృకార్యమును నిర్వర్తించి పుత్రుల శ్రేయస్సు కొరకు గోదానాదికము గావించాడు. బంగారుకొమ్ములు, వెండిగిట్టలు గల గోవుల లేగదూడలతో కాంస్యదోహన పాత్రలతో సత్పాత్రులగు బ్రాహ్మణులకు భూరి దక్షిణలతో దానము చేశాడు, ఒక్కొక్క కుమారుని ఉద్దేశించి లక్షగోవులను ఒసిగినాడు.

ఆ దినమునసే కేకయురాజు పుత్రుడగు యుధాజిత్తు అక్కడకు చేరుకొనినాడు. అతడు తొలుత అయోధ్యకు వెళ్లి అట దశరథాధులు

వివాహ నిమిత్తము మిధిల కరుదెంచినారను వార్త విని తక్షణమే ఇక్కడకు వచ్చి చేరినాడు. దశరథుడు తన బావమరిదితో కుశల ప్రశ్నలు ముగించిన పిమ్మట యుదాజిత్తు తన మేనల్లుళ్లను తనతో తీసుకొని వెళ్లుటకు వచ్చినట్లు తెలిపెను. రేపు ఉత్తరఫల్గుని నక్షత్రము అది వివాహయోగ్యమైనది. సత్సంతతికి కారకమైనదని. కార్తాంతికులు వివాహమునకు శుభముహూర్తము తెలుపగా ఆ సమయమునకు ఎల్లరూ సంసిద్ధులైనారు, నానాదేశాధీశులు తరలివచ్చారు. పౌర జానపద సందోహం సమావేశమైనది. కోసల సామ్రాజ్యం విదేహ దేశమంతా అచ్చటకు చేరినది.

రాజపురుషులు ఆగంతకులకు స్వాగతము పలుకుచున్నారు రాజసేవకులు వేత్రహస్తులై కోలాహలంగా ఇటు అటూ తిరుగుచూ ఆగంతకులకు సౌకర్యము కలుగజేస్తున్నారు.

కొందరు కళ్యాణవేదికా మండపమునకు మార్గదర్శకులగుచున్నారు. రండి రండి ఇటు దయచేయండి మహారాజులు ఈ సింహాసనములను అలంకరించండి. జానపదులు. గాయకులు, వైణికులు అంతా ఈ ఆసనాలలో కూర్చోండి. ఋత్విజులు, పురోహితులు ఆ కుడిప్రక్క ఆసనాలను అలంకరించండి. అంటూ మహారాజు సేవకులు అతిథులను సాదరంగా ఆహ్వానిస్తున్నారు. అదిగో అటువేపే కళ్యాణమండపం, పెళ్లిపందిరి.

సహస్రస్తంభ నిర్మితమైనది. నీలాకాశముపలె చాందిని కట్టబడ్డాది. దానికి రసగుళికలు, రత్నదీపికలు వ్రేలాడు చున్నాయి. మౌక్తికతోరణాలు, మామిడిచిగుళ్ల తోరణాలు, పూల తోరణాలు, చిత్ర విచిత్రంగా అలంకరించారు. అరటిచెట్లు, పోకచెట్లు, కొబ్బరికమ్మలు అమర్చి కట్టారు. మెత్తని రత్న కంబళ్లు పరుపబడ్డాయి. యథోచిత ఆసనములు ఏర్పరచినారు.

ఆ పందిరి మధ్య షోడశస్థంభ పరిమితమైనది. వేరొక ప్రపను నిర్మించారు. అది హంసయుక్త విమానమువలె గోచరిస్తోంది దాని అలంకరణము నిరుపమానం. సీతారామ కళ్యాణవేధిక అందు కలదు. నవరత్న తోరణాలంకృతమైనది, సుగంధతైలవసిక్తదీపికలు నలువైపులా ప్రకాశిస్తున్నవి. నడుమ మౌక్తిక రంగవల్లి విలసితమై యున్నది.

అటు చూడండి అది వైకుంఠవాసుని చిత్రపటము బంగరు వన్నె కట్లు కలిగియున్నది. అందు నీలోజ్వలవపువగు శ్రీ మహావిష్ణువు సహస్రఫణామణి భాసురమైన నవరత్న సింహాసనమును అధిష్టించి యున్నాడు. సర్వాభరణ భూషితుడు, వనమాల విరాజితుడు, శంఖ చక్రగధాపద్మ కలిగితుడు, దరహాసవదనుడై దర్శనమిచ్చుచున్నాడు అతన్ని పర్యవేష్టించి అనంతగరుడ విష్వక్సేనాదులు ప్రార్థిస్తూ యున్నారు. స్వామికిరు పార్శ్వముల శ్రీ భూదేవులు చిరునవ్వులు చిందిస్తూ ప్రభువుపై తమ దృక్కులను ప్రసరించుచున్నారు,

ఇదిగో ఇటు చూడండి బంగారు జిలుగుల చిత్రపటము ఇందు క్షీరసాగర శయనుడు ఆదిశేషువు తన సహస్రఫణాలతో స్వామికి ఛాయనొసగుచూ తన సుధీర్ఘ శరీరము శయ్యగానమర్చి సేవిస్తూ యున్నాడు. నిద్రాముద్రితుడైన నారాయణుని చరణకమలముల యెడ. కమలఅధివసించి పాదసంవాహనము చేయుచున్నది. చంద్రో దయాన ఉల్లోల, కల్లోలితమగుచున్న పాలకెరటాల చిరుతుంపరులు జల్లులై, మల్లెలు జాజులవలె స్వామి శరీరంపైబడి వింతశోభను చేకూరుస్తున్నాయి.

ఇదిగో ఇది ఒక చిత్రపటము. ఈ ఇందుముఖి చంద్ర సహోదరి. హిరణ్యవర్ణముకుట కుండల గ్రైవేయకాద్యనేక ఆభరణ సమన్వితమై యున్నది. ఈ అరాళకుంతలయే శ్రీమహాలక్ష్మి.

ఆమెపైనున్న రెండు చేతులలోనూ సహస్ర కమలములు న్నవి. మిగిలిన రెండు చేతులు వరదాభయ ముద్రలు కలిగియున్నది పాలసముద్రమున పద్మాసమున అధివసించినది. ఆమె కిరువైపులా రెండు భద్రగజములు నిలచి రత్నఖచిత స్వర్ణకలశాలను తొండాగ్రములన ధరించి ఆమెకు అమృతాభిషేకము గావించుచున్నది.

మా రాజునకు దైవభక్తి మెండు దేవతా సమక్షమునసే ఈ వైవాహిక కార్యము చేయుటకు నిశ్చయించెను కాబోలు అందరూ దయ తమ ఆసనములనలంకరించండి. వివాహసమయ సుముహూర్తము ఆసన్నమైనది అని ప్రబోధించుచుండగా

దశరథమహారాజు మంగళ స్నానాలంకృతులగు పుత్ర చతుష్టయముతో వసిష్ఠ విశ్వామిత్రాది మహామునులతో ఉచితరీతిని ఆసనము అలంకరించిరి. మంత్రి కోటి సామంతాదులందరూ తమ తమ స్థలములనధిష్టించిరి. వేదికపై బంగారు పెండ్లిపీటలు వేసియున్నవి. [illegible] పాలికాదులలో అంకురార్పణ గావించబడినది. సమీపమున లాజలు, అక్షతలు, దూర్వాలు, పుష్పములు, ఫలములు, వస్త్రములు మున్నగునవి బంగరు పళ్లెరములతో సిద్ధపరుపబడుచున్నది వేదిక సమీపమున సమంత్రకముగా అగ్ని ప్రేల్చబడినది.

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు గురువర్యుల అనుమతి పొంది పెండ్లి పీటలధిష్టించిరి. కన్యాదానమునకు పూర్వము చేయవలసిన కార్యములు వసిష్ఠాది మహర్షులు నిర్వహించారు.

పచ్చని పట్టుతెరలు ప్రతీ పెండ్లికుమారుని సమీపంలో చెలికత్తెలు పట్టి నిలచియున్నారు వేదిక దగ్గరకు క్రమముగా సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తులు నవవధూ అలంకృతులై లలితపద విన్యాసముగా నడచివచ్చియున్నారు. వారిని అనుసరించి మంగళ

దీపములతో ముత్తైదువలు వెంటరాగా మంగళ వాద్య విశేషములు మారుమోగ్రినవి.

వధువుల సముచిత స్థానమున కూర్చుండజేసి జనకమహారాజు ఒక్కొక్కరిని వరులకు పరిచయం చేస్తూయున్నాడు, వరులచే ప్రాణి గ్రహణం చేయించుతున్నాడు.

" ఇయం సీతా మమసుతా సహధర్మ చరీ " అంటున్నాడు.

" ఈమె సీతయా శతకోటి మహాశక్తి సముపాస్య పదాంబు జాత. ఈ భూజాత లోకైకమాత. శ్రీ మహావిష్ణువు హృదయాధినేత, జగత్కళ్యాణార్థం పుడమి నవతరించిన పుణ్యచరిత, చంద్రసహోదరి ఇందిరాసుందరి, సర్వోపద్రవనాశిని సకలసంపత్ప్రదాయిని, జననీ" అని కొందరు తమ హృదయ కమల పీఠములపై నధివసింప జేసు కొని ధ్యానిస్తున్నారు.

ఈమె స్థిరసౌదామినీ అంటున్నారు కొందరు. సీతమ్మ చిఱు నవ్వులు క్షీరాబ్ధి వెల్లువలువలే నున్నాయి. కమలకోమల గర్భ గౌవర్ణం కలిగియుంది. మంచుచేత తడిసినకేతకీ కుసుమవర్ణం కలిగియుందని కొందరంటున్నారు. అరాళకుంతల, ముత్యాలసరులలో వజ్రాలు పొదగిన నక్షత్రమాలిక శిరస్సునలకంరింపబడినది. పచ్చల పతకము నుదుట వ్రేలాడుచున్నది. పద్మమువంటి ముఖమున విశాలనేత్రాలు సిగ్గుచేత కాబోలు అరమోడ్పులై యున్నాయి. సంపెంగనాసిక క్రింద బింబాధరము దరహాసరేఖలు వెరసి ఆ ముఖమండలం జగన్మోహనం స్త్రీజనోచితములైన నవరత్నకంకణ కేయూర గ్రైవేయాకాద్యలం కారములు, బంగరు సరిగంచుగల ఎర్రని దుకూలవసనము జీరాడు చుండ పాదములకు బంగారు మంజీరములు వింతధ్వని చేయు

చున్నాయి. ఆ గుల్ఫాంతము వ్రేలాడుచు నల్లత్రాచువలే నున్న జడలో మల్లెల మొల్లల మొత్తములు జడ చివరన బంగారుకుప్పెలు పట్టుకుచ్చులుగల జడగంటలు రమణీయంగా ఉన్నాయి. నుదుట కస్తూరి తిలకము, బుగ్గనచుక్క బొట్టు కలిగి సకల జనగణమనములు వశీకృతమగు ఆ సీత సౌందర్యలహరికి అవధులులేవు. ఆమె సపోఢ.

ఊర్మిళ, మాండవీ, శృతకీర్తులను నవ వధువుల కూడా అట్లే అలంకరింపబడి యున్నారు. వయోగుణ రూప లావణ్యాదులకు తగురీతి వధూవలంకరణ కలిగియున్నారు. ఆ నల్గురూ నాలుగు వెన్నెల వెల్లువలు, నాలుగు హిమానీ నదములు.

జనకమహారాజు సతియగు కాంతిమతి సువర్ణకలశమున పవిత్రోదకమును పోయ శ్రీరామచంద్రుని పాదమునుకడిగి ఆ ఉదకమును తన శిరస్సున మార్జనము చేసుకున్నాడు. అనంతరం సీతాదేవి హస్తమును రాముని చేతిలో ఉంచి పాణింగృహీష్వ పాణినా అని కన్యాదానం చేశాడు. అటులనే ఊర్మిళాదేవి హస్తము లక్ష్మణుని చేతియందు, మాండవీ, శ్రుతకీర్తుల హస్తములను భరత శత్రుఘ్నుల హస్తములందుంచి మంత్రోదక పూర్వకముగా రాజకుమారులకు కన్యాదానం చేశాడు. పురోహితుడు సమంత్రకముగా జీలకర్ర – బెల్లమును పరస్పరము వధూవరులచే మస్తకమున అలంకరింపజేసారు. తలంబ్రాలు ఒండొరుల మస్తకముల పోయించారు. నాటి సీతారాముల మస్తకన్యస్త తలంబ్రాలు నేటికినీ నూతనవధూవరులను శుభాశీస్సులు అందిస్తూయున్నాయి.

ఆ సీతారాముల వైవాహికశోభ నిరుపమానము. నల్లకలువ రేకుల నుండి ఎగిరిన తుమ్మెదలు పద్మములపై పడుతున్నాయి. పద్మముల నుండి కలువలపై పడుచున్నట్లు సీతారాముల చూపుల

ఒండొరులపై ప్రసరిస్తున్నాయి. అవి వెన్నెల వెలుగులై మానసోల్లాసాన్ని కలిగిస్తున్నాయి. సీత యొక్క అధర పల్లవములు ఈషత్ చలించి దంతపంక్తులు దృశ్యా దృశ్యములై ఎఱ్ఱని చిగుళ్లు కుంద కుట్మలమువలే భాసిస్తున్నాయి. తలంబ్రాలు రాముని శిరమున ఉంచు సమయాన్ని కరచాలనముచే పయ్యెద ఒకింత జారిన పైదు వచ్చల పట్టుకంచుకము నుండి కాంతి ఎదలోతులలో నీవే యుంటివని రామునకు తెల్పునట్లున్నది. పసిడి మెరుగులీను శరీరగత పద్మ సుగంధము గుప్పున గుబాళించినట్లు ఆయినది. శ్రీరాముని ఆనందమునకు మేరలేదు.

మేనుపులకలెసగ దరహాసితాననుడై తన దోయిలితో సీతా మస్తకంన మౌక్తిక బ్రాలు పోసినాడు. అవి సీతాకాశమున నక్షత్రములవలే క్షణకాలము మిలమిలా మెరసినవి. ఆ అపురూప సన్నివేశము సీతారాముల లోకోత్తర సౌందర్యముగాంచిన జనకుడు సభ్యుల దృష్టిదోషము తగులునేమో యని భద్రంతే భద్రంతే అని ఆశీర్వదించాడు.

ఆ సమయమున ఆకాశమునుండి దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టితెరపి లేకుండా కురిసినది. సభ్యులు విస్మయముతో పరికించి చూస్తున్నారు. భూసురులు ఆశీర్వాదాలు చేస్తున్నారు. వాద్య విశేషాలు శ్రావ్యముగా మ్రోగుచున్నాయి. నాదస్వరమున కళ్యాణి, అమృతవర్షిణి, మోహనంగా వినబడసాగింది. పెద్దలు పేరంటాండ్రు కుసుమాక్షతలు నవవధూవరులపై చల్లుతున్నారు. పురోహితులు నూత్నవధూవరులను జ్వలిస్తున్న అగ్నిహోత్రమునకు ప్రదక్షిణచేయిస్తున్నారు. "అగ్నే నయా సుపథారాయె అస్మాన్" అని బిగ్గరిగా ఉచ్చరిస్తూయున్నారు. శుభారంభమై సుఖాంతమై వైవాహిక కార్యక్రమములు ముగిసినవి. రాముడు కళ్యాణ రాముడైనాడు. శ్రీజగత్కళ్యాణ రాముడెప్పుడగునో ?

" మానిషాద ప్రతిష్ఠ త్వ మగమః శాశ్వతీస్సమాః " అని వాల్మీకి నిషాదుని శపించిన సూక్తికి ఇదియా అర్థము? ఇంతటి అర్థమున్న ఆ లక్ష్మీనారాయణులే నేటి సీతారాములన్నమాట. ఒక ఉత్తరపదమునకదెంత అర్థమున్నదో? ఆలోచించాలి మరి రెండు పాదముల అర్థము సమర్థమైననాడే ఆ చంద్రార్కము కీర్తిగా జెల్లుతుంది. అని బ్రహ్మ యొక్క ఆదేశము. నారదోక్తి, సరస్వతి కటాక్షము అన్నీ సమకూడి వాల్మీకిని ప్రేరేపించేయి. తత్పరిణామంగానే మానవకోటికి ఐహికాముష్మికాలు లభించుతాయి. అందులకు ఆ మానిషాదుడే మనకు దిక్కు. యిది ఉపశ్రుతి.

## గర్వభంగం

సహనాయి సుస్వరంగా వినవస్తున్నది. తదనుకూలంగా మిగిలిన జంతర వాద్యములు, కాంశ్య, తాళ, కాహళ, తూర్య నాదాలు మ్రోగుతున్నాయి. బంధువులు అమూల్యములైన మణికాంచన అంబరాభరణంలు కానుకలొసగుచున్నారు. మిగిలిన వైవాహికతంతు ముగిసినది. మృష్టాన్న భోజనములు అరగించారు. వేదశాస్త్రపారంగతులకు సకల కళా కోవిదులకు ఘనంగా సన్మానాలు జరిగాయి. ఇంకనూ వేడుకలు జరుగుచునే యున్నాయి. నూతన వధూవరులను దివ్యమైన రథముల నధిష్టించారు. దశరథవశిష్టాదులు కూడా తమతమ రథముల నెక్కి బయలుదేరినారు.

దశరథుని పరివారము వెన్నంటి వస్తూయున్నది. జనకుడు " యాస్యత్యద్య మహీజ " అనుకొని తలచి మ్లానవదనుడైనాడు. సీతా, ఊర్మిళ, మాండవీ సుతకీర్తులు శ్వశృగృహమునకు వెలుతున్నారు. తలిదండ్రులకు తనయుల విడనాడ బాధగా ఉన్నది. వారిని సాగనంప వెంటబయలుదేరినారు.

సీతారాముల కళ్యాణ వైభవంతో మిధిలా నగరమంతా ఆనంద తరంగితమైనది. జనకుడు కన్యాధనంగా వేలాది దాసీదాసుల వెంట పంపించాడు. వెనువెంటనే అనేక పల్యంకికలు, రథములు, వివిధ విచిత్ర వాహనములు, మందసములతో రత్నాభరణములు, సరిగంచుచీరలు. శాలువలు, రత్నకంబళ్లు, పండ్లు, తినుబండారములు, వక్కలు, ఆకులు, లవంగి, యాలక, జాజీఫల, జాపత్రి, దాల్చిన, కస్తూరి, కుంకుమ, కర్పూర, జవ్వాది. అగరు. పసుపు, చందనము మొదలైన వస్తుజాతము కోకొల్లలుగా పంపించాడు జనకుడు.

సంతోష విచారములతో నగరము యావత్తు ఆబాలవృద్ధులు పెండ్లివారిని సాగనంప బయలుదేరినారు. జనకుడు కొంత విచ్వేగి "అర్థోహి కన్యా పరకీయ ఏవ" అని గుండె నిబ్బరం చేసుకొన్నాడు ఈమె పరకీయ ఒకని వద్దగా ఉంచిన ధనం తనదెట్లవుతుంది. ఎప్పుడైనా అది దాచినవాడిదే అవుతుంది. రామునిదే సీత. ఇంతవరకు నాయింట పంకువగా యున్నది. ఇప్పుడు ఆతని వస్తువు ఆతనిదే అవుచున్నది. జనకుడు తనలో ఇలా అనుకొనుచూ యున్నాడు.

మధ్యేమార్గమున సరళపర్యంతరము వెంటవెళ్లి వియ్యంకుడు మొదలగు పెద్దలవద్ద సెలవు తీసుకొని జనకుడు తనపరివారంతో ఏదో పోగొట్టుకొన్న వాని ముఖంతో మరళా మిథులానగరం చేరుకొన్నాడు ఇట జనకుడు పంపిన బళ్లు, రథములు. పరివారం అంతా మిథుల నుండి అయోధ్యకు చీమల బారువలె సాగిపోతున్నాది. దారిలో దట్టమైన పరాగంతో ఝంఝూమారుతము బయలుదేరింది. దిక్కులకు ఆవిరిలు కమ్మినది. ఆకాశం గాఢమేఘాచ్ఛాదితమైనది. సుదూరం నుండి ఏదో పక్షియొకటి వికృతంగా కూయుచున్నది. దశరథుని గుండెల్లో భయం ఆవహియించినది. దగ్గరనున్న పురోహితుని చూచి మహామహర్షీ! మనసు ఏదో కీడు సంకిస్తున్నది. ఏమి ఆపద వాటిల్లునో అని వసిష్ఠునితో పలికెను.

భయపడకు మహారాజా! అదిగో అనుకూలమైన గాలి కూడా మనస్సునకు హాయి కలిగిస్తున్నది. కొలది మాత్రం భయం ఉపస్థితమై వెంటనే తొలిగిపోగలదని వశిష్టుడు పలుకుచుండ ఒక మహోన్నత పురుషుడు ఎదుట తారసపడ్డాడు. రాముడు, వశిష్టుడు, దశరథుడు [illegible] ఎదురుగా వెళ్లారు.

ఆ మహానీయుడు దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు జటాజూట మండితుడు. ఆజానులంబిత భుజసౌష్టవము కలవాడు, సుదీర్ఘకాయుడు. విశాలము బలిష్టమైన వక్షస్థలము కలవాడు. దీర్ఘ నాసిక, రక్తాంతనేత్రాలు, చలిస్తున్న అధరాలు, బవిరి గడ్డము, మీసములు, లలాటమున భస్మరేఖలు, దక్షిణ భుజమున గండరగొడ్డలి, వామభుజమున ధనస్సును కలిగి లోకభీకరమైన మహోన్నత పురుషుడు వారిఎదుట నిలిచాడు.

" ఇదం క్షాత్రం ఇదం బ్రాహ్మ్యం " అన్నట్లున్నాడు అతడు పరశురాముడు "

ఒకప్పుడేమైనదంటే హైహయ దేశాధీశుడైన సహస్ర బాహువు అనబడు కార్తవీర్యుడు సపరివారంగా వేటకువెళ్లి అలసి సొలసి ఆకలిదప్పులచే పీడితుడై జమదగ్ని ఆశ్రమమునకు వచ్చాడు " అభ్యాగతః స్వయంవిష్ణుః " అని తలచి భార్గవుడెదురేగి ఆ రాజు సకు పరివారమునకు తన హోమధేనువు వలన మృష్టాన్నములచే తృప్తిపరచాడు.

ఈ ఋషి ఇందరకు ఇంత సౌకర్యం అనతికాలంలో కలిగించాడంటే దానికి ఈ ధేనువే ముఖ్యకారణం. అని తలచి కార్తవీర్యుడు బలిమిన ఆ ధేనువును తోలుకొనిపోయాడు. ఆ ఋషి ఎన్నివిధాల [illegible]న వినక ఆతని తలను తరిగి మరియు బలగర్వితుడై

ఆ గోవును తోలుకొని పోయాడు.

క్రిందటికి " ఒకడు ఇంతకుడిచి వాసములు లెక్కించి ఈ ఋల్లు నాదన్నాడట " అనునట్లు మరియు ఆ గృహస్తునితో వివాదించినట్లున్నది. ఈ రాజు బలగర్వితుడై గృహస్తుడైన బ్రాహ్మణుని చంపి ఆవును తోలుకుపోయాడు. వాడుకంటే వీడు ఘనుడు. కాని పాపఫలము అనుభవించకా తీరునా ?

తన తండ్రి తల నరికిన సహస్ర బాహుని కార్తవీర్యార్జుని పరశురాముడు సంహరించాడు. అంతటిలో ఆగక దురధికార ప్రమత్తులు, స్వార్థపూరితులు, లోభులు, జారులు, చోరులు, మానిని, మానహాని, ప్రాణహాని కారకులు, ప్రజాకంతకులు, మొరకులైన క్షాత్రవులను తనకుఠారధారాఘాతమున తలలునరికి వేసినాడు. ఇరువదిఒక్క మార్లు మరళ మరళ ఇట్టి దుర్నీతులు పుడమిపై కనబడకండా తలలు నరికి, వారిక వోణ్ణధారలచే ధారావాహినిలుగా బరపి పంచనదములు నిర్మించి తన పితృపాదులకు రక్తతర్పణము చేసినాడు. ఆ ప్రదేశం ఈ నాటికి పంచనదక్షేత్రమై వెలసిల్లింది. ఈ భూమండలమంతయు జయించి కశ్యప ప్రజాపతికి దానంచేసిన దానశీలి. మహా పరాక్రమశాలి. ఆ కారణం చేతనే ఈ భూమికి కాశ్యపి అను పేరు ప్రసిద్ధమైనది.

లోకభీకరుడైన భార్గవరామునికి దశరథుడు సమస్కరించి ' బృగువంశతిలకా? నీ పరాక్రమము లోకప్రసిద్ధమైనది. మొరకులైన రాజుల కుత్తుకులనుత్తరించిన నీ సామర్థ్యం అమేయము. ఇదే ఈ చిరంజీవి రాముడు వివాహితుడై మిథులనుండి అయోధ్యా పురమునకు అరుగుచున్నారము. కరుణించి మమ్మలనాశీర్వదించుము. అని పలుకుచున్నాడు.

దశరథుని మాటలు లక్ష్యపెట్టక పరశురాముడు రామా!

మా గురుసర్వులైన పరమేశ్వరుని చాపము ఖండించి మేటి వసుకొను చున్నావు ఇదిగో ఈ ధనువును ఎక్కుపెట్టి నీ బలపరాక్రమమును చూపిన తరువాత నీతో ద్వంద్వ యుద్ధం చేయగలనని పరశురాముడు పలికె. తన ధనువును చూపుచూ గమనించితివా ఈ ధనువు వైష్ణవమను పది. దీనిని మయుడను వాడు నిర్మించాడు విష్ణువునకొసగ బడినది. దీనిని భార్గవుడైన ఋచీకునకు విష్ణువు ఒసగినాడు. అతడు నా తండ్రికిచ్చాడు. అతనివలనే నేను గ్రహించాను. హరధనువుకంటే ఇది కోటిగుణితమైన భారము కలదు. దీనిని సంధించు నీ బలంచూచెదను. అని కటములదురునట్లు పలుకుచున్న పరశురాముని సమీపించి రాముడు హస్తప్రసారము ధనువునకై చేచినాడు. వైష్ణవమగు ఆ ధృఢ ధనువును భార్గవుడు రామునికి అందించాడు. రాముడు దానిని అవలీలగా ఎడమచేత గ్రహించి సుగమముగా వింటినివంచి నారిని వింటికోపునకు తగిలించాడు. శరమును కూర్చి ఆకర్ణాంతము ఆకర్షించాడు రాముడు. దుర్ణిరీక్ష తేజస్సంపన్నుడైన రాముడు భార్గవుని చూచి రామా నీవు బ్రాహ్మణుడవు నిను చంపరాదు. ఈ శరము మహాస్త్రమైనది. ఈ శరమును వ్యర్థపరచరాదు. త్వరగా చెప్పుము ఎవరిపై నప్రయోగించాలి? అని మేఘగంభీర భాషణముల పలికెను. నిస్తేజుడై పరశురాముడు చేతులు జోడించి నమస్కరించాడు. ప్రభూ! నిన్ను శ్రీమన్నారాయణునిగా తెలుసుకొన్నాను. దుష్టశిక్షణ, శిష్టరక్షణ ధర్మపాలనార్థము పుడమి నవతరించిన శ్రీమహావిష్ణువువు. నేను ఇది వరకు తపసుచేసి సంపాదించిన ఉత్తమ లోకములనే కములు కలవు. వాటిని ఘాతించు నాకు సెలవిమ్ము మహేంద్రంనకు పోయి తపసు చేసుకొనుదును. అని సవినయంగా భార్గవరాముడు పలికె. రాముడు శరమును విడచి భార్గవుని ఉత్తమ లోకములనాశానం చేసెను. అంతట నమస్కరించి అనుజ్ఞతీసుకొని పరశురాముడు మహేంద్రమునకు తపసు చేసుకొనుటకు వెళ్లిపోయెను. దిక్కులు వికాసం చెందినవి. చల్లని వాయువులు వీచినవి.

# పుర ప్రవేశము

శ్రీరామచంద్రుడు వైష్ణవమను ఆ ధనువును వీరుణునకు ఒసగె తండ్రికి నమస్కరించి భార్గవరాముడు మహేంద్రమునకు తపస్సునకు వెళ్లెనని దశరథుని భయమును పోగొట్టెను. దశరథుని భయ సంభ్రమాదులు పరశురామునితోనే పోయినాయి. ధైర్య ఉత్సాహాలు కలిగాయి. తరువాత పరివారము ఉత్సాహంతో ప్రయాణం కొనసాగించెను. దశరథుడు ముందుగా తన సేవకులను అయోధ్యకు పంపించి తనరాకను తెలియజేయించాడు.

నూతన వధూవరుల నగరప్రవేశము, గృహప్రవేశము జరగబోతుంది. పట్టణమంతా అలంకరింపబడినది. పందిరిలు వేశారు. పతకాలుకట్టారు. సువాసనా కలయింపిజల్లిముత్యాలముగ్గులు తీర్చారు కదలీస్తంభాలు అలంకరించారు. తోరణాలంతటా కట్టబడ్డాయి. స్వాగత వచనాలు లిఖించబడిన ఫలకాలు వ్రేలాడదీశారు. సుగంధ, ధూప, ధూమ వాసనతో పట్టణమంతయు పరిమళించిపోతున్నది. ప్రధాన స్థాన కోట బురుజుపైన కోవిదారధ్వజము రెపరెపలాడుచున్నది. రాజోద్యోగులు, రాజబంధువులు, పెద్దలు, పిన్నలు పలువురు ఉచితమైనరీతిని పెండ్లివారిని ఎదుర్కొంటుయున్నారు. సన్నాయిగా, శ్రావ్యంగా మంగళనాదాలు మ్రోగుచున్నాయి. నగర ప్రధానద్వారమునకిరుపైపులా పూర్ణకుంభాలుంచబడినాయి. ధ్వజములు ఎగిరిస్తున్నాయి. మౌక్తిక తోరణాలు మెరుస్తూ ఉన్నాయి. శంఖాలు ధ్వనిస్తున్నాయి. లాజలు, అక్షతలు, కుసుమములు, వృష్టిగా ప్రజలు, నవవధూవరులపై జల్లితున్నారు. పురంధ్రీలలామలు మంగళ హారతులొసగుచున్నారు.

నూతన వధూవరులు ప్రజల హర్షధ్వానాలతో నగరిలో రాజభవనంలో ప్రవేశించారు. కౌసల్యా, కైకేయి, సుమిత్రా మాతృమూర్తులకు పాదాభివందనం చేశారు. తండ్రికి పురోహితులకు

నమస్కరించి దీవనలు వడిసారు. నలువురు కోడండ్రకు అమాత్య మూర్తులు ఆశీర్వదించి చేరదీసి ఆదరించి అభినందించారు. కులదేవ తలకు మొక్కించారు. కోడళ్లు వచ్చిన శుభముహూర్తమున తమ ఆనందంతోపాటు పండ్లు ఫలహారములు, పసుపు - కుంకుమలు, పట్టు వస్త్రములు, బంగారుపళ్లెరములనుంచి పట్టణమునగల ప్రతి గృహము నకు పంపిపెట్టించారు. ప్రజలెల్లరూ పరమానందం చెందేరు. తమ కోడండ్రు తమ గృహములకు సారెలు, చీరలు తెచ్చినట్లు సంత సించినారు.

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు పితృసేవానిరతులు, మాతృపూజాతత్పరులు, గురుశుశ్రూషానిరతులు ప్రజాసంతోషకారకులై మెలగినారు. నలువురు కోడండ్రు అత్తమామలయెడ భయభక్తితత్ప రులై సకలోపచారములతో నిరంతరం సంతోష పరస్తున్నారు. పెద్దల యెడ వినయవిధేయతలు కలిగి, సేవకులయెడ దయాదాక్షిణ్యములు కలిగి లోకంలో అన్నివిధములా ఆదర్శ మహిళామణులుగా ప్రవర్తి స్తున్నారు. పతుల సహచర్యా భాగ్యము కలిగినందువల్ల వారి వారి హృదయ ఫలకము నిరంతరం అధివసించి ఆనందడోలికలలో యూగించుచున్నారు. తాము కర్మణా, మనసా, వాచా పతులసేవ చేయుటవలన తమ జన్మ సాఫల్యమొందినట్లు తలస్తున్నారు.

కతిపయ దినములు గడచిన తరువాత దశరదుని అనుమతి గొని యుధాజిత్తు తన మేనల్లుళ్లను, వారి భార్యలను కేకయ నగ రానికి పిలుచుకొని వెళ్లినాడు. అది శరత్ శుక్లపక్షము. నాటి రాత్రి మొదటి యామం గడిచినది. సమయసూచిక ఘంటలు మోగ్రగు తున్నాయి. ప్రపంచం ఇంకా సద్దుమణగలేదు. ఆకాశమున వెండిజరీ అంచుగల నక్షత్రపుఖను తొలగించుకొనిన వానివలే జాబిలితెలి మబ్బుల తెరలతొలగించి తెరమరుగున ఎవరున్నారో అని తొంగితొంగి చూస్తూ న్నాడు. చిరచిరె రెండు చుక్కలు మిలమిల మెరసిపోతూ తన్మొగిలు

పుతున్నట్లున్నవి. వెన్నెలలు జాలువారి పుడమిని పాలతరగలతో ..ంపినట్లున్నది. కిరణాలు సోకినంతవరకు ఆ తోటలోని చెట్లు ఒక వైపున వెండితో చేసిన కొమ్మలు ఆకులు, పూవులు, రెమ్మలు కలిగి యున్నాయి. మల్లె, మాలతి, జాజి, సంపెంగ, మందార, కుంద, వకుళ, పొన్నలు విరబూసియున్నాయి. వివిధ పుష్పపరిమళాలతో తోట అంతయూ గుబాళిస్తున్నది. చిఱుగాలులకు కొంచెము కదులుచూ తమ తమ సమీపమునకు రావల్సినదిగా చేసన్నల ఆహ్వానిస్తూనట్లు ఉన్నాయి, జలయంత్రాలు చల్లని నీటిధారల చిమ్ముతూ ఆకర్షణీయంగా ఉన్నాయి. చంద్రకాంత వితర్దికలు పూపొదరిల్లు నమీపాన వెన్నెలలో మెరసిపోతున్నాయి. ఎక్కడనుండో నీలకంఠము షడ్జమాన ఒక కేకవేసింది. ఒక పొదరిల్లు చిఱుగాలికి కదలింది. పువ్వులు జల్లు రాలినాయి.

ఆమె ఎవరు? ఇటే వస్తున్నట్లుంది. పాలరాతి తిన్నెలపై కూర్చున్నది, బంగారుజలతారు మామిడిపిందెలు అంచులుగల తెల్లని లములు ధరించినది. అది వెన్నెల సొగసును అధికరుస్తున్నది. ఎఱ్ఱని దూకూపట్టుకంచుకము బంగారుపూలుకలిగినదిధరించినట్లున్నది. సన్నని ముత్తియపుసరులు కూర్చి బంగారు అంచుగల పంచరంగుల పట్టు వస్త్రము మేలిముసుగు వైచినది. పచ్చనిచేతితో ఆమె కొంచెము మేలిముసుగు తొలగించి బెదరి లేడికళ్లలాంటి కండ్లతో ఇటునటు చూస్తున్నది. కతిపయ సముచిత ఆభరణములు ధరించింది. తలలో మల్లెలు, మెడలో రత్నములు పొదిగిన ముత్తెపు సరులు. ముఖమున చిఱునవ్వులు, కన్నులకు కాటుక రేఖలు, కరమున లీలాకమలము. దృష్టి ఎటో? ఎవరికోసమో ఆ నిరీక్షణ?

ఆమె వనదేవత కాదు. చంద్రుని నుంచి అలిగి వచ్చిన రోహిణియా! అదియునూకాదు. సూర్యుని విడిని వచ్చిన సువర్చలా! కాదు కాదు మరి ? శచి! కానేకాదు, రతి! అంతకూకాదు. మరి ఎవరు?

పొంకపలె వెడలి వచ్చిన కమలాలయు. ఆమె చేతిలో లీలా కమలం [illegible] పట్టియున్నది. మాటిమాటికి ఎదురుతెన్నులు చూస్తున్నది. ఆమె ఎవరో కాదు జానకి.

శ్రీరామచంద్రుడు జగన్మోహనాకారంతో వెనుకనుండి వచ్చి [illegible] మూసాడు. ఆ తల్లి తుళ్ళిపడి తనరెండు చేతులతో [illegible] హస్తములు తడిమి పట్టుకొని ప్రభూ! నా ప్రభువే. కరమున [illegible] సింహతలాట కంకణములు, రత్నాంగుళీయక [illegible] ఇవే.

రాముడు చేతులు తొలగించి చిఱునవ్వుతో " ఈ వెన్నెల [illegible] యిటనేమి చేయుచున్నది? అనెను. తమరాక కోసము [illegible]తెన్నులు చూచుచున్నాను ప్రభో! అనెను సీత.

రాముడు : నీ ఎదలో ఎప్పుడో కట్టిపడేశావు కదా!

సీత : అది ఏనాడో జరిగిపోయినది. మరి వెలుపలకు కూడా కనిపించాలి మీరు.

రాముడు : వచ్చేసాను సదా నీ దగ్గరకు

సీత : ఇప్పుడు నాకు 'అంతర్బహిశ్చ' అంతటా కన్పిస్తున్నారు.

అంతట సీతారాములు చంద్రకాంతా వితర్దికనధిష్టించారు. రాముని అంకమున సీత శిరమునచేర్చి గోముగా చూస్తున్నది. [illegible] చంద్రుని చూస్తున్నది. జాబిల్లి మబ్బులచాటున మణగిపోయి [illegible]. [illegible] చంద్రునిమూచి రాకాచంద్రుడు మబ్బులనొదగినాడు.

సీత : ఆర్యపుత్రా! అటు చూడండి. మీ ముఖసౌందర్యాన్ని చూచి చంద్రుడు సిగ్గుతో మబ్బులలో ముఖము దాచుకున్నాడు.

రాముడు ; అబ్బో! అబ్బో! సీతకు కవిత్వం కూడా తెలుసునన్న మాట.

సీత ; కవిత్వంకాదు ప్రభూ! మనసులోని ఉన్నమాట.

రాముడు : అలాగా! నీ ముద్దుల ముఖం చూసి కమలం ముడుచుకోలేదా?

బంగారంలోని పసిమి, వెన్నెలలోని చల్లదనం, కుసుమాల లోని సౌకుమార్యం తామరలలోని సౌగంధం, ఇంకా ఎన్నెన్నో ప్రపంచంలోని అందమైన వస్తువులలో సౌందర్యాదులు నీ మేనిలో మిళితమైనాయి. అందుకే నేను నిన్ను ఇలాగా బాహువులలో బంధించి ఉంచుకుంటాను. గుండెల్లోదాచుకుంటాను అంటు శిరోజాలు సవరిస్తున్నాడు. కన్నార్పక ఆ ప్రణయసుందరి విగ్రహాన్ని తనివితీరగా చూస్తూ దేవీ! ఈ దివ్య సుందర ప్రకృతి అంతయూ నీవే కదా! నిన్ను నా యెదనుండి జారనిస్తానా?

సీత : ధన్యురాలను ప్రభో! ధన్యురాలను

ఇట్టి మధుర సన్నివేశములతో ఎన్నో రాత్రులు, ఎన్నో పగళ్లు, ఎన్నో సంధ్యలు, ఎన్నెన్నో ఉషస్సులు గడిచిపోయాయి. అలాగే మరెన్నో శరత్తులు గడచిపోయినాయి. ఎన్నెన్నో ప్రదేశాలు పునీతాలు అయినాయి. పన్నెండు వసంతాలు క్షణాలలో గడచిపోయినాయి.

ఈ దివ్యపురుషుల సందర్శనం చేత, సంభాషణచేత, సాంగత్యంచేత నగరవాసులు, కోసల సామ్రాజ్యవాసులు చరితార్థులైనారు. వేయేల? ఆ కాలమే మంగళకరమైనదంటే అతిశయోక్తి కాదు. స్వభావోక్తియే అవుతుంది.

॥ ఇది ప్రథమ పుష్పము పరిసమాప్తము ॥

# ద్వితీయ పుష్పము

సీతమ్మవాకిట సిరిమల్లె చెట్టు
సిరిమల్లెచెట్టేమొ విరగపూసింది
చెట్టు కదలకుండ కొమ్మవంచండి
కొమ్మ విరగకుండ పూలు కోయండి
అందులో పెద్దపూలు దండ గుచ్చండి
ఈ దండ సీతమ్మకిచ్చి మొక్కండి ॥

అంటూ పదిమంది బాలబాలికలు పాటకనుగుణముగా చప్పట్లు చరుస్తూ వలయాకారంగా తిరుగుతున్నారు. ఉదయం '8' గంటలవు తుంది చిఱుయెండకు వారి ముఖాలు చిఱుచెమటలు పట్టాయి. రంగడు ఎక్కడనుండో పరిగెత్తుకొచ్చాడు.

ఆరే! అన్నలు, చెల్లెళ్లూ! రండరా! రండి. ఏనుగులు, గుఱ్ఱాలు, ఒంటెలు వచ్చాయి. రథాలు బండ్లు ఆ తోటలో ఉన్నాయి. చూద్దాం పదండి అని రంగడు చెప్పేసరికి పిల్లలందరు ఆట పాటలు విడిచి పరుగెత్తేరు. అది ఒకపెద్ద మామిడితోట. అందులో ఫలవృక్షాలు అనేకములున్నాయి. ప్రయత్నపూర్వకముగా ఆ తోట పెంచబడినది ఆ తోటలో ఆగంతకులైనరాజులు, మంత్రులు, భటులు, జానపదులు పౌరులు అంతా వచ్చియున్నారు. ఆ ప్రాంతమంతా కలకలలాడు తున్నది. వారంతా అనేక దేశములనుండి వచ్చినారు. వారెక్కివచ్చిన ఏనుగులు, గుఱ్ఱాలు, బండ్లు, రథాలు మున్నగునవి అచట వారు విడిచి సభాభవనమునకేగిరి. ఆ తోటలో వాటిని పిల్లలు వింతగా చూస్తూ ఆనందిస్తూయున్నారు.

ఆది సభాభవనప్రాంగణము. ఒకవైపు రథాలు, వేరొకవైపు గుఱ్ఱాలు, ఇంకొకవైపు ఏనుగులు, మరొకవైపు ద్విచక్రశకటాలు

ఉన్నాయి. వాటిని రక్షించేవారు ఆయా ప్రాంతాలలో వాటికి తగు రక్షణ కల్పిస్తున్నారు. భవన ప్రవేశద్వారమున కిరువైపులా సాయుధపాణులైన రక్షక భటులు నిలచియున్నారు. ఒక మహోన్నత రాజోద్యోగి ఆగంతకులకు సగౌరవంగా భవన ప్రవేశము చేయిస్తూయున్నాడు.

ఎదురుగా దివ్యమైన స్వర్ణసింహాసనము. దానికిరువైపులా తగు పీఠములు కలవు. మహారాజులు, సామంతులు, బ్రాహ్మణులు, వైశ్యులు, జానపదులు, నానావర్ణములవారు, నానావృత్తులవారు, ఉద్యోగులు, సేవకులు, పలుప్రాంతాలనుండి వచ్చినవారు, అందరూ తమకై నిర్దేశింపబడ్డ ఆసనములపై కూర్చున్నారు. ఎవరెక్కడకూర్చున్న అందరూ ఎదుటనున్న వేదికస్పష్టముగా కనబడుతుంది. దూరశ్రీవణయంత్రాలువాయు ప్రసరణయంత్రాలు అచటచటఅమర్చబడ్డాయి

అతిమెత్తని ఆసనాలలో కూర్చున్నవారికి ఈ సభ అంతా దేవేంద్ర భవనంలాగ ఉన్నది. వసిష్టాది ఋషులు, సుమంత్రాది మంత్రులువేదికపై పీఠములధిష్టించారు. అప్పుడు—

" రాజాధిరాజ! రాజపరమేశ్వర! ఇక్ష్వాకువంశపయోధి పారావార రాకాసుధాకరా! సకల జనమనమందార! అరి వీర భయంకరా! దశరథ సార్వభౌమా! జయీభవ! విజయీభవ దిగ్విజయీభవ! " అని వందులు కైవారం చేశారు. సభ్యులంతా ఒకసారి లేచి వినమిత మస్తకులైనారు. మహారాజు సింహగామియై సభాప్రవేశం చేసి సభికులకందరకూ నమస్కరించి తమ ఆసనంపై ఆసీనులైనారు. సభ్యులు జయజయ ధ్వానాలు చేసారు. సింహాసనం వెనుక శ్వేతచ్ఛత్రం. సేవకుడొకడుపట్టి నిలిచాడు. ఇరువురు చామరగ్రాహిణులు, చామరాలను వీస్తున్నారు. సభ్యులందరూ తమ తమ ఆసనాలనధిష్టించారు. సద్దుమణిగింది. సభ అంతటా ప్రశాంతత అలముకుంది.

వెంటనే సుమంత్రుడులేచి—

" సభాయైనమః " ఆర్యులారా! సామ్రాజ్య పౌరులారా! ఈశ్వేతఛత్రము నీడలో ఇక్ష్వాకు మొదలుకొని నేటివరకు సార్వభౌముల పరిపాలనలో ప్రజలు ఎంతటి సుఖసంతోషాలతో వర్ధిల్లారో తమకందరకూ తెలిసిన విషయమే. కర్షకులు, కార్మికులు, వ్యాపారులు యితర వృత్తులవారు తగు సౌకర్యాలు కలిగి తమ తమ వృత్తుల ద్వారా దేశౌన్నత్యానికి మిక్కిలితోడ్పడి ప్రజాపాలనా సౌలభ్యానికి సహకరిస్తున్నందులకు మీ యెల్లరికి ధన్యవాదాలు. విద్యా, విజ్ఞానం, కళలు, శాస్త్రాలు, సమస్తం సార్వభౌముల పాలనలో మహోన్నత స్థితి నందుటకూడా తమకందరకు విదితమే అయిననూ, పరిపాలనా భారము, ఒక్కరు నిర్వహించుట ఇప్పట్లో కష్ట సాధ్యమగుచున్నది. కనుక సార్వభౌములకు తగు మహాపురుషుని సహకారం ఎంతైన అవసరమని తలుస్తాము. ఈ విషయాన్నే మీ ముందు ఉంచి మీ సహాయ సహకారమునందించుట ప్రభుత్వ కర్తవ్యంగా నిర్ణయించి నేడు ఈ సమావేశమునేర్పాటు చేశారు. అని మంత్రివర్యులు పల్కి ఆసీనులైనారు.

వెంటనే దశరథుడు ప్రజలనుద్దేశించి మహాజనులారా! అమాత్యులభిప్రాయమును గ్రహించారు కదా! అనేక వేలసంవత్సరాలు ఈ తెల్లగొడుగు నీడలో తల్లి బిడ్డలసాకుసట్లు పాలించామని నేను చెప్పుట సభవుకాదు. అంతయూ తమకు తెలుసు.

ప్రజలలో అంతటా హర్షధ్వానాలు కలిగి సద్దుమణిగింది. మరల దశరథుడు చెప్పసాగాడు " ఇప్పట్లో రాజ్యభారానికి జరాభారముతోడైనది. మా పూర్వులవలె ప్రజాశ్రేయస్సు నుద్దేశించి పరిపాలనను అందించుటకు తోడు అవసరమని మనవి చేస్తున్నాను. మీకు తెలుసు గుణశ్రేష్ఠుడు, ధానుష్కుడు, సకల విద్యావిశారదుడు,

దయాచిత్తుడు, మీ కన్ని విధాల నచ్చినవాడు నాపెద్ద కుమారుడు రాముడు.

పాలనావిధిలో పెద్దవానికే అర్హత కలిగియుండుట చేత నాకు అత్యంత ప్రియమైన రాముని సహకారంతో నా భారం! బాధ్యత కొంతతొలుగుతుంది మీకు శ్రేయస్సు కలుగుతుందని నా నమ్మకము మీ అందరి అనుమతితో ఆ చిరంజీవికి యువరాజ్య పట్టాభిషేకము చేయాలని మా సంకల్పము అని పల్కుతూ ముగించాడు.

వెంటనే సభలో అంతటా హర్షధ్వానాలు మిన్నుముట్టెయి. "శ్రీరామచంద్రునికి జై" అంటూ జేజేధ్వానాలు చేశారు. ఆ సంతోషతరంగాల మధ్య "ప్రభూ! ఇంతకాలానికి మా మనసులోని కోరిక తీరింది. మేము ధన్యులమైనాము. శ్రీరాముడే మాకు రక్షకుడు. అతని నీడలో మేము సుఖముగానుంటాము. నేటినుండి రామరాజ్యము వర్ధిల్లాలి" అని పలికారు.

వేత్రహస్తులు కొంతవరకు సద్దుమణిగేలాగ సభను చేశారు. దశరథుడు మరల ప్రజలతో సవినయంగా అంటున్నాడు "మహాజనులారా! నాదొక చిన్న మనవి. వేలాది సంవత్సరాలుగా పరిపాలన జరుగుతున్నది. ప్రజలలో ఇంతవరకూ ఎక్కడా నావల్ల నిరాశ నిస్పృహలు కల్గినట్లు వినబడలేదు. కష్టనష్టాలు పొందినట్లు కనబడలేదు నీతి నియమాలు ఉల్లంఘించినట్లు తోచలేదు. అటువంటివి నా పాలనలో ఏవైనా లోపాలు కలిగితే చెప్పండి. ఒక్కసారిగ రామరాజ్యాభిలాష మీకెలా కలిగింది? అని ప్రశ్నించాడు.

నీటిలో బెడ్డవేసి లోతుకనుక్కోవడం అంటే ఇదే కాబోలు? ప్రజలందరూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ప్రజా ప్రతినిధిగా ఒకడు లేచి నిలిచాడు. ఇలా అన్నాడు—

ఆడకూతుర్లు సూశారంటే పడిపడి దణ్ణాలు మొక్కుతారు. మాదరమరాజు ఎప్పుడు మమ్మేలుతాడో అనుకుంటారు. కన్నెపిల్లలు చూసినారంటే సాటుమాటున గుసగుసలు పోతారు, ఇగ మాలాటి ఓళ్ల సంగతి ఏటి సెప్పమంటారు? కల్లుమూసిన తెరసిన ఆ నల్లనయ్యే నవ్వుతూ ఎప్పుడూ కనబడుతుంటాడు. మాకింకేటి కట్టాలు? ఎగిరిపోతాయి. యిక మా పనులు, సెక సెక సేసుకొనిపోతాం మా రాజా! ఆ రాముడు రాజుగా ఉండనీ. మా ముచ్చట తీరుద్ది. బక్కబడుగు, పిల్లా సేక అంతా అతగాని మీదే ఆశలు పెట్టుకున్నాం. అతడు మాకందరికి పానం బాబయ్యా! అతగాను సుత్తే మనుషుల జనమ జనమపాపాలు పారిపోతాయి అంటూ ఆనందంతో ఆ జానపదుడు చెప్పుకుపోతున్నాడు.

'చాలు చాలు ఇప్పటికి మీ అందరి అభిప్రాయములు ప్రభువులు గ్రహించారు. త్వరలో మీ అందరి ఉద్దేశానుసారం రాముని యువరాజ పట్టాభిషేక విషయం ప్రకటిస్తారు' అని సుమంత్రుడు పలికి సభను ముగించాడు.

రాజు తన అంతర్భవనాన్ని చేరుకున్నాడు. వెంటమంత్రులు, పురోహితులు, కొందరు ముఖ్యులు అనుసరించారు. అక్కడ విశ్రామ మందిరంలో దశరథుడు ఒక ఆసనముపై ఉపవిష్టుడైనాడు. అందర్నీ కూర్చోమని సౌంజ్ఞచేశాడు. సుమంత్రుని చూసి రాముడిటకు రావల్సినదిగా ఆజ్ఞాపించాడు.

ప్రభువులభిప్రాయము, ప్రజలభిప్రాయం ఏకమైంది. ఇంక కార్యరూపందాల్చడానికి అడ్డుఏముంది? శరవేగంతో పట్టణమంతా రామపట్టాభిషేకవార్త వ్యాపించిపోయింది, ఎక్కడ చూసినా ఈ విషయమై గుసగుసలు, హర్షధ్వానాల వెల్లువలు, వెన్నెల వెలుగులులా వ్యాపించాయి.

సుమంత్రుడు ఒక కక్ష్యనతిక్రమించాడు. మువ్వురు, నవ్వురు పట్టాభిషేకముగూర్చి ముచ్చటించు కుంటున్నారు. మరియొక కక్ష్య నతిక్రమించాడు. అక్కడ అదేవార్త. మఱరెండు ద్వారాలు దాటేడు సుమంత్రుడు రామలక్ష్మణులు ఏకాసనా ఉపవిష్టులై ఏవేవో మాట్లాడు కుంటున్నారు. వారిముఖాలలో గాంభీర్యం గోచరిస్తుంది.

ప్రభు! తమ పితృపాదులు ఆజ్ఞాపించారు. సత్వరంగా తమను తోడ్కొనిరమ్మన్నారు. అని సవినయంగా సుమంత్రుడు పలికాడు.

వెంటనే సుమంత్రునివెంట రాముడు తండ్రివద్దకు వచ్చాడు 'పితృదేవులకు ప్రణామములు' అని పాదాభివందనంచేసిన రాముని 'చిరంజీవ' అంటూ దశరథుడు తనవద్ద కూర్చొన బెట్టుకున్నాడు. భుజముపై చెయ్యివేసి వాత్సల్యంతో—

"రామా! అత్యవసరమై పిలిపించాను. చూడు, ఈనా శరీరం చిరకాలం రాజ్యభారంచేత, జరాభారంచేత శుష్కించిపోయినది. ఇంతవరకు ప్రజలిని కన్నబిడ్డలవలే పాలించాను. రాజభోగాలు అనుభవించాను, దానధర్మాదులు చేసాను. దేవాయతనాలు నిర్మించాను. సత్రాలను నిర్మించి శాశ్వతాన్నదానాదులు నిర్వహించేటట్లు చేశాను. దేవఋషి, పితృఋణాలు తీర్చుకున్నాను. నాకిక ఏ ఒక్కకామ్యం మిగులలేదు. నీకు పట్టాభిషేకంచేసి ఆనందించాలని నిశ్చయించాను. ఇదే నా చివరి కాంక్ష" అని చెప్పి దశరథుడు కొంచెం సేపుమౌనం వహించాడు. మరల చెప్పడాన్కి ప్రారంభించాడు.

ఈ శుభకార్యం చేయడానికి ఆలసించరాదు. ఇది చైత్ర మాసం కదా! రేపు పుష్యమి నక్షత్రం. ఈ పుష్యయోగంలో పట్టాభిషేకానికి యోగ్యంగా ఉండునని దైవజ్ఞులు చెప్పుచున్నారు. అని!

మంత్రుల, పురోహితులనుద్దేశించి—

'మీరును గమనించియే ఉంటారు. సూర్యమండలం పరిమ్లానమైనది. ఉల్కలు పడుచున్నాయి. అగ్నులు ధూమచ్ఛన్నములైనాయి. జ్వాలలు అప్రదక్షిణంగా ప్రవర్తిస్తున్నాయి. నా ఎడమకన్ను ఎందులకో పదేపదే అదురుచున్నది. రాజునకు ఈ దుస్సంఘటనలు నాశనము కల్గించేవిగా శాస్త్రములు చెప్తూయున్నాయి. తరచూ దుస్వప్నాలు కలిగి నా మనస్సును కలవర పరచుచున్నవి. నా జన్మనక్షత్రానికి దుష్టగ్రహాలు ఆవరించాయి.

'నాయనా రామా! నయనానందకరమగు నీ పట్టాభిషేకముచూసి ఆనందిస్తాను. ఇదే నాతలంపు. ఇక నీవు అందుకు తగిన దీక్షా విధానముల ననుసరించు నీవు ఇక వెళ్లవచ్చు' అనిచెప్పి—

గురువర్యా! సెలవివ్వండి. పట్టాభిషేకానికి వలయు సంభారాలు ఏమేమి సమకూర్చాలో? అని దశరథుడు పలుకగా వసిష్ఠుడు—

ప్రభూ! తమకు తెలియనిదేముంది? అశ్వములు పూన్చిన స్వర్ణరథం, భద్రగజం, ఉత్తమాశ్వం, శ్వేతచ్ఛత్రం. చామరం, రత్నపాదుకలు బంగారు కొమ్ములుగల వృషభం, గోవులు, దీర్ఘమైన కరవాలం, ధ్వజం, పంచామృతులు, పండ్లు, పువ్వులు, అక్షతలు, లాజలు, దూర్వాలు, లక్షకుపైగా భూరిదక్షిణలతో బ్రాహ్మణులకు సమారాధన, ఇత్యాదిగా కులపురోహితులు తెలియజేశారు.

దశరథుడు తగు ఏర్పాట్లుగావించుటకై సేవకులనియోగించాడు. మంత్రి, పురోహిత పరివారాదులు వారివారి పనులలో నిమగ్నమైనారు. రాజు అనుమతిని వసిష్టుడు—సీతారాములకు పట్టాభిషేకవిధానాన్ని అనుసరించి దీక్షా విధానాన్ని నిర్వర్తింపజేయుటకు వెళ్లేడు

[illegible]

నానాదేశాధీశులకు శుభవార్తలు పంపబడ్డాయి. వార్తాహరులు [illegible] జనపదాలకు పట్టణాలకు పట్టాభిషేకవార్తలు అందజేసారు. [illegible], కేకయ, కోసల రాజ్యాధీశులకు వార్తలు వెళ్లలేదు సమయం [illegible] తెలుస్తాయి. భరతాదుల రాకపోయిన ఫరవాలేదు. వారు [illegible] మనకు వ్యతిరేకులుకారు. ఎంతవేగం పట్టాభిషేకం జరిగితే అంత మంచిది. దశరథుడు తన మందిరంలో ఇలా ఆలోచిస్తున్నాడు. [illegible] అంటారు పెద్దలు. ఏవేళకు, ఎవరికి, [illegible], ఎటువంటి బుద్ధిపుడుతుందో ఎవరు చెప్పగలరు? 'దీపం [illegible] ఇల్లు చక్కబెట్టుకోవాలి' అన్నారు. నా గుండెల్లో దీపం కొడిగట్టుక పోతున్నది. ఇలాగ తలపోస్తున్నాడు వృద్ధరాజు. '[illegible] ఆకులు సంచలింపవే' అంటారు. నిజమే మరి. కానున్నది [illegible]తుందా! విధి విధానాన్ని ఎవరు తప్పింపగలరు? రాముడే విధి అయితే విధానము ఆతని సంకల్పమే. ఇక దానిని మార్చేదెవరు? ఇదంతా మనకు గుణపాఠం కాకపోతే మరేమిటి?

అంతఃపురంలో ఆది కౌసల్యా మందిరం మందిరాంత [illegible] స్వర్ణమందిరం. ఆ మందిరంలో మణిమయ [illegible] ఆ పీఠమునకిరువైపులా రత్నకంబళములపై నిశ్చ[illegible] వెలుగుతున్న ఆవునేతి దీపాలు. ఆ దీపాలకాంతిలో వెలిగి[illegible] విగ్రహం. ఆ విగ్రహం శ్రీమన్నారాయణు[illegible] లాంఛితమైన హారకేయూర కటక మకుట [illegible]. కనులంపైనిలచి చిఱునవ్వును చిం[illegible] పుష్పాలతో చందనాగరు సాంబ్రాణి ధూప [illegible] సాంపెరంగుబాళిస్తున్నది. కదళీరసాలనారికేళాది [illegible] పత్రైరములో ఉంచబడ్డాయి. ఆ భగవద్వి [illegible] చేలాజిన కుశోత్తరాస్తీర్ణ ఆసనంపై

పద్మాసనాసీనయై కౌసల్యాదేవి ధ్యానిస్తూయున్నది. ఆమె నేత్రాలు అర్ధనిమీలితాలై యున్నాయి. ఆమె చలించుటలేదు. మనస్సూ చలించుటలేదు. నిహితవాత దీపంలాగ ఏకాగ్రతగా ఉంది. ఆమె మనస్సు. నిస్తరంగ సాగరంవలే ఉన్న ఆమె అంతరంగంలో ఆ నారాయణుని ముద్రించుకొని ధ్యానిస్తూయున్నది. ఎడతెగని తైల ధారలవలెనే స్మృతి సంతానాన్ని కలిగి నిర్విరామంగా ధ్యానిస్తూ యున్నది, ఆమె రక్తాధరాలు ఈషత్ చలిసూయున్నవి. మనస్సులో అనుకుంటూయున్నది. ' ఓం నమోనారాయణాయ '

ధ్యానమందిర మంతయూ నిశ్శబ్దముగా ఉంది. ఆ సరికి ఎప్పుడువచ్చారో సీతాలక్ష్మణ సుమిత్రలు సన్నిహితులై నిలిచారు. పోతపోసిన పుత్తడిబొమ్మల్లాగయున్నారు. వారుకూడా అర్ధనిమీలితులై ధ్యానిస్తూయున్నారు. చేతులు జోడించి మనస్సులో ఏవేవో ధ్యానిస్తూ జపిస్తున్నట్లున్నది. అప్పుడొక చిన్న సద్దు. మెల్లని అడుగులు, కనులకు విందు కలిగించే నల్లని సుందరరూపం అందాల రాముడు, ఆనందాలధాముడు, భయము, భక్తినయము, వినయము కలిగి అల్లనల్లన మెల్లమెల్లగా భగవన్మందిరంలో ప్రవేశించాడు. మాతృమూర్తి మెల్లన కనులుతెరచింది కర్పూరం వెలిగించింది. "మంగళం భగవాన్ విష్ణుః మంగళం మధుసూదనః" మనకామాటలు వినబడవు, ఆమె హారతి సమర్పించి వెనుకకు తిరిగింది. ఓహో! మీరంతా వచ్చేశారా! ఎంతసేపైయింది? హారతి తీసుకోండి. అని చిఱునవ్వుతో పలికింది. అంతా కళ్ళకు హారతి అద్దుకున్నారు. తరువాత రాముడు "మాతృదేవోభవ" అని తల్లిగారికిపాదాభివందనం చేశాడు "చిరంజీవ" అంటూ అతనిని దగ్గరకు చెర్చుకుంది. ఆనందంతో సీతా సుమిత్రా లక్ష్మణులు పాదములంటి నమస్కరించారు.

రాముడు చేతులు కట్టుకొని అమ్మా! తండ్రిగారు రేపు నాకు పట్టాభిషేకం చేయాలని నిశ్చయించి చెప్పారు. మరినాకు నీ కోడలుకు

ఆ పేరః దీక్షావిధానాన్ని మాచేత నిర్వర్తింపజేయుమ్మా! అని పలికాడు ఆ మాట వినగానే ఆ తల్లి ఆనందంతో పొంగిపోయింది. కన్నుల నుండి ఆనందభాష్పాలు అవిరళంగా జారిపోతున్నాయి. సీతాలక్ష్మణ ... త్రుల స్థితి కూడా అట్లాగనే యుంది.

నాయనా! ఎంత చల్లని కబురు చెప్పావురా! నే మ్రొక్కిన ... కరుణించాడు. నా నోములపంట పండింది. ఉండుండు ... పదివేలమంది బ్రాహ్మణులకు అన్నదానం చేయుటానికి ... బాబూ! ఇక నాకేమి చింత లేదు. సుమిత్రకు ఏ ... లేదు. నీ మాతామహులు, వారి వారి కుటుంబాలు నీ వల్ల ... వర్థిల్లుతాయి. ప్రజల కన్నబిడ్డల్లాగ కరుణిస్తావు. ... దీవనలంది చిరకాలం ఆయురారోగ్య భాగ్యాలతో వర్థిల్లు ... కౌసల్యాదేవి తన తల రెండువైపులా చేతులతో మెటికలు ...

వశిష్టులవారు దయచేశారు. యథావిధి అగ్ని హోత్రాన్ని ... స్థండిలంపై కుశాస్తరణమున సీతారాములు ఉపవశింప ... పూర్వకముగ భగవన్మందిరమున నారాయణుని ... చుమని చెప్పి ఆశీర్వాదం చేసి వెళ్ళారు. వారు ... యున్నారు.

## మంధర

అమ్మా అమ్మా! ఇది విన్నావా? కైకమ్మా అంటూ పరు ... కైకేయిదేవి భవనంలో ప్రవేశించింది. అసరికే ఆమె ... అలంకరించుకొని నిలువుటద్దంలో చూచుకుంటూ ... మురిసిపోతున్నది. మురిసిమురిసి నవ్వుల నవ్వు ...

దాసి: అదంతా అట్టి మోసం తెలిసిందా. అది ఒకనాటకం. రాముడు రాజైతే నీ కొడుకు ఎప్పుడూ రాజుకాలేడు. అతని సంతానం అంతకన్నా కాదు. నీ కొడుకు, కోడళ్లు, నీవు, నీబంధువులు నేను అందరము రామాజ్ఞకులోబడాలి. పెద్దమ్మగారికి వారి బంధువులకు అడుగులకు మడుగులొత్తాలి. వాళ్ల మోచేతి నీళ్లు త్రాగాలి. ఇంత తెలివితక్కువదానివైతే ఎలాగమ్మా?

కైక: అయితే యిప్పుడేమి చేయమంటావు?

దాసి; "ఇదుగో ఈ చపురకట్ట పట్టుకొని తుడువు. నేను నీళ్లు జల్లుతాను" అశ్వపతి మహారాజుగారి దొడ్డకూతురువైయుండి అంట్లుతోముకునే గతిపట్టింది నీకు. ఏమి చేయమంటావని నెమ్మదిగా అడుగుతారేంటి?

కైక: (కొంచెం ఆలోచించి, నిట్టూర్పు విడిచి) నిజమే. నాగతి అంతేలాగుంది నీవుచెప్పకపోతే నాకు కనువిప్పు కలిగేదికాదు ఇప్పుడేమి చెయ్యాలి? కాలం దగ్గరపడ్డాది. రేపే పట్టాభిషేకము. అది రాముడికి జరగకూడదు. నా కొడుకే రాజు కావాలి. ఏమి చెయ్యాలి? ఏమిటి ఉపాయము.

దాసి; నీ తెలివికి సంతోషించానులే. ఊఁ అంటే ఉపాయానికి ఏమి లోటు చెయ్యకాలేక ఆకులుపట్టుకుంటే ఏమి లాభంఉంటుంది.

కైక: చెప్పవే. అట్టే ఆలసింపక.

దాసి; చెప్పమంటావా? నా మాట వింటావుకదూ?. నీ బాగుకోసం చెప్పమంటావుకదూ!

కైక: నమ్మకంలేదటే. ముమ్మాటికీ చెబుతున్నాను. రాముడు రాజు కాకూడదు. కానివ్వను. ఇక చెప్పు ఉపాయము.

దాసి: ఐతే విను. లోగడ తిమిధ్వజుడగు శంబరునియుద్ధంలో నీ భర్తకు నీవుచేసిన సహాయానికి, సాహసానికి మెచ్చుకొని రాజు నీకు రెండు వరములు ఇచ్చాడు. ఆ రెండు వరాలు ఇప్పుడు కోరుకో. 1] శ్రీరామునికి వనవాసము రెండవది

నీ కుమారుని పట్టాభిషేకము. తెలిసిందా. ముందుగా నీ భర్తని సత్య పాలకునిగా ప్రతిన చేయించు. నీకు నమ్మకం కలిగిన తరువాత నేను చెప్పినట్లు రెండు వరాలు కోరు. అప్పుడిక తప్పించుకోలేక నీ కోరిక చెల్లిస్తాడు. లోబడ్డావా? ఇక నీపని ఇంతే సంగతులు. తెలిసిందా.
కైక:— భాగుంది నీ ఉపాయం. తప్పక అలా చేస్తాను. ఇటు సూర్యుడు అటు పొడిచిన నా పట్టు విడిచేది లేదు.
దాసి:— అదిగది. అలాఉండాలి నీ పట్టుదల. రాముడు పద్నాలుగు సంవత్సరాలు అడవిలో ఉండాలి. ఎందుకంటే ప్రజలందరూ అతనిని మఱచి భరతుని యందు భక్తివిశ్వాసములు కలిగి వుంటారు.

కోప గృహములో నిరాభరణవై పగలు శెగలుగా మార్చి అలకాకోపము నటించాలి, నీభర్త నిన్ను అనునయించడానికి వస్తాడు. అప్పుడు నీ కోరిక చెప్పి కార్యం నెరవేర్చుకో తెలిసిందా ?

కైక:— ఎంత మంచిదానివే, పొట్టిదానికి పుట్టెడు బుద్ధులు. నీ మేలు మరిచిపోలేనులే.
దాసి;— సరేలే రాజు వచ్చేవేళైనది. నేను చెప్పినట్లు చెయ్యి. ఇక నేను వెల్తాను. అంటూ మందర వెళ్లిపోయింది.

రజోగుణం పరాకాష్టకు చెందినదీ మందర. అందుకే కైక లోబడిపోయింది. దాని పర్యవసానం రాముని వనవాసము.

సమయ సూచిక గంటలు తొమ్మిది వినబడ్డాయి. చంద్రు డప్పుడే ఉదయిస్తున్నాడు. వెన్నెల వెలుగులు చీకటిని చెరిపివేస్తు న్నాయి. చిరువెన్నెలలో మెల్లనిఅడుగులువేస్తూ వృద్ధరాజు కైకేయి మందిరం ప్రవేశించాడు. కంచుకి లేచి నమస్కరించాడు. ఒకటి, రెండు, మూడు కక్ష్యలు అతిక్రమించాడు, ఎవరూ ఎదురు రాలేదు రాణీ కనబడలేదు. ఇంతలో—

ప్రభూ! అటు. ఇటుకాదు. అటు అంటూ ఒక పరిచారిక [illegible] నివసించిన సదిపై పుదారి చూపించింది. రాజు తలుపులు తెరిచాడు అక్కడ ఒళ్లు ఝల్లుమన్నది. కైకేయి నిరాభరణయై కటిక నేలపై పడియుంది. కంట నీరు, దీర్ఘ నిశ్వాసాలు, దుఃఖం రూపుకట్టినట్లుంది. దశరథుడు నెమ్మదిగా సమీపించాడు, మెల్లన స్పృశించాడు. దేవీ! [illegible] పలుకలేదు. ఇట్నుంచి అటుతిరిగి పడుకుంది. దశరథుని గుండె ముల్లు గ్రుచ్చినట్లయింది. ఏమైంది దేవీ! తన వైపునకు మరలించ బోయాడు.

ఎందుకీ అలక! నేనేం తప్పు చేశానని? ఎందుకు నీకీ దుఃఖం ఎవ్వరైనా అవమానించారా? అనారోగ్యమా? నీకో ప్రియమైన వార్త చెప్పెను నన్నందుకు ఇంతగా బాధపెడుతున్నావు ? ఒక్క ప్రియమైన మాట చెప్పలేవా? నామీద నమ్మకం లేదా? నా ప్రాణమంతా నీవే దేవీ. నీవు మాటాడకుంటే ఎట్లు నిలవగలను— ఇలా దశరథుడు అనునయిస్తున్నాడు.

అంతా నాటకం. అంతా మోసం, ఇంకెంతకాలం నన్ను ఇలా మభ్యపెడతారు? నాకంతా తెలిసిపోయింది. నన్ను నావాళ్లనీ నట్టేట ముంచేస్తున్నారు. పైగా ఎంతో అనురాగాన్ని నటిస్తూయున్నారు. అంటూ విదిలించుకుంటూ లేచి కూర్చొని దుఃఖంతో కైకేయి దేవి [illegible].

కాదు దేవి లేదు నటనకాదు, సత్యం. నీవు కనబడకపోతే ఒక్కక్షణం జీవించలేను. ఏదీ ఒక్క మాట. ఇటుచూడు నేనేమి తప్పుచేశాను. ఏదీ ఒక్క చిరునవ్వు? తరించిపోతాను. నీకేమి కావాలో చెప్పు. [illegible] తెచ్చి యిస్తాను. నగలు, చీరలు, ధనం, ధాన్యం, [illegible], [illegible] ఏదైనా, ఎవ్వరైనా నీకు యిస్తాను. ఏదీఒక్కసారి [illegible] ఇటు త్రిప్పు. ఒక మధురమైన మాట

చెప్పు.— ఇలా రాజు ఉద్వేగంతో ప్రతిమాలుతున్నాడు.

కైకేయిదేవి కొంత సంతోషాన్ని కనబరిచి ప్రభూః నాకు తెలుసు. నా మీద మీకెంత అభిమానమో, కానీ మిమ్మల్ని నమ్మలేక పోతున్నాను. అని పలికింది.

దశరథునికి కొంత ఉత్సాహం కలిగింది. దేవీః ఎందుకు నీకీ సంశయం కలిగింది? నా ప్రాణానికి ప్రాణమైన నీవు కోరిన దానిని కాదనడం కలలోనిమాట. ఇప్పుడు చెప్పు. నీకేమి కావాలో? క్షణంలో నీ ముందుంచుతాను అన్నాడు దశరథుడు.

ప్రభూః ముందుంచవలసినదికాదు. చేయవలసినది కోరమంటే కోరుతున్నాను. ఇదివరకు మీరు నాకు వాగ్దత్తం చేసారే. యిప్పుడు ఆ వరాలు కోరుతున్నాను. కానీ తరువాత .... .... .... అర్ధోక్తిగా ఆపేసింది కైకేయి ఆమాట.

దశరథుడు ఉద్రిక్తుడైనాడు. నమ్మకం లేదా దేవీ? నిశ్చయంగా చెప్పుచున్నాను. ఏది కావాలంటే అది యిస్తాను. ఏమి చేయమంటే అది చేస్తాను. దైవసాక్షిగా చెప్పుచున్నాను. నా కొడుకు మీద 'ఒట్టు' పెట్టుకొని మరీ చెప్పుచున్నాను. నీవు నిశ్చయంగా కోరవచ్చు నీ కోరిక తీరుస్తాను అన్నాడు దశరథుడు.

కైకేయి దృఢచిత్తయై ఇక్కడ మనమిద్దరమే ఉన్నామనుకోవద్దు. పంచమహాభూతాలు, సూర్య చంద్రులు, నక్షత్రాలు, భూమ్యాకాశాలు, మీ మాటలకు ఇవన్నీ సాక్ష్యాలే తెలిసిందాః అని పలికింది.

సరేసరేః ఇకనైక నీకు నమ్మకం కలిగిందాః ఇకనైనా నన్ను బాధించక చెప్పు అన్నాడు రాజు.

“ వినండి ప్రభూ! నాటి శంబరసంహార కాలంలో నాకిచ్చిన రెండు వరాలు జ్ఞాపకమున్నాయని తలుస్తాను. వాటినే నేను ఇప్పుడు కోరుతున్నాను. ఒక వరమునకు రాముడు పద్నాలుగు సంవత్సరాలు అరణ్యానికి వెళ్ళాలి. రెండవ వరమునకు భరతునిపట్టాభిషేకం జరగాలి. ఇలా జరగని పక్షంలో మీ ముందే విషం త్రాగి మరణిస్తాను. మీకు శాశ్వతమైన అపకీర్తి మిగులుతుంది. మీవంశం కళంకితం అవుతుంది ” అని దృఢమనస్కురాలై కైక పలికింది.

అవి కైకేయి మాటలుకావు. వేయిపిడుగులపాటుల మ్రోతలు. సహస్రాధిక విద్యుద్ఘాతములు. ఎర్రగాకాల్చి చెవులో జొనిపినశూలాలు గుండెల్లో మంటలు. శరీరంలో వణుకు. మెదడులో మాంద్యం, ముఖంలో వైవర్ణ్యం, కన్నులలో నీరు కలిగి దశరథుని చైతన్య రహితునిచేశాయి ఆ వృద్ధుడు మానసిక వేదనను తట్టుకోలేక నేలకు ఒరిగిపోయాడు.

ఇంపైన పుత్తడిబొమ్మలా కన్పించే కైకేయి. ఆ సమయంలో కోమలాంగియా! కాదు కాదు. ఉక్కుతో నిర్మించబడినదివలే ఉంది. హృదయం వజ్రంకంటే కఠోరం. మేరుపుకంటే అచలం. అంతా చీకటి మయం. కాలం గడచిపోతుంది. దాని దారి దానిది.

కొన్ని నిముషాలు గడచాయి. దశరథునిలో చలనం కలిగింది. లేచి కూర్చోబోయాడు. దేవి! నోటమాట రాలేదు. మరళా మూర్ఛ వచ్చేటట్టుంది. ప్రకృతియే లేవదీయాలి. మరీ! లేచి కూర్చున్నాడు. గుండె కొట్టుకుంటున్నది యంత్రంవలే. అశ్రువులు కన్నుల నుండి ధారావాహికంగా రెండు సెలయేర్లులా ప్రవహించుచున్నాయి. కైకా! కైకా, కైకే .... .... ....

“ తల్లికంటే రామునికి నీవే తల్లివంటి దానవు. అతడు

నీకేమి అపకారం చేశాడు. వాడికెందుకు ఈలాంటి శిక్ష విధించావు. అంతకంటే ఈ— నన్ను కంఠంనులిపి చంపరాదు! అనంతంగా మరణించేవాడిని. నా రామునికి, నా ప్రాణంకన్నా మిన్నయైన రామునికి అరణ్యవాసం, అదియూ పధ్నాలుగు సంవత్సరాలు ఇట్టి శిక్ష విధించతగిన నేరం ఏమి చేశాడు? నన్ను నా కొడుకును క్షమించు దేవి. ఇదిగో నీ పాదాలకు నమస్కరిస్తాను" దశరథుడు పరివేదన చూసి కైకేయి చలించలేదు. రాజా! కాళ్ళమీద పడకు. నీవు సత్యం మరువకు. నీవు చేసిన ప్రమాణం విడిస్తే లోకం గర్హిస్తుంది. వంశం కళంకితమౌతుంది. పరలోకం నశిస్తుంది. రేపటి ముహూర్తానికి రాముడు అడవికి వెళ్లితీరాలి. భరతుని పట్టాభిషేకం జరిపి తీరవల్సిందే. అని కైకేయి పలికింది.

ఆ మాటలకు రాజు మరలా స్పృహ కోల్పోయినాడు. శరీరంలో చలనం ఉన్నట్లులేదు. దుఃఖం ఉత్కటమైనది. మనస్సు వ్యాకుల పడింది. హృదయంలో సహస్రసాగరాల ఘోషలాగ ధ్వనిస్తూంది. ఉల్లోలకల్లోలమైన దుఃఖ తరంగాలు ఒడ్డున పడ్డేలు, పడేలున కొట్టుకున్నట్లు రాజు తన తల నేలకు కొట్టుకుంటున్నాడు. కైకేయి తన చేతులతో నిలుప ప్రయత్నించింది. రాజా! ఏమిటి ఈ ప్రయత్నం. నీవు ఆత్మహత్య చేసుకుంటే కళంకం తీరిపోవునా. తీర్ణ ప్రతిజ్ఞుడవుకమ్ము అన్నది కైకేయి. దశరథునకు కట్టలుతెగింది దుఃఖం. నన్ను తాకకు నేను మరణిస్తాను. నీచేతి నీళ్లు, నీ కొడుకు చేతినీళ్లు, కూడు, త్రాగను, కుడువను. నన్ను కబళించుటకు నా యింట ప్రవేశించిన మృత్యుదేవతవు నీవు. అయిపోయినది నా బ్రతుకు తెల్లారిపోయినది మరలా రాజు చైతన్యం తప్పినట్లుంది.

సూర్యోడుదయించబోతున్నాడు, చీకట్లు ఇంకా తొలగి పోలేదు. చుక్కలు ఒక్కొక్కటి ప్రక్కకు జారుకుంటున్నాయి కోటలో సగారా మ్రోత ప్రజలలో కలకలం. ఆస్థానంలో కుల

[illegible]హితుడగు వసిష్ఠుడు, ఋషులు. పట్టాభిషేక సమయ సముచిత [illegible]లలో నిమగ్నులై యున్నారు. వసిష్ఠుని అనుమతితో [illegible] దశరథుడు వశించిన కైకేయి మందిరమునకు వెళ్లేడు [illegible] ఏమైంది. నమస్కారము తల్లీ! ప్రభువు....?

"[illegible] రాముని రాకకై నిరీక్షిస్తున్నారు. అతనిని [illegible]" అని ఆజ్ఞాపించింది. చిత్తం. అని వెనుదిరి [illegible]. మనసులో ఏదో బాధ, ఆవేదన, కాళ్లు తడబడ్డాయి [illegible] రాముని మందిరానికి వచ్చాడు.

# ప్రస్థానము

ఆ [illegible] శ్రీరామచంద్రుడు అలంకరింపబడిన తన భవనంలో [illegible] ఆసనమున సీతాదేవితో ఉపవిష్టుడైయున్నాడు. వ్రత [illegible] చందనం పూసుకున్నాడు. అజిన ఆషాడధారి [illegible] చేత ధరించారు, ముఖంలో క్షాత్రబ్రహ్మ వర్చస్సు [illegible]. చిత్రానక్షత్రంతో కూడిన చంద్రునివలె సీతాదేవి [illegible]న్నాడు. ద్వారమున కివతల లక్ష్మణుడు [illegible]. సుమంత్రుడు తనరాకను ప్రతీహారిచే [illegible]. స్వామి ఆజ్ఞఅయింది. సుమంత్రుడు [illegible] — ప్రభూ! శ్రీరామచంద్రా! తండ్రిగారి ఆజ్ఞ [illegible] కైకేయీదేవి మందిరమునకు దయచేయవలసినదిగా [illegible]. త్వరపడి రండి ప్రభూ! అని సుమంత్రుడు [illegible] సీతాదేవికి తెలియజేసి పినతల్లి మందిరానికి [illegible] లక్ష్మణుడు అనుసరించాడు. ఛత్రచామరాదులు [illegible] వెనువెంటనే బయల్దేరాయి. అంతఃకైకేయి [illegible]. లక్ష్మణుడు మాత్రము

కొన్ని అడుగులు ముందుకువెళ్లి ప్రథమ ద్వారం చెంతనే నిలచిపోయాడు. శ్రీరాముడు కక్ష్యలగడచి మేఘంలో ప్రవేశించిన చంద్రునివలే ప్రవేశించాడు.

తండ్రి విషన్నవదనుడై కటికనేల వసించుట ఆశ్చర్యం కలిగించింది. పినతల్లి సమీపమున నిలచియుంది. ముందుగారాముడు తండ్రికి పాదాభివందనం చేశాడు. పిదప తల్లికి నమస్కరించేడు. తండ్రి ముఖం చూస్తుంటే రామునికి భయం, విచారము, సంశయము కలిగేయి.

అమ్మా! తండ్రిగారు ఏలమాట్లాడరు? ముఖం వివర్ణమైంది. నామీద కోపం కలిగిందా. నేను ఏమి అజ్ఞానంచేత పొరపాటు చేసానా? సీతా, లక్ష్మణులు ఆతని మనస్సునకు కష్టంకలిగించేరా? ప్రజలెవరైనా అవజ్ఞత చేశారా? అనారోగ్యమా? భరత శత్రుఘ్నులు కుశలురేకదా? ఈ విధంగా రాముడు భయందోళితుడై పినతల్లిని ప్రశ్నించేడు.

నాయనా! అంతా కుశలము. ఎవరు ఏ ఒక్కరూ పొరపాటు చేయలేదు. నాకిదివరకు రెండు వరములిచ్చాడు నీ తండ్రి. వాటిని నేనిపుడు కోరితిని. ఒకటి నీవు నారచీరలు ధరించి మునివలే పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చెయ్యాలి. రెండవది భరతునకు పట్టాభిషేకం చేయ్యాలి. ఇచ్చిన వరములను నిలబెట్టవలసిన భాద్యత నీమిద ఉంది. మొదటి వరం ప్రకారం నీవు దండకారణ్యానికి ఇప్పుడే వెళ్లాలి. ఇది నీవిధి. ఈమాట చెప్పలేక నీతండ్రి విచారిస్తూయున్నాడు తండ్రిమాట నిలబెట్టుట పుత్రుని కర్తవ్యము కదా! అని పినతల్లి పలికిన మాటలకు రాముడు చలించలేదు. ముఖంలో వివర్ణతకలుగలేదు

అమ్మా! తప్పక తండ్రిమాటను పురస్కరించుకొని అరణ్యానికి వెళుతున్నాను. మీరు ఆజ్ఞాపిస్తేమాత్రం కాదంటానా. వెంటనే తమ్ముడు

భరతునికై వార్తాహరులను పంపించండి. తల్లిదండ్రుల ఆజ్ఞలను తనయులు పాటించుట కర్తవ్యము కదా! ఈమాటే తండ్రిగారు శెలవిచ్చినా కాదందునా? ఆయన అంతగా మానసికంగా బాధపడవలసి నదేముంది? అన్నాడు వినయంగా శ్రీరాముడు.

నాయనా! నీకు అప్రియమైన ఆ మాట ఎట్లు చెప్పగలరు? ఎలాంటి పరిణామం కలుగుతుందో. నీమీద వాత్సల్యంచేత ఈమాటలు చెప్పలేక పోతున్నారు. నీవింక ఆలసించక వెంటనేఅరణ్యానికిబయలు దేరు. నీవెంత త్వరగా బయల్దేరితే అంతగా ఆయన మనసు కుదుట పడుతుంది. అను పినితల్లి పలుకులు విని—

అమ్మా! ఈమాట సీతకు అమ్మకు చెప్పి వెంటనే బయల్దేరు తున్నాను. తండ్రిగారిని స్వస్థుని చేయుమ్మా! అని తండ్రికి ప్రదక్ష ణించి వెనుదిరిగాడు రాముడు. తండ్రి దుఃఖాక్రాంతుడై పడిపోయాడు

రాముడు తన ముఖమున ఎట్టిభావమూ ఎవరికీ కనబరచ లేదు. పినతల్లి గృహము వీడి తన మాతృమందిరానికి కాలినడకన బయల్దేరినాడు. లక్ష్మణుడు కూడా వెంటబడినాడు. ఛత్రచామరాదులు పరివారము తన వెంటరావలదని నిషేధించాడు. అయిననూ వెన్నంటి వస్తూనే ఉన్నాయి. మహాసాగర ధ్వని నిలిచిపోయింది.

'ఓం నమోభగవతే వాసుదేవాయస్వాహా ' అని నృపమును ధరించి అగ్నియందు ఆహుతి సమర్పిస్తున్నాది, కౌసల్యాదేవి, తన మందిరంలో. రాముడు లక్ష్మణుడు భక్తి వినయములతో లోపలకు ప్రవేశించారు. హోమగుండమునకు నలువైపులా, పరిస్తరణములు, కుశలు, పుష్పములు కలవు. సమిధలు, అక్షతలు, హవిస్సు, ముద్గా న్నము, కృపసరాన్నము, పాయసాన్నము. పండ్లు, ఆజ్యము. మొదలగునవికలవు. అచ్చట ముఖ్యముగా హోమాగ్ని నుండివెలువడు

ధూమం ఘృతము, హవిస్సు, ఓషధులతో కూడినందువల్ల, ఆమందిరం పరిమళించి ఆ ప్రదేశమంతటా పవిత్రీకృతము చేయుచున్నది.

" అగ్నయే నమః " అని నమస్కరించి కౌసల్యాదేవి వెనుకకు తిరిగినది. రామలక్ష్మణులు పాదాభివందనం చేశారు.

"చిరంజీవ" అని తన దగ్గరకు చేర్చుకొన్నది కౌసల్యాదేవి నాయనా! ఈవేళే నీకు పట్టాభిషేకమని తండ్రిగారు. పెద్దలు నిశ్చయించినారు. చాలా సంతోషం. నీ పూర్వులు సగర, రఘువులు, దిలీపాదులవలే వేలాదివత్సరాలు రాజ్యపాలన చేస్తూ ఆయురారోగ్య భాగ్యాలు కల్గి వర్ధిల్లు అని ఆ మాతృమూర్తి ఆశీర్వదించింది. రాముడు అత్యంత వినయంతో –

"అమ్మా! తండ్రిగారు ఇప్పుడే నన్ను పద్నాలుగు సంవత్సరాలు దండకారణ్యంలో నివసించ వలసినదిగా ఆజ్ఞాపించారు. తమ్ముడు భరతునకు పట్టాభిషేకం జరిపించవలసినదిగా సెలవిచ్చారు నాకు విధించిన అరణ్యవాసం వెంటనే పాలించాలి. సెలవిచ్చి పంపించు అమ్మా" ఆ మాటలు విన్న లక్ష్మణుని కన్నులు జేవురించేయి.

మనస్సున ఉద్రిక్త భావం కలిగి చేతులు పిడికిలించు కుంటున్నాడు. మాతృ హృదయానికి తీవ్రమైన ఆఘాతము కలిగింది. కౌసల్య అచేతనయై నేలకొరిగింది. రాముడు తక్షణమే లేవదీసి సేదతీర్చాడు ఆమె కన్నుల నుండి అశ్రువులు వెల్లువలై స్రవించు చున్నవి. మనస్సంతా శూన్యంగా ఉంది. నాయనా! విపత్కరమైన ఈమాటవిని నాహృదయంవిదీర్ణముకాలేదు. ఇదివజ్రముకంటే కఠోరమైనదికాబోలు. దుర్భరమైన అరణ్య జీవితాన్ని ఎట్లు గడుపుతావు తండ్రీ? కుసుమ సుకుమార శరీరం కఠిన నేలలో, బండరాలలో, కంటకారణ్యాలలో ఎలా సంచరిస్తావు. వేళకు రుచికరమైన ఆహారం విడచి ఫలమూలాదు

లతో బ్రతుకు ఎట్లు వెలార్చగలవు? హంసతూళికా శయనము విడిచి బండరాళ్లపై ఎట్లు పరుండగలవు? గొడ్డురాళ్లకు సంతతి లేదన్న విచారము మాత్రం కలుగుతుంది. సత్‌సంతతి కలిగి నిన్ను అడవిలో విడిచి నేనెట్లు బ్రతుకగలను.? నన్నుకూడా నీవెంట తీసుకొనిపో. అటనీకు ఫలాదులను వేళకు సమకూరుస్తాను. నా ఒడిలో పరుండబెట్టు కుంటాను. సాపత్న్య దుఃఖము దుర్భరమైంది నాయనా! అని కౌసల్యా దుఃఖంతో రాముని పట్టుకొని విలపించింది.

లక్ష్మణుడు కాలాగ్నిరుద్రుడైనాడు. అన్నయ్యా! నీకు ఈ క్షణంలో పట్టాభిషేకం జరిగితీరాలి. అడ్డు ఎవడొస్తాడో చూస్తాను. వృద్ధరాజునకు మతి చలించింది. ఆతని మాట పాటించనక్కర్లేదు. ఈ రాజ్యం నీది ' రాజ్యంవీర భోజ్యం ' అన్నయ్యా! ఇందుకు ఎవరు వ్యతిరేకించినా భరతుడేకాదు బ్రహ్మాదులు వచ్చినా క్షణంలో సంహరిస్తాను. ఈధనస్సు అమ్ములపొదులు వీరఖడ్గంఇవన్నీ అలంకారాలు కాదన్నయ్యా వాటికి సమయం వచ్చింది. అని లక్ష్మణుడు తన ఒరలోనున్న ఖడ్గాన్ని తటాలునవెలిదీశాడు.

లక్ష్మణా శాంతించు. కోపానికిది సమయంకాదు. నీభక్తి ప్రపత్తులు శక్తిసామర్థ్యాలు తెలియనివికావు. ముందు ఆకత్తిని ఒరలో నుంచు. ఇది తండ్రిగారి ఆజ్ఞ. ఆయన మాట కాదనడానికి నాకు శక్తి లేదు. వృద్ధుడైనప్పటికీ రాజు, విశేషించి నీకూ, నాకు తండ్రి. వారి మాటను పాటించాలి. అతని ఆజ్ఞను ప్రతీ పౌరుడు శిరసావహించి పాటించవలసినదే. తండ్రిగారు పినతల్లికియొసగిన వరాలను నేను నిర్వర్తించి అతని సత్యవ్రతము కాపాడవల్సిన బాధ్యత నాయందుంది సత్యంపైనే ధర్మంనిలిచి ఉంది. 'సత్యాన్న ప్రమదితవ్యమ్, ధర్మాన్న ప్రమదితవ్యమ్ ' అనువైదిక శిక్షను మరచిపోయావా? తండ్రి మాటపై పంపితుడైన కండుఋషి గోవధచేశాడు. తల్లినికూడా తండ్రి మాటపై పరశురాముడు రేణుకను వధించాడు. మన పూర్వజుడైన

సగరుని కుమారులు తండ్రిమాటపైని భూమిని పాతాల పర్యంతం త్రవ్వేశారు. వారంతా కీర్తివంతులైనారు. పరమును సాధించారు. నీకు మీ పదినకు ఒక్కింటి కష్టమైన దైనమూ నేను పితృాజ్ఞను పాలించక తప్పదు. అమ్మా! విచారించకు నాలుగుపది సంవత్సరాలు క్షణాలలో గడిపి వస్తాను. నన్ను ఆశీర్వదించమ్మా! అని దృఢ నిశ్చయంతో ధర్మ సమ్మతమైన మాట శ్రీరామచంద్రుడు పలికెడు.

నాయనా! నిన్ను విడచి క్షణమైనా ఉండలేను. దూడను విడిచి ఆవు ఎట్లువుంటుంది? నాకిక్కడ శాంతి లేదు. సుఖం లేదు. నన్ను నీవెంటరానీ కాదనకు. కౌసల్యాదేవి పలుకులు విని రాముడు -

అమ్మా! నీవు నావెంట రాకూడదు. నీకు ధర్మాన్ని బోధించే టంతవాడిని కాను. సతికి పతియే దైవము. పతి పరిచర్యవలతి? ఇహము పరము కలిగిస్తుంది. తండ్రికి ఎవరు సేవచేస్తారు. చెప్పమ్మా! అతని కష్టసుఖాలు ఎవరు విచారిస్తారు? నా తండ్రిని సర్వవిధాల సేవిస్తూ నీవుయిచటనే ఉండుట ధర్మము. నాకు సెలవిమ్మ. అని కర్తవ్యాన్ని బోధించాడు రాముడు.

సర్వధర్మమర్మజ్ఞ కౌసల్య దుఃఖభారంతో, పాణిపాదములు ఒకసారి ప్రక్షాళన చేసుకొని ఆచమించి నాయనా రామా! నిన్ను నిలుపుటకు శక్యముకాదు. నేను నీతో వచ్చుటకు ఆనలేదు. సుఖంగా అరణ్యవాసంచేసి రా. నీ తండ్రి సత్యమును నిలుపు, నీకు బ్రహ్మాది దేవతలు క్షేమం కలిగిస్తారు. ఏ ధర్మాన్ని నీవు రక్షిస్తున్నావో ఆ ధర్మమే నిన్ను సకలవిధాల రక్షిస్తుంది. ముక్కోటి దేవతలు సూర్య చంద్ర గ్రహ నక్షత్రాదులు నీకు సదా మేలుచేయుగాక. పంచమహా భూతాలు, స్థావర జంగమాది సకల ప్రాణులు నిన్ను కాపాడగలవు. కాలత్రయం, వేదచతుష్టయం అంగషట్కం. శాస్త్రసంచయం, సదా నిన్ను కాపాడుతాయి. అమృతహరణార్థం బయలుదేరినప్పుడు సతేయుం

నకు 'వినత' యొసగిన మంగళము, నీకు కలుగుగాక! వృత్ర నాశకుడైన ఇంద్రునకు అదితి యొసగిన మంగళము, త్రివిక్రము డైన విష్ణువునకు కలిగిన మంగళము నీకు క్షేమము కలిగించు గాక! అని ఆశీర్వదించి విశల్యకరణీ మొదలగు ఓషధులు, తాయెత్తులు కట్టినవి ధరింపజేసి ప్రదక్షిణం గావించెను. రాముడు క్షేమము గా తిరిగి రావలెనని వేడ్కొంచెను. దర్భలతో అభిమంత్రింపించెను. కౌసల్యా దేవి ఆరణ్యగమనమునకు అనుమతించి శిరస్సుపై అక్షతలు చల్లించెను.

రాముడు తల్లివద్ద శెలవుగైకొని తన మందిరానికి బయల్దేరాడు. "ఇక ఈ ప్రయాణవిషయం జానకికి తెలిస్తే ఎంత బాధ పడుతుందో" అనుకుంటూ స్వగృహానికి చేరేడు.

అంతలో సీతాదేవి భగవత్ పూజాదికము ముగించింది. తన ప్రాణనాథునికై ఎదురు చూస్తున్నది. రాముడు వివర్ణముఖంతో అక్కడకై వచ్చి అటు నిలిచేను. సీతకు రామునిస్థితి అవగాహనకాలేదు స్వామి ముఖం ఎందుకు చిన్నబోయినదో! అర్థంకాలేదు ఆమెకు.

ఆర్యపుత్రా! ఏమైంది. ఎందుకిలా ఉన్నారు? ముఖం చిన్నబోయింది. ఈ దినమేకదా! పట్టాభిషేకం జరగవలసినది మరి ఆ శ్వేతచ్ఛత్రం వెంట కనబడలేదేమి? చామరులు వీచుటలేదు. వందిమాగధులు కానరారు. రథగజాశ్వపదాతులు వెంట అనుసరించి వచ్చుటలేదు. అని సీతాదేవి రాముని ప్రశ్నించింది.

సీతా! తండ్రిగారు నన్ను పద్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేయవలసినదిగానూ, భరతుని రాజ్యాభిషేకము చేయవలసినదిగా ఆజ్ఞాపించారు. చిన్నమ్మగారికి పూర్వం రెండు వరాలు ఇచ్చారు. వాటిని ఇప్పుడు పినతల్లిగారు కోరుకున్నారు. కనుక నేను

తండ్రిగారి మాటను చెల్లించుటకు అరణ్యవాసం చేయుటకు వెళ్తు న్నాను. అని రాముడు తెలియజేశాడు.

సీతా! మూడు, నాలుగు, ఏడుసంవత్సరాలు సునాయాసంగా అడవిలో గడిపి వచ్చేస్తాను. అమ్మగారిని కనిపెట్టుకొని యుండు. నేను లేని విచారం ఆమెకు మెండు. తండ్రిగారి విషయంలో శ్రద్ధతో సేవించు. తల్లులకు అప్రియం కలిగించకు. భరతుడు ఇక రాజు. ఆతని విషయంలో గౌరవభావం కలిగి ప్రవర్తించాలి. అన్నగా కూడా నా భక్తిభావంతో మెలగవలసి యుంటుంది. వారికి ఎప్పుడూ అప్రియం ఆచరించకూడదు లేశంకూడా దోషం కనిపించిందా? రాజు ప్రభువైనా శాసించగలడూ, శిక్షించగలడు. రాజ్యభారవ్యగ్రులు, కనుక వారికి సర్వదా ప్రియం ఆచరించు. ఇక నేను వెళ్లివస్తాను. అని రాముడు తెలియజేశాడు.

చేపచే కదల్చబడిన తామరపువ్వు నుండి రాలిన నీటిబొట్లవలె సీత రెండు కన్నుల నుండి అశ్రువులు జారినవి. అంతలో ముఖం సంక్షోభరంగా మారినది.

ప్రణయకుపిత, సీత. ఆర్యవినుత, పతిహిత, పతివ్రత, సహధర్మచరి. సీత ముఖంలో స్థిరత్వం స్నేహము, కాంక్ష, కోపము భక్తిభావాలు రామునిచేత చదువబడ్డాయి. తను మాత్రం ఒంటరిగా వెళ్లగలడా? అడవిలో ఎన్ని ఇక్కట్లు అనుభవించాలో? ఈ సుకుమారి ఎట్లు సహించగలదు.

ఆర్యపుత్రా! వీర్యశుల్కనైన నేను మీకు సహధర్మచారిణిగా, పత్నిగా, మీ ఇంటికి మీవెంట వచ్చాను. నేను కూడా మీవెంట అరణ్యానికి వస్తాను. నన్ను విడచిపెట్టితే పురుష విగ్రహుడైన స్త్రీ నాకు అల్లుడైనాడని మా తండ్రి తలంచడా? నాకు మీతోడిదే లోకం.

నటికునివలే నన్ను ఇట్టు ఒకరివద్ద దిగవిడిచి శాసించుట న్యాయం కాదు. మీరులేని స్వర్గసౌఖ్యాలు నరకప్రాయాలు. ఛాయవలే మీవెంట వచ్చి మీకెట్టి కష్టమూ కల్గించక మీ సేవ చేసుకుంటాను. నన్ను వెంట రానివ్వండి ప్రభూ! అని పలికిన సీతతో రాముడు—

ఏమిటీ! నీవు నాతో అడవికి వస్తావా? అవేం పూలతోటలనుకున్నావా విహరించడానికి. మహోన్నతాలైన చెట్లు కంటకాకీర్ణమైన పొదలు, సింహ, శరభ, శార్దూలాది క్రూరమృగ సంచారాలు. మహోన్నత శిఖరాల నుండి అతివేగంగా ప్రవహించే సెలయేర్లు అనుక్షణం పొంగి క్షితిని కన్పిస్తూయుంటాయి. ఫల, కంద మూలాదులు మాత్రమే తినుటకు లభిస్తాయి. అవీకూడా ఒకప్పుడు ఉండవు, ఉపవాసాలు ఉండవలసి ఉంటుంది. ఝంఝామారుతాలు, దావానలాలు, ధారాపాతవర్షాలు, అతిశీతలపవనాలు. ఎంత భయంకరంగా ఉంటుంది రక్కసిమూకలు అక్కడ ఎక్కువ ఉంటాయి. సుకుమారివగు నీవు రాజోచిత సకలసుఖాలు అనుభవించతగిన దానవు క్రూరవన్యమృగాల నడుమ ఎట్లు సంచరిస్తావు? అని పల్కగా సీత—

తమ సాన్నిధ్యంలో నాకెట్టి కష్టమూ ఉండదు. భయమూ ఉండదు. సంతోషంతో మీవెంట వస్తాను. సావిత్రి సత్యవంతుని వెంట వచ్చినట్లు, సుకన్య చ్యవనుని సేవించునట్లు మిమ్మల్ని నేను సేవించుకుంటాను. లేనిచో జీవితమే త్యజిస్తాను. అని పలికింది. ఆ మాట విని రాముడు ఆమె మనోనిశ్చయాన్ని తెలుసుకొని దేవి నేను మాత్రం నిన్ను విడిచి ఉండగలనా? నీ మనస్సులోనున్న ఉద్దేశ్యం తెలుసుకొనుటకు అలా అన్నాను. నీ అమూల్యమైన ఆభరణాలు, వస్త్రాలు ఆసనాలు అర్హులైన సేవకులకు బ్రాహ్మణులకు ఇచ్చి నాతోవచ్చుటకు సిద్ధపడు ఆలసించకు అని నిర్దేశించేడు.

ఈ సంభాషణ అంతా దగ్గర్నుండి లక్ష్మణుడు విన్నాడు.

అన్నగారి కాళ్ళమీదపడి నమస్కరించాడు. నేను కూడా మీ వెంట వస్తున్నాను. నీకంటే ముందుగా నడిచి నీమార్గం సుగమము చేస్తాను కంద. ఫల మూలాదులు సేకరించి మీకు సమర్పిస్తాను. ఒదినగారు, మీరు అటవీ ప్రాంతాలలో సుఖంగా విహరించండి. ధనుర్బాణములు ధరించి క్రూరమృగాలు, మృక్కడి రక్కసులు మీకు బాధకల్గించకుండా మీకు కావలి కాస్తాను. అనుమతించు అన్నయ్యా! అని వేడుకున్నాడు అప్పుడు రాముడు—

తమ్ముడూ! నీవుకూడా నా వెంట వస్తే తల్లిగారిని, తండ్రి గారిని ఎవరు సేవిస్తారు. వారిని సదా కనిపెట్టవలసిన బాధ్యత నీకు లేదా? అని వారించాడు.

అన్నయ్యా! నీ తేజస్సుచేత భరతుడే అందర్నీ రక్షిస్తాడు పెద్దమ్మగారే దేశాన్నంతా పాలించి రక్షించగలరు. ఆమెకు ఎవరి రక్ష కావాలి? మా అమ్మలేదా సేవచేయడానికి. అం, అన్నయ్యా! గడ్డపార గంప, కత్తుల పట్టుకొని పండ్లుకోసి. దుంపలు త్రవ్వి తెచ్చి మీకు సమర్పిస్తాను. మీకు ముందుగా అడవిలో మీ మార్గమునకు అడ్డు తొలగిస్తూ సుగమము చేస్తూ అనుసరిస్తాను. అనుమతించండి అని లక్ష్మణుడు నిశ్చయముగా తన పట్టుదల స్పష్టపడునట్లు పలికెను.

సరే! నీయిష్టము. మన ఆచార్యులవద్ద ఉంచబడిన ధనస్సులు అమ్ములపొదులు, ఖడ్గములు, కవచములు, తీసుకొనిరా. మనవద్దగల వస్త్రాభరణములు, పల్యంకికాదులు, సుయజ్ఞునకు, కౌశికునకు, అగస్త్యునకు, ఇతర బ్రాహ్మణులకు, బ్రహ్మచారులకు, యాచకులకు, విద్యార్థులకు. స్త్రీలకు. బాలురకు, వృద్ధులకు పంచిపెట్టండి.
ఇంతలో ఎవరో —

ప్రభూ! రామచంద్రా! నమస్కారాలు, అంటూ పలికాడు. నమస్కారం. ఎవరుమీరు? ఏమికావాలి? అని రాముడు ప్రశ్నించాడు

నేను గర్గవంశ సంభవుడను. పింగళుడు అను నన్ను త్రిజటుడు అనికూడా అంటారు. బహు పుత్రకుడ్ని. నా భార్య ప్రోత్సాహంతో మిమ్మల్ని దర్శించ వచ్చాను, కట్టెలుచీల్చి ఉంఛవృత్తి చే జీవించేటటువంటివాణ్ణి. నిరుపేదను కటాక్షించండి.

బ్రాహ్మణా! యిప్పటికే ఆలసించారు. సరే మీచేతి కర్రను ఈ గోవుల మందలో దూరంగా విసరండి. అది ఎంత దూరంపోవునో అంతదూరము గల ఈ మధ్యలోగల గోవులన్నీ తోలుకొనిపొండి. అని పలికాడు.

చిత్తం ప్రభూ! (త్రిజటుడు శక్తినంతటిని ఉపయోగించి కర్రను విసిరేడు) అది కొంతదూరము మాత్రమే పోయింది.

క్షమించు బ్రాహ్మణోత్తమా! పరిహాసానికి అలా అన్నాను. అన్ని గోవులు తీసుకొనిపొండి, అని రాముడు పలికేడు, త్రిజటుడు వాటిని పరిగ్రహించి ఆశీర్వదించి వెళ్లిపోయేడు. సీతా రామలక్ష్మణులు తమకుగల సర్వస్వాన్ని అందరకూ పంచిపెట్టేశారు. ధనుర్బాణాలు, కవచఖడ్గాలు మాత్రమే గ్రహించి కాలినడకను పితృగృహానికి చేరాడు.

సీతా రామలక్ష్మణులు అరణ్యానికి బయల్దేరి వెళ్లిపోతున్నారను వార్త దావానలంలా పట్టణమంతా వ్యాపించిపోయింది. వారి దర్శనం కోసం స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, ఆబాలగోపాలంతో వచ్చియున్నారు. మేడలుమీద, గోడలమీద, అరుగులమీద, చెట్టుకొమ్మలక్రింద ఎక్కడ ఎలాంటి అవకాశం కలిగితే అక్కడ నిలచి చూస్తున్నారు. అందరకూ మనస్సులో బాధ. గుండెల్లోమంట. కళ్లలో నీరు, ఓహో పద్నాలుగు సంవత్సరాలట, పద్నాలుగు యుగాలు [illegible] మహాయుగాలు సీతా రామలక్ష్మణులు అయోధ్య నుండి

అడవికి వెళ్లుతుపోన్నారు. మరలావారి దర్శనం ఎప్పుడు లభిస్తుందో?

ఎట్టివారికి ఎటువంటి కష్టాలు వచ్చాయి? అడవులలో ఎన్ని కష్టాలుపడాలో ఆ సీతమ్మ తల్లికీ, రామయ్య తండ్రికి, లక్ష్మణ స్వామికీ. దైవమా! ఎట్టి దుర్భరస్థితి తెచ్చావు! అని కొందరు సీతా రామలక్ష్మణులను గూర్చి విచారిస్తున్నారు. కొందరు దశరథుని అవజ్ఞ చేస్తున్నారు. మరికొందరు కైకేయిని నిష్ఠురములాడితే మరికొందరు మందరను దూషిస్తూ పచ్చని కొంపకు చిచ్చుపెట్టింది. అని అంటున్నారు.

ఓరి బాబోయ్! ఏటీ సామిద్దోవం, ఏటి సామిద్ధోవం. గొప్పోరికి ఏటాడినా ఏటిసేసినా సెల్లిపోతాది. యింకేనాటి అగాయిత్యాలు జరిగిపోతాయో ఇంతకీ మనకు రాముడు రాజయ్యేయోగం లేదు. (ఒక గ్రామీణ వృద్ధుని స్వగతం ఇది)

ప్రభు! సీతారామలక్ష్మణులు అరణ్యవాసానికి బయల్దేరి తమ దర్శనంకోసం వెలుపల వేచియున్నారు. అని సుమంత్రుడు రాజునకు సవిచారంగా మనవి చేశాడు,

ఆహా! ఈ వేదనను భరించలేకుండా యున్నాను. వెళ్లు త్వరగా రాణులకు, మంత్రులకు, పురోహితులకు రాముని చూడ్డానికి ఉద్దేశము కలవారందరికి ఇచటకు రమ్మని చెప్పు. అని దశరథుడు సుమంత్రునితో పలికాడు. ఆ సరికే కోటలోగల యెల్లరూ వచ్చేశారు. పట్టణంలోగల పౌరులు వచ్చేసారు. ఎవరి ముఖంలోనూ వికాశం లేదు అందరిలోనూ దైన్యం, దుఃఖము చోటు చేసుకుంది. బాహ్యచిహ్నంగా వారి కన్నులనుండి స్రవించిన అశ్రువులే తెలియజేస్తున్నాయి.

సీతా రామలక్ష్మణులు దశరథావనీశుని వినయంతో సమీపించి

పాదాభివందనం చేశారు, తండ్రీ! తమ ఆజ్ఞ ప్రకారం అరణ్యానికి బయల్దేరి వెళ్లుతున్నాను. నావెంట సీతా, లక్ష్మణులు కూడా తోడుగా వస్తామంటున్నారు. మాకందరకు శెలవిప్పించండి. అని రాముడు పలికాడు.

నాయనా! నేను వృద్ధుడను. మతి తప్పినవాడిని. నామాట పాటించకు నీవు అరణ్యానికి వెళ్లవద్దు. ఈ రాజ్యం నీవే పాలించు. భరతాదులకు కూడా నీయందు పరిపూర్ణభక్తి విశ్వాసాలున్నాయి. వారిని గూర్చి శంకించనవసరం లేదు. నీవు కనుమరుగైనతో నా జీవితం కడతేరిపోతుంది. లేదా నన్ను కూడా నీవెంట తీసుకొనివెళ్లిపో వచ్చేస్తాను. అంటూ దశరథుడు దుఃఖంతో పలికాడు.

తండ్రీ! తల్లిగారికిచ్చిన రెండు వరాలు వెనుకకు తీసుకొనుట తగదు. తమ్ముడు పాలించనీ నేను అరణ్యానికి వెళ్తాను. ఇందువల్ల తల్లిగారికి ఒసగిన వరాలు వమ్ముకావు. వాటిని నిర్వహించి నీ సత్య వాక్యాన్ని సుస్థిరత చేయవలసినది మా బాధ్యత. విచారించకండి. తొమ్మిది-ఐదు సంవత్సరాలు మీ ఆశీర్వాద బలంచేత సుగమంగానే గడిపి త్వరలో తమ పాదాభివందనం చేసుకుంటాను. అని రాముడు ఊరడించబోయాడు.

నీ నిశ్చయాన్ని మరలించలేకుండా ఉన్నాను. కైకనుద్దేశించి పాతకీ! నీ కోరిక తీరిపోయింది. నా జీవితం చెల్లిపోయింది. అంటూ ముఖానికి చేతులు అడ్డుపెట్టుకొని దశరథుడు రోదించసాగాడు

సుమంత్రుని కన్ను లెఱ్ఱబడ్డాయి. తలని మాటిమాటికి విదిలిస్తున్నాడు. చేతిలో చెయ్యనుంచి నలుపుతూ, పళ్లు పటపట కొరుకుతున్నాడు. కోపం పరాకాష్ట చేరింది.

వంశనాశనీ! భర్తృహంతకి! నిండుకొంపకు నిప్పుపెట్టావు కదే— నీ తల్లి గుణాలు నీకి వచ్చాయి. మీ అమ్మకూడా నీ తండ్రిని చూచి నీవు నశించిపోతే పోదువుగాక. నీ నవ్వునకు కారణం చెప్పు నాకు కావల్సింది నీ నవ్వునకు కారణం. అని ఆమె భర్తృ మరణానికి కూడా వెనుదీయక వత్తిడి తెచ్చింది. మీ నాన్నకు సకల ప్రాణుల భాషలు వరంగా లభించాయి. చీమలు చెప్పుకునే మాటలకు ఆతనికి నవ్వు వచ్చింది. అది యితరులకు చెప్పినా ఆతని ప్రాణం పోతుంది అందుకు నీ తండ్రి చెప్పలేదు. కానీ మీఅమ్మ భర్తృప్రాణానికైనా తెగించింది. కానీ తన పట్టు విడువలేదు. నీవుకూడా అంతే. ప్రభువు యొక్క విపత్తును కూడా లక్ష్యంచేయుడం లేదు. సర్వలోక శరణ్యుడు అగు రాముని అడవికి పంపుతున్నావు. ఎంతటి పాపానికి ఒడిగట్టు కున్నావో తెలుసునా? ఛీ! నీ ముఖమును చూడరాదు. అని కైకేయి నుద్దేశించి కఠినంగా పలికాడు.

ఈ భ్రష్టురాలు తనపట్టినపట్టు విడువదు. రాముడు అడవికి వెళ్లుటమానడు. మనమంతా అడవికిపోదాం. ధనాగారం,ధాన్యాగారం, చతురంగబలాలు,ఈరాజ్యంలోగల ఆబాలగోపాలం తరలివెళ్లి పోదాం రాజ్యం తనసెత్తిన కట్టుకోని. అని కోపంగా దశరథుడు పలికాడు.

ఇది అసంగతం, అన్యాయం ఈ రాజ్యంనుండి పూచికపుల్ల కూడా వెలుపలుకు వెళ్లకూడదు, 'రాజ్యమంటే కొల్లబోయిన పాడు దిబ్బయా' రాముడు నారచీరలు, జడలు ధరించి అడవికి వెళ్లవలసి నదే. సగరుని కొడుకు 'అసమంజసుడు' అటులనే వెళ్లలేదా? అని కైక కఠోరంగా పలికింది.

ఇది మహాఘోరం. రాముడు ఏమి తప్పు చేశాడని? అసమంజసుడైతే నగరిలో చిన్నపిల్లలను సరయూనదిలో ముంచేసే వాడు. ఆ పిల్లల తల్లిదండ్రులు రాజుతో చెప్పుకున్నారు. సగరుడు

తన కుమారుడనైన నన్ను ఆలోచింపక అసమంజసుని, ఆతని భార్యను తగినన్ని సంపదను ఒసగి దేశంనుండి బహిష్కరించారు. వారు అరణ్యానికి పోయారు. రాముడు ఏమి తప్పు చేశాడని ఈ శిక్ష విధిస్తున్నావు? దయాసముద్రుడు, సకల హితంకరుడు సన్మాన నీయుడగు ఈ శిక్ష "వజ్రాదపి కఠోరాని మృదూని కుసుమాదపి" అని శ్లోకమిది. అని సిద్ధార్థుడు పలికేను.

అరణ్యానికి రాముడు వెళ్ళవలసినదే ఋషులవలె. ఇవిగో నారచీరలు అని నిర్లజ్జితయై సీతారామలక్ష్మణుల ముందుంచినది. రాముడు నారచీరలు ధరించాడు. లక్ష్మణుడు కూడా ధరించాడు. సీత [illegible] నారచీరపట్టుకుని ఎట్లా ధరించాలో తెలియలేదు. ప్రభూ! ఈ ఋషికాంతలు ఎట్లుధరిస్తారో? నాకు తెలియదు. అనిదీనంగా సీత రాముని ముఖం చూసింది. రాముడు ఆమెధరించిన పట్టుచీరపైనే నారచీర స్వయంగా కట్టించేడు.

సీతా రామలక్ష్మణులు నారచీరలు ధరించి రాజోచిత మృదుల దుకూల వస్త్రాలు త్యజించారు. ప్రజలలోను, రాణులలోను, రాజ బంధువులలోను, అంతఃపుర స్త్రీ జనాల్లోనూ హాహాకారాలు చెలరేగేయి వారికి దుఃఖం గట్టుతెగిన ప్రవాహంలా ఉప్పెనలా ఏర్పడినది.

వసిష్ఠునకు కోపం వచ్చేసింది. "సీత నారచీరలు ధరించనక్కర్లేదు. వనవాసం చేయనక్కర్లేదు. ఈ రాజ్యాన్ని పాలించవచ్చు భర్తృహితయై వెళ్ళదలిస్తే ఆమె చీరలు, ఆభరణాలు ఆసనాలు ఆమె సర్వస్వం ఆమెవెంట వెళ్ళవలసినదే. నిరోధించడానికి అధికారం ఎవరికీ లేదు" అని నిశ్చయించి ఆదేశించాడు.

సుమంత్రా! రథమును ఆయత్తపరచి తీసుకొనిరా. నా పిల్లలు కాలినడకన వెళ్ళనక్కర్లేదు. కోడలి యొక్క ఆభరణాలు,

వస్త్రాలు, ధనం మున్నగునవి పద్నాలుగు సంవత్సరములకుతగినట్లుగా మన కోశాగారంలోనుండి తెప్పించి రథముపై చేర్పించండి. అని దశరథుడు ఆదేశించాడు.

సుమంత్రుడు జవనాశ్వములు పూన్చిన బంగారు రథం ఆయత్త పరిచాడు. ధనస్సులు, ఖడ్గాలు, కవచాలు, సీతాదేవి యొక్క వస్త్రాభరణాధికములు క్షణంలో రథమందు సిద్ధపరుపబడ్డాయి.

కడసారిగా సీతా, రామలక్ష్మణులు తండ్రికి ప్రదక్షిణించి నమస్కరించారు. కౌసల్యాదేవికి నమస్కారించారు. ఆ తల్లి ఆశీర్వదించి కోడల్ని దగ్గరకు చేర్చుకుని అమ్మా, నీకెట్టిగతి పట్టినది తల్లీ? అంతఃపురంలో సకల రాజభోగాలు అనుభవించవలసిన దానివి. ఈ కౌమారావస్థలో దుర్భరమైన అరణ్యవాసం చేయువలసివచ్చింది.

సతికి పతియే దైవం. నిర్ధనుడైన, సధనుడైన, సమర్థుడైన సమర్థుడైన, రాజ్యమందున్న, అరణ్యమందున్న, స్త్రీకి పతియే రాధించ తగినవాడు. అందువల్ల ఇహము పరము అతనివల్లే భిస్తుంది. నీకు సర్వమూ తెలుసును. సామాన్య బాలికస్త్రీవలే భర్తను డనాడకు. కోపగించుకోనకు. అతడే నీకు యేడుగడ. కన్న కడుపు పిచేత ఇలా చెప్పుచున్నాను. వెళ్లిరావమ్మా (పొమ్మెవ్వరు నీకు ను బుద్ధులు చెప్పన్) అని ఆశీర్వదించింది.

కైకేయిదేవికి నమస్కరించారు, సీతా రామలక్ష్మణులు మె కన్నులు మూసుకొని ఏవో ధ్యానించి చేతులుచాచి ఆశీర్వదించారు తల్లిగారి ఆశీర్వాదంలోని దివ్యసంకేతం ఆమె మనసు పొరల లలోని భావం ఎవరికి తెలుసును? అది సీతా రామలక్ష్మణులకు మాత్రమే తెలుసును.

సుమిత్రాదేవికీ పాదాభివందనం గావించారు ఆ ముగ్గురు. ఆతల్లి వారిని దగ్గరకు చేర్చుకున్నది. 'నాయనలారా! క్షేమంగా వెళ్ళిరండి. ప్రకృతి మీకు అన్నివిధాలా అడివిలో సహకరిస్తుంది. నాయనా! లక్ష్మణా సీతారాముల సేవచేయుటకే నా కడుపున పుట్టావు 'జ్యేష్ఠ భ్రాతాపితృ సమః'

రాముని తండ్రివలే సర్వాదా సేవించు. జనకాత్మజ సీత తల్లి సుమా! వారి సేవ నీకు సకల శ్రేయస్సులు కలిగిస్తాయి. సీతారాములు నివసించు అడవియే అయోధ్య అని తెలుసుకో. అది స్వర్గంకంటే సుఖప్రదమైనది. రాముడి సన్నిధి చాలా సుఖం. ఈ అయోధ్య ఇక అడవి. నీకు సర్వదా క్షేమం కలుగుగాక! అని సుమిత్రాదేవి అశీర్వదించింది.

ఇందులో సీతారాముల వనవాసం లక్ష్మీనారాయణుల వైకుంఠవాసంగా భావించమని, పరతత్త్వాన్ని బోధిస్తున్నట్లు లక్ష్మణునకు తోచింది. తన జీవితమే ధన్యమనుకున్నాడు లక్ష్మణుడు.

వశిష్టాది పెద్దలకు అటుచేరిన సమస్త ప్రజానీకానికి ముగ్గురూ చేతులెత్తి నమస్కరించారు. పిన్నలకు వాత్సల్యంతో చూశారు.

సుమంత్రుడు సజ్జీకృతమైన రథమును సిద్ధపరిచాడు. ఆ సుందరరథముపై మొదట సీత, లక్ష్మణుడు, రాముడు అధిష్టించారు సుమంత్రుడు పగ్గములు సడలించి రథాన్ని నడుపుతున్నాడు. త్వరగా నడుపవలసినది రాముడు ఆజ్ఞాపించాడు. రథగమనం వేగం పుంజుకుంది. నిలుపవలసినదిగా దశరథుడు, ప్రజలు పల్కుచున్నారు రథం వేగంగా ధూళిని రేపుకుంటూ ముందుకు సాగిపోతున్నది. రాజు రాణులు, ప్రజలు దుఃఖాక్రాంతులై వెంబడించారు. రథం సాగిపోతునే ఉన్నది. కొందరు వెంట పరుగెత్తుచున్నారు. కొందరు విధిని

నిందిస్తూ నిలచిపోయారు. రథం కనుమరుగైపోయింది. అయినా ప్రజలు పరిగెత్తుట మానలేదు.

కౌసల్యా, సుమిత్రలు దుర్భరవిచారంతోనే ప్రభువుని ఇరువైపులా రెండుచేతులు పట్టుకొని కౌసల్యా మందిరానికి తీసుకొని వచ్చారు. అతనికి రాముని ఎడబాటు విద్యుద్ఘాతమైంది. కంటనీరు శరీరంమీద స్పృహలేదు. ఎక్కడ ఏమున్నదీ తెలియదు. ఏమైనదీ తెలియదు. అంతా శూన్యం, మనస్సంతా శూన్యం.

అతడుఏమిటో అస్పష్టంగా మనసులో గొనుకుకుంటున్నాడు. మతిలేని మాటలు, పరాకు మాటలు " నే చేసిన పాపానికి ఫలితం దగ్గరపడ్డాది అనుభవించవలసినదే. ఆ ఋషిపుత్రుని ఆనాడు నా అజ్ఞానం చేత ఏనుగు ధ్వనిగా భావించి చంపేశాను. ఆతని తండ్రి తనయులు దగ్గరలేకుండానే మరణిస్తావని శపించాడు. చేసినపాపం కట్టి కుడుపక విడువదు, ఆరోజు రానే వచ్చేసింది. తెలిసిచేసినా తెలియకచేసిన కర్మానుభవం ఎవరికీనీ తప్పదు" ఇది సంఘ మాటలు. అందరిస్థితి ఇంచుమించు అలాగనేయుంది. ఎవరు ఏంచేస్తున్నారో? ఏంమాట్లాడు తున్నారో? ఎవరికి తెలియదు. అంతా ఆయోమయం. అంతా అగమ్య గోచరం.

తాతయ్యా! నేను వస్తాను. రామన్నను తీసుకు రావడానికి నేను చెప్తే వింటాడు. నాకు చెప్పేడు నీమాట వింటానని. నన్ను తీసుకువెళ్ళు తాతయ్యా.

నువ్వు నడవలేవురా! నీవు యిక్కడే ఉండు. నేను వెళ్లి తీసుక వస్తానుగ!

మరి నీవు మాత్రం నడువగలవేమిటి? ఇద్దరం మెల్లగా

నడిచి వెళదాం రామన్నను తీసుకు వచ్చేద్దాం.

ఒరే! అన్నయ్యా! పరువెత్తు. నేను కూడా—ఈ పక్కనించి దగ్గర దారిలో పరువెత్తి వస్తాను.

ఒరే! రండర్రా పరుగెత్తండి. రాముని రథానికి అడ్డంగా పడుకుండిపోదాం. అప్పుడు రథం ఆపేస్తాడు. రాముడ్ని బతిమాలుకొని తీసుకొనివచ్చేదాం.

పదండర్రా! పదండి. ఇక్కడ నిలబడి ఏంచూస్తారు? రాముడు అడవికి చేరేలోపలే రథం ఆపేద్దాం.

వెళ్లనీయండర్రా! వెళ్లనీయండి. వారెక్కడుంటే అక్కడికే వెళ్లిపోదాం. ఆ సీతమ్మతల్లి ఎక్కడుంటే అక్కడే పళ్లు, దుంపలు నీళ్లు లభిస్తాయి. వాళ్లలాగే మనం కూడా చెట్లక్రింద గడిపేద్దాం. ఇక్కడేముంది మనకి. అయోధ్య అడవిలాగుంది. ఆవులు దూడలకి పాలీయ్యట్లే. అవి త్రాగవు. ఇండ్లలో వంటలేదు. పెంటలేదు. తల్లి పిల్లకు పాలు ఇవ్వదు. బిడ్డలకు బువ్వలేదు. అంగడిమూత పడిపోయింది. మనిషి సంచారంలేదు. చెట్లు కదులటలేదు. గాలిస్తంభించి పోయింది. ఓహో! అంతా నిస్తేజమైపోయింది. సీతారాములతోనే పట్టణశోభ పోయింది. ఇక్కడేమి చేస్తాం? రాముడు ఎక్కడుంటే అక్కడికే పోదాం. ఇలా ప్రజలు అనుకుంటూ తమ తమ బిడ్డలను తీసుకొని ఊరు విడచిపోతున్నారు. కాలిపోయిన, కూలిపోయిన, కొట్టుకుపోయిన. చీవికిపోయిన పాడైపోయిన నగరంలా కనిపిస్తున్నది. జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులు, తేజోవృద్ధులు శిరఃకంపాలతో ఒళ్లు వణకుతో కాళ్ల తొట్రుపాటుతో కఱ్ఱఊతతో వడివడిగా నడుస్తున్నారు. రామా! రథం నిలుపు. పరుగెత్తలేం. ఓ అశ్వాల్లారా! మీకు వినబడదా! రథమును మరలించండి. రాముడు అడవిలో ఉండతగడు. ఆగండి. రథం ఆపండి.

సుమంత్రా! రథం నిలుపు. వృద్ధులు నామీద ప్రేమచేత నడవలేక నడవలేక వస్తున్నారు. ప్రజలా! సరేసరి. పిల్లపాప ఇటే వచ్చేస్తున్నారు. రథం ఆగింది. లక్ష్మణా రథందిగు. సీత దిగింది అందరూ దిగేరు. నిర్వికారంగా కొన్ని అడుగులు, కొంత దవ్వు నడిచారు. అంతా తమసానదీ తీరానికి చేరారు. సూర్యాస్తమయం అయింది. తమసానదిలో సీతా రామలక్ష్మణులు సాయంసంధ్యాహ్నికములు ముగించేరు. లక్ష్మణునిచే తీసుకురాబడిన చల్లని తమసానదీ నీరమును సీతారాములు తాగేరు. ఒక వృక్షఛ్ఛాయ విశ్రమించారు సుమంత్రుడు గుఱ్ఱాలను రథమునుండి విడిచాడు. తాను లక్ష్మణుడు సీతారాముల సమీపంలో ఒకచెట్టు మొదట అధిష్టించారు.

అయోధ్యవాసులు, ఆబాలవృద్ధులు తమసా తీరంలో విశ్రమించారు. చల్లని గాలివీచి వారికి శ్రమలేకుండా చేసింది. మార్గాయాసం కలుగలేదు. క్షుత్పిపాసలులేవు. రాముని గుణ గణాలను మహాత్వమును, ప్రేమాభిమానాలను, తలచుకుంటూ కన్నుమూశారు. నిద్రాదేవి వారిని తన చల్లని ఒడిలోనికి చేర్చుకుంది.

అడవి సద్దుమణిగింది. చెట్లు కొండలు చలనంమాని సీతారాములను జాగ్రత్తగా కాపాడుతున్నట్లుగా నిలచాయి. గాలిమాత్రం సుగంధాన్ని వెదజల్లుతూ అందరికి సేద తీరుస్తున్నది.

సుమంత్రా! చూడు ఈ ప్రజలంతా నామీద అభిమానం చేత, భక్తిచేత ఊరువిడిచి అడవికి వచ్చేశారు. ఈ అడవిలో రాళ్లలో కటికనేలపై ఎలా పడుకున్నారో చూశావా? వీరి కష్టాలను చూడలేకుండా ఉన్నాను. రథానికి గుర్రాలను వేగంగా పూన్చు వీరు లేవకుండానే ఈ నదిదాటి వెళ్లిపోదాం. అప్పుడు వీరంతా మరలా అయోధ్యకు చేరుకుంటారు. అని అన్నాడు రాముడు.

రథం సిద్ధమైంది. సీతా రామలక్ష్మణులు అధిష్ఠించారు. సుమంత్రా! ఆ పచ్చికబయళ్ళ మీదుగా పోనీ. కొంతదూరం అయోధ్య మార్గం పట్టించు తరువాత దారి మళ్లించు. ప్రజలు మేలుకొని నేను అయోధ్య చేరుకున్నాను, అని భ్రమించి వారు అయోధ్య చేరుకుంటారని రాముడు వ్యాఖ్యానించాడు.

సుమంత్రుడు రామాజ్ఞను అనుసరించి కొంతదూరం అయోధ్య మార్గంలో రథాన్ని నడిపించాడు. వెంటనే చెట్లు పొదలు మాటునుండి దారి మళ్లించాడు. క్రమంగా రాముని రథము తమసానదిని అతిక్రమించినది. కొన్ని పల్లెలు, పాకలు గడిచాయి. మరికొన్ని జనపదాలు అతిక్రమించాయి. అక్కడక్కడ ప్రజలు రాముని ప్రవాసం వినియున్నారు. కనుక ఆరాత్రి రథం దగ్గరకు వచ్చి నమస్కరించారు. కన్నీటితో, హృదయభారంతోను తప్పుకుంటున్నారు

రాముని రథాన్ని 'వేదశృతి' నది అడ్డగించింది. తామరలు, కలువలు అనే కనులతో చూసింది. అలలచేత తపతపలాడింది. వీచిన గాలిని నిట్టూర్పు విడిచింది. రాముడు సమస్కరించాడు. స్వామి నమస్కారంగ్రహించి దారితొలగింది. రథం సాగిపోయింది.

ఇదిగో లక్ష్మణా! ఇది గోమతీనది. దీనిని మన పూర్వులు [illegible]నది. [illegible]ని ఫలప్రదమంవలె రుచ్యమైన నీరుకలది. దీనిచే తడుపబడిననేల సస్యవతియై మనసామ్రాజ్యాన్ని అంతటినీ పోషించుతుంది. లక్ష్మణా! నమస్కరించు. సీతాదేవి కూడా నమస్కరించింది. రథం నదిని అతిక్రమించింది. కొన్నికోయపల్లెలు ఆటవిక నివాసాలు కన్పిస్తాయి. పక్షుల గీతాలు విన్పిస్తున్నాయి. ఆకులమర్మర ధ్వనులు విన్పిస్తున్నాయి. జంతువుల అరుపులు వినిపించాయి. ఆ సీతమ్మతల్లికి అంతా ఆశ్చర్యం. అంతా ఆనందం. తియ్యని పండ్లవాసన. కమ్మని

పూలవాసన, చల్లగా మెల్లగా వీస్తున్నగాలి. అదియొక స్వర్గభోగంలా ఉంది వారందరికి.

లక్ష్మణా! ఇది స్యందిక అనే వాహిని. ఇప్పుడు మనదేశాన్ని అతిక్రమించాము. ఈనది మనదేశానికి సరిహద్దు. కోసలదేశానికి ఎల్లగా నిలచింది. ఈ పరిసర ప్రాంతం అంతా మన పూర్వీకులనుండి మన పరిపాలనలోనే ఉంది. ఇక్కడ నుండి ఆ ఉత్తరదిశ చూడు. అదే మన అయోధ్య. ఆ నగరాన్ని నమస్కారంచేయి. అందరూ తలెత్తిచూసి ఆ దిక్కునకు నమస్కారం చేశారు. పునర్దర్శనం కటాక్షించమని ప్రార్థించారు. రథం స్యందికానది దాటింది. ఇక పూర్తిగా అరణ్యానికి వచ్చినట్లే.

తూర్పున శుక్రుడు ఉదయించాడు. ప్రత్యూష పవనాలు వీస్తున్నాయి. చెట్లకొమ్మలు రెమ్మలు ఇటు రమ్మా! అన్నట్లు కదులుతున్నాయి. పక్షులు కిలకిల ధ్వనులు చేయుచూ స్వాగతాలు పలుకుతున్నాయి. పొదలమీది మొగ్గలరెక్కలు ఒక్కొక్కటిగా విడుతున్నాయి. సుగంధాల పూసుకొని తెమ్మెరలు అల్లనల్లన మెల్ల మెల్లగా వీస్తున్నాయి. వెలుగు రేఖలకు భయపడి చీకట్లు మెల్ల మెల్లగా, తుప్పలచాటున కొండలచాటున దాగు కుంటున్నాయి. అక్కడకూడా నిలవడానికి వీలులేకపోతే, గుహలలో ప్రవేశించి భల్లూకాలమొందిలో దాగున్నాయి.

దూరంగా గలగల శబ్దం వినబడుచున్నది. బ్రాహ్మీ ముహూర్తానికేలేచి ఋషులు, బ్రాహ్మణులు, దండకమండలాలు ధరించి వెళుతున్నారు. రథగమనం మందగించింది. 'హిరణ్య శృంగం వరుణం ప్రపద్యే' అంటూ అఘమర్షణ మంత్రాలు సుస్వరంగా వినిపిస్తున్నాయి. జల, కుక్కుట, బక, హంస, క్రౌంచ, చక్రవాకాది పక్షుల ధ్వనులు కలకలా వినివస్తున్నాయి. సూర్యోదయ సమయానికి

సీతా రామలక్ష్మణులు గంగానదికి చేరుకున్నారు. రథావతరణం చేసి భాగీరథికి నమస్కరించారు.

## గుహుడు

మంగళ తరంగిణియగు గంగానది శాంతంగా నొకచోట ఉరవడిగా నొకచోట సుడులు తిరుగుతూ ప్రవహిస్తున్నది. ఋషులు బ్రాహ్మణులు, స్త్రీలు, వృద్ధులు అందరూ ఆనదిలో స్నానం చేస్తున్నారు. అఘ్లింగాది మంత్రములు జపిస్తున్నారు. కొందరు సూర్యునకు ఎదుటనిలచి అర్ఘ్యప్రదానాలు చేస్తున్నారు. సైకత స్థలములందు నిలబడి సూర్యనమస్కారాలు చేస్తున్నారు.

సీతా రామలక్ష్మణులు ముందుగా కొంతనది నీటినుండి పట్టి తమ చేతులతో ఒడ్డున మూడుసార్లు వేశారు. నీళ్లు తలపై మార్జన చేసుకున్నారు. తరువాత నదిలోదిగి స్నానం చేశారు. సంధ్యావందనం ముగించి సూర్యునికి అభిముఖులై జపిస్తున్నారు.

యోదేవ సవితాస్మాకం ధియో ధర్మాదిగోచరః
ప్రేరయేత్తస్యయద్భర్గః తద్వరేణ్య ముపాస్మహే॥

తీరమునుచేరి పొడిబట్టలు కట్టుకున్నాక లక్ష్మణుడు ఆర్ద్ర వస్త్రాలు పిడిచి ఆరవేసాడు. సుమంత్రుడు రథమునుండి గుఱ్ఱాలు వదలించి విడిచిపెట్టేడు. తానుకూడా నదిలో అవగాహన చేశాడు. సీతారాములు నదీ తీరంలోగల దట్టంగా నీడనిచ్చే గారచెట్టు క్రింద ఆకులనే ఆసనంగా చేసుకొని అధివసించారు. లక్ష్మణుడు కమండలంతో నదీ నీరమును తీసుకొనివచ్చి సమర్పించగా సీతారాములు కొలదిగా పానం చేసారు. ధనుర్ధారియై లక్ష్మణుడు సమీపమున నిలిచేడు.

ఆసరికే సీతా రామలక్ష్మణులు అక్కడికి వచ్చారని తెలుసు కున్న గుహుడు తన పరివారంతో వచ్చాడు. అల్లంత దూరంనుండే చేతులు జోడిస్తూ— రామయ్య ప్రభూ! నేను గుహుడను. దండాలు దండాలుఅంటూ తన తలపాగను నేలపెట్టి బోరిగిలపడి సాగిలి నమస్క రించాడు. చేతులు కట్టుకొని ఎదుట నిలిచారు.

రాముడు ; మిత్రమా! గుహా! క్షేమంగా ఉన్నావా! నీ కుటుంబము, నీ పరివారం అంతా బాగున్నారా!

గుహుడు : సిత్తంబాబయ్యా! తమరి దయవల్ల అంతా సేమంగా ఉన్నారు. ఇదేటి ఇక్కడ కూకుండిపోనారు ? దయ సేయండి దొర మాగుడేనికి.

రాముడు ; మిత్రమా! మేము తండ్రిగారి ఆజ్ఞచేత అరణ్యవాసం చేయడానికి ఇలా వచ్చాము.

గుహుడు : అంతా విన్నాందొర. ఈ భూపపంచమంతా ఏలినోరిదే కదా! భరతయ్యగారు అయోధ్యలో పాలించనీ. తమరు మా గుడేంలో అదే ఋష్యశృంగపురంలో అమ్మగారితో కలిసి కొలువు ఉండండి. నేను, లచ్చుమయ్యగారు మా వోరు అంతా తమసేవ సేసుకుంటాం. తమరు ఏదిచెపితే చనాలలో చేసేస్తాం.

రాముడు ; మిత్రులారా ! మీ భక్తి సామర్థ్యాలు తెలుసును. పద్నాలుగు సంవత్సరాలు ఊర్లోనికి రాకూడదు. అరణ్యాలలో ఉండాలి. ఇది మా నాయనగారి ఆజ్ఞ.

గుహుడు : గట్టి సిక్కే తెచ్చి పెట్టినారుదొర! మాకు మీ సేవ సేసు కునే పున్నెంలేదు. మా దురదుట్టం. మరిఅయితే బోనాలు ఈడకే తీసుకొత్తాం, ఆ బోనాలు ఎంగిలి పడండి దొర. మమ్మల్ని దయతలచండి. కాదనకండి,

రాముడు : గుహా! నీ ఆతిథ్యం మేము గ్రహించామని తలంచు. విచారించకు. మా గుఱ్ఱాలకు ఖాద్య వ్యవస్థ చూడు.

మాకు మరేమి అక్కర్లేదు.

గుహుడు : ఈపల్లు అయినా తీసుకోండి దొర. అంటూ ఫలమూలా దులు తెప్పించి గుహుడు రాముని సన్నిధిని ఉంచి వీటిని ఆరగించి మాయందు కరుణించు దొర అనెను. గుఱ్ఱాలకు తగు గ్రాసము మొదలగు ఏర్పాట్లు తన పరివారముచే చకచక చేయించాడు. సెలవిప్పించండి. ఈ దాసుడు యింకేటి చేయాలో సెప్పండి?

రాముడు : మిత్రమా! ఈ గంగానది దాటవలసి ఉంది. అందుకు తగిన ప్రయత్నం చెయ్యి.

గుహుడు : సిత్తం దొర - ఎవర్రో ఆడ. రండి. మాంచి పడవా, సుక్కానీ తెరసాప కలిగి సిద్దం చేయండి. ఏలినోరు గంగమ్మతల్లి అద్దరికి ఎలతారట. అని కేక వేశాడు.

గారచెట్టు క్రింద పరిశుభ్రం గావించబడ్డది. సుమంత్రుడు, లక్ష్మణుడు లేత చిగుల్లు, పువ్వులు దట్టంగా పరచి సీతారాములకు సెజ్జ అమర్చారు. ఆ రాత్రి సీతారాములు గంగా తీరంలో గడప నిశ్చయించారు. గుహుడు భక్తితో పవిత్ర జలములతో సీతారాముల పాదములు కడిగాడు. తలపై చల్లుకున్నాడు. తన తలపాగా గుడ్డతో పాదముల తడియొత్తి కొన్ని పూలను పాదాలపై యుంచాడు. అందుండి ఒక పువ్వును తన శిరస్సున ఉంచుకున్నాడు.

గుహుడు;- ఇక్కడ విశ్రమించండి దొర. మావోరంతా ఏమెకముల బాధ లేకుండా కాపలాకాత్తారు. నేనుకూడా ఈ రేయి ఈడనే కూకుంటాను.

సీతారాములు విశ్రమించారు. గంగానది నుండి శీతల పవనాలు వీస్తున్నాయి. చంద్రకిరణాలు ఏటవాలునపడి ఆ ప్రదేశాన్ని రజిత మందిరంగా తోపింప జేస్తున్నది. సీతారాములు నిద్రావశులై

నారు. శత్రుఘ్నుడు, లక్ష్మణుడు, గుహుడు, కంటికి రెప్పలులా కనిపెడుతున్నారు.

లక్ష్మణుడు:- మిత్రమా! విధి ఎంతటివారినైనా కూలదోస్తుంది. ఉచ్ఛ స్థితికి లాక్కొస్తుంది. విధి విచిత్రమైంది. క్షణంలో సకల సామ్రాజ్య పట్టభద్రులు కావలసిన మా అన్నయ్యను అడవులపాలు జేసింది.

గుహుడు: ఆడోరి మనసులు సానా మెత్తని అంటారు. అలాటిదీ ఆ కైకొమ్మగారికి కఠినది ఎలాగైందో ?

లక్ష్మణుడు: మా తండ్రిగారు ఎప్పుడో రెండు వరాలు ఇచ్చారంటా ఈ అవకాశం చూచుకొని మా చిన్నమ్మ ఇంతకాఠిన్యం వహించింది. ఇట్టి పరిస్థితుల్లో వృద్ధులగు మా నాయన గారు ఎంత బాధపడుతుంటారో చెప్పలేము.

గుహుడు; మెత్తని దూదిపరుపుల మీద పడుకోవలసిన మారాజులు అమ్మగారు దిక్కుమాలినోళ్లలాగ ఈ చెట్టుకింద పడు కున్నారంటే గాచారమే మరి.

లక్ష్మణుడు: నిజమే. ఇదంతా మా గ్రహపాటు. అంతఃపురాలలో చెలికత్తెలు సేవచేస్తుండగా పూలతోటలలో సంచరిస్తూ తూగుటుయ్యాలలో ఊగుచూ పూలపాన్పులలో పవళింప తగిన మా ఒదినగారు ఈ కఠిన రాతినేలమీద, ఈ ఇసుకతిన్నెలమీద ఈ ఎండుటాకులమీద పరుండే దుస్థితి కలిగింది.

గుహుడు; అలు మారాజులు. అన్నిటికీ అలు సిద్ధమే. కానీ నా బోటివోరు ఈనాటి స్థితి చూడవల సొచ్చింది. ఆ దొడ్డ మారాజులకు కాయకసుర్లు తిని కటికనేలలో పడుకో వలసి వచ్చింది.

సుమంతుడు ఇటు సీతారాములను గమనిస్తున్నాడు. ఒక్కంట గుఱ్ఱాలను చూస్తున్నాడు. ఒక చెవితో వీరిరువురి మాటలు ఆలకిస్తున్నాడు. ఆ గుఱ్ఱాలు గుహుడు పెట్టిన 'దాణా' ని కడుపు నిండా తిని పచ్చిక మేస్తున్నాయి. ఒకమాటు నేలబడి ఇటు అటూ దొర్లి కాళ్లను విదలించి లేచినిలిచాయి. మెడలకు అంటిన ఇసుకను ఒకసారి దులుపుకున్నాయి. అప్పుడు వాటి మెడలో కట్టిన మువ్వల పట్టీ గలగల చప్పుడు చేసింది. మెల్లగా సకిలించాయి. చెవులు రిక్కించి సలునైపులా చూస్తున్నాయి. జలపక్షులు రెక్కలు టపటప చప్పుడు చేస్తున్నవి.

"లచ్చుమయ్య నిక్కముగా అన్నమీద భక్తితోనే వచ్చాడా? ఆ తమ్ముడు రాజ్యము లాగేశుకున్నాడు. ఈ తమ్ముడు అన్నగారికి హానిసేసేసి లొడ్డూ లొసుగూ కాజేస్తాడేటి చెప్పమా? ఈ రోజులలో ఏరిని నమ్మమన్నారు? ఆస మాసెడ్డది అని అనుకుంటున్నాడు" లక్ష్మణుని విషయంలో శంకగలిగి గుహుడు.

వీరు ఆటవికులు అన్నకి వదినకి ఏమి హానిచేస్తారో ఈ గుహుడు ఈ ఏటిఒడ్డున తన బలమంతా కాపలా పెట్టాడు. అవకాశం కోసం ఎదురు సూస్తున్నాడు. అడవిదొంగలు. నాశక్తి వీరికింకా తెలియదు బాణం సంధించి విడిచిపెట్టానంటే వీరేకాదు వీరిలాంటి వాళ్లు వేల కొలది వచ్చినా నేలకరిపిస్తాను— ఈ విధంగా గుహుని శంకించాడు. లక్ష్మణుడు.

వీరిద్దరూ ఏమి అఘాయిత్యానికి పాటుపడతారో? భగవంతుడా స్వార్థసంకుచిత బుద్ధులు పుట్టకనేపోవాలి. పుట్టేయి అంటే అన్నా తమ్ముడు తల్లి, తండ్రి, అక్కాచెల్లెలు ఈలాంటి అభిమానాల్లు, ఆప్యాయతలు దూరమైపోతాయి. ఒకరినొకరు చంపుకుంటారు. పొడుచుకుంటారు, మోసగించుకుంటారు. నేనొకవేళ పొరపాటు పడుతున్నా

నేమో! అయినా గుహుడుని, లక్ష్మణుడనీ ఒక కంట కనిబెట్టాలి. చేతనైనంతవరకూ నేను కత్తి. కర్రా పట్టగలను. ఇది సుమంత్రుని యోచన.

ముగ్గురూ రాత్రంతా మేల్కొని సీతారాముల గుణగణాలు తలుస్తూ చెప్పుకుంటూ గడిపారు. తూర్పున అరుణ కిరణాలు ప్రసరిస్తున్నాయి. సూర్యుడు తన వంశాంకురాలైన సీతా రాముల మేల్కొలిపాడు. సూర్యభగవానునికి నమస్కరించి వారు ప్రభాతిక స్నాన సంధ్యాద్యనుష్టానములు నిర్వహించారు. గుహుడు నౌకను సజ్జీకృతంచేసి చేతులు కట్టుకుని ఎదుట నిలబడ్డాడు.
రాముడు సుమంత్రుని చూసి—

ఆర్యా! ఇకమీరు రథమును అయోధ్యకు మరలించితీసుకు వెళ్లవచ్చును. మేము పాదచారులమై వనవాసము గడుపుతాము. మా తండ్రిగారు, మాతల్లులూ తక్కంగల పెద్దలకు మా నమస్కారాలు తెలియజేయండి. మా తండ్రిగారిని విశేషించి మా తల్లిగారిని విచారించకుండా కనిపెట్టండి. మేమువారి ఆశీస్సులచేత వనవాసము ముగించుకొని పాదాభివందనం చేయగలవారం అని చెప్పండి. అని రాముడు సుమంత్రునితో పలికేడు.

సుమంత్రుడు భాష్పవారిపరిపూర్ణలోచనుడై ప్రభూ! రామచంద్రా క్షమించండి. తమరులేని ఈ శూన్యరథాన్ని తీసుకొని ఎట్లు అయోధ్యలో అడుగుపెట్టగలను? ప్రజలందరూ నన్ను చూచి రాముడు లేని రథాన్ని చూసి నన్ను నిందిస్తారు. దుఃఖిస్తారు. నేను తరతరాలనుండి మీ సేవకుడను. మీతో అడవికి వచ్చేస్తాను. మీరులేనిఅయోధ్యలో అడుగుపెట్టలేను. కాదంటే ఈ రథాన్ని నేను అగ్నిలో ప్రవేశించి నశింపజేసుకుంటాను. శెలవిప్పించండి, అనుమతించండి ప్రభు. అని దీనంగా పలికినవాని మాటలు విన్నాడు రాముడు.

సుమంత్రా! నీ భక్తి విశేషాలు నాకు తెలుసును. కానీ నీవు యిప్పట్లో అయోధ్యకు వెళ్ళకతప్పదు. ఏమంటావా? నా పినతల్లి నేను అడవికి వెళ్లానో లేదో అని శంకిస్తుంది, నేనులేక మీరులేక వృద్ధులగు మా జననీ జనకులకు సేవ ఎవరు చేస్తారు చెప్పు. పుట్టెడు దుఃఖంతో బాధపడుచున్న మా తల్లిదండ్రులను ఎవరు ఓదార్చగలరు రాజకీయ వ్యవహారములందు మా తమ్మునకు తోడ్పడండి. సనాతనం నుండి మాయింటి వ్యవహారాల్లోను, రాజ్యపరిపాలనా పరిస్థితుల్లోను [illegible]న మీరు మాకు పూజ్యులు. మమ్ములను శాసించ తగినవారు. తమకు తెలియని ధర్మం న్యాయం ఎక్కడుంటుంది? అచిరకాలంలోనే అరణ్యవాసం ముగించి పితృపాదుల పాదుకలకు నమస్కరిస్తాను.

గుహుడు నమస్కరించి సెలవివ్వండి బాబయ్యా! తమరిసేవ ఈపాటిచేసిన ధన్యుడనేతాను.

మిత్రుడా! ఋషులు జటావల్కలాలు ధరిస్తాను. కాబట్టీ మర్రిపాలు తీసుకొనిరా నేను అట్లాగేధరిస్తాను. అనిరాముడు పలికేడు.

గుహుడు చిత్తంధొర! అని ఆకుదొన్నెతో మర్రిపాలు తెచ్చి రామునకు సమర్పించాడు. రామలక్ష్మణులు తమ శిరోజాలకు మర్రిపాలు పూసి మకుటంవలే శిరస్సుపై అలంకరించారు. సీత కన్నుల నుండి అప్రయత్నంగా రెండు అశ్రుబిందువులు నేలరాలేయి.

లక్ష్మణా! ముందుగా సీతను నావపై మెల్లగా ఎక్కించు. ఆ—అది అలాగ— ఇకమీద నీవు పడవఎక్కు. రాముడు ఏదోధ్యానిస్తూ తాను కూడా పడవ ఎక్కేడు.

గుహుడు నమస్కరించాడు. సుమంత్రుడు కన్నీటితో వీడ్కోలు రామునకు ఇచ్చాడు. సరంగు చుక్కానిని పట్టాడు. పడవను

తెరచాప ఎత్తిపెట్టి బిగించికట్టాడు. సీతా రామలక్ష్మణులు గంగాదేవికి నమస్కరించారు. మనస్సులో ఏవేవో ప్రార్థనలు చేస్తున్నారు. గాలివాలుగా పడవ మెల్లిగా సాగిపోతున్నది. నీటి తరగల ధ్వనితప్ప నిశ్శబ్దంగా ఉంది. సరంగులో ఉత్సాహం పొంగింది. పాట అందుకున్నాడు. ఒకచెయ్యి చెవిదగ్గర పెట్టి వేరొకచెయ్యి గాలిలోనికి లేపేడు.

హైలెస్సో .... — .... .... హైలెస్స.
రామయ్య లచ్చుమయ్య సీతమ్మదీ పడవ.
రక్షించు మారాజు వచ్చి కూచున్నాడు.
పిల్లా పాపా మనకు సల్లగుండాలంటే
ఏలినోరికి మొక్కి ఏఱు దాటించాల
మన బతుకు నట్టేట మునిగి పోకుండాను
యెగసి రచ్చించేటి భగవంతుడాతడు
హైలెసో .... .... .... .... హైలెస్స

ఏటి హోరులో పాట వినబడుతున్నది. కంఠం ఖంగుమంటున్నది. జానపద సాహిత్యంలోని అందాలు అందలి భావాలు ఆ తియ్యని కంఠంలో చెవులకు ఇంపుగా మనసుకు ఆహ్లాదాన్ని కలిగిస్తున్నది. నావ నదిమధ్యకు చేరుకున్నది. సీత పసుపు-కుంకుమా పండ్లు పువ్వులు నీటిలో వేసి మనసులో ఏవో ప్రార్థించింది. నమస్కారం గంగాదేవికి చేసింది. పడవ క్రమ క్రమంగా దక్షిణ తీరాన్ని చేరుకుంది. సీతా రామ లక్ష్మణులు నౌక నుండి దిగేరు. నదీమతల్లికి నమస్కరించి ముందుకునడిచారు.

దక్షిణ తీరవాసులు శర, చాప, అసిదారులైన ఈముగ్గురిని గాంచారు. దివ్యకాంతులను ప్రసరింపజేస్తున్న ఇట్టి రూప తేజోవిలాసాదులు కల పురుషులను ఇదివరకెన్నడూ చూడని కారణంచేత సంభ్రమాశ్చర్యాలతో చేతులు జోడించి నమస్కరించారు.

ప్రతినమస్కారం చేసి సీతారామ లక్ష్మణులు ముందుకు నడిచి నదీతీరాన్ని అతిక్రమించేరు. త్రివేణి సంగమం దర్శించి నమస్కరించేరు. ఆ ప్రక్క నుండి యమునా తరంగిణి పశ్చిమాన నల్లని మేఘంలా నల్లగ ప్రవహిస్తూ ఉన్నది. అల్లంతదవ్వున మునుల నివాసాల నుండి పొగ పొరలు పొరలుగా వ్యాపిస్తూ వస్తున్నాయి. సమీపంలో ఎవరో కట్టెలు చీరుస్తు ఉన్నారు.

అన్నా! భరద్వాజుని ఆశ్రమం ఎక్కడా? అని లక్ష్మణుడు ఆ కట్టెలు కొట్టువాడ్ని ప్రశ్నించాడు.

అదే! ఆ ఎదుటనే కలదని ఆ కట్టెలు చీల్చువాడు చేయి చూపించాడు. రాముని ఆజ్ఞ తీసుకొని లక్ష్మణుడు ముందుగా భరద్వాజాశ్రమానికి చేరుకున్నాడు

ఆ ఆశ్రమంలో ధర్భాసనాశీనుడై వలీ ఫలిత శిరస్కుడు [illegible] భరద్వాజ మహర్షి కుడి మోచేతి క్రింద దండము [illegible] ఆ చేలతోనే తులసి మాలను త్రిప్పుచూ అర్ధనిమీలిత [illegible] చేసుకుంటున్నాడు. లక్ష్మణుడువచ్చిన సవ్వడివిని కన్నులు తెరిచాడు. లక్ష్మణుడు ఆయనకు నమస్కరించి మహర్షివర్యా! సీతారాములు అయోధ్య నుండి అరణ్యవాసం చేయునిమిత్తం బయల్దేరి వచ్చినారు వారుతమ దర్శన నిమిత్తం ఆశ్రమ ప్రాంగణంలో నిలిచి యున్నారు. అని విన్నవించాడు. భరద్వాజుడు సంతసించి వెంటనే [illegible] రాముల్నిసమీపా తెలియజేసాడు.

సీతారాములు ఆశ్రమ ప్రవేశం చేసి భరద్వాజ మహర్షులకు నమస్కారం చేస్తూనేను దశరథావనీశునిపుత్రుడను రాముడనువాడను ఈమె నా సతి జానకి. ఆతడు నా సోదరుడు లక్ష్మణుడు. అని [illegible]చేసాడు

రాకుమారులారా! నాపుణ్యం ఫలించింది (నావిష్ణుః పృధివీ పతిః) అనుట చేత నా అదృష్టం వలన మీ దర్శనం కలిగింది. ఈ కుశాసనమున అధివశించండి. ఈ మధురఫలం గ్రహించండి. మీరు నాకు దైవ సమానులు. అతిథులు విష్ణులను పూజించే భాగ్యం కల్గింది ఈ దినము, "అభ్యాగతః స్వయం విష్ణుః" అన్నారు కనుక నా ఆతిధ్యం స్వీకరించండి. అని గౌరవప్రీతి పత్తులతో సీతా రామ లక్ష్మణుల నుద్దేశించి భరద్వాజుడు పలికేడు.

మహర్షివర్యా! మేము తల్లిగారిచే నియమింపబడి పద్నాలుగు వత్సరాలు అరణ్యవాసం చేయుటకు వచ్చినారము, మాకు అనువైన ప్రదేశం నిర్దేశించండి అన్నాడు రాముడు.

మేము సర్వమూ గ్రహించేము. దైవం ఏదిచేసిన నామేలు కొరకే "దైవాదీనం జగత్సర్వమ్" అన్నారు పెద్దలు. రామా! ఈ రాత్రి యిక్కడే మీరు విశ్రాంతి తీసుకోండి. అని పలుకుచూ భరద్వాజుడు ఫలమూలాదులు మధుక్షీర, దధి, ఘృతాది పానీయాలు అన్న రసాదులు తన తపః ప్రభావముచేత సర్వము సమకూర్చేడు. వాటి వలన సీతారామలక్ష్మణులు సంతుష్టులై ఆ రాత్రి భారద్వాజాశ్రమంలో విశ్రమించారు. వివిధ విచిత్ర కథావిశేషాల చేతను. సర్వేంద్రియ శ్రమాపనయన సమర్ధమగు సుషుప్తి చేతను ఆ రాత్రి గడిచినది.

## చిత్రకూటం

పక్షులు రెక్కలు అల్లార్చుచూ కలకల ధ్వనులుచేస్తు మేత లకు వెళ్తూయున్నాయి. చల్లని గాలులు శరీరానికి హాయిని కొలుపు తున్నాయి. దూరం నుండి షడ్జమంలో ఒక నెమలికేక వేసింది. మేఘములఅంచునకు జరీపూత పూయుచూ సూర్యుడుదయిస్తున్నాడు మందేషులు పారిపోయి గిరి గహ్వరములలో దాగున్నారు.

సీతా రామ లక్ష్మణులు ప్రభాతమున మేల్కొన్నారు. నదిలో స్నాన సంధ్యాధికములు ముగించారు. ఆశ్రమానికి అరుదెంచి భరద్వాజ మహర్షికి నమస్కరించారు.

మహర్షి వర్యా! తమ అనుగ్రహం వల్ల మేము రాత్రి [illegible] గడిపినాము. మాకు శెలవు నివ్వండి. అరణ్యవాసం [illegible] సంవత్సరాలు గడుపదగిన ప్రదేశం తెలియజేయండి. [illegible] భరద్వాజుని ప్రార్ధించేడు.

నాయనలారా! మీరు ఇక్కడనే ఉండి పద్నాలుగు సంవత్సరాలు గడపవచ్చును కదా! ఇక్కడ మీ ఉనికికి అనుకూలంగానే ఉంటుందని ఋషి పలికేడు

ఋషి సత్తమా! తమరు సెలవిచ్చినది సముచితమే కాని నేను ఇక్కడ వున్న విషయం తెలిసి అయోధ్యవాసులు జానపదులు వచ్చి చేరుతుంటారు. ఇది నా అరణ్య నివాసానికి తగదు. దయచేసి వేరు [illegible] నిర్దేశించండి ఆర్యా.

రామా! ఇక్కడకు కొంత దూరంలో చిత్రకూటం అనే పర్వతం ఉంది. అది మహర్షి జన ఆలవాలము. అటఫలమూలాదులు [illegible] లభిస్తాయి. సమున్నతాలైన పర్వత శిఖరాలు కలిగి [illegible] సమీపంలో మందాకినీ నది ప్రవహించుచున్నది. అనీరము [illegible] మార్గంలో రెండునదులు, చిన్నచిన్న అడవులు అతిక్రమించవలసి వుంటుంది. చిత్రకూటమే మీకు నివాసయోగ్యమని భావిస్తాను. అని భారద్వాజుడు సూచించేడు.

సీతారామలక్ష్మణులు వారికి అభివందనంచేసి చిత్రకూట పర్వతాభిముఖులై సన్నని కాలిబాటన నడక ప్రారంభించారు.

లక్ష్మణా! మనము ఇప్పుడు పూర్తిగా వనవాసులమైనాము. నీవు ముందుగా ఆయుధపాణివై నడువుము. నీవెనుక సీత వస్తుంది. నేను ఆమె వెనుక రాగలను. మధ్యమార్గంబులో జానకి కోరిన ఫలములు గాని. పుష్పములుగాని సమకూర్చి సంతోషపెట్టాలి. క్రూరమృగ సంచారము కలిగిన ఈ అడవిలో మనము జానకిని సర్వదా కాపాడతగియున్నది.

అన్నగారిమాట శిరసావహించాడు లక్ష్మణుడు. తన ముందటి వనమందలి సహజ సౌందర్యము గమనిస్తూ మధ్య మధ్య అయోధ్యలో జరుగు పరిణామదశను చెప్పుకుంటూ వెళుతున్నారు. కొంతదూరం వెళ్ళుసరికి వారికి కాళిందీనది గోచరించింది. సీతా రామలక్ష్మణులు ఆచమించి సమీపమునగల కొన్ని ప్రబ్బలిశాఖలు, శుష్కతరు శాఖలు సమకూర్చి తీగెలతో చిన్న పడవలను నిర్మించాడు. దీనిపై ముందుగా సీతాదేవిని అధిసంపజేసి ఆమె వస్త్రాదికమును ప్రక్కనుంచారు. లక్ష్మణుడు పిమ్మట రాముడు అధిష్టించారు. మెల్లగా పడవను గడుపు కుంటూ ఆవలితీరానికి చేరుకున్నారు. ఇదియొక నూతనానుభవము. ఇటులనే మరికొంత ప్రయాణం సాగించేరు. దుప్పులు, లేళ్లు, కుందేళ్లు గెంతుతున్నాయి. పచ్చికమేస్తూ చూడముచ్చటిగా నున్నవి. గోలాం గూలాములు, కోతులుతరుశాఖలపై ఊగుతున్నాయి. కాయలు పండ్లు కొరికి క్రిందపడివేస్తున్నవి. సీతారాములకు ఆ వానర ప్రవృత్తి ఎంత ముచ్చటిగానున్నదో ఆ వానరాలు వీరినిచూసి పండ్లు ఊగలిస్తున్నాయి పండ్లు కాయలు కొరికి వీరిముందు పడవేస్తున్నవి. వాటి మూగభాష చేష్టవిచిత్రంగా ఉంది. అక్కడకూడా మహర్షులు చిన్నచిన్న పర్ణశాలలు నిర్మించుకొని ఆవాసం చేస్తున్నారు. కొందరైతే చెట్లక్రిందే కూర్చొని నిమీలితనేత్రులై ధ్యానిస్తూయున్నారు. ఇక్కడే ఒకనదిఅడ్డువచ్చింది దీనిపేరు 'అంశుమతి' మెమ్మదిగా ప్రవహిస్తున్నది. లక్ష్మణుడు పూర్వానుభవంతో మరలా ఒకపడవ నిర్మించేడు. సీతా రామలక్ష్మ ణులు నదిని అతిక్రమించారు.

ప్రయాణం సాగుచున్నది. అదిగో! ఆ ఎదురుగా ఉన్నదే [illegible] పర్వతం. వివిధ వర్ణ పుష్ప విరాజితమై, తరులతాసమన్వి తమైనది. [illegible]ల రసాస్వాదన సమర్థమైన పక్షులు, వివిధ వర్ణములు [illegible] ధ్వనులుచేస్తూ ఒక తరువునుండి వేరొక తరువునకు [illegible]న్నాయి. ఆ [illegible] పుష్పాలను ఆరంగులు ఏ చిత్రకారుడు [illegible] తూలికను ప్రయోగించి, ఎంత కళాత్మకంగా చిత్రించాడో! [illegible] సమన్వితమైన ఆ ప్రదేశం సూర్యకిరణములుపడి కోటి [illegible] 'అనేక చిత్ర విచిత్రములకు అది [illegible]' అందుకనే అది చిత్రకూటం.

అదిగో ఆ మందాకినీనది. తీరములు నానాతరుసమాలం [illegible] శాఖలు, వివిధ పుష్పలతా వితానములు కలిగి కన్నులను [illegible]న్నాయి. సుదూరంలో ఏనుగు గున్నలు, గజస్నానం [illegible]న్నాయి. జలపక్షుల చేతను జలజముల చేతను ఒకటి రెండుగా [illegible] పూలనదులలా ప్రవహిస్తున్నాయి. ఆ మందాకినీ [illegible] నీరు కొబ్బరినీరు, చెఱుకు, పాలు తేనెతెరలు, ద్రాక్షా [illegible] మించిన స్వాదుతరం కలిగి ఉంటుంది. వీటి అన్నిటి [illegible]తో సుధామధురమైనదా! ఆ మందాకినీ నీరు.

ఈ పరిసరాలలో జింకలు పచ్చిక మేసుకుంటూ ఉన్నాయి [illegible], చమరీ మృగాలు, కస్తూరిమృగాలు అందందు సంచ రిస్తున్నాయి. అగరు, చందనం, సాంబ్రాణి, గుగ్గులుచెట్ల నుండి [illegible] సువాసనచేత ఈ ప్రాంతమంతా సురభిలమై. ఘ్రాణ [illegible]గా ఉంది. లక్ష్మణా! ఈ పర్వతశిఖర సానువులమీద ఒక [illegible] ఇక్కడ ఆవాసయోగ్యంగా ఉంది. సముచిత [illegible] ఉంది. అని శ్రీరామచంద్రుడు లక్ష్మణునకు తెలియ [illegible].

అక్కడ ఒక ఎత్తగు చెట్టు నీడలో లక్ష్మణుడు పర్ణశాలను నిర్మించుటకు ఉపక్రమించాడు. తరుశాఖలూ, తీవలు, రెల్లు, కుశలు మొదలగునవి సమకూర్చేడు. గాలి వెలుతురు గలిగి ముందునకు ఒక అరుగు, గవాక్షములు, ద్వారములు కలగి రెండు గదులుగా శాలా నిర్మాణము నైపుణ్యంగా చేశాడు. ఆశాల సీతారాములకు చాలా ఆకర్షించింది. లక్ష్మణుని పనితనానికి మెచ్చుకొన లేకుండా ఉండలేకపోయారు.

మందాకినీలో స్నానాదికాలు ముగించుకొని రాముడు వాస్తుపూజ, దిక్పాలకపూజ, మొదలగునవి గావించి, శాలకు ఎనిమిది దిక్కులకు ఫలశకలాలతో పుష్పములతో బలిని గావించేడు. ఆ దివ్య సుందరమైన పర్ణశాలలో సీతారామలక్ష్మణులు మిక్కిలి సంతోషంతో నివాసం చేశారు. మందాకినీతీర విహారాలతోను, తత్రస్థ ఫలమూల మధురసాలతోనూ, రోజులు గడుపుతున్నారు. ప్రకృతి వారిని అన్ని విధాల అలరిస్తు ఉన్నది. అప్పుడప్పుడు అయోధ్య జ్ఞాపకమునకు వస్తూ తల్లిదండ్రులు, సోదర్లు ప్రజలు స్మృతి పథంలో గలిగి కలవర పాటు కలిగిస్తూ ఉన్నది.

చాలా దూరం నుండి సంచలం కలిగినట్లు కనబడుతున్నది. అడవి జంతువులు అటునిటు పరుగులు తీయుచున్నవి. పక్షులు రివ్వున ఆకసమునకు ఎగిరి పోతున్నాయి. గూటిలోని రెక్కలు రాని పక్షిపిల్లలు ముందుకు మెడసాచి అటునిటు చూస్తున్నాయి. ఏదో కలకలము ఏర్పడింది. ధూళీరేగుచున్నది. తమ్ముడూ! ఎవరో ఇటు వేటచేయుటకై వస్తున్నారు కాబోలు గమనించు అని రాముడు పలికేడు. వెంటనే లక్ష్మణుడు— ఉన్నతమైన సాలవృక్షము నెక్కి ఆ వచ్చు కలకలము వైపు దృష్టిసారించేడు. వెంటనే చెట్టుదిగి ధనుర్బాణాలు అందుకున్నాడు.

అన్నయ్యా! మీరు ఒదినగారిని తీసుకొని పర్ణశాలలోనికి

వెళ్లండి. ఊఁ ముందుగా వెళ్లండి. ఆలసించకండి. వాళ్లు
న్నారు. అదొక పెద్ద సైన్యం. వందలాదిగా ఏనుగులు,
గుఱ్ఱాలు, లక్షలాదిగా సైనికులు, ఎందరో తెలియుట
దగ్గరకురానీ. వారినందరిని ఒక్కబాణంతో పరిమార్చేస్తా
భరతుడు, శత్రుఘ్నుడు, వశిష్ఠాదులుకూడా వచ్చుచున్న
తల్లులుకూడా తరలి వస్తున్నారు. తండ్రిగారు కనబడుట

వీరందరూ ఏకమై అడవులలో ఇడుములు
మనలను చంపడానికి వచ్చేస్తున్నారు. రాజ్యలాభంతో
సంతుష్టి పొందలేనట్లుంది. మనపైకసి, పగ, రాజ్యలోభ
వారినైనా ఎట్టిపనినైనా చేయిస్తుంది. అని సీతారాము
రించాడు

లక్ష్మణుని ముఖం జేవురించింది. అనంతుని సహ
నుండి విషానలజ్వాలలు ఒక్కుమ్మని ఉమ్మిసినట్లు ఉన
కన్నులు ఎఱ్ఱబడ్డాయి. కుబుసం విడిచిన త్రాచులాగ సరు
ఒరనుండి పెరికేడు. కోపంతో ఒళ్లు ఊగిసపోతున్నది. కోప
పండ్లతో క్రిందపెదవిని కరచిపెట్టేడు. మంత్రిరుద్ధ పన
బుసలుకొడుడూ ఇటు నటూ కదలుచున్నాడు.

తమ్ముడు లక్ష్మణా: శాంతించు. వనవాసులకు
ముందు ఆ ఖడ్గం ఒరలోపెట్టు. భరతుడు నాయందు
తత్పరుడు. శాంతి సౌజన్యాలమూర్తీభవించినమూర్తి. చిన్న
నిత్య శత్రుఘ్నుడు. వారికి వారేసాటి. మనలను జయించు
తల్లులు ఎందుకు వస్తారు? వశిష్టాది పూజ్యులు ఎందుకు వస
సైన్యము పౌరులు అంటావా వారంతా మనలను చూడటాని
తత్పరులై వస్తూయుంటారు. సోదరులు మన ఆశీస్సుల
డానికి ఇలా రావచ్చుగదా! మాతృపాదాభివందనం చేసి ఎ

అయిందోమనకి. అదిగో అటుచూడు. ఇటేవారు సమీపిస్తున్నట్లుంది అని రామచంద్రుడు పలికేడు. లక్ష్మణుని ముఖంలో (తాను పొరబడితినేమోయని) కొంతసిగ్గు చోటు చేసుకుంది. కవచ, ఖడ్గాలుదించి అవనతముఖుడై రాముని సన్నిధిని నిలిచేడు.

గురువర్యా! అదే భరద్వాజ మహర్షిచే తెలుపబడిన చిత్రకూటపర్వతం. అవే మహర్షుల ఆశ్రమాలు. తమరు మా తల్లులను పరివారమును తోడ్కొని నెమ్మదిగా రండి. ముందుగా నేను, తమ్ముడు అన్నగారుండు ప్రావును కనుగొని వారిని దర్శించుదుము అని వశిష్ఠునితో చెప్పి భరత శత్రుఘ్నులు వడివడిగా ముందుకు సాగుచున్నారు. ఎటుచూచిన గచ్చపొదలు, ఎటుచూసిన కోరెండపు తుప్పలు. బలుసు వాక ముళ్ళగు ముండ్ల డొంకలు కలిగి పొదల నుండి అటునిటు సంచరించే సరిసృపాలు, చెట్టుకొమ్మలకు చుట్టుకున్న కొండచిలువలు, రాళ్ళగుట్టలు, మిట్టపల్లాలక, అబ్బా ఎంత క్లిష్టంగా ఉంది. ఈ ప్రదేశం ఎక్కడికక్కడే మొగలి డొంకలు, వెదురు గుబుర్లు, రావి, జువ్వి, మఱ్ఱి మొదలగు మహావృక్షాలు ఊడలుదిగి పాశుపతవ్రతులవలె భీతులు కొలుపుతున్నాయి.

తమ్ముడూ! ఈ అడవి మార్గంలో అన్నయ్య, వదిన. తమ్ముడు ఎంత కష్టం పడుతున్నారొ తలచుకుంటే దుఃఖం ముంచు కొస్తుంది.

వారికి ఎంతటి దుర్గతి పట్టింది. దుర్భరమైన ఈ అరణ్య వాసానికి నేను, మా అమ్మె కారకులము. 'అసూర్యం పశ్య' కుసుమ కోమలి అగు ఒదినగారు ఈ కంటకాకీర్ణమైన అడవిలో మెట్టతామర్ల కంటె మృదులమైన పాదాలతో ఎట్లు నడిచివుంటారో? ఆమె అరుణ పాదాలు రక్తసిక్తమై ఉంటాయి. లక్ష్మణుడు సీతారాముల సేవచేస్తూ జీవితాన్ని ధన్యం చేసుకున్నాడు. నావంటి నిర్భాగ్యుడు లోకనిందకు

పాత్రుడై, మహాపరాధినై, నీచ నిర్భాగ్య జీవితాన్ని గడుపుచున్నాను. అని భరతుడు తమ్మునితో చెప్పుచూ వడివడిగా పర్వతారోహణ చేయుచున్నాడు. అదిగో ఆ కొండకొమ్మున కపోతసదృశ ధూమము వ్యాపించి చిన్న చిన్న మేఘశకలాలులా కనబడుతున్నాయి. అక్కడే చిన్న పర్ణశాల కనబడుతున్నది. వచ్చేసాం. అక్కడే మన ఆర్యులు నివసించి యుంటారు. అని శత్రుఘ్నుడు సూచించేడు.

ఆ అవును అదే ఆ మహనీయుని ఆశ్రమం. బాష్పవారి ధారలచే తేరిచూడలేకుండా ఉన్నాను. నడువు. వడిగా. నాకు శాస్తి చేయూతనివ్వు. అన్నాడు భరతుడు.

శత్రుఘ్నుని స్థితికూడా ఇలాగనే ఉంది. తొందరగానే నడుస్తూయున్నాడు. కాళ్లకు రాళ్లు తగులుతునే యున్నాయి. నేల పడినంత పని జరుగుచున్నది. నిలద్రొక్కుకుంటూ ముందుకు సాగిపోతున్నారు. అదిగో పర్ణశాల. అదిగో అన్నయ్య ఆ ప్రక్కనే వదినగారు కూర్చుని యున్నారు. ఆ ప్రక్క లక్ష్మణుడు వారంతా మనలనే చూచుచున్నారు. ఆ మహానుభావులకు ఎంతగతి పట్టినది.

అన్నయ్య అన్నయ్యా!— నోటమాటరావడం లేదు. కంటి నుండి ధారాపాతముగా ఇరువురకు నీరు స్రవిస్తూయుంది. రాముడు చేతులుచాచి ముందుకు మూడడుగులువచ్చాడు. భరతశత్రుఘ్నులు వారి పాదాలపై పడిపోయినారు.

శ్రీరామచంద్రుడు సోదర్లను లేవనెత్తి ఆలింగనం చేసుకున్నాడు. తనదగ్గరకు చేర్చుకుని కూర్చుండ బెట్టుకున్నాడు. సీతాలక్ష్మణులు ఇరువైపులా అశ్రుపూర్ణముఖులై నిలచేరు. భరతశత్రుఘ్నులకు కొంతసేపటికి సాంత్వన కలిగింది. రాముడు సోదరులమీద చేయివేసి తమ్ముడూ! పూజ్యులైన మన తలిదండ్రులకు క్షేమమేనా?

వారి ఆజ్ఞల పాటించి వనవాసం ముగించుకొని వారి ఆశీస్సులు పొందుట బిడ్డలకు సకల శ్రేయస్సులు కలుగుతాయి. పిల్లల వల్ల జన్మనిచ్చిన తలిదండ్రులు ఎంతగా సంతోషిస్తారో? మనకు అంతటి క్షేమం కలుగుతుంది.

విద్యాబుద్ధులు గఱపి, ప్రజ్ఞాప్రాభవాలు అలవరచి ఐహికాముష్మికాలకు మార్గదర్శకములైన వసిష్ఠాది గురువులు సర్వదా మనకు వంద్యులు. ఆ మహాపురుషులను సర్వదా గౌరవిస్తున్నావా? దేవతలు, పితరులు, ఋషులు, భృత్యులు, గురువులు తండ్రితో సమానులైన వృద్ధులు వైద్యులు, బ్రాహ్మణులను మిక్కిలి గౌరవిస్తున్నావా? అర్థశాస్త్రవిశారదుడు, సకల శాస్త్రకోవిదుడు అగు సుధర్మని పూజిస్తున్నావు కదూ? రాజ్యశాస్త్ర వేత్తలు, కులీనులు శూరులు, ఇంకితజ్ఞులు, వృద్ధికారలగు జ్ఞానులచే మంత్రాలోచన జరుపుచున్నావా? అల్పారంభమై, అనంతఫలదమైన కార్యాలు వేగంగా నిర్వహిస్తున్నావు కదూ? ఉత్తముల, ఉత్తమ కార్యములందును, మధ్యముల మధ్యకార్యములందును, అధముల అధమకార్యములందును నియోగించతగియున్నది. వారలకు సకాలములో జీవనభృతులు కలుగజేస్తూ ఉండాలి. జీనిరొందల పాలకులకు ద్రోహముతలపెడతారు వారి వారి కష్టసుఖాలను కని పెడుతూ ఉండాలి. లక్షలాది మూర్ఖులకన్నా, పండితుడొకడు దేశక్షేమానికి ముఖ్యుడు. మందకాదు కావల్సినది మనస్సు. మనస్సు ఉన్న ఒక మనిషి చాలు. అట్టివాడే గౌరవార్హుడు ఆదాయము అధికముగను, వ్యయము అల్పముగను ఉండవలెను. ధనాగారము, ధాన్యాగారము, ఆయుధాగారము, యంత్రాగారములు అప్రమత్తతకలిగిన స్వార్థరహితులైన అధికారులచేత రక్షింపబడుతున్నాయా? దుర్గ రక్షణము, సైన్యరక్షణము, విద్యారక్షణము, అత్యంత ఆవశ్యకములు. వాపీకూపతటాకాదులు, ఆలయములు, చైత్యములు పరిరక్షణీయములు.

జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులు, తేజోవృద్ధులు అగువారిని మిక్కిలి రక్షించవతగినది. ప్రభువు ఎల్లకార్యములను చార చక్షువులతోను, స్వచక్షువులతోను గమనించి ప్రజాహిత కార్యములను నిర్వహించవలెను.

---

సూచిక: పాఠకులారా! రామరాజ్య విశేషములను, విధానములను పూర్ణముగా తెలియదలచినప్పుడు వాల్మీకివిరచిత శ్రీమద్రామాయణము (సంస్కృతము) అయోధ్యాకాండ నూఱవసర్గకు గోవిందరాజు విరచిత 'రత్నకిరీటవ్యాఖ్య'ను చదువ వలసినదిగా మనవి చేయుచున్నాను. గ్రంథ విస్తరభీతిచే అధికముగా వ్రాయుటలేదు.

---

ఈ విధముగా రాజ్యపాలనా విధి విధానముల శ్రీరామచంద్రుడు బోధించగా భరతుడు మిక్కిలి దుఃఖాక్రాంతుడై అన్నయ్యా! నేను రాజును కాను. నాకెందుకీ రాచకీయాన్ని బోధిస్తావు? నాకు శక్తి లేదు. అర్హతయులేదు. నేను ఎన్నడూ రాజును కాదలచుకోలేదు. అన్నయ్యా! నీవే ఈ సమస్త ప్రపంచానికి ప్రభువువి. నిన్ను తలచుకొని నీపేరు మాటి మాటికి పలుకుతూ నీయందేధ్యాసకలిగి తండ్రిగారు స్వర్గమున అలంకరించారు. నీవు అడవికి బయల్దేరి వచ్చిన ఆఱవ దినమున అర్ధరాత్రి స్వర్గస్థులైనారు. నా చేయదగు కార్యములు చేశాను, నీవు వెంటనే పితృకార్యము నిర్వర్తించు. నీవల్లే అతనికి ఆత్మశాంతి కలుగుతుంది. అని భరతుడు దుఃఖముతో పలికేడు.

ఆ మాటలువిన్న సీతా రామలక్ష్మణులు తీవ్రమైన దుఃఖానికిగురైనారు. సమీపస్థులగు ఋషులు విషయము గ్రహించి విచారించారు. రాముడు సీతను ప్రోత్సహించి మందాకినీ నదియందు స్నానమాచరించి తిల, కుశ, పుష్ప సహితంబుగా తర్పణం చేశాడు.

గారపిండి, రేగుపళ్లరసంతో పితరులకు పిండ ప్రదానంగావించి పూజించేరు. దుర్భర విచారగ్రస్తులై నలువురు సోదర్లు, సీతయు ఆశ్రమానికివచ్చి, తండ్రిగారి గుణగణాలు ప్రశంపిస్తూ అధివసించారు.

అన్నయ్యా! నీ వనవాసం గూర్చి నాకు తెలియదు. నాకు రాజ్యకాంక్ష ఎన్నటికీలేదు. స్వప్నమందైనా తలచలేదు. నేను నీ భక్తుడను. నీ సేవకుడను. మాతల్లి కైకేయి ప్రోద్బలంతో అంతా జరిగిపోయింది. ఆఖరికి భర్తనుకూడా ఆమె పొగొట్టుకుంది. దీనికంతటికీ కారణంగా నేను చిత్రింపబడ్డాను. నాకేమియు తెలియదు అని ఎంత మొరపెట్టుకున్నను ఎవ్వరు విశ్వసింపలేదు. నాపెద్ద తల్లిగారు కౌశల్యాదేవివద్ద ఎన్నెన్నో ప్రమాణాలు చేశాను. గుహుడు నమ్మలేదు. ఇదంతా నా పాపం అన్నయ్యా! చివరకు మహాత్ముడైన భరద్వాజుడుకూడా శంకించేరు. నేనెంత మహాపాపాత్ముడనన్నయ్యా! నీవైనా నా నిజాయితీ ఎఱిగి నీ రాజ్యచ్యుతికి నేను కారకుడను కాను. అనితలిస్తే ధన్యుడనౌతాను. నీవే రాజువు మేము నీ భృత్యులము. మమ్ము రక్షించు అన్నయ్యా! ఈ విధంగా భరతుడు విలపిస్తూ పలికేడు.

వసిష్టుని ముందిడుకొని కౌసల్యా, కైకేయి, సుమిత్రాది తల్లులు సుమంత్రాది మంత్రులు వామదేవతాది ఋషులు, సేనాధిపతులు, సైనికులు, ఉద్యోగులు, రధగజ, అశ్వదళములు, పౌరులు ఆశ్రమానికి చేరుకున్నారు. సీతా రామలక్ష్మణులు మాతృపాదాభివందనం చేశారు. మాతాపుత్రుల దుఃఖవర్ణనకు అలవికానిదైంది. ఏడుసముద్రాలు పొంగి పొరలినట్లైంది. వసిష్టాదుల సాంత్వవచనములతో కొంత ఉపశమనం కలిగింది. అందరూ రాముని పరివేష్టించి కూర్చున్నారు. దేవఋషులు, గరుడ గంధర్వ కిన్నెరకింపురుషాదులు అదృశ్యులై భరతాదుల సంభాషణ శ్రద్ధగా కూలంకషంగాను, అర్ధ్ర

హృదయాలతోనూ ఆలకిస్తున్నారు.

భరతుడు : అన్నయ్యా! మాతల్లి తండ్రిగారొసగిన వరం ప్రకారం రాజ్యాన్ని నాకు ఒప్పజెప్పింది. నేను నీకు సభక్తికముగా సమర్పిస్తున్నాను. స్వీకరించి మమ్ములను పాలించు అసమర్థుడను, సమర్థమగు అశ్వము వహించు తగు భారము గాడిద ఎట్లు సహిస్తుంది? ఫల వృక్షాన్ని కూకటివేరుతో పెకలించి, వేరునుండి చివర వరకూ చేదుగా ఉండే వేపచెట్టు దానిస్థానములో నాటుటకు అర్హముకాదు. నాకు ఏ ప్రమేయము లేకపోయిననూ నాతల్లి నాకుగ ప్రయత్నం చేసినది. ఎంతటికైనా సిద్ధార్థురాలు. ఆర్యధర్మాన్ని అనుసరించి అనద్య అయినది. క్షమించు వర్షకాలమేఘాన్ని చేతకములు లాగా, చంద్రకిరణాలను వెన్నెల పురుగులులాగ నీ పరిపాలన కోసం మేమంతా ఎదురుచూస్తున్నాం.

రాముడు : అహోరాత్రాలు, జననమరణాలు, సుఖదుఃఖాలు ప్రతీ ప్రాణికి యాతాయాతములై ఉంటాయి. వీటిని ఎవరూ తప్పించలేరు. కానీ మనుష్యుడు సుఖాభిలాష కలిగి ప్రవర్తిస్తాడు. మనతండ్రి సకలసుఖాలు అనుభవించాడు. యజ్ఞయాగాలు చేశాడు. దానధర్మాలు నిర్వహించేడు. సత్యధర్మాలను పాటించేడు. అతడు నాకు అరణ్యగమనాన్ని, నీకు రాజ్యస్థితిని ఆదేశించాడు. కనుక నాకు విధించిన నియమాన్ని అతిక్రమించే శక్తి లేదు. నీవు అతని ఆజ్ఞ మీరరాదు. సత్యము, ధర్మము నిత్యములైననూ ఆ సత్యాన్ని కాపాడి తండ్రి ఆజ్ఞను అనుసరించుట మన కర్తవ్యము.

జాబాలి : రామా! ఎవరికి ఎవరు? తండ్రి ఎవరికి? ఎవరు తండ్రి ఎవరికి? ఎవరు సోదరులు. అంతా ఏటి ప్రవాహంలోని కట్టెలు, ఒకచోట చేరుచూ విడిపోతూ ఉంటాయి. అదే ఈలోకం. శుక్ల శోణిత సంయోగంచేత ప్రాణి ఉద్భవిస్తుంది. కాలంతీరగానే నశిస్తుంది. ఉన్న కొద్దిరోజులు సుఖపడడం అదే ధర్మం కనుక రాజ్యాన్ని చేపట్టి సుఖపడు.

రాముడు : ఆర్యా! పాపపుణ్యాలు, ధర్మాధర్మాలు, సత్యాసత్యాలు ఇవన్నీ నిత్యాలు. ఆర్య ధర్మాన్ని అనుసరించే ప్రవృత్తి నాది. సనాతనమైన సత్యనిష్టను అతిక్రమించలేను. ' అస్తి బ్రహ్మేతి చేద్వేదా! సంతమేనం తతోవిదురితి ' ఇత్యాది శృతివాక్య పరినిష్టుడను నాస్తికుడను కాలేను. రాముని కన్నులు కెందామరలు అయినాయి.

వశిష్టుడు ; రామా! శాంతించు. జాబాలి నాస్తికుడుకాడు, అతడు అస్తికుడే. ప్రపంచ గతానాగతాలు ఎరుగనివాడుకాడు వేదవేదాంగములు. అతనికి కరతలా మలకములు, నీ కష్టపాటును గమనించి ప్రజల కోరికలకు అనుకూలంగా నిన్ను అయోధ్యకు మళ్లించాలని అలా అన్నాడు,

నేను నీకు విద్యావిజ్ఞాన ప్రాభవమును కలుగజేసిన గురువును. నామాట శాస్త్రమన్నించు. సృష్టికిముందు ప్రపంచమంతా జలార్ణవమైయుండెను. దానినుండి వరాహావతారుడై నారాయణుడు భూమిని ఉద్ధరించెను. అతనినుండే బ్రహ్మ, మరీచి, కశ్యపుడు, వివస్వంతుడు మనువు, ఇక్ష్వాకులు ఆవిర్భవించారు. ఇక్ష్వాకులే తొలుత అయోధ్యను రాజధానిగా పాలించేడు. తదారభ్య మీ వంశీయులలో జ్యేష్టుడు రాజ్యాన్ని పాలిస్తూవచ్చేరు. అట్లానే దశరధునకు నీవు పెద్దకుమారుడవు కనుక రాజ్యాన్ని ప్రతిగ్రహించి పాలించు,

రాముడు ; ఆర్యా! తల్లిదండ్రులు జన్మకారకులు. పిమ్మట ఆచార్యులు, విద్యా విజ్ఞానదాయకులు. అట్టిస్థితితో తల్లి దండ్రుల ఆజ్ఞపాటించుట నా కర్తవ్యము. ఇందుకు నేను వ్యతిరేకుడను కాను,

భరతుడు : అన్నయ్యా! నీవు అయోధ్యకు రాకుంటే నేనిక్కడే ప్రాయోపవేశం చేస్తాను. అని దర్భలు నేలపరచుకొని మరణ నిశ్చయముతో మౌనియై నేల పరుండెను.

రాముడు ; భరతా! ఏమిటిది? ఇలా నీవు ఆచరించకూడదు. వేగంగా లే నన్ను స్పృశించు. ఆచమించు చాలా దోషము ఆచరిస్తున్నావు. నాకువలే నీకుకూడా తండ్రిమాటలు ఆచరించడం కర్తవ్యంకాదా!

భరతుడు : పౌరులారా! మంత్రులారా! మహర్షులారా! మీరైనా చెప్పండి. మా అన్నకు అయోధ్యకువచ్చి పాలించమని చెప్పండి, మీకు చేతులెత్తి నమస్కరిస్తాను.

పౌరులు : పూజ్యులైన మీ అన్నగారి మాటలలో సత్యం గోచరిస్తున్నది.

భరతుడు ; అన్నయ్యా! ఈ మందభాగ్యునకు ఇకగత్యంతరంలేదు ఈ రత్నపాదుకలను ఒకసారి అధిష్టించండి. వాటినినాకు కటాక్షించండి. ఇవే ఇకమీద రాజ్యపాలన చేస్తాయి.

రాముడు ; విచారించకు తమ్ముడు అరణ్యవాసం పద్నాలుగు సంవత్సరాలు ముగించిన తర్వాత నీకోరిక తీరుస్తాను. అని రామచంద్రుడు తన రత్నపాదుకలను ధరించి భరతునకు ఒసెగెను. భరతుడు భక్తిపరుడై ఆ పాదుకలను శిరసాధరించి శతృఘ్నసహితుడై సీతా రామ లక్ష్మణులకు ప్రదక్షణం గావించిభాడు. తల్లులు కన్నీరు మున్నీరు అయి దుఃఖించ సాగేరు. రాముడు వారిని సాంత్వనపరచి అభివందనచేసి వీడ్కొలిపినాడు.

భరతుడు ఆ పాదుకలను వేదికపైనుంచి కొంతదూరం నడచి తరువాత రథంపై నిలిచి వాటికి తమ్ముడు, తాను ఛత్రచామరములు ధరించేరు. పరివారంతో చిత్రకూటం నుండి అయోధ్యాభిముఖులైనారు.

అయోధ్య ఆసరికే నిస్తేజమైనది. నిరానందమైనది. ఆ అయోధ్యలో అడుగుపెట్ట బుద్ధి పుట్టలేదు. భరతునికి అన్నలేని అయోధ్య అడవికంటే హీనంగా కనిపించింది. వసిష్ఠాది పురోహితులతోను, మంత్రులతోను వారితో ఆలోచించి వారి అనుమతితో తల్లులను పరివారమును రాజభవనంలో ఉండ నియమించేరు. పౌరులు పూర్వంవలే పట్టణంలో ఉంటున్నారు. తాను శత్రుఘ్నసహితుడై నగరికి వెలుపలగల నందిగ్రామమనే పల్లెలో పర్ణశాల నిర్మించి అందులో ఆ పాదుకలను తగిన స్థానములో నిలిపేరు అన్నదమ్ములు రామలక్ష్మణులవలే జటావల్కలములను ధరించి ఆ పాదుకలకు అభిషేకం చేశారు. ఛత్రమును ధరించి చామరాలు వీచేరు. రాజవ్యవహారములు ఆపాదుకలకు విన్నపంచేస్తూ రామాగమనాన్ని నిరీక్షిస్తున్నాడు.

కాలచక్రం గిర్రున తిరుగుతునే ఉంది. సూర్యోదయ సూర్యాస్తమయాలు గడుస్తునే యున్నవి. ఆ రోజు చిత్రకూటంలో ఋషులంతా వల్కలాజినాలు, దండకమండలాలు, స్రుక్స్రువాలు, అరణులు, చమసులు సర్దుకుంటున్నారు. ఎటో ప్రయాణం సాగించేటట్టు కనబడుతున్నారు. ఒకరితోనొకరు ఏవేవో చెప్పుకుంటున్నారు. వారి ప్రవృత్తికి రామునకు ఏదో అనుమానం తోచింది.

మహర్షులారా! మీరెటు ప్రయాణ సన్నాహం చేస్తున్నారు నలే ఉన్నారు. మావల్ల మీకేమైనా అపచారం కలిగిందా? సీత తప్పు చేసినదా? లక్ష్మణుడు తొందరపడ్డాడా? మేము తెలియక ఏమైనా

పొరపాటు చేసి ఉంటే మమ్ములను క్షమించండి. అని రాముడు ఋషులతో పలికేడు.

రామచంద్రా! మీరెవరివలననూ ఎట్టి దోషంలేదు. త్రేతాగ్నుల వంటి మీకుదోషం ఎట్లుండును. ఖముడను రాక్షసుడు తన పరివారంతో ఇక్కడ ఋషులను మిక్కిలి బాధపెడుతున్నాడు. యజ్ఞయాగాదులు ధ్వంసం చేస్తున్నాడు. ఋషులను పశువులవలే హింసించి అపగత ప్రాణుల చేస్తున్నాడు. ఇట్టి విపరీతమైన భయం. మీకుకూడా కలుగ జేస్తాడేమో అని భయపడుతున్నాం. మీకిష్టమైతే మాతోపాటు దండకా రణ్యానికి వచ్చేయండి. అని దూరదర్శనలు సూక్ష్మదర్శినులు అగు ఋషులు పలికిరి.

రాముడు అట్లానే అని సీతా లక్ష్మణసమేతుడై దండకార ణ్యానకు బయల్దేరేడు. కొన్ని వనాలు, పల్లెలు, పర్వతాలు అతి క్రమించారు. నదీనదాలు దాటేరు. అదియొక ఆశ్రమం. అక్కడ అత్రిమహర్షి భార్యయగు అనసూయతో నివసించి తపస్సు చేసు కుంటున్నాడు. సీతా రామలక్ష్మణులు ఆశ్రమంచేరి అత్రిమహర్షికి నమస్కారం చేశారు.

మహర్షి వాత్సల్యంతో సాదరంగా గౌరవించి ఆతిధ్యమిచ్చేడు

ఆమె ఎవరు? ఆమె శిరోజాలు—శరన్మేఘాలు, తలభావార్ద్ర రతనాలపేటిక, కన్నులమిన్నును సూచించునట్లు ఉన్నాయి. ఒక ప్పుడు వెన్నెలలు కూడా వర్షిస్తాయి. వేరొకప్పుడు మిన్ను మన్ను ఏకంచేస్తాయి ఆమెముఖంలో ముడుతులుచూస్తే ఎన్నెన్నో అనుభవాలు రేఖలుగా కనిపిస్తాయి. ఆమె ఒళ్లు బాగుగావంచిన బంగారువిల్లు మనసు మాత్రం హిమాచలం. హృదయం దయాసాగరం. ఈమె వయస్సు ఎంత? పదివేల సంవత్సరాలు, అనావృష్టిచేత పీడితులైన

ప్రజానీకాన్ని హిమానీ నదీనదతీరాల జలాలతోనూ, తీరారణ్య వృక్ష లతాదులతోను అన్నవస్త్రాదులు కల్పించి ఆకలిదప్పులు తీర్చి ఆదరించి రక్షించింది. ఆమె వయస్సు ఎంత? పండ్రెండువేల సంవత్సరాలు అహోరాత్రులు తపస్సుచేసి పదిరాత్రులు ఒకేరాత్రిగా పరిభవింపజేసింది. మరి ఆమేపేరో? అనసూయ. ఆమెకు అసూయ ఎక్కడుంటుంది? ఆమె అత్రిమహర్షిభార్య. పతివ్రత. ఆమెనుదర్శిస్తే ఆమెను స్పర్శిస్తే, ఆమె అనుగ్రహిస్తే సకల కలుషాలు తొలిగి ఐశ్వర్యాలు సంభవిస్తాయి.

మహర్షి ప్రోత్సాహంచేత రాముని ఆదేశంచేత తన భక్తి భావావేశంచేత సీత అనసూయను దర్శించింది. నమస్కరించింది. అనసూయ మిక్కిలి స్నేహంతో ఆదరించింది.

అమ్మా! నిన్నుచూస్తే నాకు చాలా సంతోషంగా ఉంది. రాజ్యాన్ని, సర్వస్వాన్ని త్యజించి అడవులపట్టిన రామునితో నీవు కూడా ఆతనిని అనుసరించి వచ్చేవు. నీవు సచ్చరితవు తల్లీ. సతికి పతికి మించిన దైవము వేరేలేదు. ఆతడే స్త్రీకి సకలవిధాల సుఖాలు కలుగజేస్తాడు. యిహపరాలకు మార్గదర్శకుడౌతాడు. తల్లి, తండ్రి సోదరులు, కొడుకులు, బంధువులు కొంతవరకే సహకరిస్తారు. యావజ్జీవము భర్త సహకరించి పరాన్ని కలిగిస్తారు. పతితుడైన వికలుడైన అగతికుడైన, నిందితుడైన ఇందునా అందునా ఎందుకు పొందకుండా ఉన్న భర్తను కూడా గౌరవించతగును. అమ్మా! సీతమ్మా నీ చరితలోకహిత తల్లీ. ఈ వస్త్రములు, ఈ అంగరాగములు, ఈ పువ్వులు, ఈ అలంకారములు ధరించమ్మా. యివి పవిత్రములైనవి. దివ్యములైనవి. ఆకర్షణీయములైనవి. ఇవి ధరించి నందువల్ల నీ భర్తకు మరింత ప్రియమైనదానవు కాగలవు. అని అనసూయ సీతమ్మను సత్కరించింది.

వాటిని ధరించి అనసూయ పాదములకు నమస్కరించింది ... నేత్రములు మిలమిల మెరసి పోతున్నాయి. అమ్మా! తమ ఉప... లను శిరసా వహిస్తాను. నేను నా స్వామికి అనువ్రతను. అతడు ... బాహ్యాభ్యంతరముల కనబడుతూ ఉంటాడు. అతని ... నా జీవితానికే ఒకవికాశం అని మైథిలి పలికింది.

సీతమ్మ తల్లీ! నీ కళ్యాణచరిత్ర నీనోటనే వినాలని ఉంది! ... చెప్పి నాకు ఆనందాన్ని కలిగించమ్మా! అని అనసూయ ...

అమ్మా! నాతల్లిగారు మిథిలా నగరాధీశులవారు. యజ్ఞం ... తో నేను దున్నుతుండగా నాగలి చాలులో నేను దొరి... అతనికి సంతానంలేని కారణంచేత మిగుల వాత్సల్య ... పెంచేరట. నా తల్లిదండ్రులు నాకు సీత అను పేరు ... అల్లారుముద్దుగా చూసుకున్నారు. వివాహయోగ్యత నాకు. ... ఆడపిల్లగల వారికి సహజంగా ఆలోచనలు కలుగుతాయి ... ఎవరికిచ్చి వివాహం చేయాలా అని.

అయోనిజయగు నన్ను ఆసరికే నాచే పూజింపబడుచున్న ... ధనుస్సును ఎవరు ఎక్కుపెడతారో వారికి ఇచ్చి వివాహం జరిపిస్తా ... తండ్రి అన్నిదేశాల చాటించారు. దేవదానవులే దానిని ... లేకపోయారు. వీర్యశుల్కనైన నాకు వివాహ మెట్లుజరుగునా ... తండ్రి విచారిస్తుండగా అదేసమయములో ఆర్యపుత్రులను ... విశ్వామిత్రులవారు విచ్చేసేరు. నా తండ్రిని వారు ధనువు ... దానిని వారిముందు ఉంచేరు. ఆధనస్సును అప్పుడు ఆర్యపుత్రులు అవలీలగా ఎత్తి నడిమికి రెండుగా భగ్నం చేశారు. ... తో ఆనందించి మా తండ్రిగారు మహావైభవంగా పెండ్లి చేశారు.

అది మొదలు నీడలాగ ఆర్యపుత్రులను క్షణమైనా వీడక సేవిస్తున్నాను. అని జనకజ తన వివాహవృత్తాంతము అనసూయకు తెలియజేసింది. అప్పుడు అనసూయ ఆర్యపుత్రులు అంటేఎవరమ్మా! అని ప్రశ్నించింది.

మీకు తెలియనిదేమిటి? దశరథావనీశుని కుమారులు. కౌసల్యా దేవి తనయులు అని అన్నది సీత సిగ్గుతో.

అయితే ఆతనికి పేరేమి లేదటమ్మా అని అనసూయ పలికింది. సీతాదేవి సిగ్గుపడ్డది. బుగ్గలో గులాబిమొగ్గలు అరవిచ్చుకున్నాయి.

శ్రీరాముడేనా సరేసరి మగనిపేరు చెప్పడానికే ఇంతసిగ్గు పడుచుకెందు కమ్మా! చాలా సంతోషం. సీతమ్మనోట కళ్యాణరాముని చరిత విన్నాను. చాలా ఆనందంగా ఉంది. నేను చరితార్థురాలైనా నయ్యానమ్మా! అని అనసూయ పలికి సీతను ఆశీర్వదించింది.

ఆరాత్రి సీతారామలక్ష్మణులు అనసూయా అత్రిమహర్షులగు అతిథులైయ్యారు.

॥ ఇది ద్వితీయ పుష్పం సమాప్తం ॥

# తృతీయ పుష్పం

పుష్పాలు, పర్ణపుష్పాలు చెట్లమీదనుండి నేలకు రాలుతున్నాయి. పక్షులు అవ్యక్త మధురంగా కిలకిల ధ్వనులు చేస్తున్నాయి. చిలుకలు పండ్లను కొరికి శకలములతో కూడా పండ్లను రాల్చేస్తున్నాయి. చెట్ల నడుమనుండి సన్నటి కాలిబాట, దానికిరువైపులా తేళ్లు, కుందేళ్లు

సంచరిస్తున్నాయి. ఉడుతలు ఏదో ఆహారాన్ని గ్రహించి చెట్టు కొమ్మలకు ఎగబ్రాకుతున్నాయి. ఆవనం అక్కడక్కడ నీటి పట్టులు కలిగి జలపక్షులచేత, తామరలు, కలునలచేత, ఆకర్షితములై ఉన్నాయి ఆయా ప్రాంతాలలో ఋషులు ఆశ్రమాలు నిర్మించుకొని దైవధ్యానం చేస్తూ యున్నారు.

కాలిబాటననుసరించి ముందుగా రాముడు, తరువాత జానకి ఆ పిమ్మట లక్ష్మణుడు నడుస్తున్నారు. పురుషుడు, ప్రకృతి, జీవుడు అను తత్వత్రయంలాగ, జ్ఞాన, భక్తి, వైరాగ్యాలలాగ, పురుషుడు మాయ, జీవిలాగ, సూర్యసోమాగ్నుల్లాగ ప్రకాశిస్తున్నారు. ఎలా గున్నా ఏమనుకున్నా చూడముచ్చటగా ఉన్నారు.

వృక్షషండాలు, శిలాఖండాలు, కంటకాకీర్ణాలు, లతాగహనాలు కూడా ఎదురవుతున్నాయి. చిడితలు, వరాహాలు, మహిషాలు, పులులు సింహాలు, అక్కడక్కడ తారసిల్లుచున్నాయి. గజములు, గవాయ ములు, ఖడ్గమృగములు కూడా కనబడుచున్నవి. శరవేగంగా ప్రవ హించే సెలఏళ్లలో మొసళ్లు తేలి ఎదురీదుతున్నాయి. కంక, గుడ్ర, గోమాయువులు అంతటా గోచరిస్తున్నాయి.

సుఖదుఃఖాలతో కూడుకొన్న నంసారాన్ని అరణ్యాలతో పోలుస్తారు పెద్దలు. అనుకొంటూ ముందుకు సాగిపోతున్నారు సీతా, రామలక్ష్మణులు. కంటికి రెప్పలాగ రామలక్ష్మణులు ఖడ్గపానులై సీతాదేవిని కాపాడుతూ ముందుకు నడుస్తున్నారు.

ఓ విధమైన భయంకరమైన ఒకఅరపు వినిపించి ఆ ముగ్గురూ అటునిలచిపోయారు. దక్షిణ దిశనుండి వెలువడింది ఒక నడయాడే పర్వతం. అది పర్వతమా అంటేకాదు. పోనిఏదో జంతువా అంటే నాలుగుకాళ్లు లేవు. ఇది ఏదో భూతం. ఎర్రటికళ్లు, తెల్లటిపల్లు, నల్లటి

ఒల్లు, అది రక్తమాంస వసాదిగ్ధమైయుంది. చేతిలో శూలానికి మూడు పులులు, రెండు ఏనుగులు, నాలుగు వృకములు, గుచ్చబడి చావక బ్రతుకకా అరస్తున్నాయి. వ్యాఘ్రాదినధారి యగు ఆ రాక్షసుడు ఎవరు మీరు, ఈ పడుచు మీవెంట ఎందుకూ? ఇక్కడ ఉండనీ నేను మిమ్ములను తింటాను. అన్నాడు దిక్కులు అదురసట్లుగా. ఇంతకు నువ్వు ఎవరవు అన్నాడు లక్ష్మణుడు. నన్ను రక్కస విరాధుడు అంటారు. ఈవనం నా సంచారభూమి. శతహ్రద విజయులకు కుమారుడను. బ్రహ్మ వరంచేత శస్త్రాలు నాపై పనిచేయువు రంభ విషయంలో కుభేరునిచే శపించబడి ఈ దారికి వచ్చిన మిమ్ములను కబళిస్తాను. అని పలుకుచూ రామలక్ష్మణులను భుజాల పైకి ఎక్కించుకొని పరుగులంకించుకొన్నాడు. విరాధుని వెంట సీత దుఃఖిస్తూ పరుగెత్తసాగింది.

లక్ష్మణా కైకకోరిక తీరింది. మన లక్ష్యం నెరవేరే సమయం ఆసన్నమైనది. వీడి భుజాలు ఖడ్గాలతో ఖండిద్దామని అన్నాడు రాముడు. రామలక్ష్మణులు అసురుని రెండు చేతులు తెగవేశారు. వాడిగల బాణాలు ప్రయోగించారు. విరాధుడు చావలేదు. గొయ్యి తీసి కప్పేద్దాం అన్నాడు రాముడు లక్ష్మణునితో. అలాగే చేయండి. పుణ్యవతిఅగు సీతా, రామలక్ష్మణులని గ్రహించాను. నాకు శాపం తొలగిపోయింది. ఈ ముందునకు శరభంగుని ఆశ్రమం ఉంది. మీకు మేలు కలుగుతుంది. అక్కడికి వెళ్ళండి అన్నాడు విరాధుడు ప్రాణాలు వదులుతూ, దివ్యలోకానికి చేరుకొన్నాడు.

లక్ష్మణా జానకిని భద్రంగా కనిపెట్టుచుండు. మనం రాక్షసావాసం చేరుకొన్నాం. అదిగో ఆశ్రమం నుండి కపోత సదృశమైన హోమధూమాను రంజితమై ప్రకాశిస్తున్నది. తరుశాఖల నారచీరలు వ్రేలాడుతున్నాయి. పరస్పర వైరంకల జంతుపులు అన్యోన్యంగా ఆనందంగా ఇక్కడ సంచరిస్తున్నాయి.

అటు చూడండి. అది దేవేంద్రుని రథంలా ఉంది. పచ్చని గుఱ్ఱాలు, నేల అడుగుమోపని త్రిదశుడు. అతడు ఇంద్రుడేనేమో ముందుగా నేనువెళ్ళి తెలుసుకుంటాను. మీరు నావెంట రండి అని సీతా లక్ష్మణులతో పలికి ఆశ్రమం ప్రవేశించాడు రాముడు. అదిగో రాముడు వస్తున్నాడు. ఇప్పట్లో నేను నీతో మాట్లాడకూడదు. దేవతలు కార్యం నెరవేరేక మాట్లాడాలి. అని శరభంగునితోచెప్పి రథంఎక్కి పరివారంతో వెళ్ళిపోయాడు ఇంద్రుడు.

సీతా రామలక్ష్మణులు ఆశ్రమంలో ప్రవేశిస్తుండగా శరభంగ మహర్షి ఎదురువచ్చి స్వాగతమిచ్చి ఆసనమొసగి అర్ఘ్యపాద్యాలుచే పూజించాడు. దేవేంద్రుడు వచ్చాడు అన్నాడు శరభంగుడు.

ఔను చూశాను. ఏమంటాడు అతను అని రాముడు అడిగాడు రామా! అర్హమైన మీసేవ చేయకుండా బ్రహ్మదిలోకాలకు రానని అతనితో చెప్పేశాను. తపఃసమార్జితమైన పుణ్యలోకాలు సర్వం నీకే అర్పిస్తున్నాను. అన్నాడు శరభంగుడు.

ఆలోకాలన్నీ మాచేత పొందబడే ఉన్నాయి. మేము నివశించ దగిన ప్రదేశం చెప్పండి చాలు అన్నాడు రాముడు వినయముతో.

ఇంతలో సీతా రామలక్ష్మణుల దర్శనార్థం మహర్షులు దయు చేశారు. ముని జనాలను రామలక్ష్మణులు పాదాభివందనం చేశారు. సెలవివ్వండి, ఏమిటిలా దయచేశారు. సెలవివ్వండి ఏమిటి ఆజ్ఞ అన్నాడు రాముడు వినయంగా వారితో

రామచంద్రా! తమ దర్శనముచేతనే మా జీవితాలు ధన్యమైనాయి. ఈ ప్రాంతము నివశించే మునిమండలి రాక్షసులచే బాధింపబడుతున్నది. తపో యజ్ఞకర్మలు ధ్వంసం చేస్తున్నారువారు.

చివరకు ఋషులనే కబళిస్తున్నారు. వారి బారినుండి మమ్ములను కాపాడండి. తపఃషడ్ భాగం ప్రభువులకు చెందుతుంది. మేము మీ ఆశ్రితులము. రక్షించండి. అని ఋషులు రామునితో మనవి చేసుకొన్నారు.

సాధుపరిత్రాణమే కర్తవ్యంగా వచ్చేము. తప్పక రాక్షసులు సంహరింపబడతారు. మీకు ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను, అన్నాడు రాముడు. ధన్యులము అన్నారు ఋషులు.

ప్రభూ మీ సగుణరూపాన్ని ఎన్నడూ మరువకుండునట్లు కటాక్షించండి. నాకు సెలవు ఇప్పించండి. తమరు సుతీక్ష్ణుడు ఆశ్రమానికి వెళ్ళండి. అని వాగ్రూపమైన సేవచేసి, నమస్కరించి శరభంగుడు తన శరీరాన్ని విడచి పరమపదాన్ని చేరుకొన్నాడు.

సీతా రామలక్ష్మణులు సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి చేరి తమ గోత్రనామాదులు చెప్పి నమస్కరించారు. ఆ జడధారి వెంటనేలేచి ప్రతినమస్కారముచేసి అసనఅర్ఘ్యపాద్యాదులతో పూజించాడు. ఆ రాత్రి తన ఆశ్రమంలో నివశించమని ప్రార్థించి వానప్రస్థోచిత వన్యాహారాలతో సీతా రామలక్ష్మణులను సేవించాడు.

మరుచటి దినము ప్రాభాతిక స్నానసంధ్యాదులు ముగించిన రామలక్ష్మణులు సుదీక్ష్ణమహర్షిని నమస్కరించి తమకు అర్హమైన నివాసస్థానం ఎక్కడని ప్రశ్నించాడు ఆ మహర్షిని.

రామా! నీవులేనిదీ, నీకు తెలియనిది వేరే స్థలం ఎక్కడ ఉన్నది? ఇది దండకారణ్యము, అటు పంపానది. ఇటు మందాకిని. అటు చిత్రకూటం. ఈ ప్రాంతమంతా నివాసయోగ్యమే. మహర్షుల ఆశ్రమాలు, సుందర సరోవరాలు, రమ్యమైన కాననాలు, రమణీయ

పర్వతాలు కుసుమ ఫలవృక్షాలతో ఆకర్షణీయముగా ఉంటుంది. ఈ ప్రకృతి సౌందర్యము ఎటివారినైనా ముగ్ధుల్ని చేస్తుంది. అటు వెళ్ళండి. మళ్ళీ ఇటురండి సీతా లక్ష్మణులతో పునఃదర్శనము ఇవ్వాలండి, అన్నాడు ఆ మహర్షి.

ఫలవస్త్రై కొని ఖడ్గధారులై కోదండతూనీరములు భుజము నందుంచుకొని సీతా రామలక్ష్మణులు బయులుదేరారు.

ప్రభూ!........ ఏమిటి? ఈ అరణ్యము రమణీయముగా ఉంది. అదికాదు ఏదో చెప్పడానికి ఈ ఉపోద్ఘాతమంతా నీకు తెలియనిది ఏముంది. అయినా చాపల్యంచేత అంటున్నాను. మన తండ్రి ఆజ్ఞచేత 14 సంవత్సరాలు అరణ్యవాసానికి వచ్చాము. జప దండకమండలాదులతో మునులవలే సంచరించాలి.

ఇప్పుడేమైంది? ఈ ధనుర్బాణాలు, ఈ కవచ ఖడ్గాలుదేనికి? ఇవి హింసకు దారితీస్తాయి. పూర్వం ఒక మహర్షికి ఒక కత్తినిచ్చాడు ఇంద్రుడు. ఆ కత్తితో ఫలమూలాదులు సంపాదిస్తూ చివరకు ప్రాణ హింసకు కూడా పాల్పడ్డాడట. అకారణవైరం అనార్థాలకు దారి తీస్తుంది అంటారు పెద్దలు.

జానకీ! ఈ అహింసా సిద్ధాంతము సకల జనసమ్మతమైనదే ఆర్తుల ఆక్రందనాలు క్షత్రియులు వినరాదు కదా! శిష్ట పరిపాలన దుష్టశిక్షణా క్షత్రియ కర్తవ్యం. రాక్షసబాధితులైన మహర్షులను రక్షిస్తానని అభయమునిచ్చి ప్రతిజ్ఞచేశాను. భరతుడు జనావాసము నందు, నేను మహర్షి జనవాసము నందు క్షత్రియధర్మం పాలించాలి చూడు! అటు కొండలాగఉన్న ఆ ఎముక ప్రోవులు అవన్ని మహర్షుల కంకాళాలే దీనజనోద్ధరణ, సాధుపరిత్రాణము జరగాలి. నీకు మాత్రం తెలియనిదేముంది.

క్షమించాలి మాటల సందడిలో చాలాదూరం వచ్చేసినట్టున్నాము. అదేమిటి? ఇచ్చట సంగీతం వినబడుచున్నది. ఈ అడవిలో ఎన్నెన్ని చిత్రాలున్నాయో అన్నది సీత.

మహర్షి వర్యా! ఈ తటాకము దగ్గర శ్రావ్యమైన సంగీతం వినవస్తున్నది. ఏమిటి విశేషం సెలవిస్తారా? అని రాముడు ప్రశ్నించాడు. దగ్గర ఉన్న ఒకమహర్షి నిచూచి ఆర్యా! దీనిని పంచాప్సరస్సు అంటారు. ఇక్కడ పూర్వం మాందకర్ణి అను ఋషి తపస్సు చేస్తూ ఉండేవాడు. దేవతలకు ఎవరైనా తపస్సు చేస్తూఉంటే తమ పదవులు పోతాయేమో అని భయంకదా! అందులోనూ ఇంద్రునికి మరీ భయం అందుచేత ఈ ఋషి తపోభంగం చేయటానికి ఐదుగురు అప్సరసలను పంపించాడు. వారు ఈ సరోవరంలో జలస్థంభన విద్యచేత అంతర్గృహాలు నిర్మించుకొని సంగీత సాహిత్యాలతో ఆ మాందకర్ణిని అలవిస్తూ ఉంటారు. ఇదే బాగుంది స్వర్గంకంటే అనుకొన్నాడు ఆ ఋషి. ఇది రామా దీని చరిత్ర అన్నాడు ధర్మబృత్యుడను ఋషి. మనుష్యుని విశేషలక్ష్యాన్ని చెడగొట్టడానికి, చెడిపోడానికి ఇలాంటివే ఎన్నో తటస్థించుచుంటాయి. అనుకొన్నాడు రాముడు.

సీతా రామలక్ష్మణులు ఆశ్చర్యానందాలు పొందారు. ఆ పరిసర ఆశ్రమాలలో మహర్షులచేత సభక్తముగా ఆహ్వానింపబడి వారిచ్చిన ఆతిధ్యాన్ని స్వీకరిస్తూ కొన్నిసంవత్సరాలు గడిపి మరల సుతీక్ష్ణ మహర్షి ఆశ్రమానికి వచ్చారు. ఆయనచే సత్కృతులై నాలుగు యోజనాల దూరంగాగల ఆ ముని ఆశ్రమానికి చేరుకొన్నారు. దారిలో అనేక ఆశ్రమాలు అద్భుత దృశ్యాన్ని చూస్తూ వస్తున్నారు. రాముడు— వింటున్నావా? లక్ష్మణుడు— చెప్పనిదే ఏమిటి వినడం అన్నయ్యా.

సీత : బాగుంది మీ అన్నదమ్ముల వరుస.

రాముడు ; చిన్నప్పుడు అమ్మ మనకు అడ్డాల్లో పడుకోపెట్టుకొని
సీత : మీకు ఇంకా అడ్డాల్లో పడుకోవాలని ఉన్నదా ఏమిటి-
రాముడు : వినకూడదూ అన్నీ అడ్డ ప్రశ్నలే.
లక్ష్మణుడు : చెప్పు అన్నయ్యా ఒదిన మాటలతో ఏమిటి అమ్మ ఏమన్నది.
రాముడు ; పాలు నెయ్యి తేనె కలిపి మనకు ఉగ్గుపోసేది.
లక్ష్మణుడు : అప్పుడు నీవు చూశావన్న మాట.
రాముడు : అదికాదురా చిన్నమ్మ చెప్పింది.
లక్ష్మణుడు : ఏమని చెప్పింది.
రాముడు : " జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణం, ఏనుగకు వెలంకాయజీర్ణం గుణానికి గుగ్గిళ్లు జీర్ణం " అనేది.
లక్ష్మణుడు ; అయితే అవన్నీ ఇవ్వడెందుకు అన్నయ్యా!
సీతమ్మ : మీ అన్నయ్యకు చిన్నతనం జ్ఞాపకం వచ్చింది. మీ అన్నదమ్ముల మాటలతో దారి ఇట్టే గడిచిపోతుంది
రాముడు : నువ్వు విను. పూర్వం వాతాపీ, ఇల్వలుడు అనే ఇద్దరు రాక్షసులుండేవారు.

మనం నడిచేదారిలో కాశి బ్రాహ్మణ వేషంతో దారిలో పోయే ఋషులను పిలచి " మాయింట పితృకార్యం కనుక మీరు భోక్తలుగా రావలసినదని పిలిచేవారు నిజమనుకొని వారు ఋషులు వారి ఆశ్రమానికి వెళ్లేవాళ్లు.

సీత ; పిలిస్తే వెంటవెళ్తే ఏం జరిగింది.
రాముడు : వినకూడదా అంత తొందరేమి.

వాతాపిని ఇల్వలుడు మేకగాచేసి చంపి వాడి మాంసంవండి వడ్డించేవాడు. ఆ తరువాత " వాతాపి అని పిలిస్తే ఆ ఋషులపొట్ట చీల్చుకొనివచ్చి ఆ అన్నదమ్ములు ఈ ఋషుల మాంసం తినేవారట.

లక్ష్మణుడు : రాక్షసులుకదూ ఇలా మోసంచేసి దారిపోయే వారిని చంపితినేసేవారు.

రాముడు ; ఒకమారు ఏమైందంటే ఈ దారిని అగస్త్య మహర్షి పోతుండగా అతణ్ణి భోక్తగా నియంత్రణచేసి అన్నను చంపి వండిపెట్టాడు ఇల్వలుడు. పూర్వంలాగ వాతాపీ అని పిలిచాడు. ఇంకెక్కడ వాతాపి వీళ్లమోసం గుర్తించి అగస్త్యుడుతనకడుపును నిమురుకొంటూవాతాపి జీర్ణం వాతాపి జీర్ణం అన్నాడు. అగస్త్యుని కడుపులో వాతాపి చచ్చిపోయాడని తెలిసి ఇల్వలుడు అగస్త్యుని చంపడానికి ఉరికాడు. ఆ ఋషి వాడ్ని తనహుంకారంతో భస్మం చేశాడు.

సీత : దుర్మార్గులగు ఆ రాక్షస సోదరులు చచ్చారు.

రాముడు : అప్పుడే ఏంచూశావు ముందున్నది మునళ్ల నండుగ వినోదాలు ఇకచాలు. అదిగో అగస్త్య ఆశ్రమం సమీపించాము. లక్ష్మణా మనరాక ఆ మునీంద్రునికి తెలియజేయు అన్నాడు రాముడు.

లక్ష్మణుడు ఆశ్రమాన్ని సమీపించి ఒక శిష్యునితో తమరాక అగస్త్య మునీంద్రునికి తెలియజేశాడు. తక్షణమే ఆసనంనుండి లేచి ఆ అగస్త్యమహర్షి ఎదురేగి సీతా లక్ష్మణ సహితులైన శ్రీరాముని సగౌరవంగా స్వాగతం పలికాడు సీతా రామలక్ష్మణులు మునిపాదములపైపడి నమస్కరించారు. అగస్త్యుడు వార్లకు ఆసనములొసగి కుశల ప్రశ్నలు వేశాడు.

రామా, అగ్నిని ఆరాదించి అర్ఘ్యమొసగి ఇప్పుడే వస్తాను. అగ్నిని ఆరాదించక అర్ఘ్యమొసగక అతిథిని సన్మానించరాదు. అలా చేస్తే కూటసాక్ష్య చెప్పినవాడిలాగ పరలోకంచెడి తన మాంసంనే భక్షించేవాళ్లవుతారు. నీకు తెలియనిదేముంది అని పల్కి అగస్త్యుడు అగ్నిశాలకెళ్లాడు.

ఎంత ప్రశాంతంగా యున్నదీ ఆశ్రమం. ఇక్కడ ధర్మం నాలుగు పాదాలుగా సంచరిస్తున్నది. అహింస, సత్యం, ధర్మం, న్యాయం, శాంతము ఈ ఆశ్రమంలోనే ఉన్నాయి. సహజవైరాన్ని విడచి స్థలచరాలు, జలచరాలు, ఆకాశచరాలు పరస్పర స్నేహ భావంతో మెలుగుతున్నాయి. బ్రహ్మ విష్ణు రుద్రాది పదిహేడుగురు దేవతలు నిరంతరం ఆరాధింపబడతారు. మహర్షులు ఇచ్చట సకల దేవతలను ప్రత్యక్షంగా ఆరాధించి ఆయా దేవతాలోకాలలో సంతోషంగా విహరిస్తారు. అగస్త్యుడు తన మహిమచే వింద్యపర్వతాన్ని స్తంభింపజేసాడు. అతని పేరనే ఈ దక్షిణదిక్కు ప్రసిద్ధి వహించింది. ఈ మహర్షి దర్శనం సకలశ్రేయస్సును కలుగజేస్తుంది. ఈ విధంగా సీతా లక్ష్మణులు శ్రీరామచంద్రుడు అగస్త్య ప్రభావాన్ని తెల్సుకొంటూ సంతోష పడుచున్నారు.

ఇంతలో మహర్షి దయచేసి సాదరపూర్వకంగా సీతా రామ లక్ష్మణులను అభినందించి వన్యములైన ఫలమూలాదులతో ఆహార మొసంగి తృప్తిపరచాడు. మరుసటి దినం పద్మ సుగంధభరితమైన చల్లని సెలయేటి నీట స్నాన సంధ్యాద్యనుష్టానములు నిర్వహించి అగస్త్య భగవానునకు దండప్రమాణామంలు చేసి పరివేష్టించి కూర్చున్నారు. అగస్త్యుడు సీతా రామలక్ష్మణులను చూచి నాయనలారా మీరు నన్ను చూడవచ్చినందుకు చాలా సంతోషంగావుంది. ధర్మచారివైన రామభద్రా! నీవు నాకు అతిథిగా వచ్చినందువల్ల నా సంతోషానికి మేరలేదు. నిన్ను పూజించి ధన్యుడనైనాను. పెద్దకుమారుడగు పూరుడు తండ్రియగు యయాతికి తన యవ్వనమొసగి గౌరవించినట్లు నీవు నీ తండ్రిని తీర్ణప్రతిజ్ఞునిగాచేసి అఖండ కీర్తిని ఆర్జించావు ఇదిగో వైష్ణవమహధనస్సు. అక్షయతూణీరములు సువిశాలమైనఖడ్గము వీనిని గ్రహించి దుష్టశిక్షణ గావించి కీర్తిప్రతిష్ఠల నొందగలవు. ఈ సీత సుకుమారి ఈమెకు ఎందునా శ్రమలేకుండునట్లు కాపాడండి. లోకంలో సృష్టిమొదలుకొని సర్వవిధాల సంపృద్ధిగల పురుషుల్ని

గౌరవిస్తారు. స్త్రీలు సంపద్విహీనులని అవమానించి అగౌరవంగా చూస్తారు. ఈ జనకరాజపుత్రి, సకలలోకైక జనయిత్రి, సుకుమార గాత్రి, సకల సద్గుణ పరిపూర్ణ సాధుశీలి. ఎట్టి అవగుణములులేక నీ వెంట వచ్చింది. ఆమెను సర్వవిధాల సంతోషం కల్గించడం నీ కర్తవ్యమని అన్నాడు అగస్త్యుడు.

శరశరాసన ఖడ్గాలను సభక్తికంగా ప్రతిగ్రహించాడు రాముడు. ధన్యుణ్ణి తమ ఆజ్ఞను శిరసావహిస్తాను, మహర్షివర్యా మేము శేషించిన వనవాసంనకు అర్హమైన నివాసస్థలాన్ని తెలియు జేయండి. అని రాముడు అర్థించాడు.

అగస్త్యుడు ఆలోచించాడు. సరే ఇక్కడకు రెండు యోజనాల దూరంలో పంచవటి అను ప్రదేశమున్నది. అది మీకు అన్ని విధాలా నివాసాన్కి అనుకూలమైన ప్రదేశమని తెలిపాడు. సీతారామ లక్ష్మణులు మహర్షికి అభినందించి ఆశీస్సులుపొంది మహర్షివీడ్కోలు ఒసగగా అటునుండి కదలి పంచవటికి బయలుదేరారు,

## పంచవటి

చల్లని ప్రశాంత వాతావరణంలో ఎక్కడకక్కడే మహర్షుల ఆశీర్వాదాలు పొందుతూ వారికి దర్శనభాగ్యాల్ని కల్గిస్తున్నారు సీతా రామలక్ష్మణులు. చెట్లకొమ్మలు తలలు వంచి నమస్కరిస్తున్నట్లున్నవి ఆకులు రెపరెపలాడుతు చల్లని మందమైన గాలిచేత సేవిస్తున్నాయి. పువ్వులు సరేసరి. జలజల రాలుచూ రామునిపైన వృష్టిని కురిపిస్తున్నాయి. హరిత పక్షులు పిప్పలవృక్షంలపై ఫలములను మెసవుచూ కనులపండుగ గావిస్తున్నాయి. రావి, జువ్వి. మర్రి మొదలగు విశాలమూలైన చెట్లు ఛాయలతో ఒప్పుచున్నాయి. ఆమ్రము, పనస,

జంబు, జంఘీర, నారింజ మున్నగు ఫలవృక్షాలు పండ్లతో తీయని వాసనలు వెదజల్లుతున్నాయి. సౌమ్యములైన వన్యజంతువు లంతటా సంచరిస్తూ సీతారాములకు ఆనందాన్ని కలిగిస్తున్నాయి.

ఒక సింహం ఒక పొదచాటునుండి గర్జించింది. సీతారామ లక్ష్మణులు అటు చూశారు. స్వామీ చాలుస్వామీ తమ దర్శనభాగ్యం ఈ క్రూర మృగానికి కూడా కటాక్షించారనుకొని తన కన్నీళ్లతో ప్రశాంతంగా ఆశ్రమం పక్కకు తప్పుకొంది.

ఏదోఒక రీతి వన్యజంతువులు స్వామి దర్శనంచేసి సంతోషంతో దారి తొలగుతున్నాయి.

అందమైన పుష్పాలు, అమృతోపానమైన జలములు రుచ్యములైన ఫలములు కన్నులకు ఇంపయిన పత్రములు — జానకికి ఇవన్నియు కుతూహలం కలిగిస్తూ వాటిని చూస్తూవుంటే లక్ష్మణుడు వాటిని తెచ్చి సమర్పిస్తున్నాడు. రాముడు వినోదిస్తున్నాడు. చాలా దవ్వు ఆ దండకారణ్యంలో నడిచారు. ఎవరికి శ్రమ అనిపించలేదు.

అదే పంచవటి. అగస్త్యుడు చూపినదారి ఇదే శాఖోపశాఖలు కలిగి సుదీర్ఘములు, సమున్నతములైన ఐదు మఱ్ఱిచెట్లు అక్కడ ఉన్నాయి. ఎవ్వరో అంటారుగదా పంచతత్వాల కూడలియే పంచవటి సమీపంలో గోదావరి నది గలగలధ్వనిస్తూ ప్రవహిస్తున్నది. నీటి పట్టులలో తామరలు, కలువలు విరబూసి ఉన్నాయి. జలపక్షులు కిలకిల ధ్వనులు చేస్తు విహరిస్తున్నాయి. పచ్చని పైరుపావడాకాగా తెల్లుపూలు తలకు అలంకరించుకొని మంజీరధ్వనుల్లాగ తరగల ధ్వని వినిపింప జేస్తున్న గోదావరి నదీమతల్లి అల్లనల్లన చిరుతరగలతో చల్లని పిల్లగాలులతో సీతా రామ లక్ష్మణులకు పాదాభి వందనం చేస్తున్నది.

లక్ష్మణా! ఈ ప్రదేశం చాలా ఆకర్షనీయమైంది. ఈ నదీ తీరాన్న సువిశాల రమ్యమైన ప్రదేశంలో ఆశ్రమం నిర్మించుకొంటే బాగుంటుంది. అన్నాడు రాముడు.

ఆజ్ఞాపించండి అన్నయ్యా! ఈ ప్రదేశంలోనే ఆశ్రమం నిర్మిస్తాను అన్నాడు లక్ష్మణుడు. సువిశాలమైన, రమణీయమైన ప్రదేశంలో నానావిధ తరుశాఖలతో దర్భాంకురాలతో హరిచందన సదృశమైన మృత్తికతో దృఢమైన పర్ణశాల నిర్మితమైనది. గాలీ వెలుతురు కలిగి, వితర్దికలు వాతాయనములు, గవాక్షములతో రాజ మందిరంలా ఉంది పర్ణశాల.

సీతారాములు చాలా సంతోషించారు. లక్ష్మణుని చాతుర్యాన్ని భక్తిశ్రద్ధలను పలువిధాల అభినందించారు. గోదావరీనదీ జలములతో సమంత్రకంగా సంప్రోక్షించి ఫలమూలాదులతో భూతబలి ఒనర్చి ఇష్టదైవాన్ని ఆరాధించి పర్ణశాలా ప్రవేశాన్ని చేశారు. సీతా రామ లక్ష్మణులు.

సూర్యోదయాత్పూర్వమే గోదావరినదిలో స్నానసంధ్యాను ష్ఠానములు ఆచరించుకొని ఇష్టదేవతారాధన నిర్వర్తిస్తారు సీతారాములు మహర్షులు మధురఫలంలతో స్వామిని దర్శించుటకు వస్తారు. లక్ష్మణుడు సమిత్ కుశ కుసుమజలకలశాలతో సర్వంసమకూర్చి ఉపవిష్టుడౌతాడు. సీతారాములు వేదిక అలంకరిస్తారు. అప్పుడు మొదలౌతుంది పుణ్య కథాగోష్ఠి, శాస్త్రచర్చ, వేదోచిత ధర్మప్రసంగం, ఉపనిషత్వాక్య, మీమాంస సాయంసమయాల్లో పవిత్ర గోదావరీనదీ తీరాన విహారం, ప్రకృతి రమణీయ సందర్శనము ఇదేవారి దైనందిన కృత్యం.

అది ఒకనాటి సాయంసమయం రాముడు వేదికపై కూర్చు న్నాడు. అరుణారుణకాంతులు ఆకాశాన్నంతటిని అలంకరించాయి.

సూర్యుడు పశ్చిమదిశాభిముఖుడై ఉన్నాడు. పక్షివాతము నివర కంకులనోటకరచుకొని చెట్లుపైనున్న తమ గూళ్లకు చేరుకొంటున్నాయి గోదావరీ తరంగల పైనుంచి చల్లనిగాలి పద్మగంధాన్ని, పుష్ప సౌర భాలను మెల్లమెల్లగా మోసుకొస్తున్నది. సుదూరంగా పర్వతపంక్తులు దాని ముందు వయ్యారంగా వంపులుతిరిగే గోదావరి, దానికి సమున్నతమైన పున్నాగ చెట్లవరుస పువ్వులతో శోభిస్తున్నాయి. అప్పుడే ఉదయిస్తున్న చంద్రునితో కూడియున్న ఆకాశం రమణీయ ముగా ఉంది.

ఆ చెట్లనడుమ నుండి అవ్యక్తమైన ఒక వ్యక్తిస్త్రీమూర్తిగా రూపుదిద్దుకొంటున్నది. సమున్నతమైన కాయం దానిపై బంగారు సరిగంచులగల ఎర్రనిచీర మణి మయకంకణ గ్రైవేయకాలు కక్షయందు జలపూర్ణమైన బంగారు కలశ ఆ కలశనుండి వ్రేలాడుతున్న మొగ్గ లతో కూడుకున్న తామరపువ్వు రెండవచేయి విశ్రాంతిగా వ్రేలాడి యుంది. గాలికి చలించు నీలికురులతో, కుండకుట్మలాలు ముఖం జాబిలి ప్రతిరూపం. అది ఒక పుత్తడిబొమ్మ ఆమె సీత. స్వామిని చూస్తూ చిరునవ్వులు చిందిస్తూ అల్లనల్లన నడియాడి పరశాలలో ప్రవేశించింది. రాముడు తన్మయత్వంతో తత్స్వరూపాన్ని మననం చేసుకొంటున్నాడు. లక్ష్మణుడు వచ్చాడు. ఫలమూలాదులు పట్టుకొని అన్నయ్యా ఇవాల గోదావరీతీర విహారానికి వెళ్లడం లేదా అన్నాడు మీ వదిన ఇష్టమే అన్నాడు రాముడు.

ఆశ్రమం వెలువడి రాముని సమీపంలో అధివశించింది సీత ఇవాళ విహారంవద్దు ఇక్కడే కాలక్షేపం చేద్దాం అంది. వారుభయులూ చిత్రా నక్షత్రంతో కూడిన చంద్రునిలా ప్రకాశిస్తున్నారు.

లక్ష్మణా హేమంతం అంతమౌతున్నది. ఇంతవరకు దీర్ఘనిశలు ప్రకాశిస్తున్నాయి పగళ్లుపొడవౌతున్నాయి. ఆకాశం మంచు ముసుగు

తొలగి నిర్మలంగా ఉంటున్నది.

భరతుడు, శత్రుఘ్నుడు భక్తిభావంతో మనకెదురు చూస్తూ ఉంటారు. తల్లులు మన వియోగంచే మిక్కిలి వ్యధ చెందుతారు. కాలం ఎల్లరికీ ఒక్కరీతిగా గడవదు గదా! కష్టసుఖాలు ఎప్పుడు ఏరీతిగా ప్రాణులననుసరిస్తాయోకదా! దేనినీ లక్ష్యంచేయక కాలచక్రం తిరుగుచునే ఉంటుంది అన్నాడు రాముడు.

శూర్పనఖ :

పంచవటిలో సుమారు మూడు సంవత్సరాలు గడిపారు సీతా రామలక్ష్మణులు. ఒకనాటి సాయంసమయంలో

ప్రభూ! అటుచూడండి ఎవరో వస్తున్నారు. అదేమిటి అన్ని వంపులు తిరుగుచున్నది? అదేమి వయ్యారం? నృత్యం చేయడం లేదుకదా? ఆ పెదవి విరుపులు, కన్నుగిరడాలు, ముసిముసి నవ్వులు ఓహో ఏమిటా వికారం, ఛీ! ఛీ! ఇది ఎవత్తో చేతులు త్రిప్పుతూ గుండెలపైగుడ్డలు జారేస్తోంది. దీనిముఖం చూడకూడదు అనుకొంటూ లక్ష్మణుడులేచి చెట్టుచాటుకు పోయాడు.

ఆ యువతి సీతారాములను మార్చిమార్చి చూస్తున్నది. అబ్బా ఎంత అందగాడు, అతిలోకసుందరుడు, ఆకర్ణాంతనేత్రుడు ఆజానుబాహుడు ఈతని అందం ఇట్టిదని మనస్సుకూడా ఊహించ లేదనుకొంటూ ఆ యువతి దగ్గరకు వచ్చింది.

ఎవరునువ్వు? అన్నాడు రాముడు.

మాటకూడా మనసును దోచేస్తున్నదే! అనుకొంటూ నేను లంకకు రాజైన రావణుని చెల్లెలను. నన్ను శూర్పనఖ అంటారు.

ఆ గోళ్లే చెప్తున్నాయి చేటల్లాగ అనుకొంది సీత. బలే అందంగా ఉన్నావే నీ అంత చక్కనైనవాణ్ణి ఎక్కడా చూడలేదు. నిన్ను పెళ్లాడాలని ఉంది అన్నది సిగ్గులొలికిస్తూ ఆ చుప్పనాతి.

రామునికి నవ్వు వచ్చింది. చూడు ఇది నా భార్య పేరు సీత. నేను నల్లగా ఉంటాను. మా తమ్ముడు తెల్లగా ఉంటాడు. వాడి పేరు లక్ష్మణుడు. వాడిభార్య ఇక్కడలేదు అదిగో ఆచెట్టుదగ్గరున్నాడు వాడి దగ్గరకు వెళ్లు పెళ్లాడతాడేమో అన్నాడు రాముడు. సీత ఈ చోద్యం అంతా చూస్తున్నది. బాగుంది కోతి బాగోతం.

చెట్టుదగ్గరనున్న లక్ష్మణునితో లక్ష్మణా! మీ అన్న నన్ను పెళ్లాడమని నీవద్దకు పంపాడు నన్ను పెళ్లాడు సుఖపడతావు అన్నది రావణుని ముద్దుల చెల్లెలు.

అయ్యయ్యో అదేమ్మాట నేను అతని సేవకుణ్ణి రాత్రనక పగలనకా నిద్రకూడలేక అతన్ని సేవిస్తాను. నావల్ల నీవు సుఖపడలేవు నీవు గూడా ఊడిగం చేయువల్సివస్తుంది. కనుక అతన్నే పెళ్లాడమను సుఖపడతావు. అన్నాడు లక్ష్మణుడు.

శూర్పనఖ మళ్లీ రామునివద్దకు వచ్చింది. రాముని ప్రక్కను సీతను చూచింది. మూతి మూడువంకలు తిప్పి, మెటికలు విరచి, ఇది దగ్గరఉంటే రాముడు తనను అంగీకరించడని తలచి సీతను మ్రింగటానికి ఉరికింది చుప్పనాతి బుద్ధి పోనిచ్చుకుంటుందా? పళ్లు పెద్దవి, కళ్లు పెద్దవి. ఒళ్లు పెద్దది కలసి ఎనుబోతులా ఉంది ఆ చుప్ప నాతి. సీతను మ్రింగబోయింది.

లక్ష్మణా దీన్కి తగినబుద్ధి చెప్పు అన్నాడు రాముడు లక్ష్మణుడు వొరనుండి కత్తి నితీసి దాని ముక్కు, చెవులుకోసి, ఇక

వెళ్లు మళ్లీవచ్చావా చంపుతాను జాగ్రత్తా అన్నాడు.

భాధకు పరాభవాన్కి ఆ చుప్పనాతి బిగ్గరగా అరుస్తూన్నది. అదే దాని ఏడుపు పరెగెత్తుతున్నది. చెట్లతోపుల్లోనికి కొండమూలల్లోనికి, తుప్పలమూలల్లోకి ఒరే అన్నయ్యా రండిర్రారండి నన్ను చూడండి అంటూ అరచింది.

నలువైపులనుండి రక్కసులు పరుగున వచ్చారు. ఖరుడు దూషణుడు, త్రిసురుడు, శూర్పనఖకు కలిగిన పరాభవాన్నిచూచిఎంత చక్కనిది ఎలా అయిపోయింది. దీని ముక్కు, చెవులు, ఎవరో కోసే శారు ఎవరే నీకీపనిచేశారు. ఏడ్వకుండా చెప్పు అన్నారు.

పంచవటిలో సీతా రామలక్ష్మణులు ఉన్నారు. వారు ఇలా చేశారు. వారిని చంపండి. నాముద్దు చెల్లించండి.

ఖరుడు, ధూషణుడు, త్రిశిరుడు తమ సైన్యాన్ని సమీ కరించారు. అంతా మొత్తం పద్నాలుగువేలు ఉన్నారు. ఇద్దర్ని జయించుటకు అంతా బయలుదేరారు. గద, ఖడ్గముసల, ముద్గరాది ఆయుధాలు ధరించి, పెడబొబ్బలు పెడుతు, నేలకు నింగికి లేపు తున్నారు. ధూళి ఆకాశాన్కి చేరింది. అరుపులు, పెడబొబ్బలు చేత గుహలు ప్రతిధ్వనిస్తున్నాయి. కాలమేఘాలు కమ్మినట్లు నలువైపుల నుండి వస్తున్నారు.

లక్ష్మణా మనకార్యక్రమం ఆరంభమైంది. అదిగో రాక్షసులు వచ్చేస్తున్నారు నువ్వు మీవదిననుతీసుకొని పర్వతగుహలోజాగ్రత్తగా ఉండు. నేను వారిపని పడతాను. సీత కరుణాసమేత. భయంకర యుద్ధాలు చూడలేదు. మనస్సు మెత్తన కన్నులు చెదిరే కదనం చూడెలేదు. కరకు రక్కసుల క్రూరకృత్యములెట్లు సహిస్తుంది. అటు

చూపుడు ఆకాశాన్నంతటా ఎఱ్ఱటి మేఘాలావరించాయి. రక్తపు చినుకులు పడుచున్నాయి. నక్కలు రొదచేస్తున్నాయి. కంకపక్షులు ఆకాశంలో వర్తులంగా తిరుగుచున్నాయి. దారుణయుద్ధం సంభవిస్తుంది. త్వరగా సీతను తీసుకొనివెళ్లు అని రాముడు ఆదేశించాడు. సీతా లక్ష్మణులు కొండగుహల్లో ప్రవేశించారు.

రామచంద్రుడు ధనువు, తూనీరాలు ధరించాడు. ధనస్సును ఆకర్ణాంతము ఆకర్షించాడు అల్లెత్రాటిని లాగి విడిచాడు. అదిపెద్ద పిడుగు మ్రోతలో రాక్షసులకు వినిపించి, గుండె చెదిరింది.

ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు దృఢమైన రథాలనధిష్టించారు. ధనస్సులు, బాణాలు, బల్లెములు, కత్తులు, గదలు, శూలాలు మొదలైన మారాణాయుధ సామగ్రిని సమకూర్చారు. తగిన గుర్రాలను పూన్చిన రథాలను, సారథులు నిపుణతతో గడపుచున్నారు.

రామ రాక్షస యుద్ధం ప్రారంభమైంది. నలువైపులనుండి శరపరంపరలు రాక్షసులు కురిపిస్తున్నారు. ముసల, ముద్గరాది ఆయుధాలు ప్రయోగింపబడు తున్నాయి యుద్ధాలలో ఆరితేరిన రాక్షసవీరులు, వారి నాయకులు విజృంభించిరి.

మండలీకృతచాపుడై శ్రీరాముడు తూనీరము నుండి వాడి గల అమ్ములను పుంఖాను పుంఖంగా కురిపిస్తూ రాక్షసుల నెదుర్కొంటున్నాడు. ఇది ఒక క్రీడ. మోసం, వినోదం యంతవరకు సంధ్యాకాలం అతిక్రమిస్తున్నది. రాత్రి రాక్షసులకు బలం అధికం. మిక్కిలి వాడికలది రెక్కలుకలది అగుబాణములు ప్రయోగించి రాక్షసుల్ని సంహరించాడు. రాముడు. కొంచెం తనకు శ్రమకల్గించిన ఆ రాక్షసత్రయాన్ని కాలదండంలాటిబాణాన్ని ప్రయోగించిరథాశ్వసారథులతో వారిని సంహరించాడు. పద్నాల్గువేల మంది రక్కసులు నశించారు.

ఈశ్వర శాపంవల్ల యాజ్ఞవల్క్యుని సుతులైన చంద్రకాంతుడు మహామేధుడు, విజయుడు అను బ్రాహ్మణులు వీరు, వారి శిష్యులు పద్నాలుగువేల రాక్షసులై నారు. శ్రీరాముని దయవల్ల శాపవిముక్తి నిపొంది తరించారు. వారే ఈ ఖరాదులు.

దేవతలు పుష్పవృష్టిని కురిపించారు. ఋషులు సమీపించి రామభద్రుని ఆశీర్వదించారు.

శరభంగాశ్రమంలో ఇదివరకు ఇంద్రుడు, ఋషులు సంప్ర దించిచేసిన ప్రయత్నమిది. అర్ధాధికముహూర్తంలో పద్నాలుగువేలు రాక్షసులు మరణించారు. జనస్థానం అరాక్షసమైంది. సీతా లక్ష్మణులు కొండగృహలో నుండి వచ్చి దివ్యతేజోవంతుడు, సకల దేవమౌని సేవితుడగు శ్రీరాముని దర్శించారు. వీరపురుషావతారుడైన, మహర్షు లకానందాన్ని కల్గించిన శ్రీరాముని జానకి గాఢంగా ఆలింగనం చేసు కొంది. దండకారణ్యం ప్రశాంత నిలయంగా మారిపోయింది.

చావగా మిగిలిన రాక్షసులు, అకంపనుడు లంకకు పరిగెత్తారు. జనస్థానం హతాస్థానమైంది. రాక్షసులంతా చంపబడ్డారు. ఖర, దూషణ త్రిశిరులు కూడా కూలిపోయారు.

ఎవడురా చంపినది వాడికి భూమిపై నూకలు చెల్లినవి, ఆయువు మూడినది. త్రిలోక విఖ్యాతమైన నాపరాక్రమం తెలియదు జాబోలు అన్నాడు రావణుడు పళ్లుకొరుకుతూ.

దశరధమహారాజ కుమారుడూ, రాముడు తమ్ముడగు లక్ష్మణుని తోను, అర్ధాంగియగు సీతతోను పంచవటిలో నివశించి మన రాక్షసు లందర్ని సంహరించారు. ఋషులు వారిని పర్యవేష్టించి సేవిస్తున్నారని అకంపనుడు తెలిపాడు.

తక్షణమే పిశాచముఖాలు గల అశ్వములు పూన్చిన రథముపై బయలుదేరాడు రావణుడు. సరాసరి సముద్ర తీరంలోనున్న మారీచుని ఆశ్రయాన్ని వచ్చాడు, మారీచుడెదురేగి స్వాగతమిచ్చాడు. ఏంటిలా వచ్చేశారన్నాడు రావణునితో.

జనస్థానం, హతస్థానమైంది. అక్కడ మనవారంతా నశించి పోయారట. రామలక్ష్మణులు సీతతోవచ్చిపంచివటిలో నివాసాన్ని చేస్తు న్నారట. వారే మనవారికి చంపేశారట అని రావణుడు చెప్పాడు.

రామ,లక్ష్మణుల పేరు చెప్పగానే మారీచుడు నిలబడ్డపాలంగా విరుచుకొని, నేలపై పడినాడు.

అదే మిడికేమయింది అనుకొంటున్నాడు రావణుడు. శిష్యుడు మారీచుని ముఖంపై నీళ్లుజల్లి, గొంతునీరుపోస్తే కొంచెం సేపటికి కళ్లుతెరిచి నలుపైపులా కలయచూచాడు నెమ్మదిగా.

లంకేశ్వరా! మరి వారిపేరు చెప్పకు. చెప్పావంటే నా ప్రాణాలే లేచిపోతాయి. రామబాణం వాడి నాగుండెల్లో మంటల్ని ఇప్పటికీ రేపు తున్నది. అతడు దేవదానవులకు అజేయుడు. అతని పేరు, అతని మాట, తలచకు, అతని జోలికిపోకు ప్రభూ! లంకకు వెళ్లిపో!

తాటకావనంలో లోగడ తగిలినదెబ్బకు ఈ సముద్రమధ్యలో వచ్చిపడ్డాను. బ్రతుకుజీవుడా అని. చచ్చినవారు ఏలాగూ చచ్చారు, నువ్వు నీ పరివారంతో సుఖంగా ఉండు అన్నాడు మారీచుడు.

లంకకు తిరిగివచ్చాడు రావణుడు. కొలువు తీర్చాడు. మంత్రి, భట, సామంతాది పరివృత్తుడై సమాలోచన చేస్తున్నాడు.

ఇంతలో వచ్చింది శూర్పనఖ ఉరవని పిడుగులాగ అరుస్తున్నదో, ఏడుస్తున్నదో, తిడుతున్నదో తెలియదు. అవమానం, దుఃఖం ఈర్ష్య, ప్రతీకారం దాని మనస్సులో చెలరేగుతున్నాయి.

ఒరే అన్నయ్యా నీ ముద్దుచెల్లెలి ముక్కు తెగిపోయిందిరా! దండకారణ్యంలో మనవారంతా చచ్చినారు. నీకు ఒళ్లు తెలియదు. మదమెక్కి మద్యం త్రాగి కైపుతోనున్నావు. నీవారంతా నశించిపోతే నీ చెల్లెలు అవమానంతో ఏడుస్తుంటే నీకేం తెలియుట లేదు. శతృవులు మిత్రులు కనిపించడంలేదు. దేవదానవులకు అజేయుడను, ముల్లోకములు నాకు ఎదురులేదనుకొంటున్నావు నీజాతి పతనమైపోతున్నది నీకు నీతి, రీతి తెలియదు. సత్యా - సత్యాలు, దర్మా - ధర్మాలు, న్యాయా - న్యాయాలు, పాల్య - పాలక వ్యవస్థలు తెలియడంలేదు నాకు ఎదురేమున్నదని గర్వంమాత్రమే మిగిలింది.

---

సూచిక:- వాల్మీకము అరణ్యకాండ పదకొండవసర్గలో రావణుని అసమర్థత చెప్పబడెను.

---

అని రావణుని అసమర్ధతను పరుషంగా శూర్పనఖ పలికింది.

ఏందుకే ఇలా నలుగురిలో నా పరువు తీస్తున్నావు. ఏం జరిగింది ఏంటి? అన్నాడు రావణుడు.

అంతా అయిపోయింది. విను రాముడు చాలా చక్కనైనవాడు. పెద్దకళ్లు, పొడవైన చేతులు. విశాల వక్షము, ముద్దులమూట కట్టు ముఖం ఒకసారి చూశావంటే మనసులో అతడు నిలిచిపోతాడు. ఆడవారికైతే మతిపోతుంది. రూపము, యవ్వనం, సౌందర్యం, గాంభీర్యం. ఆముఖంలో గోచరిస్తుంది. ఇలా వర్ణిస్తుంది శూర్పనఖ.

ఏం జరిగిందో చెప్పమంటే ఈ సొదంతా ఏమిటే. పెళ్లికూతురు పీటలమీద కూర్చున్న తనకు కాబోయే భర్తనుచూచి ఇలాగే మురిసిపోతుందట. జనస్థానంలో అంతా క్షేమమేనా? మనవారంతా భాగున్నారా? ఏం జరిగిందేమిటి? అన్నాడు రావణుడు.

అతడే దశరథ రాముడు. రాక్షసులందర్నీ చంపేశాడు నా ముక్కు. చెవులు కోయించాడు తమ్ముడైన లక్ష్మణునిచేత.

అతనిని ఎదిరించి జయించడం చాలా కష్టం. అతడిభార్య చక్కదనాలచుక్క ఆమెదగ్గర ఉంటే ముల్లోకాలు ముడు నిమషాల్లో వశపరచుకోవచ్చు. నీకు తగినది. అటువంటి ఆడదాన్ని నేనెక్కడా చూడలేదు. అపురూప లావణ్యం గలది. బంగారపు బొమ్మ దానిని నీవెలాగైనాతీసుకొని వచ్చావంటే సీతనెడబాసిన రాముడు నీకు వధ్యుడౌతాడు. తరువాత సీత నీ వశమౌతుంది. నా పగతీరుతుంది. నీ కోరిక తీరుతుందని ఉపాయం చెప్పింది శూర్పనఖ రావణునికి.

రావణుడు వెంటనే రథమెక్కి మారీచ ఆశ్రయానికి బయలుదేరాడు. దారిలో ఉద్యానవనాల్లాంటి వనాలు దాటాడు. అది ఒక జడమర్రి. దానికొమ్మలు నూరుయోజనాలు ఉంటాయి. పూర్వం గరుత్మంతుడు మాతృ దాస్య విమోచనకై అమృతం తేవటానికి బయలుదేరాడు. దారిలో గజ, కచ్ఛపాలు కాల్లనిరికించుకొని ఈ చెట్టు కొమ్మమీద తినాలని వ్రాలాడు. ఆ కొమ్మకు వ్రేలాడుతూ వైఖానసుడు, వాలఖిల్యుడు తపసు చేస్తున్నారు. కొమ్మ విరిగింది. దానిమీద పక్షులన్ని ఎగిరిపోయాయి. కొమ్మ క్రింద పడకుండా, ఋషులకు హాని కలుగకుండా, ఆ కొమ్మను అలాగే పట్టుకొని కొండ కొనకు తీసుకొని వెళ్లాడు. మెల్లగా దించాడు. మునులకు, ఋషులకు హాని కలుగలేదు. అక్కడ గరుడుడు ఏనుగును, తాబేలును తిని. ఇంద్రుని జయించి, అమృతం హరించి నాగులకూ ఒసగాడు. తన

తల్లియగు వినతదాస్యం తొలగించాడు. ఆనాటి చెట్లు అక్కడ చాలా ఉన్నాయి. రావణుడు వాటిని అతిక్రమించి, సాగరతీరంలో ఉన్న మారీచుని ఆశ్రయానికి వచ్చాడు.

మరలా వచ్చాడు నా ప్రాణాలు తీయటానికి అనుకొన్నాడు మనస్సులో మారీచుడు. ఏమి సెలవు అన్నాడు అణకువతో.

నాటకం ఆడావో ప్రాణాలు తీస్తాను జాగ్రత్త అన్నాడు రావణుడు.

నీచేత చచ్చేకంటే ఆ రాముని చేత చస్తే మంచిది ముక్తి మోక్షం లభిస్తాయి అని మనసులో అనుకొని ప్రభూ! నాటకం కాదు నిజమే చెప్పాను, అన్నాడు మారీచుడు.

నువ్వేం చెప్పనక్కరలేదు. నడు పంచవటికి బంగారు లేడి లాగ ప్రవర్తించి ఆ సీతను ప్రలోభపెట్టు ఆ లేడిను తెచ్చుటకు రాముడు వెళ్తాడు. లక్ష్మణా అని నువ్వు అరవాలి లక్ష్మణుడు ఆశ్రమంవదిలి వెళతాడు. ఆ సమయంలో నేను సీతను అపహరిస్తాను. ఇది పధకం.

ఓరీ వీడిదుంపతెగా! ఎంత అపచారానికి వడిగట్టాడో, వీడికి ఆయువు దగ్గర పడ్డాది. "వినాశకాలే విపరీతబుద్ధి" అన్నారు. మరి వీడిది మరల్చలేననుకొన్నాడు మారీచుడు మనసులో.

ఏమిటా ఆలోచిస్తున్నావు. పద నా రథంమీద. అదిగో పంచవటి నేను చెప్పినట్లుగా నటించు. నీకు మేలు చేస్తాను అన్నాడు రావణుడు.

నువ్వేమి చేయనక్కర్లేదు. మేలు రాముడే చేస్తాడని తలచాడు మారీచుడు.

లక్ష్మణా! మనము వచ్చిన పని నెరవేరినట్లే చాలవరక
అదిగో అదిగో అదొకపక్షి. నడకొండలా ఉంది. ఇదొక రాక్షసి కాబోలు
అన్నాడు రాముడు. ఎవరు నువ్వు అన్నాడు రాముడు.

రామా! నేను రాక్షసుణ్ని కాను. మీ తండ్రియగు దశరథు
స్నేహితుణ్ణి నన్ను జటాయువు అంటారు. గరుత్మంతుని వం
యులం. మా తండ్రి అనూరుడు. నా సోదరుడు సంపాతి. కశ్య
ప్రజాపతి సంతతిలోనివాడిని.

చాలా సంతోషం. ఇక్కడకు ఎందుకు వచ్చావని ప్రశ్ని
చాడు. రాముడు.

ప్రభూ! ఇంకా ఇక్కడ రాక్షసులున్నారు, వారు బహు
మాయారూపులు. తమరు వైదేహితో సుఖంగా ఉండండి. శక్తివంచ
లేకుండా మీకు రక్షణ కల్పిస్తాను. నా సేవను అంగీకరించండి అ
వేడుకొంది జటాయువు. సరే అన్నాడు రాముడు. సీతా రామలక్ష
ణులు ఆశ్రమంలో ప్రవేశించారు.

## మాయాకురంగము

ఒకనాటి తొలిపొద్దున సీతా రామలక్ష్మణులు వేదిక అలం
రించియున్నారు. ఇంకా ఉన్నారట రాక్షసులు, వారిని ఎలాగ మ
పెట్టడం అనుకొంటున్నారు వారు.

ప్రభూ! తమరు తలచుకొంటే లోకం అరాక్షసం కాకపో
అన్నది జానికి. నిజమే, మనమందుకే వచ్చాముకదా. అదిగో అ
చూడు. ఎదుట చూపించాడు సీతకు రాముడు.

కరుణారస తరంగితాలైన సీతాదృగంచితాలతో పరివర్ధిత కదలీ తరుషండ మండితము, పచ్చని పండ్లు, ఎర్రటి పూలతో ప్రకాశిస్తున్నది.మందార, మాలతి,అశోక, పున్నాగ, తమాలా, పాటల పుష్పాలతో ఒప్పుచున్నలతాతరు పుంజమంజులమై ప్రకాశిస్తున్నది ఆశ్రమ ప్రాంగణం. అతిరమణీయంగా ఉంది.

ఒకలతాకుంజం నుండి వెలువడినది ఒక బంగారువన్నె లేడి వెన్నెలను వెదజల్లుచున్న ఉదరము, నవరత్నములు తాపినట్లున్న శరీరంపై ఉన్న బిందువులు, నీలమణులచే నిర్మితములైనట్లున్న శృంగములు, చంచలమైన దృక్లు కలిగి, మరకతములు పోలు పచ్చికను మేసవుచున్నది. దాని మెడవంపు, కొమ్ములసరళి, నేత్ర కదలిక, శరీరంయొక్క వంపుసొంపులు, ఎట్టివారినైన ఇట్టే ఆకర్షి స్తుందా లేడి.

అపురూపసోయగం కలిగి దాని నడువడిని గమనించిన ఆశ్రమకురంగాలు సమీపించి, వాసనచూచి, భయపడి పారిపోచు న్నాయి. ఇది ఒక వింతమృగం. అసురమాయ ఎవరికి తెలుసు. సాటి మృగాలకు తెలిసిపోతుంది. అవసరోచితంగా ఆ మాయాకురంగం అటు నిటూ నడయాడు చున్నది. నిమిత్తంలేకనే చెంగున ఎగురు చున్నది. పచ్చిక మేసవుచున్నది. దిక్కులు పరికిస్తున్నది. తన్నెవరూ గమనిస్తున్నారా!

చూడకేమి జానకి చూచింది. మెచ్చుకుంది. తలయూచింది సంబరపడింది. మనసుపడి కావాలనుకున్నది. ఆర్యపుత్రా లక్ష్మణా అది చూడండి ఎంత ఆకర్షణీయంగా ఉందో ఇదివరకు మన ఆశ్రమ ప్రాంగణంలో ఎన్ని మృగంలు సంచరించలేదు. ఇంత అందం దేని కుంది మన ఆశ్రమంలో కట్టివేస్తే దానితో నా సమయం సరదాగా ఇట్టే గడిచిపోతుంది. దానిని తెచ్చియివ్వరూ అన్నది సీత.

అన్నయ్యా కాంచనమృగం ఇంతకాలం ఈ అడవిలో సంచరించటం ఎప్పుడైనా చూచామా. ఇదీ రాక్షసమాయ. సౌమ్యుల్ని ప్రలోభపరుస్తారు. ఇలాగే చివరకు పొట్టపెట్టుకుంటారు. వాతాపి చరిత్ర మనకు తెలిసిందే కదా. ఇది మారీచుని మాయ, సంశయంలేదు లోగడ మనచే తిన్న దెబ్బకు ప్రతీకారం తీర్చుకొనేందుకు ఈ వేశం వేశాడు. రాక్షసులు కామరూపులు. సమయం కనిపెట్టి ప్రజలను మోసంచేసి నాశనం చేస్తారు అన్నాడు లక్ష్మణుడు.

కాదు ప్రభూ! ఇది నిజమైన లేడి. చూడండి ఎంత ముచ్చటగా యున్నదో మాటిమాటికి మనవేపే చూస్తున్నది. చెవులు కదలిస్తున్నది నెమరు వేస్తున్నది. నిబ్బరంగా ఇక్కడే తిరుగుచున్నది. పట్టుకొంటే ఇట్టే దొరుకుతుంది. ఒక్క అడుగు ముందుకు వేస్తే చాలు. ఇలాగ సీత రాముని తొందర పెడుతున్నది.

లక్ష్మణా! ధనుర్బాణాలు ఇలా తే పట్టుకొనుటకు ప్రయత్నిస్తాను. నీవన్నట్లు ఇది రాక్షసమాయ అయితే ఒక్కబాణానికి హత మారుస్తానన్నాడు రాముడు.

ప్రభూ త్వరపడండి దొరక్కపోతే చంపి చర్మాన్నయినా తీసుకురండి. ఆస్తరణముగా ఉపయోగిస్తాను. దీనినిచూచి అయోధ్యలో భరత, శత్రుఘ్నులు వినోదిస్తారు. అత్తలు ఆశ్చర్యపోతారు. త్వరగా వెళ్లండి ప్రభూ అన్నది సీత.

లక్ష్మణా జానకి జాగ్రత్త. ఇదే నేను వెళ్లుచున్నాను. రాక్షసావాసం. తొందరపడి సీతను విడిచిరాకు ఈ నట్టడవిలో కష్టాలుతెచ్చి పెట్టుకున్నట్లే అవుతుంది జాగ్రత్త అని కట్టడిచేసి రాముడు మృగం వెంటపడ్డాడు.

ఆ లేడి చేతికి చిక్కినట్లే ఉండి గంతేసి ప్రక్కకు తప్పు కొంటున్నది. మళ్లీ దగ్గరవుతున్నది. కొంతదూరం ముందుకు సాగు చున్నది. వెంట పరిగెడుతున్నాడు రాముడు. పట్టుకొనుటకు దొరకటం లేదు. దొరికినట్లే ఉండి తప్పుకొంటున్నది. తుప్పల్లో చొరబడుచున్నది అదృశ్యమవుతున్నది. మళ్లీ ఎదుట కనిపించుచున్నది.

రాముడు లేడిని వెంబడించుట అంతా నాటకంపలే కనబడు చున్నది. అదిగో కాంచనమృగం. కాదు ఇది రక్కసి. జిత్తులమారి ఇక దీనిని ఉపేక్షించరాదు. వెంటనే రాముడు ధనువుకు నారిసంధిం చాడు. వాడిగల బాణం ఆకర్షించి వదిలాడు. సూటిగాపోయి ఆ మాయలేడికి తగిలింది. బాణవేగానికి పదిబారల దూరంలో కేకలు వేస్తూపడ్డాది. ఇప్పుడది లేడి కాదు.

మారీచుడు రామబాణహతుడు. తన పని మరియింకొకటి మిగిలింది. "హా........లక్ష్మణా! హా........సీతా" అయిపోయింది తన పని" రాముని గొంతుతో అరచి ఆ రక్కసుడు ప్రాణం వదిలాడు.

మనుష్యులు మాయకు లొంగిపోతారు, మోసపోతారు. తరు వాత విచారిస్తారు. ఈ రక్కసి అరుపు ఆశ్రమానికి వినబడుతుంది. సీతను వదలి లక్ష్మణుడు వచ్చేస్తాడేమో, శంక, భయంకలిగి రాముడు త్వరగా ఆశ్రమంవైపు అడుగులు వేస్తున్నాడు.

జరగబోయే నాటకానికి రంగస్థలం సిద్ధమౌతున్నది. దండ కారణ్యంలో జనస్థానంలో రాక్షసులు సంహరింపబడ్డారు. లంకలో రావణుడు సపరివారంగా నాశనం కావాలి. ఇందులో ప్రముఖ పాత్ర సీతది అకంపనుడు, శూర్పనఖలు నాందీకలికారు. లోకం అరాక్షసమైప నాని శాంతిలేదు. దేవతలు ఋషులు అంతా అదే ఆకాంక్షిస్తున్నారు.

భర్త కంఠస్వరం ఆశ్రమంలోనికి వినబడినది.

లక్ష్మణా! మీ అన్న ఆర్తనాదం అది. విపన్నుడై యున్నాడు. త్వరగా వెళ్ళు, ఆ కంఠస్వరం మీ అన్నదే. మనస్సు కీడును శంకిస్తున్నది. త్వరగా వెళ్ళు. మీ అన్నకు ఏమైందో వెంటనే సహకరించు. సీత లక్ష్మణునితో రాముని దగ్గరకు వెళ్ళమని త్వర పెడుతున్నది. కన్నులు అశ్రుపూరితములైనవి ఆమెకు.

అమ్మా! భయపడకు. ఇది రాక్షస మాయ, నీ నాథుని జయించ గలవాడు ముల్లోకాలలో లేడు. యక్ష, రాక్షస. గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుష, దేవ, దానవాదులకు మరియు మనుష్య భూత, ప్రేత, పిశాచాదులకు ఆ లోకోత్తర వీరుని తేరిచూచుటకు సాధ్యంకాదు, అప్రమేయ బలసంపన్నులు మాఅన్నయ్య, అతనికే కీడూ కలుగదు. కలుగుతుందని కలలోకూడా తలచరాదు. రాక్షసు లను చంపి క్షణంలోవచ్చేస్తాడు, శాంతించుతల్లీ అన్నాడు లక్ష్మణుడు

లక్ష్మణా: వెళ్ళమన్నా వెళ్ళట లేదా! అన్నపై భక్తి విశ్వా సాలు నీకెక్కడివి. అన్నదమ్ముల్లో స్నేహభావం ఉండదు. అన్నకు ఆపద కలిగితే నన్ను వశపరచుకోవాలని చూస్తున్నావు. భరతుడు ఎమ్మన్ని అడవికి తగిలేశాడు. నువ్వు అతని ప్రోత్సాహంతో వెంట పడ్డావు. నా నాథునకు ఆపద సంభవిస్తే నన్ను స్వాధీనం చేసుకో వాలని చూచుకొన్నావు. లోకంలో సవతి బిడ్డలు సంపదను స్వాధీనం చేసుకొనుటయేకాక, ఆలుమగలనుకూడా వేరుచేసి వారి పబ్బంగడుపు కొంటారు. నీవు నీచుడవు, ద్రోహివి, నీకెంతమాత్రం లోబడను. అగ్నిలో పడిచస్తాను. ఉరి పోసుకొంటాను. విషం త్రాగుతాను. ఈ సీత నీకు దక్కేది లేదు అన్నది ఉద్రేకంతో,

అమ్మా అంతమాటనకు కోపగించక:, ఇదిగో వెళ్ళుచున్నాను,

అన్నగారి ఆజ్ఞమీరలేక ఈ అడవిలో మిమ్మల్ని ఒంటరిగా విడుచుటకు ఇష్టంలేక జాగుచేశాను. ఓ పంచభూతాల్లారా! ఓ వనదేవతల్లారా! నామనః ప్రవృత్తికి మీరేసాక్షి. జానకికి మీరే రక్ష, అమ్మా సెలవు తిరిగి నీ దర్శనం కలుగునో? లేదో? అని పాదాభివందనం చేసి సీత వద్ద సెలవు తీసుకొని కవచ, ఖడ్గధారియై అన్నవెళ్లిన వైపునకు పరుగెత్తి వెళ్లాడు లక్ష్మణుడు.

## అ ప హ ర ణ

" త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్!
ఉర్వారుక మివబంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ "

స్వరసమన్వితమైన మంత్రం ఉచ్చరిస్తూ రావణుడు యతి రూపంలో పంచవటి ఆశ్రమ ప్రాంగణంలో అడుగు పెట్టాడు. శ్రీరాముని రాకను నిరీక్షిస్తూ కూర్చున్న తల్లి లేచి నిలిచింది ఎవరో యతి సార్వభౌములు దండకమండలాలు, కాషాయ వస్త్రాలు, విభూతి రేఖలు, రుద్రాక్షమాలలు, పాదాలకు పాదుకలు ధరించి ఎదుట నిలిచాడు.

భారతదేశములో గోవులకు, బ్రాహ్మణులకు, సన్యాసులకు సాధువులకు గౌరవాదరాలు అధికంగా లభిస్తాయి. సహజంగా పెద్దల యెడ అతిథులుయెడ, సాధు సత్పురుషులయెడ, బంధువులయెడ సీతకు భక్తి గౌరవాదరాభిమానాలు అధికం. ఇది తన తండ్రియైన జనకుని ఇంట సత్ప్రవృత్తి.

స్వాగతం యతివర్యా! అని పలికి ఆసనమొసగినది. ఆ కపట సన్యాసికి అర్ఘ్యాదులొసంగినది సీత.

స్వస్తి భవిత్యే! అని ఆశీర్వదిస్తూ రావణుడు తన మనసున ఏమో అనుకొంటున్నాడు. ఆహా! దివ్యమంగళ విగ్రహము, రూప, గుణ, యవ్వన సంపద త్రిజగన్మంగళాకృతి పద్నాల్గు లోకాల సౌందర్యం రాసిపోసినట్లున్నది. సౌందర్యానికే సౌందర్యం కలిగించే అటువంటిది,ఈ సీత! శూర్పనఖ చెప్పినమాట నిజమే అనుకొన్నాడు

సుందరీ యువతినీవు? నీవంటి సౌందర్యరాశి మూడులోకాల్లోను నేనెక్కడా చూడలేదు. ఈ నట్టడవిలో ఒంటరిగా ఎందుకు ఉంటున్నావు. సింహ, శరభ,శార్దూలాది క్రూర మృగాలు అంతటా సంచరిస్తున్నాయి, నీకు భయం కలుగలేదా? నీవారెవరూ లేరా? నీ రూపు, రేఖ విలాసాలు చూస్తూ ఉంటే జడధారినైన నాకే మతి భ్రమిస్తున్నది. అంటూ ఏవేవో అంటున్నాడు రావణుడు.

దండ కాశాయాదులు ధరించినంత మాత్రము చేతనే యతులు ఎల్లరకు పూజ్యనీయు లౌతున్నారు. అనుకొంటూ రామలక్ష్మణుల రాకకై అటునిటు చూస్తుంది సీత. ఆర్యా! నేను జనక పుత్రికను. పూజ్యుడగు దశరథుని కోడలును. సర్వలోక శరణ్యుడు, పూజ్యుడగు శ్రీరాముడు నా భర్త. సోదరుడైన లక్ష్మణునితో కూడి పదునాలుగు వత్సరాలు అడవిలో గడుప వచ్చాము. ఇప్పటికి చాలా కాలం గడిచింది. నా ప్రభువు వచ్చి తమకు తగిన అతిధి సత్కారాలను చేయగలరు. తమరెవరో సెలవియ్యండి అన్నది సీత.

నేను మహా పరాక్రమశాలిని. కైలాసాన్ని కదిలించాను. కుభేరుని జయించి లంకనూ, పుష్పక విమానాన్ని స్వాధీనం చేసుకొన్నాను. నేను లంకాధిపతిని. ముల్లోకాల్లో నాకెవ్వరూ ఎదురులేదు. నాపేరు రావణుడని వినేయుంటావు. నా అనుమతి లేనిదే గాలి చలించదు. నదులు ప్రవహించవు. సూర్యచంద్రులు నాకనుకూలంగా ఎండకాస్తారు. శీతలం కలిగిస్తారు. ఇంతెందుకూ పంచభూతాలు నా

ఆజ్ఞను అతిక్రమించజాలవు.

నీవు నన్ను అనుగ్రహించి లంకలో ప్రవేశించు. వేలాది స్త్రీలు నీ పరిచారికులను చేస్తాను. నేను నీకుదాసుడను. నీకు రాజ్యం సమర్పిస్తాను. రాణివై పరిపాలించు. ఆ రాముడు మానవమాత్రుడు తండ్రిచేత విడుపబడి విగిత రాజ్యుడై అరణ్యానికి వచ్చాసాడు. ఆయనవలన నీకు సుఖము లేదు. ఆతడు గతాయుష్షు.

పద్నాలుగువేల సంవత్సరాలే ఆతని పరమాయువు. ఇదిగో చూడు నా రూపం అన్నాడు.

భిక్షు రూపం వదిలి రావణుడైనాడు. కవచ కుండలాలు ధనుర్బాణాలు, రక్తవసనాలు, నాలుక, కొండంత శరీరం, పది తలలు, వాటిపై హిమగిరివంటి మకుటములు, ఇరువది చేతులు ఇదీ రావణుని ఉగ్రరూపం.

సమయం దగ్గరపడ్డాది అనుకొంది సీత. పూజ్యుడైన విశ్వావసు బ్రహ్మకు మనుమడవు. ఉత్తమకుల సంజాతుడవు. నీకు ఈ దుర్బుద్ధి కూడదు. నా ప్రభువు చతుర్దశ లోకాలకు మాననీయుడు అతడు గతాయుషు ఎట్లగుతాడు. సూర్యునికి సువర్చలవలె, చంద్రునికి రోహిణివలె. స్వామికి నే నెల్లప్పుడు అనువ్రతను. సముద్రానికి పిపిటిబట్టికి ఉన్నంత అంతరం నీకు — రామునికి వుంది. నీవూ, నీ ఐశ్వర్యం రాముని పాదాంగుష్ఠానికి సాటిరావు.

బ్రహ్మాది సకల భువనాలు నశ్వరాలే, నీవు అంతే, నీ బ్రతుకూ, నీ ఐశ్వర్యం, నీ రాజ్యం నీ పరివారమంతా నశించడానికే నీకీ బుద్ధి పుట్టింది. ఇలా పరుషంగా సీతాదేవి రావణునితో పలికింది.

రావణుడు తనరెండు చేతులు విదిల్చాడు. ఎదురు పడిన సిరిని ఎవరు వదులు కుంటారనుకొని ఉద్రేకంతో సీతను పట్టుకొని రథంపై ఉంచుతాడు. ఆ రథం ఆకాశంలోకి లేచింది.

సీత రామలక్ష్మణులనుద్దేశించి మాటిమాటికి వారిని సంభోదిస్తూ ఆక్రందనం చేస్తున్నది, శిరోజాలు వేళ్లాడు తున్నాయి. కంటికి కడువడు నీరు కారుచున్నది. హృదయ విదారకంగా రోధిస్తున్నది.

లోకవిరుద్ధమైనది, ధర్మవిరుద్ధమైనది అయిన కోరిక ఎవరికైనా కష్టం నష్టం తెచ్చిపెట్టక మానదు. ఇట్లా అనుకొని "వనజీవులారా! ఋషి పుంగవులారా! ఓ పర్వత శ్రేష్టమా! నదీమతల్లులారా! రావణుడు నన్ను కొనిపోవుచున్నాడు. నా ప్రభువు రామునికి తెలియజేయండి. భక్తుడగు లక్ష్మణునకు తెలియజేయండి. పశు, పక్షి, వృక్ష, లతా గుల్మాదులారా మీరైనా నా దీనావస్థను గమనించి, నా ఈదుస్థితిని రామచంద్రునికి తెలియజేయండి" ఈ విధంగా సీత ఆక్రోశిస్తూనే యున్నది. రథం ఆకాశాన సాగిపోతునే ఉన్నది.

ఓరీ రావణా! నిలునిలు పిరికి పందలాగ రాముడు ఇంటలేని సమయాన దొంగలాగ సీతను అపహరించుకొని పోతున్నావు. నన్ను అతిక్రమించి అడుగైనా కదలలేవు. నీకు నాచేతనే మృత్యువు రానున్నది.

ధర్మార్థకామాలు విభజించి సేవించాలి, ఆకొని విషంతింటే ఏమౌతుంది? ధర్మాతిక్రమణ చేసిన చోరుడవు నీవు, నీవేమి రాజువు అంటూ మింటికెగిరి జటాయువు రథాన్ని తన కాలితో తన్నెను. అది క్రిందపడ్డాది, తనరెక్కలతో రావణునకు చెంపపెట్లు తగిలాయి. తుండాగ్రంతో ఒళ్లంతా పొడిచి కండలు ఊడదీసింది. కాలితో తన్ని

కిరీటం నేలపడునట్లుచేసి జుత్తుపట్టి పీకి చిందరవందర చేసింది ఆ జటాయువు.

సీతా రామలక్ష్మణుల సేవకు తన ప్రాణాన్నయినా త్యజించి నిర్వర్తించడమే కర్తవ్యంగా భావించింది ఆ పక్షి.

ఓ పతంగమా నీకింత శక్తి ఉందా! అనుకొన్నాడు రావణుడు. సీతను అటవిడచి చంద్రాయుధం తీసాడు ఒరనుండి. కొంతతడువు పెనుగులాడాడు రావణుడు. ఒడుపుచూచి వృద్ధమగు జటాయువు యొక్క రెక్కలు తెగవేసాడు. మరల రథమునెక్కి సీతను తీసుకొని లంకాభిముఖుడై నాడు రావణుడు.

రెక్కలు తెగినందున పక్షిశోషవచ్చి సొమ్మసిల్ల పడిపోయింది. ఆ పెద్దప్రాణం కడగట్టిపోయింది. ఆ వృద్ధ జటాయువు కొనఊపిరితో ఉంది.

ఈ నట్టడవిలో నాకెవరు దిక్కుకలరు. నా రోదనము అరణ్య రోదనమైంది. చరాచరాలకు జాలి కలుగుతుందికానీ, ఈ కఠినుడైన రావణునికి దయాదాక్షిణ్యాలులేవు. పాపభీతిలేదు, ధర్మాధర్మాలు ఎరుగని కర్కోటకుడు. సీతాదేవి తన రక్షణకై ఆక్రందన చేయుచున్నది. శిలలు ద్రవించునట్లు రోధిస్తున్నది.

మూర్ఖుడా నీమెడ కాలపాశం చుట్టుకొన్నావు. నీ లంకకు నాశనం తెచ్చుకొన్నావు. త్వరలో అసిపత్రవణం, వైతరిణీనది, శాల్మలీవృక్షం చూస్తావు. నరకద్వారం, మృత్యుముఖం ప్రవేశిస్తావు. మోసగించి నా నాథుని నుండి అపహరించి వీరుడవు, శూరుడవు అనుకొంటున్నావు. చోరుడవు నీవు. నీ దుర్వ్యవసాయం అపకీర్తి చిరకాలం లోకంలో నిలచిపోతాయి. నీచుడా! నా స్వామి కంటపడిఉంటే ఈసరికి

యమసదనం చేరియుండేవాడివి" అని పరుషోక్తులు పలుకుచుండగా
సీతాదేవి ఎడమ కాలినుండి స్వర్ణమంజీరం జారి పెద్ద ఉల్కవలె
మండుతూ నేల పడిపోయింది. రావణుని వినాశనము సూచిస్తున్నది.
అదిగో ఎవరో వనచరులు వానరులు. మీరు మా రాఘవునకు నా వార్త
తెలిపి పుణ్యం కట్టుకోండి అని పలుకుచూ ఆభరణాలు ఉత్తరీయమున
మూటగట్టి వానరుల మధ్య పడునట్లు పడవేసింది.

రావణ రథం నిరాటంకంగా లంకకు పోతున్నది. సముద్రం
దాటి ఆ రథం లంకలో ప్రవేశించింది. రావణుడు రథం దిగి సీతను
రథావతరణం చేయించాడు. సీతను లంకలో అంతఃపురంలో ప్రవేశ
పెట్టాడు. రాక్షస స్త్రీలను పిలిచి ఈమెను సర్వవిధాల కాపాడండి.
ఆహార వస్త్రాభరణములు ఏమి కావాలో సర్వం సమకూర్చండి.
ఈమెకు ఎవ్వరూ అప్రియం చేయకూడదని ఆజ్ఞాపించాడు రావణుడు.
పంజరంలోని చిలుక అయింది సీత. రామనామ స్మరణం తప్ప ఆమెకు
అన్యం అక్కర్లేదు. సంసారబద్ధుడగు జీవునకు రామనామ స్మరణమే
[illegible]

[illegible] అని [illegible] రావణుడు
[illegible] దక్షులైన [illegible] పొండి మీరు దండకారణ్యం
లోని జనస్థానానికి. అది ఇప్పుడు హతస్థానం అయిపోయింది.
అప్రమత్తంగా అక్కడ మెలగండి రాముని ప్రవృత్తిని ఎప్పటి
కప్పుడు నాకు తెలియజేయండి అని రావణుడు ఆజ్ఞాపించాడు.

ఎనిమిది [illegible] ముఖ్యనాయకులు కాగా పలువురు జన
స్థానం చేరుకొన్నారు. ఇకమీదట ఏం చేయాలి? ఏం చేయాలి? ఇది
రావణుని ఆలోచన.

నాటి సాయంత్రం అచ్చర కన్యలవలె నలుగురు స్త్రీలు

వెంటవస్తున్నారు సీతాదేవి సేవచేయుటకు. దాసీ, భూత, సమస్త దేవవనిత ఈ సీత. వీరికి ఏంతెలుసు. రావణుడు రావణ అనుచరులు ముందుకు నడుస్తున్నారు. రజోగుణం మూర్తీభవించేటట్లున్నాడు రావణుడు. తన చూపుడు వ్రేలితో చూపిస్తూ సీతతో అంటున్నాడు. అటుచూడు అవి నవరత్న భాండాగారాలు. ఇటు చూడు నవధాన్యంలు నిలువ ఉంచిన మందిరాలు. ఆ వరుసంతా ఆయుధాగారాలు. ఇవి విలాస మందిరాలు. ఆ ప్రక్కవి వినోదశాలలు. ఇది మదీయ సభా భవనం.

సీత వీటిని వేటినీ గమనిస్తున్నట్లే లేదు.

రావణుడు తన వైభవాన్ని చెపుతునేయున్నాడు. ఆకాశం అంటే మహోన్నతమైన కాంచనరాజ ప్రాసాదాలు సముద్రానికి ఎన వచ్చే అగర్తలు, సమున్నత ప్రాకారాలు – గమనిస్తున్నావా ముప్పదిరెండుకోట్ల సర్వసమర్ధులైన వీరాధివీరులు నాచేత పాలింప బడుతున్నారు.

అంతఃపురంలో ఉన్న స్త్రీ సహస్రాలు నీ అడుగులకు మడుగులొత్తుతారు. వారందరికీ నీవుఅధీశ్వరివి. అది నాసభాభవనము అదీ నవరత్న ఖచిత సింహాసనము. దానినధిష్టించి మమ్ముల్లెల్లరనూ పాలించు. మమ్ములను అనుగ్రహించు. ఈ దాసుని కరుణించు. నూరు యోజనాల సముద్రందాటి రావడం ఎవరికీ సాధ్యంకాదు. దేవ, దానవ, యక్ష, పిశాచ, గరుడోరగ, గంధర్వాదులెవ్వరూ నన్ను జయింపలేరు. రాముడు వనవాసి, రాజ్యభ్రష్టుడు, నన్నెట్లు జయిస్తాడు. జానకీ! వింటున్నావా క్రీడాశైలాలు, ఉద్యానవనాలు, పద్మ సరోవరాలు, క్రీడాగృహాలు అంతటా అన్నిడా నాతోవిహరించు. సకల భాగ్యభోగాలు అనుభవించు. స్త్రీలకు ఎవ్వనం క్షణికము సమయం వృథాచేసి విచారిస్తే ఏమిలాభము అని కాలం అసన్నుడగు రావణుడు

తనదర్పాన్ని, మౌఢ్యాన్ని జానకి సమక్షంలో తెలియజేస్తున్నాడు.

రాక్షస అధమా! ధర్మనిరతుడైన రామునికి ధర్మపత్నిని జగదారాధ్యుడైన స్వామికి నేను అనువ్రతను. నన్ను ఈ విధంగా పలకడానికి తగవు. నీ నాలుకలు చీలుకలు కాలేదు. కన్నులు అగ్ని ఘాతాలు కాలేదు. మూర్ఖుడా నీకూ రామునికి నక్కకు – నాగలోకానికి ఉన్నంత అంతరం ఉంది. నీవూ నీ సంపదలు నన్ను ప్రలోభ పరచలేవు. జగత్కల్యాణ రాముడు నా ప్రభువు. నా స్వామి. సద్గుణైశ్వర్య సంపన్నుడు నా రాముడు. నీ సరస్వం నాశనంకాక పూర్వమే నా స్వామియైన రామునికి నన్ను సమర్పించు. నేరమి తలపక నిను కరుణిస్తాడు. మూర్ఖతగా ప్రవర్తించావా జాగ్రత్త! శస్త్రాస్త్రకుశలుడు అతడు. రాముని బాణాగ్నికి నాశనమైపోతావు. దర్పం విడిచిపెట్టు నీవు నన్ను వశపరచుకోలేవు. ఈ శరీరాన్ని విషంతిని త్యజిస్తాను. అగ్నిలో ప్రవేశించి ప్రాణాలను విడుస్తాను. నిస్తేజమైన ఈ శరీరాన్ని అప్పుడు బంధించు. ఛిన్నాభిన్నం చేయి. అని సీతాదేవి రోషకషాయ నేత్రియై దుఃఖావేశంతో రావణుని గూర్చి పలికింది.

రావణుని కనుబొమలు ముడిపడ్డాయి. పళ్లు పటాపటా కొరికాడు. చేతులు విదిల్చాడు. కళ్లు జేవురించాయి. ముఖం వికృతం దాల్చించి శరీరం కంపించి ఎవరక్కడఅని అరచాడు. పిలవండి ఏకాక్షిని ఏకకర్ణిని, లంబోదరిని, దీర్ఘనాశి, అనాశి, విరూపి, వికృతకేశి, అకేశి ద్విజట, త్రిజట, చతుర్జట, సహస్రజట, ఇలాంటి క్రూర, భయంకరాకారులు, పలువురు రాక్షస స్త్రీలు వచ్చారు.

ఈ జానకిని అశోకవనానికి తీసుకెళ్లండి. అక్కడ నయాన్న భయాన్న ప్రలోభపరచి నా వశమగునట్లు చేయండి. ఒక సంవత్సర కాలం నిరీక్షించండి. అప్పటికి లొంగిరాకపోతే నా ప్రాతఃకాలం భోజనానికి చంపి వండి వడ్డించండి అన్నాడు ఆ మూర్ఖుడు

తన చావుకు తానే గడువు కోరుకున్నట్లున్నది. రాక్షసాంగనులు సీతా దేవిని అశోకవనంలో ఉంచి రక్షిస్తున్నారు.

# కర్తవ్యపాలన

ఓరీ దౌర్భాగ్యుడా! చచ్చిసాధించడమంటే ఇదే నన్నమాట. ఎంతపని చేశావు. నా కంఠస్వరాన్ని అనుకరించావు. నా కొంప ముంచావు అని చచ్చిన మారీచుని ఉపాలంభిస్తూ రాముడు సీతాలక్ష్మణుల విషయంలో భయశంకాసమన్వితుడైనాడు.

మనస్సు జానకి విషయంలో ఆందోళన చెందుతున్నది. మారీచుని చంపి ఆశ్రమంపైపు త్వరగా అడుగులు వేస్తున్నాడు. గుండె దడదడ కొట్టుకొంటున్నది. వెనుకన నక్క వికృతంగా అరుస్తున్నది. వనంలో చాలా మృగాలు అపసవ్యంగా సంచరిస్తున్నాయి. ఎదుట [illegible]. పక్షులు స్వరాలు శ్రావ్యతను కోల్పోయాయి. [illegible].

[illegible] ఉన్న సీతాలక్ష్మణులకు హా సీతా! హా లక్ష్మణా! అన్న మారీచుని మాట వినిపించి ఉంటుంది. వారు నా విషయంలో భయాందోళనలు చెందుతారు. లక్ష్మణుడు నాకోసం సీతను విడిచి పరుగెత్తుకొని వస్తాడు. సీత ఈ ప్రోత్సాహం చేస్తుంది. ఈ అవకాశాన్ని రాక్షసులు ఉపయోగించుకొంటారు. రాక్షసుల చేత సీత [illegible]. మరి ఊహించలేకపోయాడు రాముడు.

అడుగులు తొట్రుపాటు పడుతున్నాయి. రాళ్లు, రప్పలు గమనించడంలేదు. మాటిమాటికి సీత విషయంలో అమంగళం శంకిస్తున్నాడు [illegible]. ఎడమకన్ను అదురుచున్నది. కన్నులనీరు క్రిక్కి[illegible] లాంటి నడక పడుతూ లేస్తూ అన్యమనస్కుడై వస్తు

న్నాడు రాముడు. ఆశ్రమ దరిదాపులకు చేరుకొన్నాడు. అనుకు న్నంత పనీ అయింది. లక్ష్మణుడు ఎదురొస్తున్నాడు. ఎంత పని చేశాడు. నిర్జనమైన వనంలో సీతను విడచి వస్తున్నాడు. సీత రాక్షస హాపహృత, భక్షిత, మృత. అబ్బబ్బా ఈ ఊహ భరించలేను. లక్ష్మణా సీతను విడిచి ఎందుకిలా వచ్చేస్తున్నావు. రాక్షసావాసం జనస్థానంకదా మనచే శిక్షింపబడి ప్రతీకారం కోసం ఎదురుచూస్తుంది, శూర్పనఖ. ఎంతపని చేశావు లక్ష్మణా అంటున్నాడు ఉద్రేకాన్ని ఆపుకోలేక.

ఏమి చేయను అన్నయ్యా! నీ కంఠస్వరంవిన్న మా గుండెలు బెదిరిపోయినాయి. వదినైతే మూర్ఛితురాలయి, నన్ను నీ దగ్గరకు వెళ్లమని ప్రోత్సహించింది. ఆమె దుఃఖానికి మేరలేదు. నీ గుణగణాలను ప్రదర్శించి ప్రదర్శించి కంటికి మింటికి ఏకధారగా ఏడుస్తున్నది.

ధైర్యం చెప్పాను. నీ పరాక్రమం సాటిలేనిది అన్నాను. దేవదానవ మనుష్యాదులు నిన్ను జయించలేరన్నాను, అది రాక్షస మాయ. వారు కామరూపులు. మారుగొంతులతో కూస్తారు. వంచిస్తారు. బహుశావాడు మారీచుడు. సందేహంలేదు. వాణ్ణిచంపి అన్నయ్యా వస్తూ ఉంటాడు. అని నేను ఎన్ని విధాలుగా చెప్పినా వినిపించుకోలేదు, నన్ను నీదగ్గరకు వెళ్లమని నిందించింది. ఆశా అభిమానాలులేనివాడ్ని అని అంది. మిత్రరూపంలో వచ్చిన శత్రువువి అంది. భరతుని ప్రోత్సాహంతో మాతో వచ్చావు. మా కష్టాలు చూసి నన్ను లోబరచు కోవాలని చూస్తున్నావు. ఈ విధంగా ఎన్నో నిష్ఠురాలు పలికింది నా దురదృష్టం ఇలా వెంటాడింది అన్నయ్యా. ఆ మాటలు సహించలేక వనదేవతలకు సీతను అప్పచెప్పి నీ కోసం పరిగెత్తుకొంటూవస్తున్నాను అన్నాడు లక్ష్మణుడు.

రాముని ధైర్యం చెదిరింది. ఎంతపని చేశావు లక్ష్మణా!

ఆడవారి మాటలు ఇలాగనే ఉంటాయి. వారికి దూరదృష్టి ఉండదు. నా శక్తి సామర్థ్యాలు తెలిసికూడా నీవు ఆమెను విడిచి రావడం మంచి పనికాదు. అని ఆక్షేపిస్తూ రాముడు లక్ష్మణునితో ఆశ్రమానికి చేరుకొన్నాడు.

ఆశ్రమంలోని చెట్లు చేమలు నిస్తేజితంగా యున్నాయి. పుష్పాలు వడలిపోయాయి. పశు, పక్షాదులు కంట తడిపెడుతున్నాయి ఆశ్రమం పద్మాలులేని సరస్సులా శూన్యంగా ఉంది. వస్తుజాతం అంతా హస్తవ్యస్తంగా ఉంది. గాలి స్థంబించింది. జానకీ........జానకీ అని పిలవగా ప్రతిధ్వనించాయి తప్ప ఓయ్ అను పలుకులేదు. జానకి జాడలేదు.

అన్నయ్యా ధైర్యం వహించు. ఈ ఆశ్రమ ప్రాంతంలో ఎక్కడైనా ఉంటుంది. పూలుకోయుటకు వెళ్లి ఉంటుంది. గోదావరి స్నానం కోసం వెళ్లియుంటుంది. ఊసునకై వనరమణీయం చూచు [illegible] వెళ్లియుంటుంది. పద అంతటా అన్వేషిద్దాం అన్నాడు లక్ష్మణుడు

[illegible] సరోవరాల్లోనూ, గోదావరీ తీరాల్లోనూ, పూలపొద [illegible] వెతికారు. [illegible] సీత జాడ కనబడలేదు. రాముడు రక్తాంత [illegible] దుఃఖావేశంతో వెతికినచోటనే వెతుకుతున్నారు. వనంనుండి [illegible] తిరుగుతున్నారు. కొండగుహలు వెతికారు. మతిస్థిరం తప్పి [illegible]. ఉన్మత్తత ఆవహించింది. కనిపించిన చెట్లను, పుట్టను [illegible] అడుగుతున్నాడు నా సీత ఎక్కడా అని? లేళ్లు, దుప్పులు [illegible], [illegible], సింహములు వాటిని కూడా ప్రశ్నిం [illegible] చూశారా అని. ఎక్కడ ఉంది ఎటు వెళ్లింది. ఓ [illegible]! నా సీత ఎక్కడ ఉన్నదో చెప్పు, ఏమి మాట్లాడలేదు [illegible] ఉన్నాయి.

లక్ష్మణా ఎవ్వరూ బదులు చెప్పడంలేదు. నిశ్చయంగా రాక్షసులచేత తినివేయబడింది. రాక్షస భయంచేత ఏమీ జవాబు చెప్పడంలేదు.

అన్నయ్యా! ధైర్యం వహించు. సీత కొరకు వెదకుతున్న మన ప్రయత్నం ఫలించకపోదు. యత్న సాధ్యంకాని పనిలేదు అంటున్నాడు లక్ష్మణుడు. ఆతనికి కూడా మతి చెలించనట్లున్నది.

ఇంకెక్కడ సీత ఈ శరీరం విడిచివేస్తాను. ఆలాచేస్తే పై లోకం తండ్రి అడుగుతాడు. 14 సంవత్సరాలు అరణ్యవాసం పూర్తి చేయక ఎందుకు వచ్చావు అని,, ఊఁ.... హు....లాభంలేదు. పోనీ అయోధ్యకు వెళితే తల్లులకు, తమ్ములకు సీత ఏది అంటే ఏమి చెప్పాలి? నా కూతురు ఏది అని అడిగితే జనకునికి ఏమి జవాబు చెప్పేది? నువ్వు వెళ్లిపో లక్ష్మణా! భరతునికి నేను చెప్పినట్లు చెప్పు నువ్వే యావజ్జీవితం రాజ్యం చేసుకో. నాకోసం చాలా కష్టాలుపడ్డావు నువ్వు కూడా వెళ్లిపోయి తల్లులను సేవిస్తూసుఖించు లక్ష్మణా! మంద భాగ్యుడను. దుర్భర దుఃఖంతో ఈ నట్టడవిలో జీవశ్ఛవంలాగ గడిపేస్తాను. అన్నాడు రాముడు. విచారించాడు, రోదించి, పంచమహా భూతాలు గతి తప్పినట్లున్నాయి. అంతటా నిశ్శబ్దం ఆవరించింది.

రామచంద్రా ఎంత చక్కగా నీ పాత్రను ఒప్పించావు. కరుణ రసాన్ని కంటికి కనిపించునట్లున్నది. కాదు కాదు యదార్థమే జరిగింది. నీ పడినపాట్లు ఏలోకంలో ఎవ్వరూపడినట్లు లేదు. 15 సంవత్సరాలలోపనే అడవికి బయలుదేరావు. తరువాత 12 సంవత్సరాలు అయోధ్యలో ఏలా గడిపావో ఏమో తెలియదు. మళ్లీవనవాసం క్షణంలో పొందబోతున్న రాజ్యం భ్రష్టమైంది. 14 సంవత్సరాలు అరణ్యవాసం. అడవిలో ఎన్నితిప్పలు పడ్డావో పితృమరణం, మాతృ వియోగం, ఆత్మీయులకు దూరమగుట. రాక్షసబాధలు, ఆకులు,

అలవులు తినుట, నిలిచినచోట నిలువకుండుట, నీడలాఉండి ప్రాణంతో సమానమైన జానకిని ఎడబాయుట ఇంకా ఎన్నికడగండ్లు పొలనవలెనో ఎవరికి తెలుసు.

మనుష్య మాత్రుడు ఇన్ని ఇక్కట్లును తట్టుకున్నాడా? తట్టుకున్న శాంతముగా మనగలడా? జీవితము అంతా పూలబాట కాదు. మానవునికి ఈ గుణపాఠముచాలును. అనుకుంటున్నాడు లక్ష్మణుడు రాముని అనుసరిస్తున్నాడు.

ఓయి సూర్యుడా మావంశమునకు మూలపురుషుడవు. సకల ప్రాణులకు ధర్మసాక్షివి. నీకు తెలియకుండా లోకములో ఏవి జరగవు. చెప్పవయ్యా నీకు నమస్కారము చేస్తున్నాను. "సూర్యుడు నిస్తేజుడు అయినాడు" దిక్కులు తేజోరహితము అయినది.

లక్ష్మణా! ఇక సహించేదిలేదు. నదులను, సముద్రములను శోషింపజేస్తాను. పర్వతాన్ని పడగొట్టిస్తాను. అరణ్యాలను సకల ప్రాణులతో కాల్చేస్తాను. ప్రళయకాల రుద్రుడువలె చతుర్దశ లోకాలను భస్మీపటలం చేసేస్తాను. నేను నా పరాక్రమము ఎల్లలోకాలు తెలుసుకుంటాయి. అని రక్తాంతనేత్రుడై ధనస్సును హస్తమున ధరించి నారి గట్టిగాలాగేడు.

అన్నయ్యా! కోపించకు కోపానికి ఇది సమయం కాదు నీవు కోపిస్తే ముల్లోకములు వ్యాకులమైపోతాయి. ప్రకృతి తనగతిని తప్పుతుంది. ఒకడు చేసిన తప్పిదనానికి ప్రపంచ వినాశనము చెయ్యడం ధర్మంకాదు ఆ చంద్రార్కమైన యశస్సునకు కళంకము కాకూడదు. స్వభావతః నీవు శాంతుడువు కోపము ఉపసంహరించు నీ నీతిని మరవకు క్షమించు నాతోకలసి ధైర్యముతో మరల మరల సీతను అన్వేషించుదాము రా. మనకు కనబడకపోదు. ఆమె వార్త అయిన

తెలియకపోదు.

అదిగో అటుచూడు అవి ఎవడివో పాదారగుర్తులు. పక్షి కాళ్ల గుర్తులు. ఈ ప్రదేశములో చిన్నా భిన్నాముగా ఉంది. ఇక్కడ ఏదో యుద్ధము జరిగినట్లుయున్నది. అదిగో రక్తపుబొట్లు. వస్త్రఖండములు భగ్నములైన ధనస్సు తూణీరములు. విరిగిన రథము చచ్చిన గుఱ్ఱాలు, గతించిన సారథి. భగ్నమైన ఛత్రచామరాలు. అదిగో జటాయువు రెక్కలుతెగిన పక్షి పడియున్నది. కొనఊపిరితో కనబడుచున్నది. శరీరము రక్తసిక్తమైనది, స్పృహ తప్పింది. అన్నాడు లక్ష్మణుడు. రాముడు సమీపించేడు.

ఆ పక్షిపై కొంచెం నీరుచల్లేరు. తుండముతెరచి కొద్దిగా నీరుపోసేరు. పక్షి కన్నులుతెరచింది. అస్పష్టంగా ఏమో అంటున్నది.

" ప్రభూ! సీతమ్మను రావణుడు అపహరించుకుపోయేడు. లంకకు వేరొక రథము మీద చేరియుంటాడు. " మరి మాట్లాడుటకు శక్తిలేదు. నమస్కారము ఇంత మాత్రము చెప్పి జటాయువు ప్రాణాలు విడిచేడు.

సీతాదేవిని రక్షించడాన్కి రావణాసురునితో యుద్ధం చేసింది జటాయువు. ప్రాణము ఉన్నంత వఱకు స్వామిసేవ చేసింది. చివరకు జరిగిన విషయము విన్నవించి ఉపకారము చేసింది. పక్షి అయితేనేం జీవితము ధన్యంచేసుకుంది. రాముడు దుర్భర దుఃఖాక్రాంతుడైనాడు

లక్ష్మణా! నాకై ప్రాణము ఉన్నంతవరకు శ్రమించి అసువులుబాసిన ఈ జటాయువునకు దహన సంస్కారము చెయ్యాలి. చితిని పేర్చు అన్నాడు.

లక్ష్మణుడు అన్నయ్య మాట ప్రకారము చితిని పేర్చాడు. రాముడు స్వయంగా జటాయువునకు తండ్రికివలె దహన సంస్కార ములు చేసాడు. జలతర్పణం గావించేడు. అక్షయలోకాలు కలుగు గాక అని ప్రార్థించేడు.

పక్షియగు జటాయువు జీవితం ధన్యమైంది. మానవలోకం అట్లు మనవలదా! పునరావృత్తి రహితమైన ఉత్తమగతిని పొందిన పక్షి యగు జటాయువు మానవ ప్రపంచానికి ఆదర్శం కాదా! అనుకు న్నాడు లక్ష్మణుడు. రామునితో సహ దక్షిణ దిక్కును అనుసరించి జానకిని వెదుకుతూ బయలుదేరారు.

## పంపాభిగమనం

ఆశాజీవి మానవప్రవృత్తి. అంతేకాబోలు చిత్రమైనది. ఈ జగత్తు సుఖదుఃఖాది ద్వంద్వాలతో ముందుకు సాగిపోవలసిందే. అయితే కర్తవ్యం లేదా? లేకేమి లక్ష్యసాధన, దైవచింతన, పరోప కారము. స్వార్థత్యాగం సకలము శ్రేయస్సు వసగును. ఇలా ఎన్నెన్నో ఉన్నాయి. అందుకోసం కష్టాలన్ని సహించవలసివస్తుంది. అలాగే సుఖాన్ని త్యాగము చెయ్యాలి.

రామలక్ష్మణులు దక్షిణదిశగా వెలుతూ సీతాన్వేషణ గావి స్తున్నారు. అది దట్టమైన అడవి. వెదురుపొదలు, మొగలిదొంకలు గచ్చతుప్పలు, బలుసు, వెంపలి, బ్రహ్మచెముడు, నాగచెముడు ఎక్కడికక్కడే ఉన్నాయి. మార్గము కంటకాకీర్ణముగా ఉంది. శిలా ఖండాలు శ్రమను కలిగిస్తున్నాయి. సరీసృపాలు అంతటా సంచరిస్తు న్నాయి. తలచుకుంటే ఒళ్లు జలదరిస్తున్నది. రామలక్ష్మణులు క్రౌంచారణ్యం అతిక్రమించారు. అది ఒక పర్వతబిలము. చాలా లోతు గాయున్నది. అందులోనుండి ఒక రక్కసి వచ్చింది. పెద్దపొట్ట,

కుఱుతచేతులు, పొట్టికాళ్లు, పొడువుకోరలు, అంతకు మిక్కిలి ముక్కు అయోముఖి. దానిపేరు కూడా అయోముఖే. కొందరు అంటారు అశ్వ ముఖి అని. అశ్వముఖియైన అజాముఖియైన అయోముఖియైన అది రక్కసే.

రామలక్ష్మణులను చూసింది. బలే బాగున్నాడు లక్ష్మణుడు తెల్లగా ఉన్నాడు. లక్ష్మణుని అది పట్టుకుంది. నన్ను పెళ్లాడు లేకుంటే మ్రింగుతాను నిన్ను అన్నది.

అన్నయ్యా! ఈ దెయ్యం నన్ను మిర్గుతుంది. ఎలాగైనా వదిలినట్లులేదు. సీత నీకు తప్పకుండా లభిస్తుంది. అయోధ్యకు వెళ్లిపో సుఖంగా ఉండు. రాజ్యము చేసుకో అప్పుడప్పుడు నన్ను తలచు కుంటూ ఉండు. ఈ జన్మకు నాకు అదిచాలు అన్నాడు లక్ష్మణుడు దైన్యంతో.

తమ్ముడూ! నీవేనా అంటున్నది ఈ మాటలు. ఈ పిరికితనం ఎక్కడు నుండి వచ్చింది. నిన్ను వదలి వెళ్లీపోవాలా? చూస్తావేం? దాని ముక్కు చెవులు కోసి పంపించు. అన్నాడు రాముడు.

అంతలోనే దైన్యం, అంతలోనే పిరికితనం. లక్ష్మణుడు కత్తితీసి అయోముఖి ముక్కుచెవులు కోసి పంపించాడు. అది పెద్దగా రొదచేస్తూ డొంకలలోంచి, పొదలలోంచి, పగెరుత్తి పారిపోయింది. అన్నయ్యా ఈ అడవి అంతా రాక్షస మైనదిగా వుంది, చిఱుతలు, సివంగులు, ఏలుగులు, ఏనుగులు, పులులు ఇట్టి క్రూరమృగసంచారం కలిగివుంది. చెట్లకొమ్మలనుండి భయంకరంగా పాములు నోరు తెరచి వేర్లాడుచున్నాయి. ఎక్కడికక్కడ చిన్నవి, పెద్దవియైన కొండలు, నీటిపట్టులు, అని చెప్పుచుండగానే మూడు యోజనములు గడిచి పోయారు.

మతంగాశ్రమానికి. పంపాసరోవరానికి, ఋష్యమూకానికి. జనస్థానానికి అది నడిమి ప్రదేశము.

అన్నయ్యా! మనకింకా కష్టాలు గట్టెక్కినట్లు కనిపించటం లేదు. అపశకునములు గోచరిస్తున్నాయి. కొన్ని జంతువులు, కొన్ని పక్షులు, మరికొన్ని అవ్యక్తములైన ప్రాణులు దగ్గరకు సమీకరించ బడుతున్నాయి. వీటితోపాటు రామ లక్ష్మణులు కూడా సమీకరించ బడుతున్నారు. మరికొంత సేపటికి తెల్సింది వారికి. ఏవో రెండు చేతులు దగ్గరకు ఆకర్షిస్తున్నాయి. ఆ చేతులు ఒక యోజనం పొడవు ఉన్నట్లు తెలుస్తున్నాయి. బలసిన కొండచిలువ వలె ఉన్నాయి. ఇదేదో అడవి మృగం . నడిచే కొండలా వుంది. దీనికి తలలేదు. పెద్దపొట్టమాత్రమే ఉంది. పొట్టలోనే నోరు, దాని పై భాగంలో ఒకటే కన్ను గడ్డితో కప్పిన నుయ్యిలా వుంది. నోటిలో బారడేసి రెండు కోరలు, పారల్లాంటి పళ్ళు నోరు తెరవబడి ఉంది. ఆ నోటిలో ఆకర్షింపబడిన జీవజాలం ప్రవేశిస్తున్నది.

రాముడు లక్ష్మణుడు దాని నోటిని సమీపించారు. కొంచం సేపటిలో మ్రింగబడతారు కూడా.

అన్నయ్యా! ఇక మన పని సరి. చిన్నమ్మ కోరిక నెరవేరి పోయింది. మనం దీని కడుపులో ప్రవేశించవలసిందే అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణా! ఆలసించకు దాని కుడిచెయ్యి భుజాల దగ్గరకు తెగగొట్టు, నేను ఈ ఎడమ చేతిని నరికివేస్తాను. అన్నాడు రాముడు సోదరులు ఇరువురు రెండు భుజాలను తెగవేసారు. బాధను భరించలేక పెద్దగా రొదచేసి రామలక్ష్మణులారా రక్షించండి అన్నాడు కబంధుడు

ఎవరివి నువ్వు? నీకీ వికృత రూపం ఎలావచ్చింది? అని రాముడు కబంధుడుని ప్రశ్నించినాడు.

నమస్కారాలు రామలక్ష్మణులారా! దండము పెట్టడానికి కూడా చేతులు తెగిపోయినాయి. నాకు పూర్వ స్మృతి కలిగింది. అవివేకానికి తగినఫలితం నేను అనుభవించేను. ఆ ఫలితమే ఈ [illegible] రూపం. మహాత్ములారా! నేను "ధనువు" అనువాడను. దైవికంగా లభించిన మహా బలపరాక్రమాలతో ప్రజా పీడనం చేసాను. వికృత రూపంతో ఎందర్నో పొట్టన పెట్టుకున్నాను. స్థూలసూరుడు అను ఒక ఋషిని చంపబోయాను. ఆతడు కోపించి ఈ రాక్షస రూపం కలుగునట్లు శపించాడు. తప్పు తెలుసుకొని కాళ్లమీద పడి ఆ ఋషిని వేడుకొన్నాను. ఆ ఋషి దయకలిగి "రామలక్ష్మణులచేత ఎప్పుడు సంహరింపబడతావో అప్పుడు నీ వికృతరూపం తొలగి పోతుంది" అని అనుగ్రహించాడు.

ఏం చెప్పను రామా! బ్రహ్మకోసం పెక్కు సంవత్సరాలు తపస్సు చేసాను. అతను ఇచ్చిన వర ప్రభావమువల్ల సహజ కుటిల బుద్ధితో ఇంద్రునితో యుద్ధానికి తలపడ్డాను, దేవతలకు దానవులకు సహజ వైరము గదా! ఇంద్రుడు కోపించి తన వజ్రాయుధముతో నా తలపై కొట్టాడు. ఆ తల కడుపులోనికి దిగిపోయింది. అప్పుడు కబందుడనైనాను. అందుతే శిఖ, అందకపోతే కాళ్లు ఏం చేయను? కాళ్లు పట్టుకొని దేవరాజును ప్రార్థించేను. ఇంద్రుడు నా ప్రార్ధన విని కడుపులోనే నోరు, కన్ను యోజనం పొడవు చేతులు ఇచ్చాడు. నేడు మీ ఖడ్గ ప్రహారంచేత నాచేతులు రెండూ తెగి శాపవిముక్తుడనైనాను ఈ శరీరాన్ని అగడ్తలో పడవేసి దగ్ధంచేయండి. నాకు పూర్వరూపం వస్తుంది. అన్నాడు కబందుడు.

రాముడు ఆజ్ఞచేత కబంధుని శరీరము గోతులో పడవేసి

కట్టెలు వేసి కాల్చివేసాడు లక్ష్మణుడు. ఆ మంటల నుండి దివ్య కాంతి మంతమైన దేహం కలవాడై "ధనువు" ఉద్భవించి కృతాంజలియై రామలక్ష్మణులను ఇలా ప్రార్థించాడు.

పుణ్యశీలులారా! శాపగ్రస్తుడను అగుటచే నా అజ్ఞానం నశించి పోయింది. వైదేహి దొరుకుటకు ఉపాయం తెలియజేస్తాను. ఇక్కడకు సమీపంలో ఋష్యమూకం అను పర్వతం ఉన్నది. దానిపై సుగ్రీవుడు అను వానర వీరుడు సోదరుడైన వాలిచే పరాభవింప బడినవాడై ఆ కొండమీద నివశిస్తూ ఉన్నాడు. అతడు మహాబలశాలి ధైర్యశాలి, కార్య కుశలుడు. అతనితో స్నేహం చెయ్యండి. బలశీలు రైన పెక్కురు వానరులు కలరు. వారిని నలుదిక్కులకు పంపి సీతను వెదికించగలడు. మీకు విజయం కలుగుతుంది.

దానికి సమీపంలోనే మతంగాశ్రమం ఉన్నది. అక్కడ 'శబరి' అను మతంగాశ్రమణి సన్యాశిని నీ దర్శనం కోసం ఎదురు చూస్తుయున్నది. అక్కడకు వెళ్లండి. అక్కడనే పంపా సరోవరం కలదు. నందన వనంలాంటి కాననం, అమృతోపమానములైన ఫల మూలాదులు, లభిస్తాయి. ఇక్కడ నుండి కొంచం పశ్చిమ దిశగా వెళ్లండి. మీకు మేలు కలుగుతుంది. నాకు శలవు అని 'ధనువు' అదృశ్యుడైనాడు.

రామలక్ష్మణులు దనువు చెప్పిన మార్గమున అనుసరించి తమ ప్రయాణము సాగించారు.

ఎంతటి వివేకవంతుడైన మానవుడిని మనస్సును చెలింప జేసే ప్రమాదం కలిగిన యెడల పరులను ఆశ్రయించక తప్పదు. అంతమాత్రాన్న తమ సామర్థ్యం కుంటుపడునట్లు తలంచనక్కరలేదు.

రామలక్ష్మణులు మార్గమధ్యములో పనస, నారికేళ, జంబు

జంబీర, కదళీ, కపిత్థ, చూత, నారంగ. ఖర్జూరాది ఫలవృక్షాలు– వాటిని అల్లుకొని ద్రాక్షాది లతలు ఫలవంతాలై చూడబడుతున్నాయి చంపక, కరవీర, వకుళ కర్ణికారాది పుష్పవృక్షాలతో ఆ వనం చైత్రరథంలా ఉంది. వెండి, బంగారు, తామర పూలతో హంస, కారండవ చక్రవాకాది జలపక్షులతో సరోవరాలు ఆకర్షిస్తున్నాయి. అక్కడక్కడ మతంగ శిష్యులు ఫలసమిధకుశహస్తాలతో ఆశ్రమాలకు నడుస్తున్నారు. ఆ ప్రశాంత నిలయమైన ప్రదేశంలో ఒక రమణీయమైన ఆశ్రమం కలదు.

ఆశ్రమంలో రామలక్ష్మణులు అడుగుపెట్టారు. ఎదురుగా వచ్చింది వృద్ధ శబరి. ముఖానికి చేతులు అడ్డంపెట్టి దగ్గరకు వచ్చి వారిని చూస్తున్నది శబరి.

ఎవరూ? మా రాఘవుడేనా? రామ లక్ష్మణులారా రండి రండి అంటూ వ్యాఘ్రాజినం పరచింది. కూర్చోండి మీరాకకోసం ఎన్నాటినుండో పదమూడు వత్సరాలై ఎదురుచూస్తూ, కన్నులు కాయలు కట్టిపోయినాయి, మీరు చిత్రకూటానికి వచ్చినపుడు మా గురువు "మతంగ మహర్షి" మిమ్ములను పూజించి పునీతులుకండి అని మాకు సెలవు ఇచ్చి వెళ్లిపోయారు. అదిమొదలుకొని ఎదురు తెన్నులు చూస్తున్నాను. అన్నది శబరి.

రామలక్ష్మణులు ఆసనంపై అధిష్టించారు, ఆశ్రమం అంతా జ్యోత్స్నా వితానం ఆవరించినట్లున్నది.

శబరీ! కుశలమా! నీతపస్సు నిర్విఘ్నముగా కొనసాగుతున్నదా? నీ ఆశ్రమం నిరుపద్రవమైనదికదా నీ గురు శుశ్రూష సఫలమైనదా? అని రాముడు ఆనందముతో శబరిని కుశల ప్రశ్నలు వేసాడు.

భక్తిరసావేశంతో కన్నుల నీరు స్రవిస్తుండగా శబరి

తన రెండు చేతులు జోడించి "రామభద్రా! లక్ష్మణదేవా! మీ దర్శన భాగ్యంచేత నాతపస్సు ఫలించింది. గురుసేవ సఫలీకృతమైందిస్వర్గాది సకల పుణ్యలోకాలు లభించాయి. నా జన్మ తరించింది. ఈ పల్లవములో మీ పాదములు ఉంచండి. ప్రభూ" అని చెప్పి పంపాసరోవర ఉదకములతో పాద ప్రక్షాళనము గావించి సకల పాపక్షయకరమైన పాదోదకాన్ని పానము చేసినది. శిరస్సున జల్లుకున్నది. పూలమాలతో అలంకరించింది స్వామిని.

స్వామీ ధన్యురాలను. ఈ ముసలిదానికి ఈ మూలపడియున్న దానికి నీవే దిక్కు అని నీ దర్శనంకోసం తపించిన దానికి సాక్షాత్కారం కలిగించేవు. ధన్యురాలను. పునీతురాలనైనాను.

నీ దివ్య పాదసేవకోసం నిరీక్షిస్తూ నీ దివ్య మంగళ విగ్రహ దర్శనం కాంక్షించిన ఋషులకు, ముక్త పురుషులకు అలవికాని దర్శన భాగ్యం కలిగింది.

ఇదిగో ఈ చూత ఫలములు రుచ్యములైనవి, బాగాపండినవి ఆరగించండి. ఇవి రుచ్యములైన బదరీ ఫలాలు. ఇవి జంబూఫలాలు చాలా తియ్యగా వుంటాయి. ఇవి కదలీ ఫలాలు, ఇవి సుపక్వాలు, వీటినన్నిటినీ ఏర్చి, కూర్చి రుచిచూచి నీకోసం దాచి ఉంచాను. వీటిని ఆరగించండి ప్రభూ! అని శబరి భక్తి వినమ్రతతో పలికింది.

రామలక్ష్మణులు పరమ ప్రీతులై శబరి యొసగిన ఫలములను ఆరగించారు.

ఆర్యే! మతంగమహర్షి మహాప్రభావ సంపన్నుడని ధనువు వల్ల విన్నాను. అతని మహత్యము తెలియజేయ పలసిందిగా కోరుచున్నాను. అన్నాడు రాముడు.

ప్రభూ! ఇటు దయచేయండి. ఇదంతా మా గురువుల ఆశ్రమ ప్రదేశమే. నిరంతరం పత్ర, పుష్ప ఫల సంభారితాలై సకల ఋతు సంయమం వలే ఉంటాయి. ఇక్కడి చెట్లు, మృగ, పక్షి విశేషాలు విరుద్ధ ధర్మం కలవైనప్పటికి పరస్పర వైరం విడచి కలసి మెలసి ఉంటాయి. గంగా, యమునా, గోదావరీ మొదలగు సకల నదీనదాలు ఇక్కడ ఆయన మంత్రప్రభావముచేత వెలసిల్లిఉంటాయి వారు అధిష్టించు వేదికలు గంధ, పుష్ప, ధూప, దీపములు కలిగి ఎల్లప్పుడూ ప్రకాశిస్తూనే వుంటాయి. పువ్వులు వాడవు, సువాసనలు వీడవు, సప్తసాగరాలు యిక్కడ ఆవహించి వుంటాయి. ఆదే మతంగ సరోవరం. సకల పాపహరం. సర్వజన మనోహరం వారు, నిత్య స్నానం చేసిన ఆర్ద్రవసనాలు తరుశాఖలపై అర్ద్రంగానే వ్రేలాడతున్నాయి. ఈ పరిశరాలన్ని అతని దివ్యమహిమచేత పునీతాలే. సకల సంపత్ప్రదములే. సంతతానంద సందోహములే. ఈ విధంగా శబరి తమ ఆచార్య వైభవాన్ని తెలియజేసింది.

ప్రభూ! ఇకనాకు సెలవు. కటాక్షించండి. తమ దర్శనభాగ్యం చేత మా గురు శుశ్రూష వైభవంచేత పొందతగిన దివ్యలోకంలను పొందగల్గుతానని పలికింది.

శ్రీ రాముని అనుమతితో శబరి యోగాగ్నిలో తన శరీరాన్ని దగ్ధంచేసి, దివ్య సుందరమూర్తియై పునరావృత్తరహితమైన పుణ్య లోకానికి చేరుకొంది.

రామలక్ష్మణులు శబరి ధర్మనిష్టను, ఆచార్యభక్తిని, అతిధి సేవను, భక్తిభావంను తలచి సంభ్రమాశ్చర్యాలతో అటు కదలి పంపాసరోవరానికి బయలుదేరినారు.

పరిమళాలు వెదజల్లుతూ చల్లని పిల్లతెమ్మరలు పంపాసరోవరం

నుండి వెలువడి రామలక్ష్మణులకు స్వాగతం తెలియజేస్తునట్లున్నాయి మనస్సునకు ఆనందం కలుగగా పంపాతీర సోయగాన్ని నిరీక్షిస్తూ రామలక్ష్మణులు సరోవరాన్ని సమీపించారు.

॥ తృతీయ పుష్పం సమాప్తం ॥

# చతుర్థ పుష్పం

## "మైత్రి"

దినకరుని ఉదయారుణారుణ కిరణంసోకి పద్మినీ కపోలం మరింత ఎర్రపడింది. ముగ్ధారుణ ముఖకమలం త్రపాసుందరమై, దళములరవెూడ్పు కనుగప సోయగంతో ప్రభాకరునకు స్వాగతం పలుకుచున్నది. భ్రమరములు ఝుమ్ము ఝుమ్ము అని ఎగురుచు పుప్పొడి దుమారాన్ని రాల్చుచు ప్రణవ శ్రుతినాలపిస్తున్నాయి. ప్రత్యూష పవనాంకురాలు మేనునకు హాయిని గొలుపుతున్నాయి.

లక్ష్మణా! పుష్పితాగ్రములైన ఈ తరువుల శాఖోపశాఖలు పెనవేసుకొని ఒండొంటిని ఆలింగనం చేసు కొంటున్నట్లున్నాయి. కమ్మని వాసనలు వెదజల్లు పూలలతలు తరుశాఖలనల్లుకొని కన్నుల పండుగ చేస్తున్నాయి. కలహంసలు మానస సరస్సునందువలె, రాయంచలీ పంపాసరోవరమున నీదులాడుచున్నాయి. జలపక్షుల కలకల ధ్వనులు సరోవర జలతరగల సవ్వడి, శ్రావణ శుభగమై యున్నది. హరిణములు ధర్భకబలము మెసవి రోమాంచం చేయు చున్నది. శాఖకములు వాటిచుట్టూ గంతులిడుచున్నవి. కరికదంబమును చూచి దారుమెయిలను భ్రమసిన నెమళ్ల గుంపులు నృత్యం చేస్తు న్నాయి. నడుమ నడుమ క్రేంకారం చేస్తున్నాయి. వృక్షములు, పల్లవితములు, కుసుమితములై వసంత హేళావిలాసాన్ని సూచిస్తున్నాయి

వృష్టి సంభోదయమున సకలప్రాణులు సన్నిహిత ప్రియాప్రణయంబున సరసకేళీ వినోదాన్ని పొందుచున్నవి. ఈ సమయంలో ప్రాణంకంటే గరీయసి అయిన మైథలీవియోగం దుర్భరం కదా! అని రాముడు ఏడ్చాడు.

అన్నయ్యా! ధైర్యం విడనాడకు కష్టాలు కలకాలం కాపురం చేస్తాయా? సహనాన్ని విడనాడకుండా వదినగారి జాడ నరయుదము ఆమె కనబడుటయో, ఆమె ఉనికి సమాచారం తెలుసుకొనుటయో జరుగుతుంది. మతంగాశ్రమంలో శబరి మనకు సుగ్రీవుడు. ఈ ప్రాంతంలో ఉంటాడని తెలిపింది. అతని మైత్రి, సహకారాలు, జానకీ నివాస ప్రయత్నాలు మనకు తెలియజేస్తాయి. ఆ శ్రమణి మాటలు వ్యర్థంకావు.

అదిగో అటు చూడు ఎవరో ఒక మహాపురుషుడు. భిక్షురూపంలో ఇటే వస్తున్నాడు. అతన్ని చూడగా అత్యంత వినయవిధేయత కనబడుతున్నదని లక్ష్మణుడు రామునితో పలికాడు. ఇంతలో ఆ భిక్షువు సమీపానికి రానేవచ్చాడు. తలవంచి చేతులుజోడించి 'అభివాదయే' అంటూ నమస్కారము చేశాడు రామలక్ష్మణులకు.

ప్రభువులు దివినుండి భువికి దిగివచ్చిన దినకర హిమకిరణులవలె ఉన్నారు. ఎవరు మీరు? సర్వం సహాచక్రాన్ని పాలించగల మహనీయులు. ఈ నట్టడవులలో తిరుగుతున్నారు. కుశుమ సుకుమార దేహాలు. మహారాజ సౌధాంతరాళల్లో మసలవలసిన మహాపురుషులు కర్కశ, కఠిన, కంటకాకీర్ణమైన కాంతారాల్లో తిరుగుచున్నారు. జగన్మోహనాకారులై, జటధారులుగా గోచరిస్తున్నారు. సువిశాల వక్షస్కులు ఆజానులంబితభుజులై, శర–చాప, అసిధారులై ఇక్కడ వనచరులకెల్లరకు మిక్కిలి భయాన్ని కల్గిస్తున్నారు. ఈ విధంగా భిక్షుకుడు తన సందేహాన్ని – భయాన్ని వ్యక్తపరిచాడు.

లక్ష్మణా! ఇతడు భిక్షు మాత్రుంకాదు. సకలశాస్త్ర పారంగతుడు ఇంద్రాదినవ వ్యాకరణ కోవిదుడు. వేదవేత్తవలే కనిపిస్తున్నాడు. ఉచ్చారణ, వినయం, విధేయత చూడగా మనకు సన్నిహితుడు కాదగినవాడుగా కనబడుతున్నాడు. కల్లాకపటం వీని ముఖంలో కనబడుటలేదు. తెలుసుకో ఈతనిస్థితిగతులు అన్నాడురాముడు లక్ష్మణునితో

ఎవరు నీవు? మేము కోశలాధీశుడైన దశరథ కుమారులం. వారు మా అన్న రామచంద్రుడు. నన్ను లక్ష్మణుడంటారు. తండ్రి మాటననుసరించి అడవులు తిరుగుచున్నామన్నాడు లక్ష్మణుడు.

మిక్కిలి దగ్గరకుచేరి భిక్షువు రెండుచేతులు జోడించి నమస్కరించి " మమ్మేలిన మా ప్రభువులే " నమస్కారము. నేను వానరుడను. కామరూపుడను. నా పేరు హనుమంతుడు. నీ సేవకుడను నా ప్రభువు సుగ్రీవుడు ఇక్కడకు పంపగా ఈ రూపాన వచ్చాను. అన్నయైన వాలిభయం చేత సుగ్రీవుడు ఈ ఋష్యమూక పర్వతంపై నివశిస్తున్నాడు కొందరు వానరులతో కలిసి. మతంగమహర్షి శాప భయంచేత వాలి ఈ పర్వతానికి రాలేడు. అతడు పంపిన చారులేమో నని మిమ్ములను చూచి భయపడుతున్నాడు. ఇప్పుడు మాకు ఆ భయం తొలగిపోయింది. దయచేయండి. మిమ్ములను మా ప్రభువులైన సుగ్రీవుని సమక్షానికి తీసుకొని వెళతాను. నా భుజస్కంధము లనధిరోహించండి, మీతో చెలిమి మా ప్రభువులకు, మాకూ మహోపకారమౌతుంది అన్నాడు హనుమంతుడు.

" సేవింపతగిన తీర్థం చేరువైంది. వెతకబోయిన తీగకాలికి తగిలింది " అన్నట్లు మీ ప్రభువు చెలిమిని మేమునూ కాంక్షిస్తున్నా మన్నాడు రాముడు. శ్రీరాముని మాట హనుమంతునకు ఆనందం కలిగించింది. శ్రీరామచంద్రా! మా ప్రభువు కృతార్థుడైనాడు. అధిష్టించండి భుజములపై. మా ప్రభువువద్దకు తీసుకొని వెళతానని

హనుమంతుడనగా –

విశాలవక్షుడు, మహాభుజ పరాక్రమం గల హనుమంతుని భుజాలపై రామలక్ష్మణులు అధిరోహించారు. క్షణకాలంలో వానరుడు పరివారంతో కూడియున్న సుగ్రీవుని సమక్షంలో రామలక్ష్మణులనవ రోహింపచేశాడు,

ప్రభూ! మనజీవితాలు–కోరికలు సఫలీకృతాలైనాయి. వీరే మనప్రభువులైన ఇక్ష్వాకులగు రామలక్ష్మణులని హనుమ సుగ్రీవునకు రామ లక్ష్మణులను పరిచయం చేశాడు. సుగ్రీవుడు లేచి నిలబడి నమస్కారం చేశాడు. శ్రీరాముడు చేయిచాచి సుగ్రీవుని సన్నిహితంగా చేసుకొన్నాడు. చిరకాల మిత్రులు హఠాత్తుగా సన్నిహితులైనప్పుడు కలిగిన ఆనందం వారిరువురిలో కలిగింది. అన్యోన్య సందర్శనంచేత కరద్వయ పీడినంచేత ఆనంద పులకితులైనారు రామ సుగ్రీవులు.

హనుమంతుడు సమయజ్ఞుడై రామ సుగ్రీవులకు వృక్షశాఖలు రెంటిని ఆసనంలుగా అలంకరించాడు. వేరొక చందనశాఖను లక్ష్మణునకు ఆసనం కల్పించాడు.

మిత్రమా! సుగ్రీవా! రావణాపహృత సీత! ఆమెను అన్వేశిస్తూ నీ సహాయం, చెలిమి అపేక్షించి ఇక్కడకు వచ్చినానన్నాడు. రాముడు సుగ్రీవునితో.

రామా! నీ చెలిమి నాకు సకల భోగభాగ్యాలు కలిగిస్తాయి. ధన్యుడనన్నాడు సుగ్రీవుడు. ఇంతలో చిదుగులేర్చి చిచ్చురగుల్కొల్పెడు హనుమంతుడు. రామ సుగ్రీవులు అగ్నిసాక్షిగా ప్రదక్షించి చేతులు చాచి కరతలముల నంది మైత్రిని ప్రమాణీక రించారు.

పిమ్మట గాఢంగా ఆలింగనం చేసుకొన్నారు.

పూలజల్లులు తరుశాఖల నుండి కురిశాయి.

సాప్తపదీనం సఖ్యం అన్నారు పెద్దలు. మిత్రమా! మనకింక దాపరికమేమి విడువడు ఆపన్నుని. హితార్థ కలితుని చేస్తాడు మిత్రుడనిపలుకుతూ హనుమంతునితో సుగ్రీవుడు హనుమా! గుహలో ఉంచిన ఆభరణముల మూట ఇటు తీసుకొనిరా. అవి జానకివేమో మిత్రుడు కనుగొని తెలుసుకొంటాడని పలికాడు.

హనుమ తెచ్చిన మూటను విడియుజరచి రామా! గమనించుము ఈ అభరణాలు జానకివి అవునో కావో అన్నాడు. వీటిని కరకు రక్కసుని బారిపడి ఆర్త యగుచు ఒకయతివ దిగవిడిచిన ఈ రత్నాభరణాలు, పచ్చని పట్టుచీర కొనముడివైచి మేము నలువురము ఇట కూర్చొనియుండ నడుమ పడినవి, ఇవి వైదేహివి అనియే తలుస్తానని సుగ్రీవుడు ఆభరణాలు రామునికి చూపాడు,

ముడివైచిన వస్త్రఖండము, ఆభరణాలు చూచి రాముడు సీతవిగా గ్రహించి, యెదను అత్తుకొని కన్నులు మూడిచి పారవశ్యం చెంది. నిట్టూర్చాడు.

లక్ష్మణా! ఇవి కర్ణాభరణాలు, ఇవి హస్తాభరణాలు, ఇవి కంఠాభరణాలు; అవి మణిమంజీరాలు, అవి అంగుళ్యకాలని రాముడు తమ్మునికి వేరువేరుగా చూపించాడు.

నాకవేమి తెలియదన్నయ్యా! ఇవిగో ఈ మణిమంజీరాలను గుర్తుపట్టాను. వీటిని నిత్యం వదినగారి పాదాభివందనం చేస్తాను కనుక ఈ పాదాభరణాలు జానకివేనని లక్ష్మణుడు వాటిని పరిశీలించి

సస్వలోకసుకాని తిరుగ అన్నకు సమర్పించాడు.

రామా! జానకిని ముల్లోకాల్లో ఎక్కడ ఉన్నా వెదికి నీకు సమర్పిస్తాను. విచారించకు అని సుగ్రీవుడు రామునికి ధైర్యం చెప్పాడు.

సంతోషించి శ్రీరాముడు మిత్రునియందు విశ్వాసం కలవాడై చెప్పాలి ఇంతకూ నీ వృత్తాంతం చెప్పనేలేదు. నీకీ ఋష్యమూకి వాస మేమి? నీకూ మీ అన్నవలన కలిగిన భయమేమి? ఎందువల్ల మీలో ద్వేషాన్ని కలిగిందని ప్రశ్నించాడు.

సుగ్రీవుడు అధోముఖుడై కొంతవరకు మౌనందాల్చి దీర్ఘం నిట్టూర్చాడు మిత్రమా! నీకు చెప్పక మరెవరితో చెప్పుకొంటాను. కలిగిన కష్టాలు ఆత్మీయులతో చెప్తే కొంత ఉపశమిస్తుంది. విను

## " కన్నీటిగాథ "

రామా! ఇక్కడకు కూతవేటు దూరములోనే వుంది. కిష్కింద నగరం. అదే మా రాజధాని ఋక్షవీరజుడు అను పుణ్యాత్మునకు ఇరువరు కుమారులు. వారిలో పెద్దవాడు మాయన్న "వాలి" అనువాడు నేను రెండవవాడను సుగ్రీవుడను.

తండ్రి తరువాత మా యన్న జ్యేష్టాను క్రమంగా ఈ ఈ కిష్కిందనగరానికి రాజైనాడు. అతని తండ్రిగా భావించి సేవిస్తు రాజకార్యాల్లోను అన్నిట చేదోడు వాదోడుగా ఉంటున్నాను. ఇలా ఉండగా ఒకనాటి అర్ధరాత్రము కటిక చీకట్లు నల్లడల కాటుక పూసు నట్లు వ్యాపించాయి. తమస్సు వడిలో సకల ప్రాణులు మైమరచి నిద్రిస్తున్నాయి. మింట ఒకటి రెండు చుక్కలు మిణుకు మిణుకన

మిణుగులులాగ మెరుస్తున్నాయి. ఆ గాఢ నిశథ నిశ్శబ్దంలో ఉరుము లురిమినట్లు దెసలు పగులునట్లు భయంకరమైన ఒకశబ్దం వినిపించింది

మాయన్నకు మాకు నిద్రాభంగం కల్గింది. దెబ్బతిన్న సింహంలాగ కోపోద్రుక్తుడై మా యన్న గృహము నుండి వెలుపలికి వచ్చి ఇరువురము అంతఃపుర స్త్రీలకు అనుసరించాము. వెలుపల రక్కసుడు భీకరముగా అరుస్తు మా యన్నని యుద్ధానికి ఆహ్వానించాడు. మేమంత వాదిస్తున్న లక్ష్యపెట్టక మా యన్న అర్ధరాత్రి ఆ మాయావితో కలియబడ్డాడు.

అది ఒక స్త్రీ కృతంగా ఏర్పడీన వైరం అట. పౌడుగరిచి మెల్లచరిచి మాయావి, వాలి యుద్ధానికి బయలుదేరారు. బాహాబాహి. కచాకచి, ముష్టాముష్టిగ యుద్ధం సాగుతున్నది. హుంకారాలతో హంకారాలతో తిరస్కారలతో వాలి మాయావులకు భయంకరంగా సంగ్రామం సాగుతున్నది. ఒకరినొకరు అంతం చూసుకునేటట్లున్నారు క్రమ క్రమముగా ఆ మాయావి మా యన్నను యుద్ధం చేస్తూ ఒక పర్వత బిలం ప్రవేశించాడు.

భాతృభావంతో నేను మా యన్నను అనుసరించాను. ఆ రాక్షసుని సంహరించుకాని, నేను వెనుకకు మరలను అనిచెప్పి నన్నిట నిలిపి తాను ఆ బిలంలో చొరపడ్డాడు. వృక్ష లతావృతమైన ఆబిలం మృత్యు ముఖ గహ్వారంలా ఉంది. ఆ బిలంలో పలు రక్కసులుతో యుద్ధం చేస్తున్నాడు. వెలుపలకు హృంకృతులు రక్కసుల ఆహాకారాలు ఆక్రిందనలు పిడుగుల చప్పుడ్లాగ. చరుపులు, పిడికిలి పోట్లు బర బరలు ఈడ్పులు, జర జరలు, వివిధరకాల ధ్వనులు వినిపిస్తున్నాయి. కొంతవడికి ఆ సంగ్రామం చల్లారునట్టు అనిపించింది. బిల ద్వారం నుండి మడుగుతో కూడిన రక్తం ప్రవహించ సాగింది.

మా యన్న రక్కసులకు చిక్కి దుర్మరణం పొందినాడని చెడు తలంపు కలిగింది. దుఃఖం ముంచుకొచ్చింది. ఆ బిలంలో ఎందరు రాక్షసులు ఉన్నారో! ఒకరా ఇద్దరా! అన్న బలపరాక్రమాలు తెలుసుకొని మనస్సు కీడు శంకిస్తున్నది. ఆ రక్కసి మూక సజీవ సమాధి కావాలని ఒక పర్వత శిఖరాన్ని బిలద్వారానికి అడ్డు పెట్టి దుర్భర విచారంతో నగరికి మరలి వచ్చాను.

ప్రజలు ఈ వార్త తెలిసి కొంత విచారించారు. నేను చేసిన పనికి సంతసించారు. అరాచకమైన ఈరాజ్యాన్ని కాపాడమని నన్ను అభిషేకించారు. గత్యంతరం లేని నేను రాజ్యాన్ని స్వీకరించి జనామోదంగా పాలిస్తున్నాను.

ఇంతలో ఒకనాటి మలిపొద్దున మా యన్న ఆ రక్కసి మూకను పరిమార్చి బిలద్వారం పద్దగల పర్వతశిఖరాన్ని కాలదన్ని పట్టణం ప్రవేశించాడు. మృతుడైన వాడు బ్రతికి వచ్చినవానిగ తలచి సంతోషంతో ఎదురు వెళ్లి అభివాదనం చేసాను. నిర్దాక్షిణ్యంగా తలపై తన్నబోయేడు. నీ రాజ్యాన్ని నీవే పాలించు అన్నాను. జరిగింధి అంతా తెలియజేసాను,

కాని నన్ను భాతృ ద్రోహిని రాజ్యకాంక్షిగాను తలచాడు. మాయన్న. ఎవరు ఎన్ని చెప్పిన వినక అధిక్షేపించాడు. నక్కవినయం అన్నాడు. తనను చంపడానికే బిలం ద్వారంలో రాయి అడ్డుపెట్టావు అన్నాడు. ప్రజలను వంచించి రాజ్యం అపహరించానని కక్షకట్టి నన్ను చంపడానికి ఉద్యుక్తుడైనాడు. నా భార్యను ఆక్రమించి నిలువ నీడలేకుండా తరిమికొట్టి, నా ప్రాణం తీయాలని వెంబడించాడు

అన్నిటికన్నా ప్రాణ భయం గొప్పది కదా రామా! ఆ భయంతోనే నలుదిక్కులా పరిగెత్తాను. ఎక్కడికి పోయినా అన్న

...ంతో మృత్యువు వెంటాడుతునే యున్నది. ఎక్కడా త్రాణ దొరకలేదు, చివరకి ఈ మలయ పర్వతం మీద మతంగాశ్రమ సమీపంలో ఈ ఋష్యమూక పర్వతం మీద నేను, నా మిత్రులు, సచివులు, అనుచరులుతో చేరుకున్నాను. శాపభయంచేత మా యన్న గాని ఆతని వారెవ్వరు ఇక్కడకు రాలేరు. అనిచెప్పి సుగ్రీవుడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

రామా! ఇందులో నా తప్పు ఏముంది చెప్పు? కొంత కాలం గడిచాక మిమ్ములను ఈ పర్వత పరిసరాల్లో చూచి భయపడ్డాను వాలి పంపించాడేమో నని భ్రాంతి చెందాను. నా అదృష్టంవల్ల దయా సముద్రుడువైన నీ దర్శనం చెలిమి కల్గింది. ఇది నా దుర్భర విషాద గాథ. భార్యను రాజ్యాన్ని పోగొట్టుకొని ప్రాణ సంశయంతో నిన్ను ఆశ్రయించాను. నా శత్రువుని పరిమార్చి నా సర్వస్వాన్ని సమకూర్చి రక్షించ దగినవాడవు. రామా! నీవే నా రక్షకుడవు. అని సుగ్రీవుడు రామునితో విన్నవించుకొని కన్నుల అశ్రువు నింపాడు.

మిత్రమా! విచారింపకు పుట్టినవారికి కష్టములు కలుగుతునే ఉంటాయి. కానీ అవి శాశ్వతముగా నిలవవు. నీ యన్నను నాకు చూపించు. అమోఘమైన నాబాణంతో భాతృ వంచితుడగు నీయన్నను హ...చి నీ ...జ్యాన్ని సమకూరుస్తాను. మిత్రకార్యం నెరవేర్చ... నా ...ంచింది. నిస్సంశయంగా చెప్పుచున్నాను. విచా... ...వాలిని నాకంటపడునట్లు చెయ్యి. ఇప్పుడే పోయి వాలిని ...ధ...హ్వానించు. రాముడు రెండు మాటలు ఆడడు. త్వరగా వెళ్లు అన్నాడు రాముడు.

## బల పరీక్ష

ప్రభూ ధన్యుడను, మా అన్న మిగుల పరాక్రమశాలి, దేవ

దానవులకజేయుడనితలుస్తాను. ప్రతిదినం సూర్యోదయ సమయాన్ని తూర్పు సముద్రం నుండి పడమర సముద్రానికి, దక్షిణ సముద్రం నుండి ఉత్తర సముద్రానికి చేరి ఉపాసిస్తాడు. ఇది అతని నిత్య కృత్యంలో ఒకటి. అతని వేగాన్ని గాలికూడా అతిక్రమించ లేదు. పర్వతాలను రెండు చేతులా పట్టి బంతుల్లాగ ఆడి వినోదిస్తాడు. మహావృక్షాలను పెకలించి వన్య జీవులకు అమితమైన భయాన్ని పుట్టిస్తాడు. అని చెప్పి సుగ్రీవుడు ఎదుట చూపి రామచంద్రా!

అటుచూడు మంచుకొండ శిఖరం కాదు. ఐరావతం తాల్యాక అస్థిపంజరం కాదు. అది ఒక ఎనుబోతు తాలుక—ఎండిపోయిన కంకాళం ఎముకల గూడు.

రామలక్ష్మణులు అటు చూసారు. నిజమే అది ఎనుబోతు ఎముకలగూడు.

ఒకనాడు ఏమైందంటే? మరల ప్రారంభించాడు సుగ్రీవుడు

ఓ.... ఓ.... ఓ.... పిలచినా వినబడుట లేదు. ఎలా వినబడుతుంది? రాత్రనక పగలనక నిరంతరం ఒకటే హోరు. గాలి వీచినప్పుడు ఎల్లా ఆహోరు పెరుగుతుంది. కడలిలోకల్లోలం పెరుగుతుంది కొండలులాగ లేస్తున్నాయి కెరటాలు. కాళ్ల దగ్గరకు వచ్చేసరికి నురుగులతో తెల్లనై మళ్లా వెనక్కి మరలిపోతున్నాయి. ఆ కెరటాలు. నా కోరిక తీరేదెట్లు ? కాళ్లకు తాకి దాసోహం అంటున్నాడు ఈ సముద్రుడు. అనేక జలజంతువులకు నెలవు. అనేక రత్నాలకు కూడ నిలయమే. అలిగాడంటే దేశాన్నే ముంచేస్తాడు. అపార బలసంపత్తి కలవాడు. చేస్తే వీడితోనే యుద్ధం చేయ్యాలి. దగ్గరగా మళ్లీపిలుస్తాను: ఓ.... ఓ.... ఓహో

ఆధ్వని అలల ధ్వనిని మించిపోయింది. సముద్రపు హోరులో కలసిపోయింది. అదిగో ఏదో అస్పష్టమైన రూపం ఏదో అంటున్నది:

ఓయి దుందుభి చూసావా నాస్థితి నేను ఎప్పుడు ఇలాగే ఉంటాను అన్నాడు సముద్రుడు.

నీతో యుద్ధం చేయ్యాలి అన్నాడు దుందుభి.

నీకు ఒళ్లు బలసింది. నాకు ఒళ్లు లేదు. నేను ద్రవరూపాన్ని కదూ: నీ యుద్ధకాంక్ష నేనెట్లు తీరుస్తాను అన్నాడు సాగరుడు గంభీరంగా

అయితే మరి ఎవరితో యుద్ధం చేయాలో చెప్పు అని రంకె వేసాడు దుందుభి.

అదిగో అటుచూడు అతడే నగాధిరాజు హిమవంతుడు అన్నాడు సాగరుడు.

దుందుభి వెనక్కి చూడకుండా పరుగెత్తాడు. ఒక్క ఉదుటున పంచుకొండను తన కొమ్ముల పొడిచాడు. తలతో ఢీ కొన్నాడు. కొన్ని పర్వతశకలాలు గిరిశిఖరాలు దుందుభి శరీరం మీద పడ్డాయి. అవి వాడి వంటిమీద పువ్వుల వానలా ఉంది. దున్నపోతు మీద వాన కురిసినట్లు అయింది. వాటిని విదలించుకున్నాడు. గట్టిగా గర్జించాడు. నాతో యుద్ధం చెయ్యమని. చెట్లమీద పక్షులు ఎగిరిపోయాయి. గుహలు ప్రతిధ్వనించాయి.

నేను కదలలేను. నాస్థితి ఎప్పుడూ ఇంతే వెళ్లు కిష్కింధకు

అక్కడ వాలియనే వానరరాజు కలడు. వాడు నీకన్నివిధాల యుద్ధాతిద్యం ఇవ్వగలడు, నీకోరిక తీరుతుంది. సమానకయ్యం అవుతుంది అన్నాడు హిమవంతుడు.

వాడా బాగా జ్ఞాపకం చేసావు. నా కొడుకుని "మాయావి" ని పొట్టన పెట్టుకున్నాడు. ఇప్పుడే వెల్తున్నాను. వాడిని చంపి మాయావికి ఆత్మశాంతి కలిగిస్తాను. నా శరీరబలాన్కి తగిన అవకాశం లభించింది. అని దుందుభి కిష్కింధకు చేరాడు. పెద్దగా గర్జించాడు.

ఓ వాలీ!.... ఓ వాలీ నీవు ఇప్పుడే యుద్ధానికి రావాలి. నీయంతు తేలుస్తాను. కుర్రాత్రిపు మాయావినికాదు. నేను వాడి అబ్బాని లోపలనుండి వెలుపలకు రా అరుస్తున్నాడు దుందుభి. డెక్కలతో భూమిని చీల్చేస్తున్నాడు. కొమ్ములతో కోటగుమ్మాల విదలించేస్తున్నాడు. తలతో గోడ పగలకొడుతున్నాడు.

అది రాత్రి సమయం. అంతఃపురంలోంచి వెలుపలకి వచ్చాడు వాలి.

ఏయి ఏవరునువ్వు రాత్రినక పగలనక ఏమిటి నీ ఆగడం? అన్నాడు వాలి.

ఓహో! ఇది రాత్రికదూ వెల్లువెల్లు ఆడాళ్లతో కూడిన మత్తున చంపరాదు. ఈ రాత్రి నీ వాళ్లతో గడుపు బంధువులకు చెప్పుకో నీ కొడుక్కి అందరికి ఏమేమి ఇవ్వాలో చెప్పాలో చేసేయి. రేపే తెల్లారేకే నీతో యుద్ధం చేస్తాను? అన్నాడు దుందుభి.

నీకోరిక ఇప్పుడే తీర్చేస్తాను అని వాలి హుంకరిస్తూ ఆరాత్రి దుందుభితో తలపడ్డాడు. కొంతసేపు వెనుకముందు గుంజాటం జరిగింది

ఒక్క ఉదుటునవచ్చి తన రెండు చేతులుతో కొమ్ము పట్టుకొన్నాడు వాలి. తలకాయ నులిపేసాడు. మెడ మెలితిప్పాడు. గుడ్లు వెలుపలికి వచ్చాయి, పిండిన తడిబట్టనుండి నీరు కారిపోయినట్లు దుందుభి మెడ నుండి రక్తం కారిపోతున్నది. అరవడాన్కి నోరు పెగలలేదు. వెళ్ల కిలాపడ్డాడు. ఇటు అటు దొర్లుతున్నాడు. వాలిచేతి పట్టునుండి విడిపించుకుందుకి ప్రయత్నం చేస్తున్నాడు. వాలి మెడను నులుపేస్తునేయున్నాడు. దుంధుభి పొట్టమీద ఒక్కతన్ను తన్నేడు. ఘోరంగా అరుస్తూదుంధుభిమరణించాడు వాలి వాడినాలుగుకాళ్లుపట్టిమీదకెత్తి గిర గిరా తిప్పి విసరేసాడు. నోటనుండి చెవులనుండి కన్నులనుండి రక్తం స్రవిస్తుండగా కిష్కిందనుండి ఇక్కడ పడ్డాడు. ఈ ప్రాంతం అంతా రక్తసిక్తమైంది. అదేవాని కళేబరం. వేలకొలది ఏనుగుల బలం కలవ్ అన్నాడు. సుగ్రీవుడు.

ఆ కంకాళం కొండలా ఉంది. రాముడు దగ్గరకు వెళ్లిచూసాడు తన ఎడమకాలి బొటనవేలితో కదలించాడు. ప్రేళుని నేలమోపి చిన్నగా మీటాడు. అది సుగ్రీవాదులకు ఆశ్చర్యం గొలుపుతూ ఎక్కడకో చిమ్మపడ్డాది. బహుశ నూరుయోజనాల దూరంలో పడ్డాది అని అంచనా.

మిత్రమా! రామచంద్రా నీ సామర్థ్యం తెలుసుకున్నాను. ఆనాడు ఈ రాక్షసుని నోటినుండి జారిపడిన రక్తబింధువులు. ఈ ఆశ్రమ ప్రాంగణంలో పడ్డాయి. మతంగమహర్షి తన దివ్యదృష్టితో గ్రహించి " ఈ ఆశ్రమం అపవిత్రత గావింపజేసిన వాలి, వాని అనుచరులు ఇక్కడకువస్తే వెంటనే వారితలలు, వేయిశకలాలై నశిస్తారు " అని శపించేడు. అందుచేత నేను ఇక్కడ నివసింపగలిగాను కానీ....

ఏమిటి ఆలోచిస్తూన్నావు? సంశయించక చెప్పు అన్నాడు రాముడు.

ప్రభూ! వానరుడను చపలచిత్తుడను నిన్ను తెలియనావశమా?

ఈ శరీరం చాలా కాలమై రక్తమాంసాలు ఉడిగిపోయింది. ఇప్పుడు ఎండులాగ తేలిపోయింది. నీ బలాన్ని సంకోచిస్తున్నానని తలంపకు. వాలి మహాపరాక్రమశాలి. నేను వానిచేత అవమానింపబడి ఇక్కడ తలదాచుకున్నాను. నాకు యుక్తాయుక్త పరిజ్ఞానం నశించింది. అందుకనే నాకు నీ బలం విషయంలో శంకతీరలేదు. ఇదిగో సాల వృక్షాన్ని నీ బాణంతో తెగవేయి ఇలా పరీక్షిస్తున్నానని కోపించకు'' అన్నాడు సుగ్రీవుడు వినయముతో.

వెంటనే రాముడు బాణమును శరాసనమునకు సంధించి ఆకర్ణాంతము ఆకర్షించాడు. సుగ్రీవుడు చూపిన సాలవృక్షాన్ని ఛేదించి ఆ క్రమంలోఉన్న మరి ఆరు మద్దిచెట్లను తెగవేసిందాబాణము ఆ వేగంతో భూమిని చీల్చి పాతాళం ప్రవేశించి మరల వెనుతిరిగి రాముని అమ్ములపొదిలో ప్రవేశించింది.

సుగ్రీవుడు మొదలగు వానరులు ఆదృశ్యమును చూసి ఆశ్చర్యచకితులైరి.

సుగ్రీవా! నీ సంశయం తొలగిందా? ఇక నీ శత్రువును చూపించు. వెళ్లి నీ యన్నను యుద్ధానికి పిలు నాకు కనబరచు అనిన రాముని మాటలకు సంతసించి సుగ్రీవుడు కిష్కింధకు చేరు కున్నాడు. రామలక్ష్మణులు అనుసరించారు.

## వాలి వధ

అంగబలం ఉంది. అర్థబలం ఉంది. అధికార బలం ఉంది. ఇహలోకం ఏమంది. ఎదురులేని మనస్తత్వం ఏర్పడింది. తమ్ముడు

వేపు తేరి చూడలేదు. వాడి భార్యా వాడి రాజ్యం అంతానాదే. ఇంద్ర పుత్రుడు హేమమాలి వాలి అనుకొంటున్నాడు. ఇక ఆడిందే ఆట పాడిందే పాట అయింది. ఆవార రాజ్యంలో తను పెద్దవాడు అగుట చేత సుగ్రీవుని విషయంలో పితృ సముడను అని మరచాడు. ఆతని భార్య స్నుషాపుత్రీ సమురాలు. ఈ వానర లోకంలో ఈ కోతిమూక ఆలోచించే స్థితిలో లేదు.

మాయావిని చంపి బిలం నుండి వెలువడి వచ్చిన తన యన్నకు చేతులు కట్టుకొని నమస్కరిస్తూ సోదర ధర్మాన్ని అనుసరించి రాజ్యాన్ని మరల సుగ్రీవుడు అన్నకు సమర్పించాడు. అయితే మరి యెందుకు వాలికి తమ్మునిమీద పగ? వాడి ప్రాణాలు తీయతగినంత కార్పణ్యం ఎందుకు ఆవహించింది? దయా, దాక్షిణ్యం. ధర్మం న్యాయం, అన్ని మరచి కర్కశత్వంతో తమ్ముడు ప్రాణాలు తీయదల్చాడు మతంగమహర్షి శాపం వల్ల తను ఈ ఋష్యమూకపర్వతం చేరలేకపోయాడు. అదే లేనిచో సుగ్రీవుని గతి యేమయ్యేది.

సుగ్రీవుడు సూర్యుని అంశవల్ల జన్మించేడు. ఎవరు ఏ అంశవల్ల జన్మించినా కార్పణ్యం జనించి స్వార్థం పెరిగి, ధర్మంతరిగి నపుడు కాలపాశాన్కి కట్టుపడవలసినదే. ఈ సత్యం అంతుతెలియని భూత కాలంనుండి వర్తమానం మీదుగ సుదూర భవిష్యత్తులో ప్రకాశిస్తూనే యుంటుంది. కాలం సమీపిస్తేనేగాని కంటికి అగుపడదు. [illegible]తోచదు.

ఇంతలో వాలికి సుగ్రీవుని కంఠధ్వని వినిపించింది. అన్నా యుద్ధానికి రా.

ఏమొచ్చింది వీడికి? నన్నే యుద్ధానికి పిలుస్తున్నాడే మళ్ళ ఋషికొండ చేరకుండానే వీడిని హతమార్చాలి అని వాలి గుహనుండి

వెలుపడిన సింహంలాగ అంతఃపురం నుండి వెలుపడ్డాడు. నగర ప్రాంగణంలో సుగ్రీవుడు నడగొండవలే నిల్చియున్నాడు. పరస్పర జిగీషతో వాలి సుగ్రీవులు యుద్ధానికి తలపడ్డారు. రాముడు సమీప ములో చెట్లు మాటునుండి గమనిస్తున్నాడు వీరి యుద్ధాన్ని. సమాన బలం, రూపం, కలిగి అశ్వనీ కుమారులులా ఉన్నారు. అమోఘమైన తన శరాన్ని విడిచిపెడితే అది తన మిత్రునికే తగిలితే ఇంకేముందా! అపైని ఊహించలేకపోయాడు రాముడు. తను తన భార్య తన సోదరుడు తనవారంతా సుగ్రీవునిపై ఆధారపడి యున్నారు. పైగా మిత్రద్రోహం. మిత్రవధాసంజనిత పాతకం తనకు సంభవిస్తుంది.

రాముడు సంధించిన శరమును ధనస్సు నుండి తొలగిం చాడు. సుగ్రీవుడు పిష్టాంగోరు శరీరుడై అన్నచేత అవమానించబడి ప్రాణాలు అరచేత పట్టుకొని తిరిగి తన కొండకు చేరుకున్నాడు దీర్ఘ నిశ్వాసాలతో, రక్తసిక్తమైన శరీరంతో అధోముఖుడై రాముని ఎదుట నిలిచాడు.

నిన్ను నమ్ముకొని అన్నతో యుద్ధంచేసి భంగపడ్డాను అని వేరే చెప్పనక్కర లేదు అతనిరూపం

మిత్రమా! విచారించకు రాముడు రెండు మాటలు అడడు

ఇదిగో ఈ గజపుష్పమాల. ఇదే నీవిజయమాల. కంఠమున ధరించు ఇప్పుడు వెళ్లు నీ అన్న హతుడైనవానిగ తలంచు.

తుల్య వయో రూపబల చేష్టలుగల మిమ్ముల గుర్తించడం అసాధ్యమైంది. బాణంవదిలితే అది పొరపాటున నీకే తగిలితే నీవేగాదు నీతోబాటు మేమంతా హతులయిన వారిగతలంచు. నీపైని మా ప్రాణాలన్ని నిలిచిఉన్నాయి ఈ పుష్పమాలికను ధరించి మీయన్నను

మరల ఆహ్వానించు. విజయం నీదే, అని రాముడు మాయామానుషవిగ్ర హాత్మమునకు తగు రీతిని సుగ్రీవుని ప్రోత్సహించాడు.

వానర రాజులో నమ్మకం ధైర్యం ఉత్సాహం కలిగేయి. అంతకంటే తన పరతంత్ర భావం చెరగని ముద్రవేసింది. మనసులో రాజ్యకాంక్ష రమణీలోలత యన్నను జయించగలనను ధీమ ఏకమై రాముని యందు, రామ బాణము యందు మతిమరుపు కలిగిందేమో సుగ్రీవునకు లేకుంటే తొలుత పరాజయం ఎందుకు కలిగింది. ఏమో లోగుట్టు పెరుమాళ్ళకె ఎరుక.

రామా: రాజ్యం, రమా, ప్రాణం నీ యధీనం నీ ఆజ్ఞను సిరసావహిస్తు అన్నని యుద్ధానికి పిలుస్తాను అని అన్నాడు వినీతుడై సుగ్రీవుడు.

సుగ్రీవుడు, హనుమంతుడు. నీలుడు, నలుడు మున్నగు వానరులతో రామలక్ష్మణులు కిష్కిందకు బయలుదేరేరు. చెట్లు,చేమలు తుప్పలు, తీగలు. రాయి. రప్పలు. వీటితో కూడిన అడవి మధ్య నుండి బయలుదేరేరు. ఒక చోట ఒక చక్కని వనం గోచరించింది.

మిత్రమా: ఇది ఎవరితోట చాలా ఆకర్షనీయంగా ఉంది. నందన వనంలా ఉంది. ఇది ఎవరిదై వుంటుందని ప్రశ్నించాడు రాముడు.

ప్రభూ: ఇది అందమైన ఉద్యానం. ఆకులు, పువ్వులు. కాయలు, పండ్లతో నిండిన రమణీయమైన చెట్లున్నాయి ఇందులో అమృతంతో సమానమైన నీరములుగల సరస్సులు వున్నాయి. నిరంతరం పక్షులు కిలకిలధ్వనులు చేస్తుంటాయి. వన్యమృగాలు మైత్రితో సంచరిస్తాయి. కానీ ఎవరూ లోన ప్రవేశించరు. ఎవరైన పొరపాటున ప్రవేశిస్తే తిరిగి మరిరారు. ఇక్కడ ఏడుగురు మునులు వాయుభక్ష

కులై తలకిందులుగా తపస్సు చేసారు. శతసంవత్సరాలు గడిచాక వారు సశరీరంతో స్వర్గానికి చేరుకున్నారు.

ఇక్కడ త్రేతాగ్నులు ప్రకాశిస్తుంటాయి. దివ్య గంధం పరిమళిస్తుంది. సరస సంగీత స్వనం వినిపిస్తుంది. రామచంద్రా ఈ వనాన్కి నమస్కరించు ఆ సప్తమునుల ప్రభావంచేత శారీరక. మానసిక వ్యథలు అంతరిస్తాయి. అని సుగ్రీవుడు చెప్పగానే రామ లక్ష్మణులు నమస్కరించారు.

ఈ మహారణ్యంలో ఏ ప్రాంతంలో ఏ మహిమావిశేషాలు కలుగుతున్నాయో ఎవరికి తెలుసు? అడవులు నశిస్తే మనశ్రేయస్సే మంట కలుస్తుందని భావించారు రామలక్ష్మణులు.

అది దట్టమైన అడవి. విశాలం, ఉన్నతంలగు వృక్షాలతో కూడిన కిష్కింధా పరిసరానికి చేరారు. వారంతా రామలక్ష్మణులు వృక్షషండముల మాటున నిలచేరు. సుగ్రీవా! వెంటనే నీ అన్నను యుద్ధాన్కి ఆహ్వానించు అన్నాడు రాముడు.

రామునికి నమస్కరించి నగర ప్రాంగణం చేరాడు సుగ్రీవుడు. సింహంలా గర్జించాడు.

వాలి కోపోద్రేకంతో నడుమున కాసెబిగించి కదనరంగానికి బయలుదేరాడు. భార్య తార అడ్డువచ్చింది.

ప్రభూ! కోపం ఉపసంహరించి, తమ్మునియెడ దయచూపడం మన ధర్మం. మీచే అవమానింపబడి మరళా యుద్ధాన్కి పిలుస్తున్నా డంటే తగు సహాయం పొందేయుంటాడు. మన అంగదుడు వేగుల వారు చెబుతున్నారు. కోశలదేశాధీశులు, దాశరథులు, మహాపరాక్రమ

వంతులు, తండ్రి ఆజ్ఞచేత దండకాటవులలో తిరుగు తున్నారట. వారి ప్రాపు పొందియుంటాడు మీ తమ్ముడు. అతనితో యుద్ధం క్షేమం కాదు. తమ్ముని పిలిచి ఆదరించడం తక్షణ కర్తవ్యమని బోధించింది తార.

నాచేత నామీద స్నేహంచేత చెప్పిన మాటలిక చాలు. వీరుడు వీరగర్జనను సహించలేడు. నేను సుగ్రీవుని, హీన సుగ్రీవుని చేస్తాను. ఒక రాముని మాటయా, అతనికి అంత యుక్తా యుక్త పరిజ్ఞానం ఉండకపోదు. నన్ను వారించకు. నీవు అంతఃపురాన్కి వెళ్లు అని తారకు చెప్పి సుగ్రీవునితో యుద్ధాన్కి తలపడ్డాడు వాలి.

పచ్చని కాశధరించి కంఠమున గజమాలధరించి సుగ్రీవుడూ హేమమాల ధరించి వాలీ పరస్పరం యుద్ధం చేయ తలపడ్డారు. కొంతవరకు బాహాబాయి యుద్ధం చేసారు. కొంతవరకు ముష్టి యుద్ధం చేసారు, వృక్షాలు పెకలించి వాటితో మోదుకొన్నారు. ఆకాశములోని బుధాంగారక గ్రహముల యుద్ధంవలే ప్రళయ సూచికంగా ఉంది. క్రమక్రమంగా సుగ్రీవుని బలం సన్నగిల్లు తున్నట్లున్నది. ఇంతలో చెట్లచాటు నుండి రివ్వున ధ్వనిచేస్తూ ఒక బాణంవచ్చి వాలి హృదయానికి తగిలింది. జిల్లున రక్తం బాణఘాత నుండి స్రవించి, వాలి నేలకువాలిపోయాడు. హనుమత, లక్ష్మణ సమేతుడై కోదండపాణియై రాముడు వాలివద్దకు వచ్చాడు.

దివ్య తేజోవిరాజితుడై, ధనుష్పానితుడగు రాముడు తన్ను సమీపించగానే, వాలి బాధాజనితమైన వాక్కులతో ఇలా అన్నాడు—

రామా! ఉత్తమవంశ సంజాతుడవు. ప్రఖ్యాత బలపరాక్రమం కలవాడవు దయాదాక్షిణ్యాది గుణములు కలవాడవని ప్రశస్తికన్నవాడు సద్ధర్మపరుడవు. అట్టినీవు చెట్టు చాటునుండి నేను ఇతరులతో యుద్ధం

చేస్తుంటే బాణంవేసి నేల పడగొట్టావు. ఇట్టి అకృత్యాన్నాచరించి సత్పురుషులకేమి సమాధానం చెప్పుకొంటావు. దార్మికవేషం కలిగి హీనమైన నీ ప్రవృత్తికి గర్హించ తగినది. నీవు నాఎదుట పడినట్టయితే నేను చూడదగిన యమలోకం నీవే చూచియుందువు.

ధనధాన్యాలు, భోగభాగ్యాలు ఆశించి అక్రమాలాచరిస్తారు. బుద్ధిహీనులు, మేము అడవులలో ఫలమూలాదులు తింటూ తిరిగే శాఖమృగాలం. మా మాంసం నరులకు ఉపయోగపడదు. చర్మం ఎందుకూ పనికిరాదు. నావల్ల నీకెట్టి అపకారం, ఉపకారంలేదు. మరి ఎందుకు వధించావు. కాముకవైన నీవు నన్నే ఆశ్రయిస్తే జానకిని ముల్లోకాల్లో ఎక్కడఉన్నా వెతికి నీ సమక్షంలో ఉంచేవాడిని. ధర్మస్వరూపుడవైన ఆ దశరధునికి నీవెట్లు జన్మించావు. తృణచ్ఛన్న కూపంలాగ నీవు నీ ప్రవర్తన నీచాతి నీచమైంది.

సాధ్వి తారవలదు అన్నప్పటికీ, నీవు ధర్మజ్ఞుడవని నమ్మి మోసపోయాను. నీ నడవడి సూర్యవంశానికే కళంకం తెచ్చింది. బుద్ధికలవాడవైనచో సరియగు సమాధానం చెప్పు అన్నాడు వాలి.

ధర్మం సూక్ష్మమైనది. అది బలగర్వితులగు వారికెట్లు తెలుస్తుంది. లోకవృత్తము, ధర్మసూక్ష్మం తెలియుట అవశ్యమేమరి అపోహ తొలగిపోవాలి.

కాలపరిభ్రమణం ఆపలేరు. ఈ ప్రవాహంలో అనేక చిత్రవిచిత్రాలు ఉద్భావం చెందుతాయి. కొట్టుకుపోయాయి. ధర్మంమాత్రం అలాకాదు. అది కాలాన్ని అనుసరించదు. అది సత్యమైంది. నిత్యమైనది. త్రికాలరాధ్యమైంది. దాన్ని మనం కాపాడితే అది మనల్ని కాపాడుతుంది. వింటున్నావా వీరవాలీ. పంచభూతాలు, సూర్య,చంద్ర గ్రహ, నక్షత్ర. తారలు అవి గతి తప్పవు. స్వభావాన్ని విడుపవు.

సముద్రం ఎల్లనుదాటి రాదు. అగ్ని శైత్యం నొందదు. వాయువు స్పర్శగుణం తోపదు. భూమి తనక్షమాధర్మాన్ని కోల్పోదు

చక్రవత్ పరిభ్రమించే కాలం మృగం నుండి మనిషి దశగా మారుతున్న కాలం ఇది ఇట్టి పరిణామం ఒక్కసారిగా జరుగదు. దేశం కాలం, వాతావరణం, ఆహారం. పరిసరం, ఈ పరిణామాన్కి కారణాలు మనుష్యునిగా పరిణామం చెందడంతో ధర్మం కూడా మానవత్వాన్ని సూచించేదిగా వుంటుంది. అది శ్రేయోదాయకం. నీలో శాఖా మృగత్వం వలదు గదా.

ఇక ఇక్ష్వాకుల కాలం నుండి పంచాశత్కోటి విస్తీర్ణమైన ఈ భూమండలం పరిపాలింప బడుతున్నది. నిగ్రహానుగ్రహములు వారి అధీనములు. ధర్మం వారికి రక్షణీయ మైనది. ఆ వంశీయులం మేము. ప్రస్తుతం భరతుడు రాజ్యమేలుతున్నాడు. వాని ఆజ్ఞచేత ఈ అటవీ ప్రాంతంలో ధర్మాన్ని కాపాడుచూ అధర్మాన్ని నిగ్రహిస్తున్నాను. తండ్రి. గురువు, అన్న ఈ ముగ్గురూ పూజ్యులు. శిరాధనీయులు, శిష్యుడు, తమ్ముడు పుత్రసములుగా గ్రహించాలి. తమ్ముని భార్య నీకు కోడలౌతుంది. పుత్రి స్నుషా, సోదరి వీరిని అనుసరించిన వారికి మరణమే శిక్షగా శాస్త్రము. ధర్మ సూక్ష్మంగా గ్రహించాలి. శిక్షార్హుడిని శిక్షించకుంటే ఆ దోషం రాజుకు చెందుతుంది శిక్షించినట్లయితే దోషి తనదోషం నుండి విముక్తుడై ఊర్ధ్వగతిని చెందుతాడు. ప్రకృతమున నీకు దోష శంక లేదు. నాకు ధర్మభీరుత్వమూ లేదు.

ఇక నీవు వానరుడవు. మృగముల వేటాడుట రాజధర్మము పరోక్షంగానో. ప్రత్యక్షంగానో. పరులతో పోరాడుతున్నప్పుడు, పారిపోతున్నప్పుడు. ఉరులు పన్ని బెదిరించి వివిధ విధాల చంపుతారు. నీవు ధర్మలుప్తుడవు. శాఖా మృగమౌటచేత పరోక్షంగా చంపబడ్డావు.

ఈ ధర్మం నీవు గుర్తిస్తే నన్ను నిందించవు. అడవి యందున్ననూ అయోధ్యయందున్ననూ నేను క్షత్రియుడనే. దుష్ట నిగ్రహం, రాజ శాసనం నాకు కర్తవ్యం.

సుగ్రీవుడు భార్యను పోగొట్టు కున్నాడు. రాజ్యాన్ని ఆదరణను కోల్పోయాడు. నీచే తరమబడి నిలువ నీడలేక, ప్రాణ భీతిచే నీ తమ్ముడు నన్ను ఆశ్రయించి, సీతను వెతికి సమర్పిస్తానని నమ్మబలికాడు. అగ్ని సాక్షిగా నాతో సఖ్యం చేశాడు. అతన్ని ఆపద నుండి కాపాడటం మిత్రధర్మం. అదేచేశాను. ఎవరికైనా ఏనాటికైనా ధర్మాతిక్రమణం వినాశహేతువౌతుంది. నేరం తీవ్రమైనపుడు. నమ్మ దగినదపుడు శిక్షార్హమౌతుంది. ఈ విధంగా ధర్మనిరూపణ చేసిన శ్రీరామచంద్రునికి వాలి నమస్కరించాడు.

ప్రభూ! ధర్మస్థితి తెలియక శరముచే శరీర పీడితుడనై మిమ్మల్ని నిందించాను. క్షమించు రామచంద్రా! దయార్ద్ర దృష్టిచే నన్ను కరుణించి, ప్రాణంకన్నా ప్రియమైన పుత్రుడు. తారేయుడు నా అంగదుడు వాణ్ణి సర్వవిధాలా రక్షించు, నీకు సకల కార్యము లందు నా సోదరుని వలె సహకరిస్తాడు. ఇదియే నా కోరిక అని వాలి విరమించాడు.

ధనుష్పాణులైన రామ లక్ష్మణులను, హతుడైన వాలిని చూచి వానరులు భయంభ్రాంతులై నలుదిశలా పరుగెత్తారు. కొందరి వానరులవల్ల జరిగిన విషయాన్ని తెలుసుకొని తార దుఃఖా క్రాంతు రాలై అంగదుడు, వానర స్త్రీలు వెంటరాగ వాలి పడియున్న ప్రదే శానికి పోయి రామలక్ష్మణులను సుగ్రీవుని దాటి వాలి పాదాలచెంత వ్రాలిపోయింది. వాలిచే ప్రేమింపబడి లాలింపబడిన శ్రేష్ఠమైన దేవి, వాలి గుణ గణాలు. స్నేహ సౌహృదాలు పలవించి, పలవించి రాళ్ళు కరుగునట్లు రోధించింది వానర స్త్రీలు దుఃఖంచే వాలిచెంత రోదించారు.

నాథా తమ్ముని భార్యను ఆక్రమించుకొని, ఆతన్ని తరిమి
కు ఈ విధంగా ఫలితాన్ని పొందావు. అకార్యకరణం ఎంతటి
ప్రమాదాన్ని గురిచేయక మానదు. ప్రఖ్యాత బల విశేషాలు
న్ననూ, అకార్యం విషాహారంవలె ప్రాణం తీస్తుంది నన్నూ
నూ దిక్కుమాలిన వారిగా చేసినావు. రాజ్యము, భార్యను
సోదరుడు సంతసించుగాక. పరులతో పోరాడుతున్న నిన్ను
ాముడేల విచారిస్తాడు. నీ తోడిదే లోకం,

రామా! నా భర్తను చంపేసిన బాణంతోనే నన్ను చంపి
టుకో. స్త్రీ భర్తను విడచి జీవించదు. భార్య భర్తకు ప్రాణం
న్న అతనితో చేర్చిన నీకు పుణ్యమే కలుగును. స్త్రీవధవల్ల
కలుగదు. నవవైధవ్యదుఃఖం భరింపరానిది. పితృహీనుడై
ండు నీచే రక్షించదగినవాడు. అంటూ బిగ్గరగా తార దిక్కులు
ంచినట్లు రోధించింది.

తారా విలాపం హృదయాన్ని కలచివేయగా సోదరవధకు
సుగ్రీవుడు దుర్భర దుఃఖాక్రాంతుడైనాడు. బుద్ధిమంతు
ప్రశాంతుడు తారను సమీపించి, అమ్మా! విచారించకు
ా అతిక్రమించలేరు. నీ భర్త రామబాణం వల్ల నిర్దోషియై
చ్చి చూరగొంటాడు. వీరమరణం చెందిన నీ భర్తనుగూర్చి
ప నీవు దుఃఖించరాదు. ప్రాప్తన కర్మవిపాకం వల్ల ప్రాణి
లను అనుభవిస్తుంది. ఈ శరీరాలు నీటిబుడగల్లాంటివి. వీర
షుడు నీభర్త ప్రకృతిదోషంబలీయమై అతనిని బలికొన్నది.
నీకు తెలియందేమున్నది. అంగదుని అభిషేకించి ఆనం
ద గలవు. నీభర్త ఊర్ధ్వగతికి చేయదగు ఉత్తర క్రియలు
ంచు. అని పలికాడు.

ాయనా! అంజనేయ! పుత్రుని అభివృద్ధి తండ్రి చూడ

తగింది. తల్లి కాదు. పినతండ్రి సుగ్రీవుడు రాజ్యంను పొందుతాడు. నేను నా భర్తను చేరుతాను. తల్లి తండ్రి లేని పుత్రుడు అంగదునికి పినతండ్రియే సర్వం అవుతాడని తార పలికింది.

ఈ దుర్భర పరిణామానికి నేనే కారకుడను. మోహంచేత, రాజ్యకాంక్షచేత, అన్నను చంపించాను. భాతృ హంతకుణ్ణి నాకు రాజ్యం వద్దు, రుమా వద్దు. ఈ నికృష్టుని జీవితం వ్యర్థమైనదని సుగ్రీవుని నిర్వేదన చూచి వాలి బాధాజనితమైన మాటలతో ఇలా అన్నాడు.

సుగ్రీవా! మన ఇరువురిలో భాతృప్రేమ మాయావి పురా స్నిడ్డగించిన్నాడే నశించింది. ఇరువురం ఒకసారి సుఖపడే యోగం లేదు. నాకు సమయం ఆసన్నమైంది. రుమను. రాజ్యాన్ని పరిగ్రహించు. అంగదున్ని నాకు మారుగా నీవు కాపాడు. రామ సేవా కార్యక్రమంలో యుద్ధంలో సర్వ విధాల సహకరిస్తాడు. తార తెలివైనది. ఆమె మాట స్థిరమైనది. ఆమె మాటలకు అన్యథా జరుగదు. అతిక్రమించిన నా పరిస్థితి చూశావు కదా విచారించకు. పోయిన వారితో ఎవ్వరూ పోరు. అంత బాధతోనూ అస్పష్టంగా భార్యా పుత్రులను అప్పగించాడు వాలి సుగ్రీవునికి,

రాముడు తారను సమీపించాడు. వీరపత్నీ! విచారించకు. సమస్త లోకములందూ, సృష్టిస్థితి లయాలు దైవాధీనాలు. సుఖదుఃఖాలు ప్రకృతి కల్పితాలు. కర్మ పరిపాకాలు – యాయాతములైన ఈ ప్రాణుల ప్రవృత్తియె ఇంత. ఎవరికి ఎవరు శోచ్యులు?

నశ్వరమైన శరీరాల్లో జీవస్థితి నిత్యమైంది. సర్వం దైవాధీనమై జరుగును. వీరమాతవగు నీవు దుఃఖించతగదు. అని రాముడు ఓదార్చాడు.

రాముని ఉపదేశమున తార విచారం ఉడిగినది. వాలి తన కంఠమున నున్న హేమమాలికను సుగ్రీవునకు ఇచ్చాడు. సుషేణుడు రామబాణాన్ని వాలి శరీరము నుండి వెలుపలకు తొలగించాడు. రక్తం చిమ్మిన గొట్టము నుండి జలమువలె అంతట చిమ్మబడినది. వాలి గతాశువైనాడు. అందరిలో ఒక్కసారిగ దుఃఖం పెల్లుబికింది.

లక్ష్మణుడు తారను ఓదార్చాడు. అతనిచే ప్రోత్సహింపబడిన వానరవీరులు అంగదుని ముందుంచుకొని వాలికి దహనక్రియాదులు గావించారు. ఉదకతర్పణం చేసారు. ఆర్ద్రవసనులై సుగ్రీవాదులు రామలక్ష్మణులున్న యెడకు సమీపించారు.

రాముడు సుగ్రీవుని చూచి మిత్రమా! కాలమును ఎవరూ అతిక్రమించజాలరు. కాలచక్రం పరిభ్రమిస్తునే ఉంటుంది. నీవు కిష్కింధకు పోయి రాజ్యాభిషిక్తుడవగుము. అంగదునికి యువరాజ్యమందభిషేకించు. వానర వీరులను యథోచితరీతి సంతోషంపెట్టు అని ఆజ్ఞాపించాడు.

ప్రభూ! రామచంద్రా! సోదర సహితుడవై కిష్కింధకు దయచేయండి. ఈ శుభసమయంలో నాచే చేయబడిన సత్కారముల ప్రతిగ్రహించండి. అని సుగ్రీవుడు వినయ పూర్వకముగ ప్రార్థించాడు.

మిత్రమా! మేము పదునాలుగు సంవత్సరాలు వనవాసం చేయుటకు నియమితులము. పట్టణమునకు రాకతగదు. నీవు పోయి రాజ్యాభిషిక్తుడవై నియమితకార్యము చేయుము. నీ ప్రజలనానందపరచి సుఖింపుము. వర్షాకాలము ఆసన్నమైనది. మేఘచ్ఛన్నమైన అంబరము సస్యానుకూలంగా వర్షిస్తుంది. ఈ నాలుగు మాసములు సోదరునితో మేము ఇచ్చటనే యుంటాము. శరత్ ఆసన్నముకాగానే

సీతాన్వేషణ కార్యక్రమమునకు ప్రయత్నం చెయ్యి అని రాముని ఆజ్ఞ ఆశీస్సులు పొందాడు సుగ్రీవుడు.

దుష్టుల శిక్షించడానికి శిష్టుల రక్షించడానికి అవతరించిన స్వామిని సేవా ధర్మము ననుసరించి సేవించడానికి, అవతారదర్శనం చేసి తరించడానికి బ్రహ్మచే ఆదేశింపబడిన దేవతులు, పుడమి మీద వానరులగను, భల్లూకములగను, పుట్టేరు. ఇంతేగాక గరడ, గంధర్వ, కిన్నెర, కింపురుషాంశల చేతను, జన్మించేరు. అందులో ఇంద్రుని అంశలో వాలి, సూర్యుని అంశలో సుగ్రీవుడు, వాయువు అంశలో హనుమంతుడు, బ్రహ్మాంశచేత జాంబవంతుడు ఇట్లాగ మిగిలిన దేవతల అంశలలో వానరులు జన్మించారు. వాలి తన కర్తవ్యాన్ని మరచాడు. ధర్మానికి విరుద్ధంగా ప్రవర్తించాడు. అహల్యమూలకంగా మొదట గౌతమునిచే విఫలుడుగా శపింపబడ్డాడు.

ఇప్పుడు సుగ్రీవునికి అపచారంచేసి రామునిచే శిక్షింపబడ్డాడు. దైవసంకల్పం చేత ఎవరు ఎందుకు పుట్టేరో వారు ఆ పని చేయకపోతే శిక్షార్హుడే అవుతాడు. అదే వాలివధకు కారణం. ఇదే దేవరహస్యం మాయామనుష విగ్రహులైని రాఘవులకు ఇదితెలియదా

లక్ష్మణా! మన మీ ప్రస్రవరణ పర్వతం మీద వార్షిక దినములు గడుపుదాం. సుగ్రీవుడు ఈ నాలుగు నెలలు రాజ్యసుఖాలను అనుభవించనీ అన్నాడు రాముడు లక్ష్మణునితో.

రాముని ఆజ్ఞనుపొంది సకల వానరవీరులతో సుగ్రీవుడు కిష్కింధకు చేరేడు. ఒక శుభముహూర్తమున హనుమదాదులు సుగ్రీవుని సింహాసనంపై అధివసింపజేసి శాస్త్రీయముగ వానర రాజ్యానికి రాజుగా అభిషేకించారు. అదే సమయంలో అంగదునకు యువరాజుగా

అభిషేకించారు. వానరులు వానర పత్నులు పరమానందాన్ని అనుభవించారు.

సుఖ దుఃఖాలు జీవితంలో ఒకదాని వెంబడి మరి ఒకటి తరుముకొస్తాయి. దుఃఖాన్ని మరిచారు వానరులు. ఆనందాన్ని అను భవిస్తున్నారు. ప్రాణి నియతంగా శీతోష్ణాలు లాభలాభాలు జయాప జయాలు అనుభవించ తగినవే. శరీరం ఈ ద్వంద్వాలను అనుభవిం చుటకే ఏర్పాడ్డాది. నిత్యనిరతిశయ ఆనంద సంధాయకము ఆ భగ వత్సానిధ్యము మాత్రమే.

సముద్ర జాలాలను సూర్యకిరణాల ద్వారా ఆకర్షించిన మేఘాలు ఆకాశాన్ని ఆవరించాయి. ఒకానొక చోట పర్వత శిఖరాన్ని దంతాలతో చిమ్ముతున్న, దంతావళంలాగ, వేరొకచోట గృహవినిర్గత మృగేంద్రంలాగ, ఇంకొకచోట స్వేచ్ఛాస్వంచారం చేస్తున్న కారెను బోతులాగ, వనవరాహంలాగ, నీలిమబ్బులు ఆకాశాన్ని అంతట సంచారాన్ని చేస్తున్నాయి. వనపుష్పాల వాసనల వ్యాపింపజేస్తూ మందకొడిగా సంచరిస్తున్న గాలి తాకిడికి, కన్నులు మిరుమిట్లుకొలిపె మెరుపులతోను, రధనేమి ధ్వానంలాంటి ఉరుములతోను చిరు జల్లులు ఆరంభించాయి. జలకణాల నుండి స్రవించే సూర్యకిరణాలు అంబ రాన, హరివిల్లుని వ్యాపింపజేస్తూ బాలకృష్ణుని శిరమున అలంకరించిన బర్హిపించాన్ని తలపిస్తున్నది. పచ్చికపైల్లు ఆర్ద్రపురుగులువే వ్యాప్త మై రత్నకంబళ్లు పరచినట్లున్నాయి. విద్యుద్వితానములు అంతట గోచరింపగ పెళపెళార్భటులతో జంఝూ మారుతంవీచి ఆకాశం నుండి భూమికి వెండితీగెలు ప్రసరించినట్లు వానజల్లులు కురుస్తున్నాయి.

తొలుత ఆవిర్లు వదిలిన పొడమితల్లి కమ్మని వాసనల వెద జల్లి జలధారసిక్తమై క్రమక్రమంగా జలాకీర్ణమై నిదాఘదాహన్ని పోకార్చినది. చెట్లు ఆకుల నుండి జారిన జలధారలకు నేల బుడగలు

చేరి, అంతలోనే జీవితములు క్షణభంగురములు అనే సత్యాన్ని [illegible]స్తూ నశించిపోతున్నాయి. వర్షానికితడిచిన పర్వతాలు జలధారల [illegible] ముత్యాలసరులచే అలంకరింపబడి మదపుటేనుగులలా కనబడు తున్నాయి నేలపై పాయిలుపాయిలుగ ప్రవహించిన నీరు ఒకచోట ఏకమై కాలువలుకట్టి నదులలో చేరగా ఆ నదులు కూలంకషములై ప్రవహించి సముద్రాలలో చేరుతున్నాయి. భూమి జలావృతము అయింది. జల కుక్కుట చక్రవాక బక క్రౌంచ సారస పక్షులకు అమితానందము కలుగగా కలకల ధ్వనులతో నీటిపట్టుల విహరిస్తున్నాయి. పర్వతాలు వృక్షాలు స్నానాలచేసి నిశ్చలమనస్సుతో దైవాన్ని ధ్యానిస్తూన్నట్లు న్నాయి. పుడమితల్లి పులకించిపోయింది. సకల సస్యాల సమృద్ధిని కని లోకం ఆనందం పొందుతుంది.

రామలక్ష్మణులు వాన, గాలి, సోకని సువిశాలమగు పర్వత గుహను ఆవాసంగా వర్షకాలం వెళ్ళించారు. రాముడు అప్పుడప్పుడు సీతను తలచి విచారిస్తూ నాలుగు నెలలు నాలుగు యుగాలులాగ గడుపుతున్నాడు. వార్షిక దినములలో సర్వసుఖములు కలవారే అన్యథా మనఃప్రవృత్తి కలిగి ఉంటారు. ప్రాణంకంటే ప్రియమైన ప్రణయిని సుదూరతీరాల్లో ఉన్నప్పుడు ఆ యెడబాటు ఎంత దుర్భరంగా ఉంటుందో! లక్ష్మణుడు సమయస్ఫూర్తి వచనాలతో రామునికి ధైర్యోత్సాహాలు కలిగిస్తూ కాలాన్ని ప్రతీక్షిస్తున్నాడు.

పంకజలక్ష్మణ యగు శరత్తు పొడసూపింది. కుముదోత్పల పుండరీక, కమల కల్హారాలతో సరోవరాలు ఆనందాన్ని కలిగిస్తున్నాయి. భ్రమరాలు ఝంకారాలతో మధు విందులు చేసుకొంటున్నాయి. నదీనదాలు నిర్మల నీలమణులవలె ప్రవహిస్తు నడుమ నడుమ పులినములు కలిగి ఉన్నాయి. మార్గములు అశ్వానకర్థములై జనసంచార యోగ్యములుగా ఉన్నాయి. వర్షించిన మేఘములు తమ నైల్యము వీడి తెల్లనై నడిమింటిని పరువులెత్తు తున్నాయి.

వృక్షలతా గుల్మాలు నద్య పత్ర పుష్ప ఫలభరితాలై రమణీయంగా ఉన్నాయి. శరశ్చంద్ర చంద్రికలు నల్గడల ప్రసరించి పాలవెల్లువ వ్యాపింపజేస్తున్నట్లున్నాయి.

లక్ష్మణా! సుగ్రీవుడు కామాంధుడై కాలమును ప్రతినను మరచినట్టున్నాడు. ఉపకృతిని మరచిన మత్తుడగు కృతఘ్నుని క్రవ్యాదులు కూడా తినవట. మిత్రకార్యమునే మరచిన సుగ్రీవుని కడకు పోయి కర్తవ్యాన్ని జ్ఞాపకం చెయ్యి. వాలిని వధించిన బాణం నీ వంశాన్నే నిర్మూలింపగలదని చెప్పు. అని రాముడు లక్ష్మణునితో పలికేడు.

లక్ష్మణుని కన్నులు జేవురించాయి. చెయ్యి ఖడ్గం మీద పడ్డాది తలవని తలంపుగా. అధరాలు కంపించాయి. ఔడుకరిచాడు. అన్నయ్యా! అధముడుకి అధికారంవస్తే అవసరం మరచిపోతాడు. స్వార్థం పెరిగి కర్తవ్యం మరుస్తాడు. గర్వం అహంకారం మనస్సుని ఆవరిస్తాయి. నిర్లక్ష్యం నీడలో నీల్గుతాడు. అనుజ్ఞ ఇయ్యి. వాడంతు తేలుస్తాను అన్నాడు లక్ష్మణుడు.

అంతపని చేసేవాడెవే లక్ష్మణా! తొందరపడకు వెళ్లి కర్తవ్యాన్ని జ్ఞాపకం చెయ్యి అన్వేషణ సమయం ఆసన్నమైందని చెప్పు శరత్ ప్రవేశించింది. సుగ్రీవుని కార్యోన్ముఖిని చెయ్యడం మన కర్తవ్యం. చిరకాలనికి ప్రాప్తించిన రాజ్యవైభవాలు భోగభాగ్యాలుతో కాలాన్ని గుర్తించలేదు. కార్యావసరాన్ని భాద్యతను మిత్రునకు తెలియజేయి, నిర్లక్ష్యంతో వ్యవహరించాడండే ఆపైని చేయుతగినది ఉండనే ఉంది అని రాముడు లక్ష్మణుని ఉద్రేకాన్ని అణిచి కార్యోన్ముఖుని చేసాడు.

అన్నయ్యా! సెలవియ్యి. ఇదే కిష్కింధకు వెళ్లి వస్తాను.

పరిస్థితి గమనించి మీ మాటగా సర్వం సుగ్రీవునికి తెలియజేస్తాను. అయుక్తంగా వ్యవహరిస్తాడంటే సుగ్రీవుని హీన సుగ్రీవుని చేస్తాను. అని పలికి రోషంతో పెద్దపెద్ద అడుగులు వేస్తు లక్ష్మణుడు కిష్కిందకు నడిచాడు.

## ప్రయత్నము

కొండల కోనల్లో యున్న కోతిరాజ్యంలో అలజడ బయలు దేరింది. ఒక వానరుము వృక్షాగ్రమునికి అటు నిటు చూసింది. విషాగ్నిజ్వాలలు చిమ్ముచున్న సహస్ర ఫణామండితుడైన ఆదిశేషు వలా లక్ష్మణుడు వచ్చేస్తున్నాడు. విల్లుఅమ్ములు వీరఖడ్గాన్ని ధరించి ధరణి కంపించినట్లు అడుగులు వేస్తున్నాడు. రోషారుణ నేత్రాలనుండి అగ్నిజ్వాలలు వ్యాప్తమై అరణ్యాన్నంతా దగ్ధం చేసేటట్టున్నాడు.

చెట్టుపై నున్న వానరం చూసింది తల ఆడించింది. చెవులు వెనుక ముందుకు ఊపింది. గుడ్లు మిలమిలా చేసి పండ్లు ఇగిలించింది అది గమనించిన లక్ష్మణుడు వెంటనే ధనస్సు నుండి నారలాగి టంకారము చేసేడు.

ఆ ధ్వనికి పిడుగు మ్రోతగా విన్న వానరం భయంతో ఆ చెట్టుపై నుండి ఎగిరి అరుస్తు వేరొక చెట్టుకొమ్మకు ఎగిరి పారిపోయింది. దాని అరుపు సంకేతంగ అడవి అంతా వానరులు పరుగులతో అరుపులతో కాకావికాలైంది. పిల్లల్ని పొట్టలకింద చేర్చుకొని తల్లి వానరులు కొమ్మల నుండి కొమ్మలకు పరుగులు తీస్తున్నాయి. కొమ్మలు విరిగిపోతున్నాయి. గండ శిలలు దొర్లు పోతున్నాయి. రాళ్ల రాపిడికి విస్ఫులింగాలు బయలుదేరాయి.

నగ చేష్టి గమనిస్తునే యున్నాడు. లక్ష్మణుడు పద మూడు సంవత్సరాలు అరణ్య సంచారంలో అలవాటు పడ్డ రామా ... తి వేగముతో కొండ కోనల నడుమ నున్న కిష్కిందను సమీపిస్తున్నాడు.

కదళీ, పనసామ్ర, నారికేళ, జంబూజంభీరాది, నానాఫల వృక్షాలు అంతా నిండిఉన్నాయి. వాటినుండి ఇటునటు సంచారంచేస్తూ తేనెటీగలవల్ల తేనెతెట్టలునేలవరకు పరచి యుండుటచేత తేనెవాకలులు పుష్పాడులుతో కలసి ప్రవహిస్తున్నాయి. జాజి, కుందమందార, మల్లె మాలతీ లతలు కుసుమ పరిమళాలు వెదజల్లుతున్నాయి. శ్వేతారుణ కమళాలతో కూడియున్న సరోవరాలు జలపక్షులు కలిగి నిర్మల జల పూరితాలై యున్నాయి. అచ్చటి వాయువులు మధుతిక్త కషాయ గంధాలు వ్యాపింప జేస్తున్నాయి. పండుటాకుల మర్మరధ్వనులు, సెలయేటి నీటితరగల గలగలధ్వనులుగాలి పోసుకున్న వెదురు చీలికల నుండి వెలువడిన కీరకధ్వనులతో వనదుర్గమైన కిష్కింధా నగరం రమణీయంగా ఉంది. సుధూరనగర ప్రాసాద శిఖరాగ్రాలు తళతళలై కన్నుల మిరుమిట్లు గొలుపు తున్నాయి.

రాజవీధి యంతా ద్రాక్షాసవ, శర్కరాసవ, పుష్పాసవ, గంధాలతో నిండియుంది. నగర గోపుర ద్వారానికి ఇరువైపుల మహాబల సంపన్నులు మహాకాయులగు వానర వీరులను లక్ష్మణుడు చూచాడు. రాచబాట కిరువైపుల హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు, గజగవయ. గంధమారణ మొదలగు వానర వీరుల సౌధాలున్నాయి. క్రమ క్రమంగా లక్ష్మణుడు కొన్ని కక్ష్యలను అతిక్రమించాడు. సుగ్రీవుని ప్రాసాన్ని సమీపించాడు.

ప్రళయాగ్ని రుద్రుని వంటి ఆకృతి గల లక్ష్మణుని చూసి పరిసర వానర వీరులు భయభ్రాంతులై చేతులు ముకిలించి

నమస్కరించారు. అంగదుడు సమీపించి లక్ష్మణునకు అభివాదనం చేసాడు.

సౌమ్యుడా! రామానుజుడు వచ్చియున్నాడని నీ పిన తండ్రికి తెలియజెయ్యి. అని అన్నాడు లక్ష్మణుడు. అంగదుడు అంతఃపురమునకు పరుగెత్తాడు. లక్ష్మణుడు కుపితుడై ద్వారముచెంత వేచియున్నాడు. అని వినగానే సుగ్రీవునకు భయం ఆవహించింది.

కాలాతిక్రమణం గురుతుకొచ్చింది. రామకార్యం స్మరణకొచ్చింది. లక్ష్మణుని కోపం తగ్గించాలి. వీరులైన మహాత్ములు ఆడవారి వద్ద కోపం ప్రగటించరు.

సుగ్రీవుని అంతఃపుర స్త్రీలలో 'తార' తెలివైనది. మాటకారి సమయస్ఫూర్తి కలది. వివేకవతి. ఆమెను లక్ష్మణ కోపోపశమనం కోసం పంపించేడు సుగ్రీవుడు అచ్చరుల మించిన అందంగల తార కక్ష్యల గడచి లక్ష్మణుని సమీపించింది. నమస్కరించింది. రామానుజుడు తలదించుకున్నాడు.

వీరకుమారా! కోపాన్ని విడిచిపెట్టు. పిచ్చిక మీద బ్రహ్మాస్త్రమా! ప్రభుకార్యం మరువ లేదు. అందుకు తగిన ప్రయత్నం సాగుతునే యున్నది. నలుదిక్కుల నుండి వానర వీరులు వచ్చుటకు తగిన వేగరుల పంపించ బడ్డవి. అసంఖ్యాకులగు వానరులు వస్తున్నారు. రామకార్యం నిర్విఘ్నంగా కొనసాగుతుంది. సుగ్రీవుని యెడల ప్రసన్నుడవుకమ్ము. మీరిచ్చిన రాజ్యభోగాలు, సుఖ శాంతులు అనుభవిస్తున్న సుగ్రీవుని యేమరుపాటుని క్షమించాలి. సహజంగా "కపి" కదా మన్నించాలి. అంతఃపురంలోనికి దయచేయండి మీకు ఏందునా అడ్డులేదు. సుగ్రీవుడు మీచే అనుగ్రహించదగినవాడు అని లక్ష్మణుని శాంతపరచి "తార" అంతఃపురంలో ఉన్న సుగ్రీవుని

సమీపానికి తీసుకొని వచ్చింది.

సుగ్రీవుని చూడగానే లక్ష్మణునిలో మరల కోపం జాగృత మైంది. "వానరరాజా! మిత్రకార్య నిర్వహనను మరచి గ్రామ్యా సుఖాసక్తుడవైన నిన్ను రాముడు క్షమించడు. సీతాన్వేషణకై ప్రతిన చేసి గతానుకాల మరచి రాముని ఉపకార స్మృతిని కూడా మరచి స్వయంగా కాలపాశం మెడకు చుట్టుకున్నావు సుమా. తక్షణ కర్తవ్యాన్ని నిర్వహించమని చెప్పడానికి రాముని ఆజ్ఞతో ఇక్కడకు వచ్చాను" అన్నాడు లక్ష్మణుడు.

రామానుజా! క్షమించు రామబాణాన్ని ఎట్లు మరుస్తాను. చెట్లనుపడగొట్టి భూమినిచీల్చుకొనిపోయి మరల అమ్ములపొదిన పొందినబాణం నాఎదుట కనబడుతునే యున్నది. మీ అన్నయగు "శ్రీరామ చంద్రుడు" మా వంటి వారపై కోపింప తగదు. ఆతడు దయాసముద్రుడు. వానర వేగుల నలుదిక్కులా పంపించేను. ఈ సరికి అసంఖ్యాకంగా మహాబల సంపన్నులు వృక్ష పాషాణ, నకదంష్ట్రాయుధులు, మహా భయంకరాకారులు. వానర భల్లూక వీరులు వచ్చియేయుంటారు. వారితో కూడి నేను సహాయ మాత్రుడైన రామ కార్యాన్ని నిర్వహిస్తాను. మహాపరాక్రమశాలి, త్రిలోక పూజ్యుడు, శస్త్రాస్త్ర సంపన్నుడు, లోకైక వీరుడు రాముడు, సకల "కార్య నిర్వహణ దక్షుడు" అనియు రామబాణం ఒక్కటే నిర్వహిస్తుంది.

హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు, గజుడు, గవయుడు, గంధమారుణుడు, మున్నగు పెక్కురు వానర వీరులు, కార్య కుశలురు, పర్వతాకారులు, సీతాన్వేషణకు నాలుగుదిక్కులకు నిరాఘాటంగా వెళ్లగలరు. అలస్యం అయినందుకు క్షమించండి ప్రభువులు.

లక్ష్మణుని కోపం శాంతించింది. సౌమ్యా! ఇప్పుడే రాముని వద్దకు బయలుదేరు. క్షమా స్వరూపుడైన 'రాముని' అనుగ్రహానికి పాత్రుడవు. అని లక్ష్మణుడు పలికాడు.

లక్ష్మణ సుగ్రీవులు సకల వానర పరివారంతో శ్రీరాముని సానిధ్యానికి చేరుకున్నారు.

ప్రభూ! అవజ్ఞతను మన్నించండి అని రాముని పాదముల పై బడి నమస్కరించాడు సుగ్రీవుడు.

'దాసుని తప్పులు దండముతో సరి' రాముడు సుగ్రీవుని తన సమీపమున కూర్చుండ పెట్టుకున్నాడు. మిత్రమా! కుశలమా! ధర్మార్థ కామములు విభజించి సకాలమున సేవించినవాడై రాజు ధర్మార్థములు విడిచినచో కేవలం పామరుడే అవుతాడు, కామపర తంత్రుడైనవాడు చెట్టుమీద నిద్రించి నేలపడునట్లు భ్రష్టుడవుతాడు. మిత్ర సంగ్రహం రాజునకు ముఖ్యమైనది. శత్రు వినాశకమైనది. మిత్రయుక్తుడైన రాజు త్రివర్గాన్ని అనుభవిస్తాడు. స్నేహితుడైన నిన్ను ఇంతకాలము విడచి యుండగలనా ఇప్పటికి మిత్రునియందు ఆదరణ కలిగిందని రాముడు మధురంగా పలికేడు.

రామా! క్షమించాలి ఆలసించినందుకు

ఇంతలో మేరుమంధర, వింధ్య. గంధ, మారణ, హిమ, క్రౌంచ. చక్రవాళ, కైలాసాది పర్వతముల నుండి వానరులు వస్తున్నారు. బదరీ నైమిశ ద్వైతవనాది అరణ్యాల నుండి అసంఖ్యాకంగా వానరులు వస్తున్నారు. సకల నదీ నద సముద్ర తీరాల నుండి వానరులు. భల్లూక వీరులు వస్తున్నారు. వారంతా ఫల మూలాశనులు. నఖ దంష్ట్రాయుదులు మేరుమందర సంకాసులు అనేక రంగులు కలవారు. పింగాక్షులు పొడవైనతోకలు కలవారు, పొట్టితోకలుకలవారు

అసలు తోకలులేనివారు వానరులు,భల్లూకములు వందలు-వేలు-లక్షలు-కోట్లు అర్బుదమ్ముగా వచ్చి చేరిపోయేరు. ఆవానరసైన్యం చతుస్సముద్రాలు ఏకమైనట్లు కనబడుతుంది, మహోత్సవంతో రామ సేవా తత్పరులై వచ్చారు

వారంతా దేవదానవ గరుడ గంధర్వాప్సరో సంజాతులు, మరియు దేవయోని విశేషియ్యులు, దైవకార్యా తత్పరులు కళ్యాణ రాముని దర్శించి సేవించడానికి వారివారంశలవల్ల బలములతో పరాక్రమములతో రూపములతో అవతరించారు. దైవసేవకులై ఇట్టిసదవకాశాన్ని ఎందుకు ఎవరు జారవిడచుకుంటారు? ఆ సమయం రానే వచ్చింది.

ప్రభూ! వీరంతా నీ సేవ చేయాలి అని వచ్చారు అనుగ్రహించి కార్యమందు నియోగించు అనిసవినయంగా సుగ్రీవుడుపలికేడు

ఆ వానరసేనాసాగరాలను చూచి రాముడు ఆనందాశ్చర్యముల పొందేడు.

మిత్రమా! జానకి సజీవమై ఎక్కడయున్నది తెలుసుకొనవలసియున్నది, రావణుడు ఎక్కడయున్నది తెలియదగినది. వారల ఉనికిని తెలుసుకొనుటకు ; ఈ వానరుల నియోగించుటకు నీవే తగినవాడవు. ఆ పిమ్మట చేయదగిన కార్యం నిశ్చయిద్దాం. పరిమితిని ఏర్పరచి సకాలంలో సీతాన్వేషణ చేసి వచ్చేవారల నియోగించు అని రాముడు పలికాడు.

రామచంద్రా! నీ ఆజ్ఞకు సర్వదా బద్ధుడను.

సుగ్రీ— ఓరీ ఎవరక్కడ?

విన— చిత్తం ప్రభూ! నేను వినతుడను

సుగ్రీ— నీ సైన్యమెంత?

విన— తూర్పున కనుచూపుమేర వ్యాపించి ఉంది కోట్లసంఖ్యలో

సుగ్రీ— నీవు నీ సైన్యాన్ని వెంట పెట్టుకొని తూర్పు దిశకు వెళ్లు పర్వతాలు, నదులు, అరణ్యాలు, ఆయా పరిసరాల్లో గల పట్టణాలు పల్లెలు అంతటా రాముని భార్యయగు సీతను వెదకండి. రావణాసురుడు ఎక్కడ ఉంటాడో వాని ఉనికిని కనిపెట్టండి. ఇక్కడి నుండి తూర్పు దిక్కుగా బయలుదేరి కొండలు అడవులు దాటండి. ముందుగా గంగా నదిని దాటాలి. ఆతరువాత సరయూనదిని దాటండి. కేశకీ, కాళింది, యమున; సరస్వతి, సింధూ నదుల అతిక్రమించండి. పరిసర పర్వతారణ్య ప్రాంతాలలో బాగా పరిశీలించండి. బ్రహ్మమాళ, విదేశీమాళవ, కాశి, కోశల, మగధ, వంగ, రాజ్యాల్లో, దేశాల్లో, పట్టణాల్లో జనపదాలలో పరిశోధించండి. ఆ పై ప్రదేశం అంతారజతమైంది సముద్ర పరిసర పట్టణాలలో మంధర శిఖరాలలో ఆశ్రయించినవారు చెవులు లేనివారు, పెదవులులేనివారు, పెదవులే చెవులుగ కలవారు. భయంకరమైన అయోముఖులు, ఏకపాదులు, బలవంతులు, మనుజ భక్షకులు, కిరాతులు, పీరూపులు, సురూపులు, పచ్చిచేపలు తినువారు నీటీయందు తిరుగువారు, అరణ్యవాసులు వీరివీరి నివాస గృహాలలో వెతకండి.

పడవులతో ఆ పైన వెళ్ల వలసి యుంటుంది. చుట్టూకొండలు ఉంటాయి. ఆమధ్యప్రదేశమే, యవద్వీపం అక్కడకు చేరి అంతటా వెతకండి బంగారు, వెండి, రత్నాలు కలిగిన సప్తరాజ్యాలు కలవు ఆ పిమ్మట ఉన్నత శిఖరం గల శిశిర పర్వతం ఉంది. అది దేవదానవ సేవితం ఆ ప్రాంతమంతా వెతికి అగాధమైన శోణానదిని దాటి సముద్రం చేరండి. బిలములు, గుహలు వనములలో రావణుని సీతను వెతకండి మహోన్నతములైన సముద్రపు దిబ్బలు మహాకాయులైన అసురులు ఆకలిగొన్నవారై ఛాయనుబట్టి వారివారి ఆహారాన్ని సంపాదించుకుంటారు. ఆతరువాత ఎర్రని నీరుగల " లోహిత " సముద్రం

చేరండి. దాని తీరంలో పెద్దబూరుగు చెట్టు ఉంటుంది. అది గరుడనికి నివాసం. అచ్చట మందేహులు అను రాక్షసులు శాఖల నుండి తల క్రిందుగా వ్రేలాడుతుంటారు. వారు బ్రహ్మ తేజస్సుచే చంపబడి సూర్యతేజస్సుచే పుడుతుంటారు.

తరువాత క్షీరోదం అను సముద్రం ఉంది. అది ముత్యాల తరగలతో ప్రకాశిస్తుంది. దానిమధ్య శ్వేతఋషభమును పర్వతం ఉంది. దానిని ఆశ్రయించి దేవతలు, యక్షులు, చారణులు, సిద్ధులు ఉంటారు. అక్కడ సదర్శసమను సరస్సు కలదు. అందులో అప్సరో గణము క్రీడా విలాశములు కలది అది దాటేక జలోదమనే సముద్రం ఉంది. అందులో " బడబ " అనే గుర్రం ముఖముతో అగ్నియుంది అది ప్రళయకాలంలో ప్రపంచాన్నంతా నాశనం చేస్తుంది. దానికి ఉత్తరాన్న పదమూడు యోజనాల దూరాల్లో కనకశైలం ఉంది. అచ్చటనే ఆదిశేషుపు తన సహస్రఫణాళితో భూమిని మోస్తూయుంటాడు అక్కడే ఇంద్రధ్వజం ఆకాశాన రెపరెపలాడుతూ ఎగురుతుంది. దానికావల ఉదయపర్వతం ఉంది. దాని శిఖరం నూరుయోజనాలు దాని అడుగుభాగానకల వేదిక చాలా విశాలమైనది. అక్కడనే యోజనం వెడల్పు పది యోజనములు పొడవుగల సౌమనసనం అనే శిఖరం ఉంది. ఇక్కడ శ్రీమహావిష్ణువు త్రివిక్రమావతారంలో తొలిపాదం ఈ సౌమనసమందు, మలిపాదం కనకశైలమందు ఉంచాడట. జంబూ ద్వీపమున వైఖానసులు వాలఖిల్యులు చూడబడతారు. అది సుదర్శన ద్వీపం ఈ ప్రాంతమంతయు దేవలోకం తేజోమయం పర్వత అరణ్య నదీనదాలు, సువర్ణమయదూలు, ప్రాణులు తేజోవంతులు మహాద్భుత ప్రభావ సంపన్నులు. ఆయా పరిసరాల్లో సీతను రావణుని వెతకండి ఆ పిమ్మట అంతా తమోమయం ఆ ప్రాంతంలలో ప్రాణి ప్రవేశించ శ్రమ. అక్కడ మీరు వెనుతిరిగి ఒకనెలలోపల సీతను రావణుని ఉనికి తెలుసుకొని రండి. కాలం అతిక్రమించిన వారికి మరణదండనతప్పదు అని సుగ్రీవుడు ఆజ్ఞాపించాడు.

సుగ్రీ ; నీళా గురువెక్కడ
నీళా ; ఎవరు జాంబవంతులగారు ఇదిగో వచ్చేస్తున్నారు.
సుగ్రీ ; హనుమంతుడెక్కడ?

అతడు వచ్చాడు. అంగదుడు సుహోత్రుడు, గజుడు, గవయుడు, గంధమాదనుడు, ఋషభుడు, మైందుడు, ద్వివిదుడు అందరూ వారివారి సైన్యాలతో వచ్చియున్నారు.

యువరాజుని నాయకునిగా చేసుకొని మీరంతా దక్షిణ దిక్కుకు వెళ్లండి మీ సైన్యం అంతా మీవెంటే ఉంటుంది. వృక్షములు లతలు, గుల్మములు కొండలు నదులు అడవులు ఆయా ప్రాంతాలలో సీతాదేవిని రావణాసురుని వెతకండి. వెయ్యిశిఖరాలుగల వింధ్యపర్వతమునంతటా వెతకండి. నర్మదా, కృష్ణ, గోదావరి, నదీతీరాల్లోను పట్టణములలోను, పల్లెలలోను వెతకండి. ఉత్కల దశార్ణఅశ్వవంతి అవంతి, విధర్భ, రుషిక, అంగ, కళింగ, కేశక, దేశాలలోను నదీనద పర్వతారణ్యాలలోను వెతకండి రామపత్నిని. దండకారణ్యనంత పరిశీలించండి. ఆంధ్రపుండ్ర, చోళ, పాండ్య, కేరళ దేశాలలో వెతకి సహ్యపర్వతం చేరి, చందనలతాగుహలలో వెతకండి. పిమ్మటకావేరి నదీ, దాని పరిసర గ్రామాలలోను పట్టణారణ్యాలలోను వెతకండి. మళయ పర్వతంచేరి అక్కడ సూర్యునివలె ప్రకాశించు అగస్త్య మహర్షినిదర్శించండి తామ్రపర్ణ నదీతీరాలలోను పాండ్యదేశమంతటా జానకిని వెతకండి అనేక చెట్లు, గట్లు పుట్టలు గల్గి శెలయేర్లుతో నిండి సముద్రమధ్య గతమైన మహేంద్ర పర్వతాన్ని తానితటములందు అన్వేషించండి. దుర్మార్గుడు, వధ్యుడు, పరదారా అపహరుడగు రావణుని వెతకి తెలుసుకొండి. మహేంద్రమును దాటి సముద్ర గర్భంలో నూరుయోజనాలు దాటినపిమ్మట పుష్పితకమను పర్వతం గలదు దాని రజత కాంచన శిఖరములందు చంద్రసూర్యులు సేవిస్తూ విశ్రయిస్తూ ఉంటారు. దానిని కృతఘ్నులు, క్రూరులు, నాస్తికులు

చూడలేరు. ఆపైన పదునాలుగు యోజనాల దూరంలో సూర్యవంత మనే పర్వతమున్నది. దానిని దర్శించుట చేతనే సకల కామ్యములూ తీరుతాయి. ఆపైని వైద్యుతమనే పర్వతమున్నది. అక్కడ ఫలము లను తిని మధువును త్రావి ఆపైని వెళ్లండి. అకండకుంజ అను పర్వ తమున్నది. అక్కడ అగస్త్యుని గృహముంది. యోజనం వెడల్పు 10 యోజనముల పొడవు కల్గిఉంది. నవరత్న శోభితమైయుంది. ఆ పైని సర్పనిలయమైన భోగవతి కలదు. అందులో బహుముఖ సర్పా లకు రాజుగా వాసుకి అనే నాగరాజు ఉన్నాడు. అక్కడ సీతను వెద కండి. ఆపైని ఋషభగిరి కలదు. అక్కడ రోహితులను గంధర్వులు కలరు. శైలూషా, గ్రామణీ, సిగ్రు, బభ్రు, సుభ్రు అను 5గురు గంధ ర్వులు కలరు. వారు స్వర్గవిజేతలు అక్కడ నివశిస్తున్నారు. అటుపిమ్మ ట పితృలోకం యముని రాజధాని గాఢాంధకారం కలిగి వానర ప్రవే శాన్కి వీలుకాదు. మీ మీ బుద్ధికుశలతచే కార్యం నిశ్చయించి వెదగ దగినది, నేను చెప్పమరిచినవి ఆగు ప్రదేశాల్లో నిపుణతతో రామ చంద్రుని భార్యయగు సీతను అన్వేషించండి. ఆమె క్షేమం ఎవరు నాకు చెపుతారో వారు సకల భోగభాగ్యాలు అనుభవిస్తారు. రాముని అనుగ్రహాన్కి పాత్రులౌతారు. నెలకు పైనివచ్చిన వారు వధ్యులు కనుక వేగరులై దక్షిణ దిక్కంతయూ సీతను వెదికి, క్షేమవార్త తెలు పండని సుగ్రీవుడు హనుమదాదులకు ఆజ్ఞయిచ్చెను.

పూజ్యులైన మామగారికి నమస్కారాలని చేతులు జోడించి నమస్కరించాడు సుగ్రీవుడు.

ప్రభువులు పిలిపించారట అన్నాడు తార తండ్రి సుషేణుడు.

సుగ్రీ ; అవునండి తమను సీతాన్వేషణమునందు నియోగించ వలిసి వచ్చింది.

సుషేణ : విన్నాను. రాముని కార్యం అవశ్యం ఆచరించ దగినదే.

నాకేకాదు. ఎవరికైనా రాముని సేవ శ్రేయోదాయకమైంది.

సుగ్రీ : తమరు పశ్చిమదిశకు అన్వేషణార్థం పంపదలచాను.

సుషేణ ; నావెంట వచ్చినవారు మారీచులు. అర్చిష్మాలురు అను ఋషిపుత్రులు. 2,200 మంది వచ్చియున్నారు,

సుగ్రీ ; చాలు మీరెంతటికైనా సమర్థులు. దివిని భూమిపై పడవేయగలరు. దిక్కులనొక్కచోట చేర్చి పిండీకృతం చేయగలరు. అస్త్యపర్వత పర్యంతం వెదకవల్సి ఉంటుంది. ఆపైని ప్రాణి మాత్రానికి అసాధ్యం.

సుషేణ : సెలవియ్యండి.

సుగ్రీ : మీరు ఇక్కడ నుండి కొండలు, అడవులు, నదులు, పట్టణాలు, పల్లెలు, ఆయా ప్రాంతాలు వెతుకుతూ వెళ్లండి సౌరాష్ట్ర, బాంహ్లికదేశములలోని జనపదాలు వెతకండి. " కుక్షి " అనుదేశంలో వనములు, ఉపవనములు, ఆశ్రమాలు, నదీ-నదాలు గమనించండి. పడమటి సముద్రం చేరండి. ఆ తీరభూములు పరీక్షించి, మరీచిపట్నం అవంతి, అంగ మున్నగు దేశములలోగల పట్టణాలు వెతకండి. పర్వత సానువులు, గృహలు పరిశీలించండి. మహామాయావియగు రావణుడు యెక్కడ ఉన్నది తెలుసుకోండి. అక్కడ రెక్కలుగల సింహాలున్నాయి. క్రూరమృగములంతట సంచరిస్తాయి. సముద్రమధ్యమందున నూరు యోజనాలు వ్యాపించిన పారియాత్రమను పర్వతం కలదు. అక్కడ 24కోట్ల గంధర్వులు కలరు. అగ్నిసదృశులు అనేక కోట్ల సంఖ్యలలో అంతటా సంచరిస్తూ ఉంటారు. వారిని ఎవ్వరూ జయించలేరు. సీతను రావణుని అక్కడ వెతకండి. ఆ పిమ్మట వైడూర్యములుగల వజ్రపర్వతం ఉంది. దాని సానువులందు, గృహలలోనూ జానకిని వెదకండి. ఇక్కడ నూరు యోజనములుగల గుహలు కలవు. ఆపైని చక్రవంతం అను పర్వతం కలదు. అక్కడ నూరు అంచులు గల చక్రాన్ని మయుడు నిర్మించాడు. పంచజనుడను రాక్షసుని హైయగ్రీవుడను రాక్షసుని విష్ణువుజయించి పాంచజన్యమను శంఖం సుదర్శనచక్రం పొందాడు. అక్కడకు 60 యోజనాల దూరములో

వరాహగిరి ఉంది. అక్కడ ప్రాగ్జ్యోతిషం అను పురం కలదు. దానిలో నరకుడను రాక్షసుడు కలడు. ఆతరువాత సౌవర్ణమను పర్వతముంది దానికి 60 వేల శిఖరాలున్నాయి. వాటిమధ్య ఆదిత్యదత్తమైన మేరువు కలదు. ఈ పర్వతం మీకు ఆశ్రయమౌతుంది. దేవ, దానవ గంధర్వులు వస్తూ పోతూంటారు. అంతా కాంచ నమయమే, విశ్వ దేవులు, మరుత్తులు, వశువులు, ఉత్తర మేరుగత సానువుల నాశ్రయించి సంధ్యాకాలంలో సూర్యుని ఆరాధిస్తారు. సూర్యుడు 10 వేల యోజనాల దూరంలోగల అస్తపర్వతంను అర్థమూహూర్త కాలంలో చేరుతాడు. పిమ్మట అదృశ్యుడగును. దానిపైన పాశహస్తుడైన వర్ణుని ఆలయం ఉంది. ఆ ప్రాంతంలో, నదీతీరాల్లో జానకినివెతకండి ఆతన్ని నమస్కరించి సీతను గూర్చి తెలుసుకోండి. ఈ ప్రాంతంలో వెలుతురు కలిగించి రాత్రికాగానే సూర్యుడు అస్తపర్వతానికి చేరుకొంటాడునేమరచిన ప్రదేశాల్లోరావణునినిలయంకానీ జానకి జాడకానీఉంటే తెలుసుకొండి. రామకార్య నిర్వాహకులై మాసంలో తిరగిరండి. అని సుగ్రీవుడు, సుషేణుడూ మొదలగు వానరులకు ఆజ్ఞాపించాడు.

ఆ పిమ్మట శతబలి అను వానరుని ఉత్తరదిక్కుకు పంపిస్తూ ఇలా అన్నాడు.

శతబలీ నీవు సహస్రబలివి, కోటిబలివి, శతసహస్ర కోటిబలివి నీవంటి మహావీరులగు వానర శ్రేష్టుల కూడగట్టుకొని ఉత్తరదిశకు సీతాన్వేషణార్థం వెళ్లండి. దాశరథికి ప్రియమొనర్చి అతని అనుగ్రహన మనము సకల భోగభాగ్యాలను అనుభవించగలము. వనదుర్గాలు, జల దుర్గాలు, పర్వతదుర్గాలుగల ప్రదేశాలలో వెతకండి. అచట మ్లేచ్ఛ పుళింద, శూరసేన, ప్రస్థల, భరత, కురు, మద్రిక, కాంభోజ, యవ్వన, శక, ఆరట్టక, బాంహ్లీక, ఋషిక, సౌరవ, టంకణ, చీన, పరమచీన, నీహార, దరదదేశాల్లోనూ పట్టణంలలోనూ పల్లెలలోనూ వననదీ సరోవరాల్లోనూ సీతాదేవిని వెతకండి. హిమవంతుమున, దేవ

దారువనాల్లో సీతను వెతకండి. అక్కడనుండి సోమాశ్రమం, అటు పిమ్మట కాళపర్వతం దానిగడచి, సుదర్శన పర్వతం, ఆ తరువాత దేవసఖమను పర్వతం పరిశీలించండి. వృక్షలతా గుల్మాంతరితమైన కైలాసశిఖరం చేరండి. అక్కడే కుభేరభవనం ఉంది. యక్ష, గుహ్యక అప్సర, గంధర్వాదులతో కూడి సకల భోగభాగ్యాలు అనుభవిస్తు ఉంటాడు కుభేరుడు. ఆ తరువాత క్రౌంచగిరిని సమీపించి, దానిపరిశర సానువులలో వెదకండి. దాన్ని దాటి మైనాక పర్వతంలో జానకిని వెతకండి. అక్కడ గుఱ్ఱం ముఖంగల కిన్నెర స్త్రీలు గలరు, అదిదాటిన తరువాత సిద్ధాశ్రమం ఉంది. అక్కడ వైఖానసులు, వాలఖిల్యులు తపస్సు చేస్తూంటారు. వైఖానశమను సరోవరమొకటి ఉంది. దాని యందు సార్వభౌమమను ఏనుగు సంచరిస్తూంటుంది. జలపక్షులు, బంగారుమైనయనవి. వృక్షాలు బంగారుమయమైనవి. మృగాలు బంగారుమయమైనవే. ఆపైనంతా నిశ్శబ్ద ప్రదేశం, శైలోదమనేసరస్సు అక్కడ ఉంది. ఉత్తరకురుదేశీయులు, పుణ్యాత్ములు అక్కడ సంచరిస్తుంటాయి. నదులు, పర్వతాలు, అడవులు అన్నీ బంగారు మయములు. రత్న ప్రకాశంలు సర్వకాలాల్లోను ఫలపుష్పాల పుష్పములు కలిగి దివ్య గంధ రసస్పర్శ, సుఖసంతోషాలు కల్గిఉంటాయి. స్త్రీ పురుషులు సేవించ వస్త్రాభరణ, ఆహార, విహార, వినోద, విలాసాల కనుగుణంగా ఆ ప్రదేశముంటుంది. అపురూప లావణ్యాదులు, యవ్వన సౌకుమార్యాదులు, భోగపరాయణులు, నిత్యసంతుష్టులై స్త్రీ పురుషులు సంచరిస్తుంటారు. అదిదాటాక ఉత్తర సముద్రము దాని నడుమ సోమగిరి ఉంది, దానిని బ్రహ్మేంద్రాది లోకాలను పొందిన పుణ్యాత్ములు సేవిస్తూ ఉంటారు. దేవసుడైన బ్రహ్మ, ద్వాదశరూపుడైన విష్ణువు, ఏకాదశాత్ముకుడైన రుద్రుడు అక్కడ నివశిస్తుంటారు. సూర్యకిరణములచే చూడదగినవారు. సూర్యునికి సమాన తేజస్సు కలవారు. తేజోలోకంపైన ఆ సోమగిరిని అతిక్రమించరాదు. ఎవరు అట ప్రవేశించలేరు, భూమిపైనున్న ప్రాణులు అటు ఎంత మాత్రం వెళ్లలేవు. సాధ్యమైనంతవరకు అటు సంచరించి శ్రీరాముని దేవేరియగు

సీతాదేవిని అన్వేషించండి. గడువును అతిక్రమించక నెలలోపు రావాలి. కాలాతిక్రమించిన వారికి మరణశిక్ష తప్పదు. సత్వరమే బయల్దేరండని సుగ్రీవుడు ఉత్తరదిశకు శతబలిమున్నగు వానరులనుపంపించాడు

## ప్రస్థానము

వినతుడు, నీలుడు, సుషేణుడు, శతబలి వీరలాజ్ఞచేత కోటానుకోట్లుగా అమిత బలసంపన్నులైన వానరవీరులు భల్లూకాదులు సీతాన్వేషణకు బయల్దేరినారు.

"వీరులారా మీ కార్యం నిర్విఘ్నంగా నెరవేరుతుంది వెళ్లండి" అందరకూ ఒకనెల మాత్రమే గడువు. నెలలోపు దాశరథి కార్యం నెరవేర్చి రావాలి. కాలాతిక్రమణ చేసిన ఎట్టివారికైనా మరణ శిక్ష తప్పదని చివరిసారిగ సుగ్రీవుడు వానరులకు హెచ్చరించాడు.

ప్రతియొక్క వానరవీరుడు తమపైనే రామకార్యభారముందని తానే నిర్వహించి రాముని అనుగ్రహం పొందగలనని తలచారు అందరూ పరమోత్సాహంతో రామకార్యాన్ని నిర్వహించుటలో ధృఢ నిశ్చయులై ఉన్నారు. వానరులంతా ఒకేసారి ఆకాశానికెగిరిపోయారు మిడుతులదండువలే లేచిన ఆ వానరసైన్యం నలుదిక్కులా చెదిరింది. యంత్రంచే ఎగరగొట్టబడిన శిలాఖండాలూ, ధనస్సునుండి వెలువడిన శరపుంఖాల్లా ఎగిరిపోయారు, ఎగిరిపోతున్నారు.

ఆంజనేయా! నీతో ఒకమాట. ఏమంటే నీవలనే రామకార్యం జయప్రదమగునని నా విశ్వాసం. నీ తండ్రియగు వాయుపునకువలే నీ గమనానికి ఎందునా అడ్డులేదు. భూమి, ఆకాశం, దిక్కులు,నదులు పర్వతములు, వనములు, సముద్రాలూ, నీవేగాన్ని అడ్డగింపలేవు. ముల్లోకాలలో నిన్ను ఎదురించే సమర్థుడులేడు. నీ భుజానికి ఎదురు

లేదు. నీ బుద్ధికి మారులేదు. నీపైనే మా ఆశలన్ని నిలచియున్నాయి ఈ కార్యభారం వహించి నన్ను రామునీ కృతార్థున్ని చేయుము అని సుగ్రీవుడు పలికాడు.

రాముడు హనుమంతుని నమ్మినబంటుగా నిశ్చయించాడు. హనుమంతుడు బుద్ధి కుశలత కలవాడు. అనురక్తుడు, భక్తుడుగా తలచి తనపేరుగల రత్నాంగుళ్యకంను ఒసగి ఆంజనేయా! నీపైనే నాకు పరిపూర్ణ విశ్వాసమున్నది. ఈ ఉంగరం సీతకు చూపిస్తే నీతో నిర్భరంగా మాట్లాడుతుంది. దీన్ని అనవాలుగా గ్రహించి, జానకి నిన్ను నావలే నమ్మి నీతో మాట్లాడగలదు. విజయుడవై రావలసిందని రాముడు ఆశీఃపూర్వకంగా వీడ్కోలిచ్చాడు.

దక్షిణదిశకు హనుమా, జాంబవ, అంగద, నీల, గజ, గవయు గంధమాధన, మైందద్వివిధ, శరభ, ముక్షులు ఆదిగావానర భల్లూక ములు అసంఖ్యాకంగా బయల్దేరినారు.

మిత్రమా సుగ్రీవా! ఈ భూమండలం దిగంతములతో ఎట్లు తెలుసుకొన్నావు అని రాముడు ఆశ్చర్యంతో సుగ్రీవుని ప్రశ్నించినాడు.

ప్రభూ! మా అన్న వాలి నిష్కరుణుడై నన్ను తరిమివేసినాడని మనవి చేసియున్నాను. ప్రాణమన్నా తీపికదా! వాలి చేత తరముబడి భూమండలమంతా పరిభ్రమించాను. ఎక్కడా త్రాణ దొరకలేదు. ఇంతలో మతంగశాపంవల్ల ఈ ఋష్యమూక పర్వతానికి రాలేడని గుర్తువచ్చింది. వస్తే వానిశిరస్సు సహస్ర శకలములై పోతుందని జ్ఞప్తికివచ్చి ఈ ఋష్యమూకానికి చేరుకొన్నాను. మీ దయవల్ల ఆ భయం తొలగింది. పోగొట్టుకున్నదంతా పొందగలిగాను. ఈ హనుమంతుని వలన నీచలిమి, కలిమి నేనెట్లుపొంది సంతోషించానో, అట్లే

నీవు కూడా జానకి క్షేమవార్త హనుమంతుని వలన తెలిసి సంతోషించ గలవని సుగ్రీవుడు రామునితో పలికాడు.

సుగ్రీవుని మాటలకు సంతసించి ధైర్యోత్సాహములతో నలువైపులా వెళ్లిన వానర రాకను, ఆలాన్ని ప్రతీక్షిస్తున్నాడు. వానరులంతా త్రికరణ శుద్ధిగా ప్రయత్నలోపం లేకుండా జానకిని అన్వేషిస్తున్నారు. నదులూ — నదములు, పట్టణములు, అరణ్యములు, సముద్రములు వెదకుతు దిగంతాల వరకు వెళ్లి సీతాన్వేషణ చేస్తున్నారు. ఎంతవరకు తమ ప్రయత్నం సాధ్యమౌతుందో అంతవరకూ యత్నం సాగుతునేయుంది. ప్రాణి మాత్ర సంచారానికి వీలుచిక్కని పరిస్థితిలో వెనుకకు రావలసి వచ్చింది. ఆవానరుల శ్రమ ఫలించలేదు తమ శ్రమ వృథా అయింది. సుగ్రీవుని చేత చంపబడతామనే భయం కన్నా రామకార్యం నిర్వహించలేక పోయామనే విచారం ఎక్కువైనది. గత్యంతరం లేక జవసత్వా లుడిగినవారై తూర్పు, పడమర, ఉత్తర దిగంతాల నుండి వానరులొచ్చారు. కేవలం దక్షిణ దిక్కునకు పోయిన వానరులు రాలేదు. కాలం అతిక్రమిస్తున్నది. వారు వచ్చిన, తెచ్చిన వార్తపైని సామూహిక శిక్ష ఆధారపడి ఉంటుంది.

హనుమదాదులు అన్వేషిసు యున్నారు. కామరూపులై ఎప్పటికి తగిన ఆయా రూపములూ, చేష్టలూ, మాటలూ కలిగి సీతాదేవిని వెదుకుచున్నారు. ఋషులు మున్నగు వారిని అడిగి తెలుసు కొంటున్నారు. వింధ్యపర్వత గుహారణ్య నదీ నదాల్లో వెదకుతున్నారు వందలాది యోజనాల గుహలలో ప్రవేశించారు. వారు పోరాని ప్రదేశాలంటూ ఎక్కడా కనబడలేదు. కానీ సీతాదేవి కనబడలేదు. నిరాశా, నిస్పృహలకు చోటు రానీకుండా వెదకుచున్నారు. ధైర్య సాహసోత్సాహాలు కలిగి అంతటా పర్యటిస్తున్నారు. ఒక అడవినడుమ పెద్ద మైదానం. కొన్ని యోజనాలుంటుంది. అక్కడ యే ప్రాణి

కనబడలేదు. నీరులేదు. చెట్టులేదు, పుట్టలేదు, గట్టులేదు. గరికకూడా లేదు. ఇంత ఖాళీస్థలం ఇక్కడ ఏందుకుంది. "కండు"అను ఋషి ఇక్కడ చాలాకాలం నివశించాడు. అతని 16ఏళ్ల కుమారుడు నశించాడు పుత్రశోకం దుర్భరమైంది. భరించలేక పోయాడు. తండ్రికి కోపం వచ్చి ఈ ప్రాంతం ఎందుకు కొరకాకుండా శపించాడని ఒకవృద్ధుడు వానరులకు ఈ విషయం తెలిపాడు. ఈ అడవి మధ్యలో ఎన్నెన్ని చిత్రాలున్నాయో.

ఎవరురావీరు? గుహలోంచి తొంగి తొంగి చూస్తున్నాడు. నల్లని నడగొండలా వున్నాడు. కళ్లు పల్లు, ఒళ్లు అంతా భయాన్ని పుట్టిస్తున్నాయి. వీడే రావణుడు కొట్టండి. చంపండి. అని అరచాడొక వానరుడు.

పలువురు పరుగెత్తారు. మీరుండండి నేను వీడి పని చూస్తానని అంగదుడు పిడికిలి బిగించి రాక్షసుని నెత్తిపై గుద్దాడు, గుడ్లు తుల్లి పోయాయి. నోట నెత్తురు కక్కుకొని పెద్దగా అరుస్తూ అశువులు బాసాడు. ఇక వెదకండి సీతను ఎక్కడదాచాడో అన్నాడు అంగదుడు

సీత కనబడలేదు. వీడు రావణుడు కాడు. ఎవడో రాక్షసుడూ అనుకొని అక్కడనుండి వానరులు బయలుదేరారు. వెతికి వెతికి అలసి పోయారు. ఆకలిదహిస్తున్నాది. దాహం చేత నోరు ఎండిపోయినది. శ్రమచేత ఆయాసం కలుగుచున్నది. ఒక చెట్టుక్రిందకు వానరులు చేరారు. ఇప్పుడేంచేయాలి?

అదిగో ఆచెట్లు సందుల్లోంచి జలపక్షులు వస్తూన్నాయి వాటి రెక్కలు తడసి ఉన్నాయి. అక్కడకు పదండి. అక్కడ ఎదో చెరువు ఉంటుంది అన్నాడు ఒక వానరుడు. అందరూ అటు బయలుదేరారు. ఆ చెట్లమధ్య కొండగృహలాంటి బిలం ఉంది. దానిలోంచి పక్షులు

వస్తున్నాయి. అందులో ప్రవేశించారు వానరులు. పోను పోను అది ఒక చీకటి గుయ్యారంగా మారింది. దారి సన్నగిల్లింది. చీకటిలో ముందుదారి కనబడుటలేదు. వెనుకకు తిరిగి పోవడానికి వీలుచిక్కలేదు ఒకడు గత్యంతరంలేక ముందడుగు వేస్తున్నాడు. వాడితోక మరి యొకడు పట్టుకొన్నాడు. అట్లే వాడితోక మరియొకడు పట్టుకొని ఆ చీకటిలో ముందుకు నడుస్తున్నారు. అలా ఎంత దూరం నడిచారో తెలియదు. ప్రవేశించి ఎంత కాలమయిందో తెలియదు. మరణ నిశ్చయంతో ముందుకు సాగుతున్నారు.

కొంతదూరం వెళ్లాక చిన్న వెలుగురేఖ ముందువాడికి కన బడింది. మరికొంత దూరం వెళ్లాక పెద్దకాంతి తోచింది. అందరూ గమనించ గలిగారు. ముందడుగే గానీ వెనుకడుగులేదు.

కాంచనవృక్షాలు, రత్న కుసుమాలు, మధురఫలాలు. రజిత వితర్దికలతో ముత్యాల లతలు అల్లబడి ఉన్నాయి. పగడాల సోపానాలు నవరత్న సౌవర్ణభవనాలు, మౌక్తిక తోరణాలు అలంకరింవ బడి ఉన్నాయి. అమృత సరోవరాలు, కాంచన పద్మాలు, కలహారాలు, జలపక్షులు, బక, హంస, క్రౌంచ, చక్రవాలాది పక్షులూ అన్నీ బంగారు మయాలు. తీర్చిదిద్దినట్లున్న రాజమార్గాలు, జలయంత్రాలు, పూల కుంజాలు, దేవేంద్రలోకంలా ఉంది. అక్కడ ఎవరూ కనబడలేదు. వానరులు సంభ్రమాశ్చర్యాలతో ముందుకు సాగుతున్నారు. దిక్కులు చూస్తున్నారు.

అదిగో ఎవరో సన్యాసిని. ఇటే వస్తున్నాది. నమస్కారమమ్మా! ఆకలి దాహం అన్నారు వానరులంతా!

" ఆ పండ్లుతినండి, మధువును గ్రోలండి సరోవరాల్లో అమృత జలం త్రాగండి అని ఆదేవి సెలవిచ్చింది. "

వానరులు అక్కడున్న ఫలాలతో తృప్తి పడిన మీదట హనుమంతుడు ఆమెను సమీపించాడు. అమ్మా! మమ్మల్ని రక్షించారు ముందుగా ఈ ప్రదేశాన్ని గూర్చి కొంచెం వివరించండి. మేము రాముని బంటులం అని అశ్వయంణిని ప్రశ్నించాడు.

నేను. మేరుసావర్ణి కూతురును నాపేరు "స్వయంప్రభ" నా స్నేహితురాలు 'హేమ' అను అప్సరది ఈ గుహ, భవనాలు మున్నగునవి మయుడు ఆమెకొరకు ఈ ప్రదేశాన్ని నిర్మించాడు. ఆ దానవుడు నాచెలి ఆదేశానుసారం ఈ ప్రాంతం సంరక్షిస్తూ తపసు చేసుకొంటున్నాను. ఇక మీ సంగతేమిటి అన్నది స్వయంప్రభ.

అమ్మా! దశరథావనీశుని ఆజ్ఞచేత రాముడు సీతాలక్ష్మణులతో దండకాటవికు వచ్చాడు. సీతను జనస్థానంలో రావణుడు అపహరించాడు. రామ సుగ్రీవులకు మైత్రి కలిగింది. సుగ్రీవుని ఆజ్ఞచేత సీతను, రావణుని వెతుకుతూ ఇందులో ప్రవేశించాము, మా ప్రభువు ఒసగిన గడువు ఇక్కడే ముగిసింది. సీత కనబడలేదు. మమ్మల్ని వెలుపలకు చేర్చండి. ఆపైన మా తిప్పలు మేము పడతాము అన్నాడు. హనుమంతుడు.

కన్నులు మూసుకొమ్మని చెప్పి వానరులందరిని తన తపః ప్రభావంచేత ఆ బిలంనుండి "స్వయంప్రభ" వెలుపలకు చేర్చింది ఇక కనులు తెరువండి అందరూ తెరిచారు.

అదిగో! సముద్రం ఇదే వింధ్యపర్వతం మీకు మేలుకలుగుతుందని చెప్పి స్వయంప్రభ అదృశ్యం అయింది. వానరవీరులు వృక్షమూలమున సమావేశమైనారు. ఈ గండం గడిచింది. ఇప్పుడేమీ చేయాలి. సుగ్రీవుడిచ్చిన గడువు ఎప్పుడో తీరిపోయింది. మన ప్రయత్నమంతా వృధా అయింది. జానకి కనబడలేదు. వానరులు

మరణ నిశ్చయంతో విచారిస్తున్నారు.

ఒక వానరుడులేచి ఇలా అన్నాడు. మనం మరళా ఈ బిలంలో ప్రవేశిద్దాం. ఫలమూలాదులకు లోపంలేదు. కాలం గడిచాక సుగ్రీవుని దగ్గరకు వెళ్తే చంపుతాడు.

మరియొక వానరుడు ఇలా అన్నాడు. అంగదుడు సుగ్రీవుడి దగ్గరకు వెళ్తాడు. యువరాజుకదా! శిక్ష ఉండదు. సుగ్రీవుడు వాడి పినతండ్రి. తారను దగ్గరకు చేర్చుకొన్నాడు కదా. మనము ఈ గుహలో ప్రవేశించి ప్రాణాలు రక్షించుకొందాం.

లక్ష్మణుని బాణానికి ఈ గుహలు కొండలు అడ్డురావు. ఆకు దొన్నెలు చీల్చేసినట్టు ఈ బిలాన్ని పడగొట్టి మనల్ని చంపేస్తాడు. ఇక అంగదునకు క్షేమంలేదు. అన్ననేచంపిన సుగ్రీవుడు అన్నకొడుకుపై జాలి చూపిస్తాడా. ఏనుగులే నశిస్తుంటే, దోమలు నిలుస్తాయా! "తండ్రిని చంపినవాడు మామకు మంగళహారతి పడతాడా" కనుక మనమంతా ఇక్కడే ప్రాయోపవేశం చేయడం కర్తవ్యం అన్నారు వానర వీరులంతా. నేల దరబలు పరచుకొన్నారు. వాటిపై పడుకొని ఆహార, పానీయాలు విడిచి చావ నిశ్చయించుకొన్నారు.

మనం సర్వవిధాలా ప్రయత్నం చేశాము. రాముని గూర్చి ప్రాణాలు అర్పించడమే శ్రేయోదాయకము. జటాయువు కూడా ఓపికున్నంతవరకు పెనగి సీతను రావణుని నుండి విడిపించుటకు ప్రయత్నం చేశాడు. రామకార్యార్థం అశువులు విడచి ధన్యుడైనాడు ఎప్పుడైనా చావుతప్పదు. రామకార్యార్థులమయి మనం అసువులర్పించి చరితార్థులౌదాము అన్నాడు వానరవీరుడు.

ఇళ్లు, భవనాలు, భూములు, రాజ్యాలు, అధికారాలు, ధన

ధాన్యాలు, భోగ-భాగ్యాలు, ఆలు-బిడ్డలు, బంధు-మిత్రులు చివరకు ఈ జన్మతోవచ్చిన ఈ శరీరాలు అన్నీ నశించేవే. మనవెంట వచ్చే దేమీలేదు. భగవత్ సేవా తత్పరులై, రామకార్యార్థులై ఆత్మార్పణ చేయడం ప్రాణిమాత్ర కర్తవ్యం అని తీర్మాణించారు వానరవీరులు.

ఎవరుబాబూ మా సోదరుని గూర్చి పలుకుతున్నారూ? చాలా కాలానికి విన్నాను. జటాయువు రామకార్యార్థం శరీరత్యాగం చేశాడా ధన్యుడు అన్నాడు సంపాతి అను పక్షి. దానికి రెక్కలు గలితములైనాయి. కన్నులు కనపడవు. ఆ వృద్ధపక్షి మెల్లిగా ముందుకు అడుగులువేస్తున్నది.

మేము రామకార్యార్థం బయల్దేరాము. మా ప్రభువాజ్ఞచే సీతాదేవిని వెదకుతున్నాము. కానీ మా ప్రయత్నం ఫలించలేదు. అందుకే చావ నిశ్చయించాము. నీకు తెలిస్తే మాకు తెలిపి పుణ్యం కట్టుకో అన్నాడు ఒక వానరుడు.

మేము చాలాదూరం చూడగలం. గరుత్మంతుని సంతతి వారంగదా! నన్ను ఈ సముద్రం దగ్గరకు చేర్చండి. స్నానంచేసి తమ్మునికి తర్పణ చేస్తాను. నాకు మునుపటి జవసత్వాలు వస్తాయి. అన్నాడు సంపాతి వానరవీరులతో.

వానరులు పక్షిరాజుని సముద్రతీరానికి చేర్చారు. సంపాతి స్నానం చేసాడు. మునుపటి శక్తిసామర్థ్యాలు, రెక్కలూ అన్ని కలిగాయి. దృష్టిసారించి లంకవైపు చూసాడు.

వానరవీరులారా! ఇక్కడకు సముద్రగర్భంలో నూరుయోజనాలదూరంలో " లంక " అనే పట్టణం ఉంది. అక్కడ రావణుడు సీతను ఉంచాడు. మీరు అక్కడ ప్రయత్నించండి. తప్పక మీకార్యం

సఫలమౌతుంది. రామకార్యం నెరవేరుతుంది అన్నాడు సంపాతి.

వానరులకు ప్రాణాలపై ఆశ కలిగింది. సంపాతికి జవసత్వాలు కలుగుట ఆశ్చర్యం కలిగింది వానరులకు.

వానరులారా! గతకాలంలో నేను, నా సోదరుడు జటాయువు సూర్యమండలం చేరడానికి పందెం వేసుకున్నాం. వెంటనే పైకెగిరాం కొన్ని యోజనాలెగిరే సరికి నా సోదరుడు ఎండవేడికి దప్పిగొని సొమ్మసిల్లి పోయినాడు. నేను వానిని రెక్కలతో కప్పగా నా రెక్కలు కాలాయి. ఇద్దరం నేలపడినాము. నా తమ్ముడు జటాయువు ఎక్కడ పడ్డాడో తెలియదు. గాయమై పడిపోయిన నాకు నా కుమారుడు సుపార్శ్వుడు ఆహారాన్ని తెచ్చి ఇచ్చాడు. వానివలన సీతను రావణుడు అపహరించిన వృత్తాంతం తెలుసుకొన్నాను. నిశాకరుడు అను మహా మునీశ్వరుని అనుగ్రహం వలన వాక్కుతో శ్రీరాముని సేవచేసినందుకు మీ అందరి కరుణచేత పక్షవంతుడనైనాను. సీతాదేవి లంకలో ఉన్నది. సందేహంలేదు. రావణుడు కూడా అక్కడనే ఉన్నాడు. మీ ప్రయత్నం సఫలమౌతుంది. అని చెప్పి సంపాతి ఆకాశానికి ఎగిరి పోయాడు.

వానరులలో ధైర్యోత్సాహాలు కలిగాయి. అంతలోనే ఆ సంతోషం అంతరించిపోయింది.

ఎదురుగుండా సముద్రం. కొండంత కెరటాలతో అగాధమై అపారమై కనిపించింది. తిమి, తిమింగలాది జలచరాలతో ఆ మకరాలయం భయం కలిగిస్తున్నది.

నూరు యోజనాలు సముద్రాన్ని దాటి లంకలోనికి చేరాలి. ఎవరు దాటుతారు? అది సాధ్యమేనా? ఎందుకు సాధ్యంకాదు? అత్మ

శక్తి దృఢనిశ్చయం, ఉపాయం, ప్రయత్నం, దై
అన్ని కలసిరావాలి. ఈ లక్షణాలన్ని ఎవరిలో ఉన్నాయి

అంగదుడు వానరవీరులందరినీ చూచి ఎవ
దూరం సముద్రం లంఘించగలరని ప్రశ్నించాడు.
యోజనం, రెండోవాడు రెండు యోజనాలు, మూడోవ
యోజనాలు అన్నాడు జాంబవంతుడు. "నేను నూరు
దాటేస్తాను. ఇదివరకు భూమండలమంతా ప్రదక్షిణచేసి
ఇప్పుడు ముసలివాణ్ణి అయినాను కదా! తిరిగి రాగలనో
హంగా ఉంది అన్నాడు.

హనుమంతుడు ఒక పెద్దగండశిలమీద కూర్చొని :
చూస్తున్నాడు.

జానకి జనస్థానములో రావణుడు అపహరించాడ
పశుపక్ష్యాదులు ఆ జాడ తెలిపి తరించాయి. జటాయువు
యుద్ధంచేసి సీతాదేవి వార్త రామునికి తెలిపి పురుషార్థం
రామునికి ఫలమూలాదులొసగి శబరి తరించింది. సుగ్రీవు
చేసి రాజ్యాన్ని సంపాదించాడు. సంపాతి మాటలతోనే :
రించి జవసత్వాలు పొంది కృతార్థత నొందినది. నేను ని
చగలను? నీ అనుగ్రహం లేక రామచంద్రా! నన్ను నీసే

"ఓయీ ఆంజనేయా! ఏమిటా ఆలోచిస్తున్నావు
విపత్సముద్రంలో పడవేసి" అన్నాడు జాంబవంతుడు.

ఎవరూ గుటపుగారా జాంబవంతులవారా. నె
అన్నాడు హనుమంతుడు.

గరుడానిల సమసత్వుడవు. వాయు పుత్రుడవు. అంజనీ గర్భ సంజాతుడవు. పుట్టుకతోనే సూర్యమండలానికి ఎగసిన మహా జవ సత్వ సంపన్నుడవు. ఈ ఆపదనుండి మమ్ముద్ధరించి, చిరయసస్సును సంపాదించు. ఈ వానర వాహిని అంతా నీపైనే ఆధారపడివుంది. వారి ప్రాణాలు నీ చేతిలోనే ఉన్నాయి, నేనూ అంగద ప్రముఖాదులు నిన్ను ప్రార్థిస్తున్నాము. " శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్యఖాయం"

గురువర్యా! మరి దండకం వర్ణించకండి. తమ అందరితో పాటూ నాకూ బాధ్యతఉంది. శత యోజన విస్తీర్ణమైన సముద్రాన్ని లంఘిస్తాను. జానకిని సందర్శిస్తాను. రావణుని ఉనికిని తెలుసుకొంటాను వారికి తగిన గుణపాఠం చేస్తాను రావణుడు లంకలో లేకపోతే ముల్లోకాల్లో ఎక్కడ ఉన్నా ఆనీచ నిర్భాగ్య జీవిని తుదముట్టించి వస్తాను లంకా నగరాన్ని పెకలించి నీ సాన్నిద్యాన్న వుంచుతాను. శ్రీరామ చంద్రుని అనుగ్రహంవల్ల మీ అందరి ఆశీర్వాదం వల్ల జానకి సందర్శనంచేసి ఆమె క్షేమ సమాచారాన్ని తెలుసుకొని వస్తాను. ఆతల్లినే స్వామి సాన్నిద్యానికి తీసుకొనివచ్చి సమర్పిస్తాను. అని బుద్ధిమంతుడగు హనుమంతుడు వానర వీరులతో పలికి సముద్రం దాటడానికి నిశ్చయించాడు. మనస్సులో శ్రీరామచంద్రమూర్తి నిధ్యానిస్తున్నాడు స్వామి సంకల్పబలం లేనిదే ఎవరూ ఏపనీ చేయలేరు గదా!

○ చతుర్థపుష్పం సమాప్తం ○



# పంచమ పుష్పం

## సాగర లంఘనం

పర్వతాగ్రమున ఇటు అటు సంచరిస్తున్నాడు. హనుమంతుడు. అడుగుతీసి అడుగు వేస్తుంటే కాలిక్రింద పాషాణాలు చూర్ణమైపోతున్నాయి. నేల కృంగి పోతున్నట్లున్నది. రాళ్ళ క్రింద సర్పాలు నలిగి విషాన్ని క్రక్కుచున్నాయి. దట్టమైన చెట్లు ఆమూలాగ్రం కదిలి పోయి పువ్వులు, ఆకులు, కాయలు రాల్చేస్తున్నాయి. శాఖలు విరిగి పోతున్నాయి. శాఖాగ్రపక్షులు ఎగిరి పోతున్నాయి. హనుమంతుని అద్భుత స్వరూపాన్ని చూచి ఒక అపూర్వభూతంలా భావించి కిన్నెర మిధునం భయపడి పారి పోతున్నది. గంధర్వులు తమ విమానాలు లేపుకొని ఆకాశానికెగిరి పోతున్నారు. ఋషులు (స్వస్త్యస్తు అంటూ) మంగళాన్ని ఆకాంక్షిస్తున్నారు.

జాంబవదంగద నీల ప్రముఖులంతా అలాగే సముద్రాన్ని అతిక్రమిస్తున్నారు. సీతాదేవిని లంకలోను కనుగొంటాం! లేక రావణాసురునితో లంకానగరాన్నే శ్రీరామచంద్రుని సమక్షంలోనిల్పుతాను ముల్లోకాల్లోనూ వెతికి ఎక్కడ నా తల్లి యగు సీతమ్మ కన్పించిన రామునికి సమర్పిస్తాను. “నమోస్తు రామాయ సలక్షణాయ నమోస్తు దేవ్యై జనకాత్మజాయై” అని హనుంతుడు సీతారామలక్ష్మణులను కార్యార్ధసిద్ధికై తన మనస్సులో ప్రార్ధించాడు. తండ్రియగు వాయు దేవునకు నమస్కరించాడు. సముద్రాభిముఖుడై ఉత్తరతీరంనుండి దక్షిణతీరం వరకు లంఘించునట్లు మనసా ఊహించాడు. భుజములు సారించి రెండు పాదములూ దగ్గరకు చేర్చి క్రిందికి కొంచెమువంగి చెవులు కదల్చి వెనుకకు రిక్కించాడు. గుండెలనిండా ఊపిరి పీల్చి

రామచంద్రునికీజై అంటూ సముద్రాన్ని దాటడానికి కుప్పించి ఎగిరాడు. ఆవేగానికి పది యోజనాల నేల క్రిందికి క్రుంగిపోయింది పరిసరాలలో ఉన్న చెట్లు, చేమలూ విరిగిపోయినాయి. పర్వత శిఖరాగ్రభాగాలు అతనితోపాటు ఎగిరిపోయినాయి. జంతుసంతతులు భయభ్రాంతులై పరుగులు తీసాయి. హనుమంతుని వెంటఎగిరివచ్చిన చెట్లు, బంధువులు కొంతదూరం అంపకం పెట్టివచ్చినట్లు వెన్నంటి వచ్చి కొన్ని సముద్రంలో పడిపోయాయి.

సమర్థుడు బారసాచి ఏటికి ఎదురీదినట్లు నోరుతెరచి బారవేసి తోక ఊపుతూ హనుమంతుడు సముద్రం పైనుండి ఎగురుచున్నాడు. మనుష్యుడు ప్రయత్నం చేస్తే నీటిమీద యీదినట్లు గాలిలో ఎందుకు ఈదలేడు. అతని వేగానికి సముద్రం దారి విడిచినట్లు మధ్యపల్లమయి అటు-ఇటు కెరటాలు కలిగి ద్రోణీకృతమైంది. గాలి కొండగుహ నుండి ప్రతిధ్వనించినట్లు వినవస్తున్నది. జల జంతువులు ప్రాణభీతితో పరవళ్లు పెడుతున్నాయి. వింటినుండి వెలువడిన బాణంలాగ, రివ్వున మహేంద్రం నుండి లంకాభిముఖుడై ఆంజనేయుడు లంఘించాడు. వేగంవలన కలిగిన ధ్వని శంఖధ్వానంవలె వినవస్తున్నది. చాలా దూరం నుండి చిన్న బంగారు తెప్పవలె కన్పించి క్రమ క్రమంగా ద్వీపంలాగ తోచింది. మీదుగా ఎదుగుతున్నది నానావిధరత్నాలు పొదగబడినట్లు, అన్నివిధములైన ధాతువులు కల్గిన పర్వతము ఆకాశాన్నంటుతుందా అన్నట్లు ఉంది. జల జలాశిఖరాల నుండి స్రవించి సెలఏరులు ముత్యాలహారాల్లా కనబడుతున్నాయి. దానికి రెక్కలు కూడా ఉన్నాయి. పక్షి మాత్రంకాదు. మైనాకమనే పర్వతం హిమవంతునకు, మేనకకు సంభవించినది. పార్వతికంటె పెద్దవాడు. వీడు మైనాకుడు. పురుషరూపం ధరించి శిఖరం మీద నిలబడి హనుమంతునితో ఇలా అన్నాడు.

వాయుపుత్రా! నీకు స్వాగతం రామదూతవై సీతాన్వేషణకు

వెళ్లుతున్న నీకు మా హృదయపూర్వక స్వాగతం. బహుదూరపు ప్రయాణం చేస్తున్న బాటసారివగు నీవు నాకు అతిథివి. రాముని పూర్వీకులచే త్రవ్వబడిన సాగరుడు స్వాగతం చెబుతున్నాడు. సగర చక్రవర్తి పుత్రులు. నేలత్రివ్వి జలరాశికావాసం కల్పించారు. అందుకే సాగరుడు నీకు ప్రీతిపూర్వకంగా అతిథ్యానిస్తున్నాడు.

మరీ నాకుకూడా మిక్కిలి గౌరవించ తగినవాడవు. ఎందు కంటే నాకున్నట్టుగనే పూర్వం పర్వతాలకు రెక్కలుండేవి. అవి ఊళ్లపై పడి ప్రజలను నాశనం చేసేవి. ఋషి ప్రోత్సాహంతో ఇంద్రుడు వజ్రాయుధంతో వాటిరెక్కలు ఖండించాడు, అప్పట్లో మీ తండ్రియగు వాయుదేవుడు నన్ను సముద్రంలో పడివేసి రక్షించాడు. అతని కుమారుడువు నీవు. కనుక కొంచెం నామీద విశ్రమించి ఫలమూలా దులను ఆరగించి వెళ్లు. అని మైనాకుడు ప్రార్థించాడు.

హనుమంతుడు తన వేగమును సడలించకయే ఇలా అన్నాడు. మిత్రమా: చాలా సంతోషం నేను నీ అతిథ్యాన్ని స్వీకరించినట్లే సంతో షించండి. రామకార్యార్థినై వెళ్లుతూయున్నాను. ఇచ్చట నిల్చుటకు తగదు అని పలికెను.

ఆ వేగంలో ఆ పర్వతశిఖరాన్ని మాటుతి స్పృశించాడు. ఆ శిఖరం విరిగి నేల రాలిపోయింది. అప్పుడైతే సంతోషించాడు మైనాకుడు. రామదూతకు సేవచేసిన కారణాన్ని ఇంద్రుడు మైనాకు నకు స్వేచ్ఛాసంచారానికి అనుమతియిచ్చాడు. తల్లిదాస్యవిమోచనకై అమృతహరణార్థం బయలుదేరిన గరుత్మంతునిలాగ హనుమంతుడు ఆకాశంలో దూసుకుపోతున్నాడు. ఉత్తరదెశ నుండి లంకానగరి మీద పడబోతున్న తోకచుక్కలాగ కనబడుతున్నాడు. మధ్యందిన మార్తాం డునిలాగ అతని ముఖం దుర్నిరక్ష్యమై యున్నది. పుచ్ఛము మాటి మాటికి లంకావాసుల భయపెడుతున్నట్లు కదులుతున్నది నోరుతెరచిన

భూతంలాగ ఆ హనుమంతుడు ఎగురుతున్నాడు.

ఈమాటు నిజంగా భూతమే ఎదురుపడ్డాది. "శ్రేయాంసి విఘ్నాని" అని ఇది ఒక విఘ్నమా? కాని అన్నిటికి రాముడే న్నాడు. అనుకున్నాడు హనుమంతుడు.

ఆ భూతం పర్వత గుహలాగ నోరు తెరచుకొంది. దంతాల నాలుక సేతువులాగ కదలాడుతున్నది. వాడిగా వక్రంగా ు, మిడుగ్రుడ్లు కలిగి కర్కశంగా అరుస్తున్నది. ఆ అరుపు ంశం ఇలా ఉన్నది నాకు బ్రహ్మ వరం యిచ్చాడు. నిన్ను గుతాను అన్నది ఆభూతం.

మధ్యలో ఏమిటి అంటూ ఈ అలజడి ఎవరయ్యా నీవు అని చాడు హనుమంతుడు.

నేను నాగమాతను సురసను దానిని, అంది ఆ భూతం. విని హనుమంతుడు నేను రామకార్యార్థం వెల్లుతున్నాను. నన్ను పెడిదే నీవు కూడా రామునికి సహాయం చేసిన దానవు అవుతావు ఇలాగే వస్తాను. అప్పుడు నన్ను మింగుదువుగాని అన్నాడు మంతుడు.

అలాగకాదు ఇప్పుడే మింగుతాను.

: సరే అయితే నోరు తెరువు.

తెరచింది హనుమంతుడు శరీరం పెంచాడు. ఆమె నోరు ఇంకా తెరచింది ఇతను శరీరం పెంచుతునే యున్నాడు. ఆమె నోరు తెరస్తునే ఉన్నది.

వాయుపుత్రుడు అంగుష్టమాత్రరూపుడై ఆమె కడుపులో

ప్రవేశించి వెలుపలకివచ్చి ఇలా అన్నాడు.

నీ కడుపులో ప్రవేశించాను. వెలుపలకు వచ్చాను. ఇక వెళ్ళతాను. అని చెప్పి రివ్వున ఎగిరిపోయాడు. దేవతలు మెచ్చుకున్నారు. అతనికి కార్యసిద్ధి కలిగినట్లు ఆశీర్వదించారు.

ఎగురుతున్నంత మేర మున్నీటిలో హనుమంతుని నీడ మిక్కిలి పొడవై పరచుకునేయున్నది. వాయుపుత్రుడు గాలిలో బార వేస్తునేయున్నాడు. దగ్గరకు వచ్చేసాను. అదుగో లంకానగరం అనుకొంటున్నాడు. కానీ వేగం తగ్గుతున్నది. క్రిందికి లాగుతున్నట్లుయున్నది. దిగువ పెద్దఆవర్తం ఈఆవర్తమే తననీడనుబట్టి క్రిందికి లాగుతున్నది. గాలిలో సుడి బయలుదేరితే మీదను ఆకర్షిస్తుంది. నీటిలో సుడిపుడితే క్రిందకు లాగుతుంది. ఇదిచ్ఛాయాగ్రాహి.

ఈ విషయమై సుగ్రీవుడు తెలిపేడు. ఇది ఒక రక్కసి. దీని పేరు సింహిక హనుమంతుడు పిడుగుపడినట్లు ఆ రక్కసి నోట్లో పడ్డాడు. తన వాడిగోళ్ళతో దాని పొట్టచీల్చి వెలుపలకు వచ్చాడు. క్షణంల్లో మీదకు ఎగిరి లంకాభిముఖుడై పరిసర సౌందర్యాన్ని గమనించాడు.

లంకానగరం సమీపించింది. దివ్యమైన ప్రాసాదాలు కనబడుతున్నాయి. సముద్ర తీరంల్లో "సువేల" అను పర్వతం విశాలము, ఉన్నతము కలిగి తాను దిగుటకు అనుకూలముగా గోచరించింది. హనుమంతుడు పర్వతంపై పాదములు మోపాడు (గెంతేడు) నూరుయోజనాలు సముద్రాన్ని దాటి, దాటిన దానిని, గోప్పదీకృతం చేసి ఆనదించాడు. అడుగుపెట్టగానే ఆ కొండ కొన్నివేళ అడుగులు క్రిందికి కృంగిపోయింది. ఆ అదటున [అదురున] చెట్ల నుండి పువ్వేటు రాలినాయి.

# అన్వేషణ

పడమటి కొండపైనుంచి ఈటెలవంటి కిరణాలతో సూర్యుడు చీకటి భూతాలతో యుద్ధం చేస్తున్నాడు. వాటి శరీరము నుండి వెలువడిన రక్తపంకిలమా అనునట్లు సంధ్య అలముకొన్నది. పీతారుణ నీలకాంతులు ఆకాశమంతా గోచరిస్తూ, భావి రామ రావణ రణ రంగ భూమివలే కనబడుతున్నది.

సువేలాచల పర్వతంపై నిలచిన హనుమంతుడు లంకా నగరంపై దృష్టి సారించేడు. ఇది మహోన్నత ప్రాసాదమాలికలచే అమరావతీ పుర ప్రతిభను ప్రతిఘటిస్తున్నది. సుందరోద్యానాలు, చైత్రరథాన్ని మరపిస్తూన్నాయి. “రక్షోజన సంఘోషము, సాగర సంఘోషమును ఇనుమడింప చేస్తున్నాయి. దుష్ప్రవేశమైన ఈలంకలో సహజరూపంగా ప్రవేశించుట అసాధ్యము కనుక శరీరమును సంక్షేపం చేసుకొనవలెను. లేనిచో రక్కసులచే పట్టుబడుట తథ్యము” అని హనుమంతుడు తలిచాడు. సూక్ష్మరూపాన్ని పొంది రక్కసుల కను గప్పి లంక అంతటా వెదకి సీతను కనుగొంటాను అని నిశ్చయించి సూక్ష్మరూపాన్ని పొందేడు. ఈ రాత్రివేళ నగరిలో అన్వేషణ జరుప నిశ్చయించాడు. నిశాచరులు కదా రాత్రివేళకి తనే రంగుబయట పడుతుంది. ఏ రక్కసి చిరునవ్వులో ఈ చిక్కని చీక్కట్లు అనుకున్నాడు హనుమంతుడు గట్టునుండి పుట్టకు పుట్టనుండి చెట్టుకు చెట్టు నుండి వేరొకచెట్టుకు అక్కడనుండి ప్రాకారం ముందుకుచేరుకున్నాడు అక్కడ ఒక ఆడభూతము.

ఆకారము చీకటిలో కలిసిపోయింది. ఆ కటిక చీకటి ముట్టుకుంటే కాటుకలా అంటుకొంటుంది. పళ్లు తెల్లగాను కండ్లు ఎఱ్ఱగాను కన్పిస్తున్నాయి. అరుపులు వినిపిస్తున్నాయి. ఒళ్లు కదలినట్లు అనిపిస్తుంది. అది అరుస్తుందో మాట్లాడుతుందో తెలియదు. మాట్లాడు

తున్నట్లేయుంది. అదిగో ఏమిటో అంటున్నది.

ఏయి కోతి ఎవరు నువ్వు?
ఇంకేం నీకు తెలిసిపోయిందన్నమాట నేను కోతినే.
మారుతిని.
ఎందుకొచ్చావు?
చూడ్డానికి
ఏమిటి చూస్తావు?
లంకను.
ఏం పరిహాసంగా ఉందా?
ఆహా సరదగా ఉంది.
నేను ఎవరో తెలుసునా?
నువ్వు ఎవరో చెప్పందే నాకు ఎలా తెలుస్తుంది.
నేను లంకను. మరి ఒకపేరు లంకిణి.
బావుంది బాగుంది ముద్దొస్తున్నది పేరు.

ఏయి కోతి నేను లంకానగరానికి రాత్రింబవళ్లు కాపలా కాస్తుంటాను. నన్ను జయించకుండా ఇందులోనికి ఎవరూ వెళ్లరాదు.

అయితే ఈ నగరమంతా నువ్వే చూపించు.

ఇదిగో చూడు అని ఐదువేళ్లు ముడిచి బిగించి బలాన్నంతా ఉపయోగించి పిడికిలితో హనుమంతుని గుండెలపై ఒక్కగుద్దుగుద్దింది లంకిణి.

ఆడదానికి ఇంత బలముండునని అనుకోలేదు. సరే నా ఎడమచేతితో ఒక్క చరుపు చరుస్తానని హనుమంతుడు లంకిణి వీపు మీద చరిచాడు. దాంతో ఆ రక్కసి నోటినుండి రక్తము. బిలబిలా కక్కింది బాబోయిచచ్చానుఅని అరచింది దెబ్బకుదెయ్యంలోబడింది

రవకు నువ్వు చావవు. చచ్చేటట్టు కొట్టకుండానే తప్పుకదూ నిన్ను చంపను ఆడదానివి నువ్వు.

జ్ఞాపకం వచ్చింది. నువ్వు రామధూతవు. హనుమంతుడవు. బ్రహ్మనాకు చెప్పాడు నీ గురించి. పూర్వం నిన్ను ఎవడు జయిస్తాడో వాడే లంకలో ప్రవేశిస్తాడు. లంకకు దాని వైభవానికి అదే అంతమని.

ఇంకా అనుమానం లేకుండా లంకలో ప్రవేశించి, అంతటా నిర్భయంగా పంచరించు. లంకకు చేటుకాలం దాపురించింది. ఇక నీవు వెళ్లు. జయం కలుగును నీకు అని బలవంతుడైన హనుమంతునితో లంకిణి పలికింది.

నాకు కాదు రామునికి జయం అన్నాడు వాయుసుతుడు. బుద్ధిమంతుడగు హనుమంతుడు నగర ప్రధాన ద్వారంవిడిచి వేరొక మార్గం గుండా ముందుకు తన ఎడమకాలు తన శత్రువు తలపై మోపినట్లు లంకలో అడుగుపెట్టాడు. సముద్రతీరంలో సువేలా పర్వతంమీద సువిశాల భూభాగంలో మయుడను దానవుడు నిర్మించాడు ఈ లంకానగరమును. అది శోభాయమానంగా సముద్రంలో ప్రతిఫలిస్తున్నది ఉన్నతమైన ప్రాసాదములు, భవనములు, ఆవరణములు వనములు, ఉపవనములు, నదులు — నదములు, పంటభూములు, అరణ్యములు, పర్వతములు కల్గి రాక్షసావాసమై ఉంది. రాక్షసులు అను ఒకజాతి. వీరిలో పాలితులు పాలకులు ఉన్నారు. యధారాజ తధాప్రజ అనునట్లుగా రావణాసురుడు అనాటికి సార్ధకనాముడు లోకాన్ని ఏడిపించేవాడు. విశ్రవశుబ్రహ్మకు కుమారుడు. పులస్త్యునకు మనుమడు రావణుడు పరిపాలిస్తున్నాడు. అసుర ప్రవృత్తితో జానకీ హరణం చేయుటచేతనే ఆ తల్లిని వెతుకుటకు హనుమంతుడు లంకకు వచ్చుట జరిగినది. ఆ రాత్రికి రాత్రియే వెతుకుట ప్రారంభించాడు.

అప్పటికి చంద్రుడు తన చల్లని కిరణాలను ప్రసరింపచేస్తూ హనుమంతునికి శ్రమను తొలగిస్తున్నాడు. రజత శలాకలచే నిర్మితమైన పంజరంలో రాజహంసలా ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. కొండల్లాగున్న మేఘాల నుండి కనబడుతూ, మందర కందరస్థమయిన సింహంలాగున్నాడు. సకల ప్రాణులకు మానసోల్లాసం కల్గించుచూ, చంద్రుడు రోదసినంతయూ పాలవెల్లువలచే నింపేస్తున్నాడు నవ్వు పువ్వులు రాలుస్తున్నాడు.

అత్యంత సూక్ష్మరూపంలో హనుమంతుడు సీతాన్వేషణ చేస్తున్నాడు. రాక్షస నివాసభవనములు వెతికాడు. యంత్రాగారములు గాలించాడు. అక్కడ వందలాదిగా ఆయుధపాణులైన రక్కసులు సంచరిస్తున్నారు. ఆయుధాగారాలు, ధాన్యాగారాలు ఎక్కడికక్కడే ఉన్నాయి. శూల, ముద్గర, పట్టిస, పాశ, కుంత, భల్ల, బాణ, కృపాణాదిగా గల ఆయుధాలు ధరించి సంచరిస్తున్నారు. వికృతరూపులు కురూపులు, సురూపులు, ముండిత శిరస్కులు, ఊర్ధ్వకేశులు, కుంచిత కేశులు, కరాళవక్త్రులు, కఠినమనస్కులు, లంబకర్ణులు, దీర్ఘకర్ణులు ఏకాక్షులు, ఏనుగు, సర్పము, ఒంటె, గాడిద, పంది, తోడేలు మొన్నగు జంతు ముఖములు వంటి ముఖములు గలవారు అంతటా సంచరిస్తున్నారు. వారి స్వరూపాన్ని బట్టి పేర్లు నిర్ణయించ బడ్డాయి. విశాలమైన రాజవాటలా వాటికి ఇటునటూ సౌన్నతభవనాలు, దీప తోరణాలతో వెలిగిపోతున్నాయి. క్రమంగా ఆంజనేయుడు అన్వేషిస్తున్నాడు.

పానశాలలు, జూదశాలలు, మాంస విక్రయశాలలు, వేశ్యవాటికలు, తాలీంఖానాలు, మల్లశాలలు, గజ, వాజి, రథశాలలు అంతా వెతుకుతునే యున్నాడు. ఆ రాక్షసనగరు అర్థయోజనం వెడల్పు సార్ధయోజనం పొడవుకల్గినది. వక్రప్రాకారములు ఎనిమిది బురుజులు వాటిపై సాయుధపాణులగు రక్కసులు అప్రమత్తులై యున్నారు.

ఆకాశాన్నంటే సౌధరాజములు, వాటి లోపల ఉన్న తోద్యానములు, రాజబంధువులు, మంత్రులు, దండనాదులూ నివశిస్తూ ఉంటారు.

ప్రహస్తుడు, సుపార్శ్వుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు కుంభకర్ణుడు, విభీషణుడు, అతికాయ మహాకాయులు, వజ్రదంష్ట్రుడు మహాదంష్ట్రుడు, అక్షయుడు, మేఘజిత్తు, సుకుడు, సారణుడు, ధూమ్రాక్షుడు, జంబుమాలి, సుమాలి మున్నగు మహారాక్షస శ్రేష్ఠులు నివశించే ఆ భవనాలలో భవనం నుండి వేరొక భవనంలోనికి సూక్ష్మ రూపుడగు హనుమ ఎగురుతూ ఎగబ్రాకుతూ, దిగుచూ, ఎక్కుతు దుముకుతూ — దూరుతూ అంతటా ప్రవేశించి కొంచమైనా స్థలం ఏమరక వెతుకుచున్నాడు.

అదియొక సమున్నత భవానాన్కి బహిర్ద్వారము. దానికి రుపైపులా పిశాచ ముఖములు గల రెండు జంతురూపాలు గలవు. సుదీర్ఘకాయులు, కవచఖడ్గాలు ధరించారు. శిరస్త్రాణాలు కూడా వారి కున్నవి. చేతులలో శూలములు ధరించి, అప్రమత్తులై కాచియున్నారు ఆ రాత్రి అంగుష్టమాత్ర రూపుడగు హనుమంతుడు వారి ఏమరపాటు గమనించి లోపలో ప్రవేశించాడు. లోపల వివిధ ఫలవృక్షాలతా గుల్మాదులు తీర్చిదిద్దునట్లున్నాయి. అవన్నియు పత్రపుష్ప ఫలభరితాలు కొన్ని విచిత్రవర్ణములు కలిగి విచిత్రమైన పువ్వులతో రమణీయంగా ఉన్నాయి. ఆ లోపల అనేక రాజప్రాసాదాలు కలవు. వాటిని అతడు కొన్ని కక్ష్యలు అతిక్రమించాక అత్యంత సమున్నతమైనది, రమణీయమైనదీ పలుఅంతస్తులుగల మహారాజ సౌధము అది విశాలమైన గదులతో గవాక్షములు, ద్వారములు, తోరణములు, వేదికలు—సోపానములు ఎడనెడ సాలభంజికలు, లతలు — పుష్పములూ మున్నగు వాటితో కళానైపుణ్యాన్ని చాటుతున్నాయి. అందంతా వనితాజనము విశ్రాంతి నందియున్నారు.

కొందరు వికసిత పద్మకు వలయాదులవలె నున్నారు. ఒక చోట కోటిచంద్రబింబాలు కనబడతాయి. మరియొక చోట స్థిరమైన మెరుపు తీగెలు. అక్కడక్కడ వెన్నెల కన్నెలు, బంగారు శలాకలు, పుత్తడిబొమ్మలు, పూలతీగెలు, ముత్యపుతలుకులు వీరంతా స్త్రీలు. వీరంతా యక్షరాక్షస. గరుడ గంధర్వ కింపురుషాంగనలు. రావణుడు బలిమిన తెచ్చినవారు. కొందరైతే జయించి తెచ్చినవారు. వేరొకొందరు వెంబడి వచ్చినవారు. చక్కనిచుక్కలు మక్కువపడి వచ్చినవారుకలరు వారంతా నిద్రావశులు.

వివిధాభరణ భూషితలు, వస్త్ర, మాల్యానులేపనులు హస్త వ్యస్తంగా అంగదిక్షేపణ కలిగియున్నారు. వీణావేణు మృదంగ వాద్య నిపుణులు ఆయా వాద్యవిశేషాలు ధరించియే నిద్రావశులైయున్నారు సంగీత నృత్యనాట్యకుశలులు రావణాసురుని అలరించి అలసి సొలసి పడియున్నారు. మయూర, కుక్కుట, ఛాగవరాహ, మహిష మాంసా దులు రుచ్యంగా కమ్మని వాసన కలిగినట్లువండబడినవి. అర్థభక్షితుల సై భాజనములతో ఎక్కడికక్కడే పడియున్నారు. మద్యములు షోడబములు అనేక విధములైన పానీయములు పానాదిపాత్రములలో నిండినవీ సగంమిగిలినవీ ఒలిగిపోయినవీ కనబడుతున్నాయి. మోహం చేత, మాదకతచేత, నిద్రచేత, అలసటచేత, పారవస్యంచేత అక్కడ గల స్త్రీ సందోహం యొక్క నేత్రములు అర్ధనిమీలితంలైయున్నాయి భ్రష్టాంగకములు, వివస్త్రాభరణాలు, దళితాభరణులు, కమనీయరూప లవణ్యాలతో కాంతాజనులు నిర్ద్రాతులైయున్నారు.

ఇక్కడ మద్య, మాంస, వనిత, జూదాదిక్రియలు స్వేచ్ఛగా జరుగుతున్నాయి. వ్యసనాలు రాజగృహాలలోనే ఇంత స్వేచ్ఛగా నిర్వహింప బడుచున్నపుడు సామన్య రాక్షసావాసాల్లో ఏమికావాలి వారి వారి ప్రవృత్తులు సిగ్గునకే సిగ్గు కలిగిస్తున్నాయి. అసభ్యతకు అసభ్యత అనిపిస్తున్నాయి.

అదియొక రత్న ఖచిత పర్యంకము. హంసతూలికములతో నిర్మించబడిన పరుపుపై పాలనురుగులాంటి ఉత్తరచ్ఛదం, తలయంపిని రొళ్లపై పున మెత్తనిదిండ్లు గలవు. పైభాగంన రత్నశలాకలిచే నిర్మితమైన జాలంబులు కలవు. ఆ మంచమునకు నాలుగు వైపులా దంత స్తంబాలపైని పరిమళతైలాలు నింపబడిన దీపాలు వెలుగుతున్నాయి ఆ వెలుతురులో నిండిన పర్యంకంపై రావణుడు పడుకొనియున్నాడు దూషరాశి ప్రతీకాశుడు, కఠినోరస్కుడు. హారకుండల మండితుడు రక్తకేశేయవాసుడు కంకణ అంగుళీయక అంగదాది ఆభరణములుచే ప్రకాశించు బలిష్టమైన బాహువులు ఇటు నటూ పంచాశ్యములనైన కాలసర్పములవలే నున్నాయి. నిద్రాముఖంలో కూడా ధైర్య గాంభీర్యంలు కానవస్తున్నాయి. సమీపంలో దాంతకాంచన పర్యంకంన కొంచెం ప్రక్కకు మలగియున్న తనూ విలాసము భువనమోహన ముగ్ధ సుందరమూర్తి బ్రహ్మ తన సృష్టి చాతుర్యంతో నిర్మించిన పుత్తడిబొమ్మ, సౌందర్య సాధనాలనన్నీ అమృతంలో రంగరించి తీర్చిదిద్దిన అమృతమూర్తి. అరాళకుంతళ, సర్వావయవ సంపూర్ణ సౌందర్యముఖి, శ్వేతదుకూలధారిణి, సర్వాభరణభూషిత, కబరీభరము నుండి ఈషత్ గళితములైన జాజి, వకుళమాలికలు గాలికి నిటునటూ కదలాడే కురులు, చిరుచెమటకు కొంచెంచెదరిన నుదుట కస్తూరితిలకం కపోలంన అంటిపెట్టియున్న రత్న కర్ణావతంసములు, రత్నాభరణములు మోడ్చిన కనుతామరలు, అపురూప లావణ్యవతి.

ఈమె ఎవరు? "సీత" అనుకొన్నాడు హనుమంతుడు.

నేను వానరుడను. నాకపిత్వం ఇప్పుడే తెలిసిపోయినది. కోతికి మతిచలిస్తుంది. నిలకడ ఉండదు. ఇది సీత ఎలాగవుతుంది. జగదభిరాముడగు రాముని విడిచి సర్వాభరణములు ధరించి భోజన పానాదులు సేవించి మత్తుగా చిత్తుగా ఇలా పడుకుంటుందా! ఈమె ఎవరో రావణుని తొత్తు.

అక్కడ నుండి కదిలిపోయాడు హనుమంతుడు. లంకానగ మంతా అన్వేషించాడు. నాలుగు అంగుశాల మేరకూడా విడువబడ లేదు, కానీ ఏమి ప్రయోజనం సీత కనబడలేదు.

సాగరలంఘనం వ్యర్థమైంది. పక్షిరాజగు సంపాతి మాటలు నీటి మూటలైనాయి. వానరుల ఆశలు అడియాసలైనాయి. నేను ఇక్కడ నుండి వెలితే రామలక్ష్మణుల జీవితాలు సంశయగ్రస్తాలౌతాయి కనుక ఉరిపోసుకొని మరణిస్తాను. లేక సముద్రంలో ప్రవేశిస్తాను. సన్యాసినైపోతాను. రామా! నేను నిన్ను నమ్మించాను. సీతమ్మను దర్శించలేకపోయాను. అని హనుమంతుడు ఒక ప్రాసాదకుడ్యంపై నిలిచి విచారిస్తున్నాడు. మనసుకలత చెంది, కన్నుల నీరు తిరిగింది అదిగో అదియొక వనము చాలా చక్కగా పోషింపబడింది. అందమైన తరులతా శోభితమైంది. ఇక్కడ వెతకలేదు జానకిని అనుకొని. సీతా రామలక్ష్మణులను, తన తండ్రిని మనసున ధ్యానించి, నమస్కరించి అశోకవనంకు లంఘించాడు.

కార్యసాధనకు మానవప్రయత్నమే చాలదు. భగవత్ అను గ్రహం కూడా కావాలిమరి.

## సంభాషణ

చుట్టూ ప్రాకారము. దానికి ఒక ప్రవేశద్వారము. దానికి రువైపులా రాజహంసలపై కూర్చున్న అందమైన పాలరాతి స్త్రీ విగ్ర హాలు. చేతిలో కమలము. చంకలో స్వర్ణకలశాన్ని కల్గి ఉంది. చిత్ర ముగా మలచబడిన తోరణము, ఆ ద్వారాన్ని అతిక్రమిస్తే క్రమ పద్ధతిలో నాటబడిన వృక్ష, లత, గుల్మాదులు అన్నిటిలోనూ పువ్వుల లతలు పల్లవించి, పుష్పించి, ఫలించేవృక్షాలు, లతామండపాలు, జల యంత్రాలు, కదళీఖండాలు, అశోకవృక్షాలు, చూతవృక్షాలు, నారికేళ

నారంగ, జంబు, జంభీర, పనస, వృక్షాదులు. ఎడనెడ జలపక్షులు సారసములు కలువలుకల జలాశయాలు స్వచ్ఛమైనసైకత పులినము లతో సన్నగా ప్రవహించు నదీనదాలు, స్వర్ణసోపానాలు, వితర్థికలు, నాలుగు, ఎనిమిది, పదహారు, వేయిస్తంభాలపై నిర్మించినమంటపాలు పాల్రిణి సమాకర్షణమైనదావనవము.

ఆ నదీ తటమున ఒక సుందర మండప సమీపమున సమున్నత శింశుపా వృక్షము. ఆ ఛాయలో చెక్కిలికి చేయి చేర్చి నిరానందయగు దివ్య సుందరమగు వనితారత్నము.

హనుమంతుడు అక్కడఉన్న శింశుపా వృక్షశాఖాంతరమున విలీనమై గమనిస్తున్నాడు. ఈమె జానకియై ఉండవచ్చును. ఇంద్రుని విడచిన శచి. చంద్రుని దిక్కరించి వచ్చిన రోహిణి. కమల పీఠము దిగివచ్చిన రమాసుందరి, మలిన పీత కౌసేయవాసిని. ఏకవేణి. నిర్ద్రానంద అర్ధనిమీలిత. సీత ఈమెయే. రామునికి తగిన రమణి. ఈ రమణికి తగిన ప్రభువు రాముడు. నా అదృష్టం, శ్రమ ఫలించింది.

"ఘోరేభ్యో అఘోరేభ్యో, ఘోర ఘోరేభ్యో, ఘోరాంత రేభ్యః" దూరం నుండి బ్రహ్మరాక్షస పైదిక ఘోష వినబడుచున్నది. పిల్లగాలులు వీస్తున్నాయి, కుసుమ సౌరభాలు వనమంతా వ్యాపిస్తు న్నాయి. వేగుచుక్క పొడసూపుతున్నది. తెల్లవార వచ్చినదనుకొం టున్నాడు. హనుమంతుడు. ప్రభాత సూచకంగా అరుణరేఖ పొడ చూపుతున్నది. దూరం నుండి కలకల ధ్వని వినిపించింది. సుందర రాంతాసందోహం కాగడాలు ధరించి వస్తూయున్నది.

ఛత్ర చామరాలు కొందరు యువతలు ధరించి వస్తున్నారు మధ్యపాత్ర ఒకేసతి ధరించింది. వారిమధ్య ఒక స్త్రీ పై దండలిడగా నడచివస్తున్నాడు రావణుడు.

సింగమును గాంచిన జింకపిల్లవలే సీత భయపడుతున్నది. శరీరం చలించు కదలీదళం వలె కంపిస్తున్నది. కన్నులనీరు ముత్యాలవలే స్రవిస్తున్నాయి. శరీరం నిండుగా చీరసవరించుకొని మనసున రాముని ధ్యానిస్తున్నది. ఈ దిక్కుమాలిన చెరనుండి ఎప్పుడు విముక్తి కలిగిస్తావు రామా! అని.

సీతా! భయపడకుము నేనునీకు ప్రియతముడను. నీవునాకు ప్రియతమవు. నా ఐశ్వర్యము, నా విభవములు గమనించియే వుందువు వేలాది స్త్రీ సమూహము నీ అడుగుల మడుగులొత్తుదురు. నారాజ్యానికి రాణివినీవే. నా సర్వస్వం నీ ఆధీనం చేస్తున్నాను. నీవు నీ బంధువులు యథేచ్ఛగా అనుభవించండి.

మనుష్యుడు, కృపణుడు, దీనుడు. రాజ్యహీనుడు, ఇంటి నుండి వెడలగొట్టబడినవాడు, రాముడు. వాని వల్ల నీకు సుఖసంతోషాలు లేవు. అసలు బ్రతికి యున్నాడో లేదో తెలియదు. బ్రతికి ఉంటే ఈ సాగరం దాటలేడు. వచ్చిన అజేయుడనైన నన్ను జయించ లేడు. వాడిపై ఆశవీడి నన్నునుగ్రహించు. అని రావణుడు ప్రలోభపరచాడు.

సీత నిర్లక్ష్యంగా ఒక గడ్డిపోచను తుంచి మధ్యలో నుంచినది అది "నీవూ, నీ ఐశ్వర్యం ఈ గడ్డిపోచ కంటే హీనం సుమా" అని ఘోషించినట్లున్నది. జానకి ఇలా అన్నది. 'వినాశకాలే విపరీత బుద్ధిః' అనునట్లు నీకు కాలం దాపురించింది. చంద్రునివిసవెన్నెలా, సూర్యుని వినాకాంతి ఉండదు. నీవు, నీ సంపద, నీ పరాక్రమము, రాముని కాలిగోటికి సరిరావు. క్షణంలో పద్నాల్గువేల రక్కసుల నుక్కడగించిన అతని పరాక్రమము దగ్గర నీవొక నక్కవు. సింహానికి—శశమునకు కల అంతరము కలదు. నీవు నీచుడవు. చోరుడవు. అతన్ని మోసగించి దొంగిలించి నన్ను తెచ్చావు. సిగ్గులేక పౌరుషాలు పలుకుతున్నావు.

అతని కంటపడితే ఆనాడే ఇంతదూరం వచ్చేవాడివికావు. రాజు తన ప్రజలను కాపాడుట ధర్మము. ఒంటరిగా నన్ను చేసి నీచంగా చూసిమాట్లాడిననీనాలుక వేయి చీలికలుకాలేదు. కన్నులు కాలిపోతాయి నన్ను నీవు సమీపించుటకు సాధ్యంకాదు. తపసా నేనునిన్ను భస్మం చేయగలను గానీ చేయను. నా స్వామి చేయదగిన కార్యం అది. అది అతనికి తగినది అతనికి పౌరుష ప్రధమైనది" అని ఈ విధంగా పలికిన సీతను చంపుటకు ఒరనుండి కత్తితీసి రావణుడు ముందుకు అడుగువేసినాడు. భార్య ధాన్యమాలిని అడ్డుకొని వారించింది.

ప్రభూ! ఇది తగదు దేవదానవ, యక్షరాక్షస, కిన్నెర గరుడ గంధర్వ కన్నెలు నీ కనుసన్నలలో మెలగుచున్నారు. మాకంటే ఈ మానిషిలో ఏమిసొగసు గాంచినావు. మనసులేని మానిషిని మనసు పడుట తగదు. అది వాని మనుగడకే ముప్పు. మనసు మరల్చి మందిరమునకు అరుదేవ్మని పలికింది.

రావణుడు కోపిష్టై సమీపస్తులు, కూ్రర ధర్మనులైన రక్కసులను చూచి ఒక మాసం గడువులో ఈమెనా వశవర్తి అగునట్లు చేయమని ఆదేశించి తన పరివారంతో మందిరానికి వెళ్లిపోయాడు.

సీతాదేవికి కాపలా ఉన్న రక్కస స్త్రీలు తర్జనభర్జనలు చేస్తూ ప్రలోభ పరుస్తున్నారు.

ఒకతె ఒంటికన్నుది. మరొకతె మూడుకన్నులు కలది. మరొకతె నెత్తిపై కన్నులు కలది. ఒకతెకు చింపిరి జుత్తు అయితే మరొకతెకు ఈత తుప్ప మరియొకతెకు మ్రిఊడలు ఇంకొకతెకు సేతుపంది ముల్లు ఒకతెకు పొడుగు ముక్కు, వేరొకతెకు ముక్కులేదు దానిచోట రంధ్రముంది. మరియొకతెకు చప్పిముక్కు ఇంకొకతెకు మీదుగా శ్వాశించే ముక్కు, ఒకతెకు అడ్డగా శ్వాశించే ముక్కు.

ఒకతెకు పిల్లికల్లు, వేరొకతెకు గవ్వకల్లు, మరియొకతెకు గుడ్లగూబ కల్లు, ఇంకొకతెకు గాడిద కల్లు, పెదవులు వ్రేలాడి అటూ-నిటూ కోరలు ఒకతెకు కలిగిఉండే పంది ముఖం దానికి మీదికి పొడిచినట్లు కోరలు ఇంకొకతెకు కుక్కముఖం, వేరొకతెకు పిశాచముఖం, మరియొకతెకు మర్కటముఖం, వీళ్లు ఆడభటులు. వీళ్లకు వేరే పేర్లు లేవు. అదిఒక విచిత్ర సృష్టి. ఏర్చికూర్చినాడు రావణుడు. ఇచ్చట కాపలా పెట్టాడు. వీరంతా వికలాంగులు, విరూపరూపులు, మూర్ఖులు, ముష్కరులు, వీరందరూ వారి వారి రూపాలగుణ్యంలైన పేర్లతోనే పిలువబడతారు. దీర్ఘకర్ణి. హ్రస్వకర్ణి, దీర్ఘనాస, హ్రస్వనాస. అనాసిక. ప్రలంభోష్టి, ఊర్ధ్వకేశి, హ్రస్వరోమ, దీర్ఘరోమ, వృశ్చిక రోమ, ఏకాక్షి, త్రిఅక్షి, ఏకజట, ద్విజట, త్రిజట, సహస్రజట, వరాహముఖి వృష్టిముఖీ, పిశాచముఖీ, చవటముఖీ, గార్ధభముఖీ మొదలైన పేర్ల తోనే పిలుప బడతారు. ఇదివారిభాష, ఈ భాష వారికి వాడుకభాష. వీరందరూ వికలాంగుల సంక్షేమ పధకం క్రింద వారికి ఇలాంటి ఉద్యోగాలు లభిస్తాయి.

మల్లయుద్ధ విశారధులు, రౌడీలు, మోసగాల్లు, హంతకులు హత్యాచారులు వీల్లకు వేరే ఉద్యోగాలున్నాయి. సోమరులు, తిండి పోతులు, నిరక్షులు, నిర్లజ్జులు, నిర్వ్యాపారులు, వీరుఅనువగు క్రీడా రంగాల్లోను, అవసరమైతే యుద్ధ రంగాల్లోను. బలప్రదర్శనలలోను అప్పుడప్పుడు అంగరక్షకులు. గూఢచారులుగా ఉపయోగపడతారు. సమయంవస్తే వీళ్లను బలిపశువుల్లా చేసి తన కార్యాన్ని నిర్వహించు కుంటూంటారు. యుద్ధవిద్యా నైపుణ్యం కలిగి సకలవిధ ఆయుధాలు ప్రయోగించుటలో సమర్థులగువారు సూరాలబలంలో చేరిపోతారు. వీరికి యుద్ధాలోనే తప్ప ఇతరత్ర పనిఉండదు. అన్నీ తెలిసి ఉండి ఇంత కంటే క్రూరులు, ముష్కరులు, మూర్ఖులు, అంగరక్షకులు, నీచనిర్భాగ్య, నిర్వ్యాపారపరాఖ్య జాత్యాభివృద్ధి పధకం క్రింద వీరందరకు సకల సౌకర్యాలు కల్పించుట ప్రత్యేకత. లంచాలు, లాలాచీలు.

అత్యాచారాలు, బహిరంగంగా నిర్వహించుట, నిషేదం. వీరంతా రావణుని పాలితులు. సాధుసంతతులు, వివేకవంతులు, విజ్ఞానవంతులు విద్వాంసులు, విశ్వ శ్రేయోభిలాషులు వీరుకూడా గౌరవింపబడతారు. సన్మానింపబడతారు. అవసరమైనంతగా ప్రకటనలలో పుస్తకాలలో బొమ్మలతో ముద్రికరింప బడతారు. అవసరమని ఆ రావణరాజ్యం కొంచెం వ్రాయవలసి వచ్చింది. ఇంకా గానుగెద్దులు, గంగిరెద్దులు, గుడ్డిఎద్దులు, దున్నపోతులు వీటికి దీటియైన వారు కూడా ఉన్నారు.

ఇక మన ఆడ రక్కసీ గణం రావణుని ఆజ్ఞను జవదాటక సిద్ధాంతాన్నములు చేశారు. సీతను తర్జన భర్జనలు చేశారు, తిట్టారు, దీవించారు. తిరస్కరించారు. పొగిడారు, కొడతామని చంపుతామని భయపెట్టారు. ఎంత అరచి గీపెట్టిన వారిమాట వినలేదు సీత. ఇంతలో త్రిజట అప్పుడే పడుకొని నిద్రతీసి మరీ లేచి. ఒళ్లు విరుచుకొని, పళ్లు కనబడునట్లుగా ఆవలింత తీసి ఇలా అన్నది. ఉండడర్రా ఆగండి ఆమెనేమి అనకండి. నాకొక కల వచ్చింది. చెబుతాను. దాని ఫలితం కూడా చెబుతాను.

స్వప్న శాస్త్రం అధ్యయనం చేశానమ్మ:రి. నిశావశాన సమయాన కలిగిన కలలు కల్లలు కావు. సద్యః ఫలితాన్నిస్తాయి. వినండి వినండి. నాకు బహుమానాలు సన్మానాలూ చేయక పోయినా నిజం చెప్పేస్తాను. మనజాగ్రతలో మనముండాలి. కాలం ఒకరీతిగా ఎవ్వరికి గడవదు.

రాముడు, అతడే సీతమ్మతల్లి భర్త, అతడు జగతికి భర్త అతడు ఐరావతాన్నెక్కి సీతమ్మను తీసుకొని వెల్లుచున్నాడు. లక్ష్మణుడు కూడా అతనివెంట వెల్తున్నాడు. ఆతరువాత పుష్పక విమానం మీద ఆముగ్గురూ ఆకాశం మీది నుండి ఎగిరి పోతున్నారు. తెల్లటి బట్టలు. పువ్వుల దండలూ కలిగి దివ్య విమానంలో వెల్లి పోతున్నారు.

ఇక మన రావణ ప్రభువు ఎర్రని బట్టలు ధరించి తైలం త్రాగుతున్నాడు, ఒంటికి పూసుకొంటున్నాడు, ఒక నల్లబట్టల రక్కసి జుత్తుపట్టుకొని, సంహాసనం నుండి లాగి, దక్షిణ దిక్కుగా ఈడ్చుకొని వెల్తున్నది. కుంభకర్ణుడు, ఇందర్రజిత్తు మొదలగువారు గాడిదలపై ఒంటెలపైన ఉన్మత్తులై దక్షిణదిశకు పరుగులు తీస్తున్నారు. ఈ లంక అంతా సముద్రంలో మునిగిపోయినట్లున్నది.

విభీషణుడు శ్వేతవస్త్ర గంధమాల్యాదిలేపనుడై ఛత్రచామర అలంకృతుడై ప్రకాశిస్తున్నట్లు కలగన్నాను ఫలితమేమిటంటే లంకకూ రావణునికి చేటు తప్పదు. అతని అనుయాయులు నశిస్తారు. విభీషణుడూ, రాజ్యాన్నేలుతాడు. సీతారామ లక్ష్మణులు అందరి మన్ననలను పొంది మహావైభవంగా అయోధ్యా చేరుకొంటారు. అన్నాది త్రిజట.

ఐతే మనకందరికి చావు మూడినట్టే అని అన్నారు రాక్షసాంగనలు.

" ప్రణిపాత ప్రసన్నా హి మైధలి జనకాత్మజా " మనమంతా ఆమె కాల్లుమీదపడి వేడుకుందాం. ఆమె దయగలతల్లి మనల్ని కాపాడును అని త్రిజట పలికింది.

విభీషణుని కూతురు " కళ '' ఏమి చెప్పిందంటే వాళ్లనాయన సీతను రామునికి పంపివేయమని రావణాసురునితో చెప్పాడట. ఎన్ని చెప్పినా, ఎవరు చెప్పినా అతడు వినలేదట. చివరకు తనకు తనవంశానికి పుత్రమిత్ర బంధు పరివారంతో నశించిపోతాడు ఇది నిజం. ఏంచేస్తాం ఇలాగ ఆ రాక్షసీణగం అనుకొంటున్నది.

సీతాదేవిలో సహనం నశించింది. తన జీవితంమీద రోతకలిగింది

రక్కసి పీడవదల్లేదు. తనవారులేమి దుర్భరమైంది, భర్తరాకకై ఎదురుచూచి అలసిపోయింది. అసలు తన ఈ విపత్కర విషయం రామునికెవరు చేప్తారు. జటాయువు చెప్పియుండదా! ఋషులు చెప్పక పోరా! పశు పక్ష్యాదులు సూచనలు చేయవా! తన భర్త అంత తెలివి మాలినవాడా! సర్వజ్ఞుడు, సర్వశక్తి సమన్వితుడు ఇక లక్ష్మణుడు నిరుపమాన విజ్ఞానఖని. అతడు అగతానాగతములు తెల్సుకోగలవాడు అతనిమాట నమ్మక అతన్ని అనరాని మాటలానాడు అన్నాను. ఆ ఫలితం కట్టుకుడుపక పోతుందా! రామా! నాకింకేది దిక్కు. దిక్కుమాలిన చావు చావాల్సినదిగా విధి వ్రాసినాడు గాబోలు. ఇక నిరీక్షించుట వ్యర్థం అని సీత ఒక నిశ్చయానికి వచ్చింది.

అకస్మాత్తుగా ఆమె వామనేత్రం, భుజం, ఊరువు చలించింది చేపచేత కొట్టబడిన తామరపలే ఆమె ఎడమనేత్రం అదిరింది. వస్త్రం స్రస్తమైందిగా తోచింది. ఇది ఏమి శకునము మరణావసాయికి మేలెట్లు కలుగును మృతులకుమందేమి? గతానికి బంధనమెందుకు సుఖ శాంతములు శూన్యములైనవి. ఇక మరణమే సుఖాంతంకాగలదు.

సీత నిర్వేదంతో తన శిరోజాలనే పాశాలుగా చేసుకొని మెడకు చుట్టుకొంటున్నది.

సమయం మించిపోచున్నది. రావణ దురాగతము, రాక్షస గణ తర్జనం, త్రిజట స్వప్న వృత్తాంతం, సీతాదేవి మరణ నిశ్చయం శింశుపాపత్ర విలీనుడైన హనుమ గమనించాడు. సీతాదేవికి ఊరట కల్గించుటకు రామనామ స్మరణచేస్తూ జన్మాదిగా రామకథను వినిపింపదలచాడు.

దశరథుని కుమారుడు రాముడు. దయాదాక్షిణ్యాది గుణములు కలవాడు. అతనికి తండ్రి పట్టాభిషేకం చేయాలని తలంచగానే

పినతల్లి కోరికపై తండ్రి ఆజ్ఞచే 14 సంవత్సరాలు భార్యాసహితుడై అరణ్యానికి వచ్చాడు. తమ్ముడు లక్ష్మణుడు కూడా సేవాభృక్ప్రథంతో వెంటవచ్చాడు. జనస్థానంలో రాముని భార్య సీత అపహరింపబడింది అన్నదమ్ములు వెతుకుతూ "ఋష్యముక" మునకు వచ్చారు. వారికి మారాజు సుగ్రీవునకు మైత్రిని నేను జరిపాను. రాముడు వాలినిచంపి వానరరాజ్యాన్ని సుగ్రీవునికిచ్చాడు. సుగ్రీవుని ఆజ్ఞచేత వానరులు నలుదిక్కులకూ పంపబడ్డారు. నేను దక్షిణ దిక్కునకు వచ్చాను. సంపాతి మాటచేత సముద్రందాటి లంకలో ప్రవేశించి, రాత్రంతా లంకను వెతికాను. దైవికంగా నేను సీతమ్మను ఇక్కడ చూడగలిగాను.

అని హనుమ స్పష్టతర ఉచ్ఛారణతో రామకథ సంగ్రాహముగా పలికాడు. అతని మాటలు అమృతోపమానాలైనవి.

రావణరాజ్యంలో "రామశబ్దం" చిత్రంగా ఉందని చెట్టుపై నున్న హనుమను చూసింది. ఉదయిస్తున్న సూర్యునివలే ప్రకాశిస్తున్నాడు. నమస్కారం చేస్తున్నాడు. అతని ఉనికి, భక్తివినయాలు ద్యోతకమౌతున్నాయి.

నిజమైన వానరుడేనా? లేక ఇది రావణమయా? కలగన్నానా? కలలో వానరాన్ని చూసినట్లైతే ఆత్మీయులకు హాని కలుగుతుందట. నాకు స్వప్నంరాదు. నిద్రలేదు ఆహారంలేదు. అతనిమాటలు స్పష్టంగానే వినిపిస్తున్నాయి. సీతకు అనుమానం కలుగుతున్నది.

హనుమంతుడు చెట్టుదిగి సవినయంగా సమీపిస్తున్నాడు. అమ్మా! నేను నిజమైన వానరుడను. నీవెవరవు తల్లీ! దేవకాంతవా! భూమిని స్పృశించుటచేత, నిశ్వాసం కల్గి ఉండుటచేత, అనిమిషత్వం లేకపోవుటచేత నీవు దేవకాంతవుకావు. మానవకాంతవు. రాజ మనిషివని తలుస్తాను. మా ప్రభువు శ్రీరాముడు. శ్రీరామదూతను,

వాయుపుత్రుడను హనుమంతుడనువాడను. నీవు రామచంద్రునిభార్య వని తలుస్తాను, అయినచో నేను ధన్యుడను నా ప్రయత్నం సఫలమైనది. నీకు క్షేమం కలుగుతుందని హనుమ సీతాదేవికి నమస్కరించి పలికెను.

ఔను! నేను నీవన్నట్లే జనకరాజ పుత్రికను. దశరథుని కోడలును, రాముని అర్ధాంగిని. నిన్ను రామధూతగా ఎట్లు నమ్మగలను, సుగ్రీవునికి మంత్రియగుట ఎట్లు నమ్మదగినది రాక్షసమాయ కపట సన్యాసిగావచ్చి రావణుడు రాముని మోసగించి నన్నపహరించి తెచ్చాడు. ఇది రాక్షసమాయే. నన్నింత భాదించుట తగదు. నీవు రామధూతవైతే స్వామియొక్క గుణరూపాలుప్రభావం మొదలగునవి తెలుపు అని సంశయంతో అన్నది సీత.

చిత్తముతల్లీ! మా ప్రభువు శ్రీరాముని చరిత్ర, అతని గుణగణాలు. మరల మరల స్మరించి తరించతగిన భాగ్యం కలిగించావమ్మా. శ్రీరాముడు నీలమేఘశ్యాముడు. సకల కల్యాణ గుణాభిరాముడు. సమస్త ప్రాణి సంరక్షణాదక్షుడు, జగన్మంగలాదాయకుడు. త్రిజగన్మోహనాకారుడు. త్రిజగత్పూజ్యుడు. సకల వేదవేదాంగ పరిపిష్ఠితుడు. సకల శస్త్రాస్త్రకోవిదుడు, స్మితపూర్వాభిభాషి. వృద్ధోపసేవి, దైవబ్రాహ్మణ పితృగురు పూజాదురంధరుడు దయాదాక్షిణ్యాదుల చేత చంద్రునివలె సకల ప్రాణులకు ప్రియమైనవాడు. అహ్లాదకారకుడు. అతడు శ్రీరామచంద్రుడు.

అర్ధఘటిక ముహూర్తంలో పదునాలుగువేల రాక్షసులను సంహరించాడు. ఏడు తాళవృక్షములను ఒకే బాణంతో పడవేశాడు. బలిష్ఠమైన దుందుభి కళేబరాన్ని కాలిగోటితో నూరుయోజనాలు చిమ్మివేశాడు. రావణుని ముల్లోకాలు త్రిప్పి, ముప్పతిప్పలు పెట్టి, సముద్రపు నీరు త్రాగించిన వాలిని ఒకే బాణంతో నేల కరిపించాడు.

ధీర్ఘమైన బాహువులు, ఉన్నతమైన భుజస్కంధములు, విశాలవక్షము శంఖంవంటి కంఠం, స్నిగ్ధమైన వర్ణం, ఆకర్ణాంత విశ్రాంతమైన కన్నులు కలవాడు. మేఘమువలే గంభీరమైన కంఠధ్వని కలవాడు. సర్వావయవ పరిపూర్ణుడు.

శరీర శాస్త్రంలోను, సాముద్రిక శాస్త్రంలోను, ఎన్నెన్ని ఉత్తమ లక్షణాలున్నాయో అన్నీ ఒక్క రామునియందే చూడగలం లేకపోతే రాముని చూచియే ఆయా శాస్త్రములు లక్ష్య లక్షణము ను సంతరించుకొన్నాయని తలుస్తాను. ఒక్కమాటలో చెప్పాలంటే అతడు అవాఙ్మానస గోచరుడు. ఏదో మనసునకు మాటకు అందినంతవరకే చెప్పగలిగాను. లక్ష్మణుడు కూడా అట్టివాడే. వర్ణంలో బంగారువన్నె కలవాడు. రామునియెడ పితృదైవభక్తి విశ్వాసాలను కలిగినవాడు, ఆ లోకోత్తర పురుషులగూర్చి ఎంతచెప్పినా ఇంకా మిగిలిపోతుంది తల్లీ.

ఇదిగో స్వామి నీకు ఆనవాలుగా పంపిన అంగుళీయకము గ్రహించుతల్లీ అని తన శిరస్సున భద్రపరచిన రామనామాంకితమైన రత్నాంగుళీయకమును సీతమ్మకు సమర్పించి సమస్కరించాడు.

సీతాదేవి కన్నుల నుండి నీరు స్రవించగా ఆ అంగుళీయకము కన్నులకద్దుకొని, హృదయాన చేర్చుకొని, రాముడు తన ఎదుట సాక్షాత్కరించినట్లు తలంచినది. పావనిని అనుగ్రహ పూర్వకంగా చూచి

అన్నా హనుమన్నా! స్వామి నిన్ను పంపించాడా నా వద్దకు. ఈ మందభాగ్యపైని నేటికి కరుణ చూపించాడు. నాయనా నీయంతటి శక్తిసామర్థ్యాలు కలవాడు లోకంలో ఎవరున్నారు. సముద్రం దాటగల సామర్థ్యం గరుత్మంతునకు వాయువునకు నీకు మాత్రమే కలదు. పరీక్షించకు నాదగ్గరకు మా ప్రభువు ఎవ్వరినీ

పంపడు స్వామి ఏమి చెప్పేను అని ఉత్కంఠతో సీత పలికినది.

అమ్మా నీఉనికి అతనికింతవరకు తెలియదు. ఇక మీదట తెలుసుకొని సుగ్రీవునితో సకల వానరసైన్యాన్ని వెంటపెట్టుకొనివచ్చి రావణుని సంహరించగలడు. రాముడు నిమ్న అయోధ్యకు తీసుకొని వెళ్లగలడు తల్లీ. నిరంతరం నిన్నే మనసాధ్యానిస్తూ వచసాపలుకుతూ శారీరకమైన రక్షణాభరణాదుల యందు అశ్రద్ధకలిగి వ్యవహరిస్తున్నాడు. చీమలు, దోమలు చివరకు పాములు శరీరంమీద పాకిన పట్టించుకోలేదు. కాయకసరులు నమిలి త్వాగ్గతచిత్తం కలవాడై దుర్భర దుఃఖతప్తుడై యున్నాడు. లక్ష్మణుడు సమయంబట్టి ఓదారుస్తూ ధైర్యం చెపుతూ కాలాన్ని మరిపిస్తున్నాడు. అని హనుమ పలికెను.

విధినైపరీత్యము ఇలాగున్నది పేర్మిమైక జీవుల ఎడబరచి విధి వినోదిస్తున్నాడు కాబోలు. సకల భోగభాగ్యాలకు నిలయమైన రాజ్యాన్ని వదులుకొన్నాడు. తల్లిని వదులుకొన్నాడు. తండ్రిని వదులుకొని ఈ నట్టడవులలో నాపైప్రాణాలు పెట్టుకొని జీవిస్తున్నాడు ఆ గర్భశ్రీమంతుడెట్టి దుర్భరకష్టాల నెదుర్కొంటున్నాడూ దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు ఆంజనేయా ఎప్పుడు నాస్వామి సన్నిధికిచేరగల దానను. అతని దుఃఖం ఎప్పుడు అపనయింప గలదానను. ఈ రావణుని పీడ ఎప్పుడు విరగడగునో అని సీత విచారంతో పలికెను.

విచారించకుతల్లీ ! అచిరకాలంలోనే అతనికు నీకు దుఃఖం తొలిగిపోతుంది. రామలక్ష్మణులు నా భుజస్కంధాల నధిరోహించి సూర్యచంద్రులవలే ప్రకాశవంతులై లంకలో ప్రవేశిస్తారు, రావణుని సంహరిస్తారు. నీచెరవిముక్తి కలిగి సుఖసంతోషాలతో వర్ధిల్ల గలరు. అంతవరకు సహించని ఎడల నా భుజములపై అధిష్టించండి. మిమ్ము లను క్షణంలో రామసన్నిధికి చేర్చగలనని హనుమ పలికెను.

అంతట సీత ఆశ్చర్యంతో నన్ను భుజములనధిష్టింప చేసుకొని సముద్రాన్నెట్లు దాటగలవు. ఈమాట చేతనే నీ వానరత్వం స్పష్టమగుచున్నది. అని పల్కినది.

ఓ ఇది ఒక పరిభవము. ఇదిగో ఈ శరీరాన్ని గమనించుము అనుచు తన శరీరాన్ని క్రిమక్రమంగా చుక్కలు తన తలపూలుగా పర్వత సమానంగా మేనుపెంచి నమస్కరిస్తూ అమ్మా సకల రాక్షసులతో రావణుని లంకను ఒక్క ఉదుటన పెకలించి రాముని సాన్నిధ్యాన్కి తీసుకొని వెళ్లగలను, సెలవీయ్యండి ఏమిటి కర్తవ్యం అని హనుమంతుడు పలికెను.

సీత ఆ ఆకారంచూసి ఆంజనేయా గుర్తించాను. నీ భుజ పౌరుషాలను. నన్ను తీసుకెళ్లునపుడు రాక్షసులు నీతో యుద్ధానికి వస్తారు, అప్పుడు నన్ను కాపాడడం కష్టమౌతుంది లేకా నేనైనా సముద్రంను గాంచి భయంతో పడిపోవడమైనా జరుగును. సపుత్ర మిత్రామాత్యకంగా రావణుని చంపి రాముడు నన్ను తీసుకొనివెళ్లిన ఆతని పౌరుషానికి, ప్రతిభకు సముచితంగా ఉంటుంది. స్వామికి ఇచ్చటి వృత్తాంతాన్నంతటిని చెప్పి ఆతనిని ప్రోత్సహించు. స్వామి రాకకై ఒక మాసం గడువుగా ఎదురు చూస్తావుంటాను. రావణుడు పెట్టినగడవు నీవు వింటివికదా! మా సాదూర్ద్వం నేను బ్రతుకుట సాధ్యమని సీత హనుమతో పలికెను.

అంతట హనుమంతుడు అమ్మా నాకింక సెలవు దయచేయుడు సమయాన్ని వ్యర్థపుచ్చతగదు. ఇక రామునికేదయిన నివేదించతగినది కలదా! అభిజ్ఞానాన్నే దానినైనా కటాక్షించండి అని పలికెను

ఏమున్నది నాయనా! అంటూ వస్త్రంనుండి ముడివిప్పి చూడారత్నమును హనుమంతునికిచ్చి, దీనిని స్వామికి సమర్పించుము

దీ ్నచూచి నన్ను, తన తల్లిదండ్రులను స్మరించగలడు. చిత్రకూట ములో ఉన్న సమయమున నన్నవమానపరచిన ఒక కాకిని దర్భాస్త్రి రణము నుండి ఒక ధర్భనుతీసి బ్రహ్మాస్త్రంగా అభిమంత్రించి ఆకాకంపై ప్రయోగించినాడు. ఆ కాకి ముల్లోకాల్లోనూ త్రాణను గానక రాముని శరణుకోరింది, అస్త్రప్రభావానికి తన కుడికన్ను అర్పించి ప్రాణం దక్కించుకొంది. దోషిని శిక్షించక విడిచివేయుట ధర్మంకాదుకదా. నన్నువాడు కంతుడై, జయింతుడైన, వసంతుడైనా కాకిగా తన నీచబుద్ధిని చూపించి శిక్షింపబడ్డాడు. దుష్టముల్లైన కాకీ, పిచ్చుకల మీదనే బ్రహ్మాస్త్రం ప్రయోగించినస్వామి ఇప్పుడు నాపై దయతప్పినాడా! లేనిచో ఈ నీచుని ఏలవధించడు. అనన్య శరణు నగు నన్ను కరుణించమని ఆర్యపుత్రులకు దయగలుగునట్లు చెప్పుడు ఈ విషయాన్ని జ్ఞాపకంచేయి ఆ సుప్రతను. అతడు లేని జీవితాన్ని క్షణమైనను భరించలేని నాయందు ఆ కాకమాత్రమున దయచూపినట్లు రక్షించమని చెప్పు. అతడి అనురాగంతో నా నుదుటను తీర్చిదిద్దిన తిలకం అటులనే ఉన్నదని మనవి చేయుము. శీఘ్రంగా మమ్ముల ఈ విపత్సముద్రం నుండి ఉద్ధరింప సమర్థుడవు నీవే నాయనా! స్వామికి తమ వృత్తాంతం తెలిపి నన్నుద్ధరించే మార్గాన్ని చూపి మమ్ములనొకచోట చేర్చు బాధ్యత నీపై ఉన్నది. మరియొకడి కిట్టి పని సాధ్యం కాదు. అని సీతాదేవి హనుమంతుని గూర్చి పలికెను.

హనుమంతుడు ప్రాంజలియై ప్రదక్షిణ నమస్కారాలు గావించి వృక్షాగ్రాన అధిరోహించెను.

సీతా సందర్శనం జరిగింది. రాముని క్షేమ వృత్తాంతం తల్లికి మనవిచేయుట జరిగింది. రావణునికి బుద్ధి చెప్పడమున్నది. దానికిదే ఉపాయమని మనస్సులో నిశ్చయించుకొని తత్ఫలితంగా

అశోక వనంలో చెట్లు విరుగుచున్నవి. కొమ్మలు రాలిపో

ఉన్నాయి. పక్షులు ఎగిరి పోతున్నాయి. వృక్షాలు, కాయలు, పళ్ల రాలిపోతున్నాయి. తోరణ స్తంభాలు కూలిపోతున్నాయి, మండపాలు బ్రద్దలై పోతున్నాయి. ఇది ఏమిటి. ఇదియొక మహాభూతం, ఈవనాన్ని ఆవేశించింది. రాక్షసగణం భయభ్రాంతమైంది.

అమ్మా: సీతమ్మ తల్లీ ఎవరమ్మా అతను. నీతోమాట్లాడాడు అని ప్రశ్నించారు. రాక్షసాంగనలు. పాములవాళ్లు, పాములకు తెలుస్తాయి. నాకెలా తెలుస్తాయి. నీకే తెలియాలి. నాకు తెలియదు. కొందరు పరుగెత్తారు. కొందరు రావణునికి నివేదించారు. రావణసార్వభౌమా ఒక పెద్దకోతి .... ....

రావణుడు; ఎక్కడరా అది

సేవ; అశోకవనం పాడుచేసింది ప్రభూ! అక్కడవారిని చావకొట్టింది.

రావ; ఎవరక్కడ

సేవ! అంతా ఇక్కడే ప్రభూ!

రావ; ఎందుకున్నారు

సేవ; కోతిని పట్టుకొందుకు మీ అనుమతితో

రావ: వెళ్లండక్కడికి. పట్టుకోండి.

రావణుడితో సాటియైన రాక్షసులు, ఎనబై వేలమంది కింకరులను పేర్లుకలవారు. హనుమంతుని పట్టుకొనుటకు వెళ్లారు. మహోదరుడు. మహాక్రూరుడు, ఘోరరూపులు, ఆయుధధారులు, హనుమంతుని చూశారు. తోరణస్తంబంపైన హనుమంతుడు తనతోకను ఝళిపించాడు. అచప్పుడుకు పిడుగుపాటికి పిట్టల్లాగ ఎగిరిపోయినారు రాక్షసులు భయభ్రాంతులై,

(జయత్యతి బలోరామో లక్ష్మణస్య మహాబలః దాసోహం కోసలేంద్రస్య)

ఏమిటిరా అరుస్తున్నాడు
తెలియడం లేదా.

బలవంతులగు రామలక్ష్మణులకు జయము అంటున్నాడు. తనూ రాముని బంటట.

అయితే పట్టుకొండి. పట్టుకోండి. కొట్టండి. చంపండి. తోరణ స్తంభాన్ని ఊడబీకి దానితో ఆ రాక్షసులను హనుమంతుడు సంహరించాడు. బిగ్గరగా అరచాడు. ఆ ధ్వనికి మిగిలిన రక్కసులు దిక్కు తెలియక పరుగెత్తారు. వేటగాడు ఒక కాకిని ఉండవింటి నేలను పడగొడితే మిగిలిన కాకులు చెట్టుమీంచే అరుస్తూ ఎగిరిపోయినట్లూ పారిపోయారు.

రావణునకు మరలా సమాచారం అందింది. మనకింకురులకు యమ కింకరులకు లోబడిపోయారని. రావణునికి కోపం ముంచుకొచ్చింది. చితిలో కాలుతున్న శవం నుండి మంటలాగ మండిపోయాడు. వీడు సామాన్యమైన వానరుడు కానట్టున్నది.

ప్రహస్తుని పుత్రుడు జంబుమాలి అనువానికి రావణ ఆజ్ఞ అయింది, వీడికి మృత్యులోకానికి బాటపడింది. సపరివారంగా రధము పై బయలుదేగాడు.

ఎప్పుడో, ఎవరో, ఎవతో వచ్చాదాకా ఎందుకు కూర్చోవటం అంతవరకు ఈ చైత్ర ప్రాసాదాన్ని పడగొడతాను. ఇది చాలా ఉన్నతంగా, రమణీయంగా ఉన్నది అనుకొన్నాడు హనుమంతుడు. కాలితో ఒకతన్ను తన్నాడు, ఫెళ, ఫెళాలాడుతూ, మంటలు రేపుతూ మేడవిరిగి నేల పడిపోయింది. పాలకులు హనుమంతుని [వానరుని] తో కలియబడ్డారు.

" మహాగజాః ఫలాయంతే " ఈ నక్కలు ఒక్కుమ్మడిగా నలిపివేయబడ్డారు.

ఇంతలో జంబుమాలి సైన్యంతో వచ్చాడు. తోరణస్తంభం ధరించి ఎదుటనిలబడిన హనుమంతునిచూశాడు. వీడు వానరుడుకాడు యముడులాగున్నాడు. అని అనుకొన్నాడు.

" హనుమానితి విఖ్యాతః నరావణ సహస్రమ్మో యుద్ధే ప్రతిభయం భవేత్తు " ఇది మారుతి (జవాబు) మాట.

వీడిపేరు హనుమంతుడట. వేయిమంది రావణులొచ్చినా భయం లేదంటున్నాడు. కూత ఘనంగానే ఉంది పిట్టకొంచెమైనప్పటికీ సరేఅనుకొని భాణప్రయోగం చేశాడు జంబుమాలి రాక్షసులుభీకరంగా అరుస్తూ అంజనేయునిపై బల్లెములు, శూలములు, పట్టిసము ప్రయోగించారు.

వీరందర్ని హనుమంతుడు తోరణస్తంభంతో చావమోది యమపురికి అతిధులుగాపంపాడు జంబుమాలి రధంమీదకు ఒకేసారి లంఘించాడు. ఆ పడుట పిడుగుపాటుగా సారధితోకూడిన రధం నాశనమైంది ఒక్క ముష్టిప్రహారంతో జంబుమాలి యమలోకానికి దారితీశాడు.

చావుకబురు రావణునికి చల్లగా తెలిసింది. వీడు వానరుడు కాడు కాలుడు. రావణుని కోపం మితిమీరి పోయింది. మండుచున్న దీపం నుండి జారిపడుతున్న నూనె చుక్కల్లాగ క్రోధాశ్రువులు రాల్చాడు. ఒరే! పిలు మంత్రిపుత్రుల్ని భటునకు అరచి ఆజ్ఞాపించాడు

విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధర్షుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు వచ్చారు.

వెళ్లండి. ఆ వానరుని చంపండి. మీ సామర్థ్యాన్ని ప్రకటించటానికి ఇదే మంచి సమయం. ఇదీ రావణుని ఆజ్ఞ.

ఈ ఐదుగురికి అది రావణాజ్ఞగాలేదు. యముడు, ఎక్కిన పోతుమెడలోని గంటలు చప్పుడు లాగుంది. పలువురు రాక్షసులు సాయుధపాణులై వెంటరాగ బయల్దేరారు. ఎదుట హనుమ ప్రళయాగ్ని రూపం దాల్చినట్లు కనిపించాడు.

" అస్త్రవిత్ జయతామ్‌రామః లక్ష్మణస్య మహాబలః ఇధి హనుమంతునినోట వెలువడిన మాటకాదు. పిడుగుల మ్రోత, ఆమోత్రకే కొందరు రక్కసులు కూలిపోయారు. మూకుమ్మడిగా పంచసేనాగ్ర నాయకులు తలపడ్డారు. వివిధ ఆయుధాలు ఒక్కుమ్మడిగా ప్రయోగింపణడ్డాయి. (పడుతున్నాయి) కొండమీద చిరుజల్లు లాగుంది. ఆ యుద్ధం హనుమంతునకు. కొందరిని తల ప్రహారంతోనూ, మరి కొందర్ని పాద ప్రహారంతోనూ, కొందర్ని గోళ్లతోనూ, కొందర్ని పళ్లతోనూ, వేరోకొందర్ని రాళ్లతోనూ, కొందర్ని చెట్లతోనూ, కొట్టి చీల్చి, తన్ని, ఈడ్చి చంపేశాడు. పంచసేనాగ్ర నాయకులతో రాక్షస పరివారం నాశనమైంది. వార్తాహరులూ, చావగ మిగిలినవారూ, రావణునికి సమాచారాన్ని అందించారు.

రావణునికి ఈపరాజయమంతా కోపానికి కారణంగా మారుతున్నది. పళ్లు కొరుకుతున్నాడు, చేతులు నలుపుతున్నాడు, కాళ్లు నిలచుటలేదు, ఇటు–నటూ తిరుగుతున్నాడు. ఎలాగ? ఎలాగ వీడ్ని నిగ్రహించడం లంకకు మృత్యువు. ఎవరక్కడ........

అక్షయుడ్ని. నన్ను పంపించండి అన్నాడు కొడుకు సరే నీవెళ్లు జాగ్రత్తా వాడు సామాన్యుడుకాడు. పరివారాన్ని వెంటతీసు వెళ్లు అన్నాడు రావణుడు.

అలాగె వెళ్తుతున్నాను నాయనా! (వెళ్లిపోయాడు).

వెళ్లొస్తానని చెప్పడేమి. మరిరాడు కాబోలు. అక్షయకుమారుడు రథంమీద సైన్యంతో బయల్దేరాడు హనుమంతుని జయించడానికి.

కుర్రవెధవ! మిడిసి పడుతున్నాడు. దగ్గరకురానీ వీడిపని పడతాను. అని అనుకొంటున్నాడు హనుమంతుడు. దగ్గరగా ఉన్న సాలవృక్షాన్ని పెకలించాడు. సమీపిస్తున్న రాక్షసులను ఆ మద్దిచెట్టుతో చంపుతున్నాడు. ఆ చెట్టుతాకిడికి పదులు, వందలుగా ఒక్కుమ్మడి నశిస్తున్నారు. హా హా కారాలు చెలరేగాయి. నేలరక్తం మడుగులూ పీనుగుపెంట అయింది.

అక్షయకుమారుడు రథంమించీ బాణవర్షం కురిపిస్తున్నాడు. వర్షపు జల్లులాగ. హనుమంతుని పై పడుతున్నాయి. రక్తంతో తడిసి పూసిన మోదుగలాగుంది హనుమంతుని శరీరం. ఇక వీడిని ఉపేక్షించకూడదు. రెక్కలున్న కొండలాగ రథంమీద పడ్డాడు, రథము, గుఱ్ఱములు, సారథి సర్వం నాశనమైనాయి. కత్తిపట్టుకొని అక్షయుడు ఆకాశానికెగిరాడు. గాలితో తన్నిన బంతిలాగ, అగ్నిగోళంలాగ. రెండుకాళ్లు పట్టుకొని క్రిందికి దిగలాగాడు హనుమ. గిరగిరా త్రిప్పి నేలకేసి బాదుతున్నాడు. చాకలి మురికి బట్టను బండమీద ఉతుకుతున్నట్టు.

అక్షయుడి అవయవములు ఏర్పరచరానట్లు తుత్తునియలైనాయి. మిగిలిన రాక్షసులు పరుగెత్తి పోయారు. లంకానగర ప్రాంగణం రక్తసిక్తమైంది.

ఈమాటలు ఎవరూ చెప్పకనే తెలిసింది రావణునికి. అంతా నశించారని కొడుకు నశించాడని దుఃఖం వచ్చింది. కింకరులు

నశించారు. ప్రహస్త పుత్రుడు కూలిపోయాడు. పంచసేనాగ్ర నాయకులూ పంచత్వం పొందారు. అక్షయకుమారుడు అంతరించాడు ఎంత సైన్యం నశించిందో అంచనాలేదు.

తండ్రీ! సెలవివ్వండి, నేనువెళ్లి ఆ వానరుని తెస్తాను. అన్నాడు ఇంద్రజిత్తు.

వెళ్లిరా. నీపై నాకు విశ్వాసమున్నది శస్త్రాస్త్రము తెలిగిన వాడవు. ఇంద్రున్నే జయించినావు కదా! వానరుడనగా నీకెంత అని తండ్రియైన రావణుడు ప్రోత్సహించాడు.

అసలు వీడిపేరు మేఘనాధుడు. పుట్టగానే ఉరుముల్లాగ ఏడ్వడం మొదలుపెట్టాడు. అందుచేత ఇంద్రజిత్. ఇది పౌరుషనామం మేఘనాధుడనేది తల్లిదండ్రుల పెట్టిన నామం.

సైన్యాన్ని వెంటపెట్టుకొని రథమునెక్కి లంకా ప్రాంగణానికి వచ్చాడు. వీడెవడో గట్టివాడిలాగే ఉన్నాడు అనుకొన్నాడు ఇంద్రజిత్, రాక్షసులు. హనుమంతునిపై ఆయుధాలు ప్రయోగించారు.

హనుమంతుడు రాక్షసుని ఒకర్ని పట్టుకొని వేరొక రాక్షసునిపైకి విసిరివేశాడు. దానితో ఆ ఇద్దరు కూలిపోయారు. అటులనే రథంతో రథం, ఏనుగుతో ఏనుగూ, గుఱ్ఱంతో గుఱ్ఱాన్ని చంపడం మొదలుపెట్టాడు.

ఇంద్రజిత్ అస్త్రాలు ప్రయోగింప మొదలుపెట్టాడు.
" అస్త్రవిత్ జయతాంరామో లక్ష్మణస్య మహాబలః
దాసోహం కోసలేంద్రస్య నతురావణ సహస్రమ్మో

యుద్ధే ప్రతిభయం భవేత్ '' అని బిగ్గరగా అరచాడు హనుమంతుడు. వృక్ష, పాషాణాలు ఇంద్రజిత్‌పై ప్రయోగించాడు.

ఇతడు అవధ్యుడని తెలుసుకొన్నాడు ఇంద్రజిత్. బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి హనుమంతుని బంధించాడు. రాక్షసులు తాళ్లతో కట్టారు. అస్త్రబంధం వదిలిపోయింది. మూర్ఖులు రాక్షసులు నన్ను వీల్లు రావణుని దగ్గరకు తీసుకొని వెళ్తారు. నాకు కావలసిందీ అదే. మోసుకెళ్ళనీ. రావణునికీ బుద్ధి చెప్పవచ్చు అనుకొన్నాడు ఆంజనేయుడు.

ఇంద్రజిత్ హనుమంతునికట్టి రాక్షసులు మోసుకు రాగా తండ్రివద్దకు వచ్చాడు. రావణుడు మంత్రులతో కొలువు తీర్చి వున్నాడు, కొడుకు ప్రతాపానికి సంతోషించి హనుమంతుని చూశాడు

ఔరా! వీడు హనుమంతుడా! వానరుడా! కాదు కాదు ఇంద్రుడు, ఉపేంద్రుడు, వరుణుడు, యముడై ఉంటాడు. లేకపోతే వారిచేత పంపబడిన వాడేమో! కాదు కాదు! వీడు నందీశ్వరుడు! నేను కైలాసానికి వెళ్లినపుడు నన్నడ్డుకొన్నాడు. అప్పుడు వాడ్ని నేను వాడి ముఖంచూచి కోతిలాగున్నావని పరిహసించి అవమానించాను. వాడపుడు ఆకోతి చేతనే పరాభవింపబడి నశిస్తావని శపించాడు. కనుక వీడు నందియే. సంశయంలేదు ఎంత భయంకరంగా ఉన్నాడు మధ్యందిన సూర్యునిలా ఉన్నది వీని ముఖం. కొండలా ఉంది శరీరం వజ్రనఖాలు, వృశ్చికరోమాలు, పింగళ నేత్రాలు, తామరములాటి ముఖము, గోపుచ్ఛంలాగ సుదీర్ఘమైన ఆ తోక యమపాశంలా ఉంది [ఆవాలపాశం] రావణుడు హనుమంతుని చూసి ఆశ్చర్యభయశంకా సమన్వితుడైనాడు ప్రహస్తునిచూచి.

ఎవడువీడు? ఎందుకు వచ్చాడు. రక్కసులనేల సంహరించాడు?

వనభంగం ఎందుకు చేశాడు? కనుక్కోమ్మన్నాడు.

ప్రహస్తుడు— ఎవరయ్యా నీవు? నీవచ్చిన సంగతిచెప్పు. నిజం చెప్పకపోతే నీ ప్రాణానికే ముప్పువస్తుంది. సత్యం చెప్పు. నీకేమి భయంలేదని హనుమంతుని ప్రశ్నించాడు.

మద్య నీ రాయభారమేంటయ్యా! సముఖంలో చెప్తానులే. అందుకే వచ్చాను ఇక్కడకు అన్నాడు హనుమంతుడు.

వినవయ్యా! లంకేశ్వరా! నేను రాముని బంటును. అంజనీగర్భ సంభూతుడను. హనుమంతుడను. మీరనుకొన్నట్టుదేవదూతను కాను. రామదూతను, నందిని కానేకాను. వాలి మీకు తెలుసనుకొంటాను అతడు రామబాణానికి హతుడైనాడు. అతని తమ్ముడు సుగ్రీవుడు కిష్కిందకు రాజు. నీ క్షేమం అడుగుతున్నాడు. జనస్థానంలో శ్రీరామచంద్రుని భార్య సీతాదేవి అపహరింపబడింది. ఆమెను వెతకడానికి నాకంటే బలవంతులూ, నాతో సమానమైన వార్లను సుగ్రీవుడు నలు దిశలకు పంపాడు. కొందరి వానరులతో నేను దక్షిణదిక్కునకు వచ్చాను సముద్రాన్ని దాటి రాత్రి లంకంతా వెతికాను. సీతను అశోకవనంలో చూశాను. దొంగా, దొంగలింపబడిన సొత్తు తెలుసుకున్నాను. సీతను మా స్వామికి సమర్పించడం ఉంది. ఆపని నువ్వేచేస్తే నీ ప్రాణాలు దక్కుతాయి.

నీవు పులస్త్యబ్రహ్మ మనుమడవు. విశ్రవసుని పుత్రుడవు. ఉత్తమకుల సంజాతుడవు. పైగా ఈశ్వరభక్తుడవు. లంకారాజ్యనాయకుడవు. మహాబలవంతుడవు. రూప, శౌర్య, పరాక్రమవంతుడవు. సకలశాస్త్రాలు తెల్సినవాడవు.

కానీ ఏంలాభం సన్యాసివేషంలో మోసగించి సీతను తీసుకు

వచ్చావు. ఎందరెందరి అబలలను ఎన్నివిధాల మోసగించి తెచ్చి ఉంటావు. సకల దేవతలను ఏడిపించి రావణశబ్దం సార్థకం చేశావు. నీ నడవడి లోకనింద్యమైంది. పాపభూయిష్టమైంది. నీ పతనానికి నీ దుష్ప్రవృత్తియే కారణమౌతుంది కర్మానుభవం కట్టికుడుపగబోదు

సీత నీ కంఠాద్భుత కాలపాశం. మెడకు చుట్టుకొన్న నల్లత్రాచు నీ నెత్తిమీద పిడుగు. నీ లంకకు మృత్యువు. తెలిసిందా?

అంతటకూ నేనే సరిపోతాను. లంకను నాశనంచేసి సపుత్ర మిత్రామాత్యకంగా నిన్ను సంహరించి మాతల్లి జనకసుతనూ శ్రీరామ చంద్రునికి సమర్పించగలను. కానీ అలా చేయను.

మా రాముడు నిన్నూ నీ రాజ్యాన్ని నాశనంచేసి సీతను తెచ్చుకొంటానని ప్రతిజ్ఞ చేశాడు. త్వరపడి సీతాదేవిని రామచంద్రు నికి సమర్పించు. చేతులుకాలేక ఆకులుపట్టుకుంటే లాభంలేదు ఈమాట నీకు చెప్పడానికి నీఎదుటకు వచ్చాను. అని హనుమంతుడు నిర్లక్ష్య ముగా, నిర్భయంగా రావణునితో చెప్పాడు.

ఎవరక్కడ? చంపండి ఈ కోతిని అని అరచాడు రావణుడు.

ఎవరూలేరు: చంపడానికి వచ్చినవారంతా ఇదివరకే చచ్చారు. మరింకెవరున్నారు అన్నాడు హనుమంతుడు.

రావణుడు కోపంతో చితాగ్నిలా మండిపోయాడు. పళ్లు పటపటా కొరికాడు. చంద్రహాసం ఒరనుండి పెరికాడు.

అన్నయ్యా! ఆగు. దూతను చంపరాదు. రాజశాస్త్రం నీకు తెల్సుకదా! వీడ్ని చంపితే ఇక్కడవార్త నీ శత్రువుకెవరు చెప్తారు

ఒక దూత. దూతకు తగినశిక్ష విధించు అన్నాడు విభీషణుడు.

అయితే కోతికి తోకంటే ఇష్టం కనుక తోకకాల్చి పంపండి. మన శత్రువులకు తెలుస్తుంది మన ప్రతాపం అని రావణుడు రాక్షసులకాజ్ఞాపించాడు. ఊరంతా తిప్పండి. అందరూ వినోదిస్తారు కూడా అన్నాడు.

రాక్షసులు పాతగుడ్డలు తీసుకొని వచ్చారు. హనుమంతుని తోకకు కట్టారు. కొందరు నూనెతో తడిపారు. మరియొకడు నిప్పంటించాడు. తాళ్లుకట్టి లాగుచున్నారు. వెక్కిరిస్తున్నారు. అరస్తున్నారు ముందుగా డప్పులు వాయిస్తున్నారు.

"సీతను చూచిన కోతిని చూడండి" రండి రండి ఆనందించండి. ఈ సరదా మరిరాదని చాటిస్తున్నారు.

పిల్లలూ, పెద్దలూ, ఆడవాళ్లు—మగవాళ్లు ఇళ్లలోంచి, వీధుల్లోంచి సందులలోంచీ వచ్చేస్తున్నారు. చప్పట్లు కొడుతున్నారు. అరుస్తున్నారు అల్లరిచేస్తున్నారు. వీధి వీదీ, వాడా—వాడా, సందూ—సందూ ఈ వానరాన్ని త్రిప్పుచున్నారు. మావీధికి రండి మా పిల్లలు చూస్తారు మా ఇంటికి తీసుకురండి. మా సందుకు మరవకండి. అని రాక్షసులంటుంటే హనుమంతుని సందు సందునా మూల మూలనా తిప్పుతున్నారు.

గతరాత్రి బాగా చూడలేదు లంకను. ఇప్పుడు వీళ్లునాకంతా చూపుతున్నారు. దుర్గ కర్మవిధానము, పట్టణ నిర్మాణ ప్రావీణ్యము అన్నీ తెలుస్తున్నాయి. మండుతున్న తోకను ఒకచేతితో పట్టుకొని ఆంజనేయుడు నగరాన్ని వీక్షిస్తున్నాడు. కొందరు రక్కసులు అశోక వనానికి పరుగెత్తారు. అమ్మా! సీతమ్మతల్లీ! నీతో మాట్లాడిన కోతి

తోకకు నిప్పంటించారు. ఊరంతా త్రిప్పుతున్నారని సీతాదేవితో చెప్పారు.

నా స్వామిని త్రికరణశుద్ధికల్గి సేవిస్తున్నాను. ఓ అగ్ని హోతుడా! నా పాతివ్రత్యంవల్ల హనుమంతునికి బాధకల్గకుండా చందనద్రవంపలే శీతలంగా ఉండు అని మనసా అగ్నిని శాసించింది హనుమంతుని పుచ్ఛమున మండుతున్న అగ్ని చందనంవలే చల్లని స్పర్శ కల్గించింది.

చాలా ఆశ్చర్యంగా ఉంది. మండుతున్న అగ్ని చందనం శీతలం కల్గిస్తున్నది. ఇది సీతారాముల కరుణ అనుకొన్నాడు హను మంతుడు. ఇక మిగిలిన కార్యక్రమమేంటి? నాతోకమ మండుతున్న అగ్నికి సంతోషం పెట్టవలసి ఉన్నది. దానితో ఈ లంకానగరం నామ మాత్రావశిష్టమౌతుంది. అని నిశ్చయించుకొన్నాడు హనుమంతుడు తన శరీరాన్ని చాలా వరకు సంకుచిత పరచుకొన్నాడు.

దానితో కట్టినతాళ్లు నేలజారి పడిపోయినాయి. శరీరంను మహోన్నతంగా పెంచి, ఆ తోకను గిరగిరా త్రిప్పసాగాడు, తనను పట్టుకొన్న రాక్షసులు ముఖానికి అంటిచాడు. దగ్గరకు చేరినవారికల్లా కాల్చేస్తున్నాడు. గోడలమించి, మేడలమించి చూస్తున్నాడు.

ఒకసారి ప్రహస్తుని భవనం మీదకి లంఘించాడు. ఇంటికి నిప్పపెట్టాడు. ఆ తరువాత ఇంద్రజిత్ ఇంటికి, మహాపార్శ్వుడు జంబు మాలి, మహోదరుడు, సుమాలి మొదలైనవాళ్ల భవనాలకు నిప్పంటిస్తు భవనం నుండి భవానాన్కి లంఘిస్తూ యున్నాడు. వాయువు కూడా సహకరించాడు క్షణకాలంలోలంకానగరం అగ్నిజ్వాలా పరివృత్తమైంది

ఆహాకారాలు చెలరేగాయి. ఏడుపులు, బొబ్బలు, పెడబొబ్బలు

వినిపిస్తున్నాయి. జ్వాలలు ప్రజ్వరిల్లుతున్నాయి. ఫటఫటారవములతో మంటలు ఆకాశాన్నంటుతున్నాయి. మేడలు కూలిపోయాయి. ద్వారాలు, కిటికీలు, ఆసనాలు, వాహనాలు అన్నీ మండి బూడిదైనాయి ఎరుపు, పసుపు, నీలం, బంగారు రంగు మిశ్రంలా ఉన్నాయి. ధూమ రాజిచేత కన్నులు కనబడకుండా పోయినాయి. ఒళ్లుకాలి, ఇళ్లుకాలి సరుకులుకాలి, సంసారాలు కాలుతున్నాయి. అంతా భస్మీపటలమై పోతున్నది. చాలా వినోదంగా ఉంది హనుమంతునికి. సముద్రానికి వచ్చి, ఆ తోకను నీటిలో ముంచి చల్లార్చాడు.

ఇంతలో సీతాదేవి జ్ఞాపకం వచ్చింది. ఆమెకు ప్రమాదమేమీ లేదు కదా! ఎంత పొరపాటు చేశాను. నా ప్రయత్నమంతా వృథా అయింది. ఎందు నిమిత్తం ఇంత ప్రయాస చేశానో అది వ్యర్థమైంది. హనుమంతునికి దుర్భర దుఃఖం ముంచుకొచ్చింది.

ఆకాశంమీంచి చారణులు అనుకొంటున్నారు. లంకంతా భస్మీభూతమైంది. సీతను అగ్ని స్పృశించలేదు. ఆమె క్షేమంగా ఉన్నది. అది చిత్రంగా అని దేవతలు చెప్పుకొంటున్నారు. విన్నాడు హనుమంతుడు. మనసు కొంచెం కుదుటపడింది. అయినా దర్శించి రావాలి వెంటనే అశోకవనంలో సీతాదేవి సమక్షాన నిలచి, రెండు చేతులు జోడించి, అమ్మా! చాలా భయపడ్డాను. నువ్వు క్షేమంగా నా కన్నుల పడ్డావు. నమస్కారం. సెలవు ఇప్పించు. స్వామిసన్నిధికి వెళ్లిపోతున్నాను. అచిరకాలంలోనే శ్రీరామచంద్రుని చూడగలవు. నీదుఃఖం అంతరించగలదు. అని ఆంజనేయుడు సభక్తికంగా ప్రదక్షిణ నమస్కారాలు చేసి శ్రీరాముని మనస్సున ధ్యానిస్తూ సముద్రందాటుటకు నిశ్చయించాడు.

సువేలా పర్వతంమీద రెండుపాదాలు మోపి శరీరాన్ని కుంచించాడు. చెవులు రిక్కించాడు. గుండెనిండా గాలి పీల్చి ఒక్క

దుటన ఆకాశానికెగిరాడు. అతడు పాదాలుమోపిన ఆ ప్రదేశం పది యోజనాలు వెడల్పు ముప్పై యోజనాల పొడవుకల్గి సమతలంగా మారింది. శిఖరాలు రాలిపోయాయి. వేగానికి చెట్లు విరిగిపోయాయి. జంతువులు పారిపోయాయి. కొన్ని అక్కడకక్కడే నశించిపోయాయి దక్షిణతీరం నుండి ఉత్తరతీరానికి ఇంతకు ముందుగానే మనసుతో ఎగిరిపోయాడు. తిమి, నక్ర, ఝష, సంకులమైన సాగరం పై నుండి సాగిపోతున్నాడు. మేఘమండలంలో దృశ్యాదృశ్యుడై ఎగిరిపోతు న్నాడు. సముద్ర తరంగాలు పర్వతాలంలోపలే ఉవ్వెత్తున లేస్తూ అణిగిపోతూన్నాయి. దరిద్రుల మనోరథాలు పెరుగుతాయి, తరుగు తాయి. ఇది లోకసహజం. మధ్యమార్గంలో మైనాభుడను పర్వత శ్రేష్టుడు దర్శనమిచ్చాడు. క్రింద అనంతమైన సాగరంమీద అనం తమైన ఆకాశం నడుమ హనుమంతుడు దూసుకు పోతున్నాడు.

అస్త్రవిత్ జయతామ్ రామో లక్ష్మణశ్చ మహాబలః
దాసోహం కోసలేంద్రస్య రామస్యా క్లిష్టకారిణః

ఎక్కడనుండి ఆధ్వని వినవస్తున్నది. దక్షిణంనుండి ఉత్తరానికి జాంబ వంతుడు చెవులు రిక్కించివిన్నాడు. అంగదునితో చెప్పాడు. ఆధ్వని మన మారుతిదే. కార్యం నిర్వహించకపోతే అలా నర్దించడు. సర్వదా కృతకార్యుడు హనుమంతుడు.

ధ్వని క్రమంగా వినవస్తున్నది పెద్దగా. వానరులంతా పర్వత శిఖరాలకెగ బ్రాకినారు. కొందరు ఉన్నతమైన సాలవృక్షాలు అధిరో హించి, అందరూ ధ్వని వచ్చేవైపు పరిశీలిస్తున్నారు. జాంబవంతుడూ నీలుడు, అంగదుడు సముద్రతీరంలో నిలబడి, సూర్యకిరణాలు పడ కుండా అడ్డంగా చేతులుంచి, ఆకాశంవైపు చూస్తున్నారు. మిగిలినివారు ఉత్సాహంతో గంతులు వేస్తున్నారు.

"సీతాదృష్టన సందేహః" అని అంగదుడన్నాడు.

చూడకపోతే హనుమంతుని ప్రవృత్తి ఈ విధంగా ఉండదు అన్నాడు జాంబవంతుడు.

హనుమ వేగవంతుడై నూరుయోజనాల జలరాశిని తరించి వానరుల సమక్షాన నిలచి "దృష్టా సీతామయాసాధ్వీ మైథిలీ జనకాత్మజా" అన్నాడు హనుమంతుడు. అమృతోపమానమైన ఆ మాటలు విన్నారు వానర పెద్దలు. జాంబవంతుడు ఆలింగనం చేసుకొన్నాడు. అంగదుడు అభినందించాడు. వానరులంతా సమీపించి, గంతులు వేయసాగారు. పాషాణాలు దొర్లించారు. కొందరు పండ్లు తెచ్చి సమర్పించారు. మరికొందరు కాయలు, దుంపలు తెచ్చి ఎదుట ఉంచారు. కొందరు హనుమంతుని స్పృశించి ఆనందించారు. గిరి పుష్పమాలికలు కంఠంలోవేసి, హనుమన్నా మా అందరి ప్రాణాలు కాపాడావు. చాలా సంతోషవార్త చెప్పావు. పాలవాన కురిసిందంటూ వానరులంతా అభినందించి, ఆనందించారు.

ఉన్నతమైన శిలాఖండంపై హనుమంతుని ఉపశివంపచేసి స్నిగ్ధమైనతమదృష్టిలతో హనుమంతుని మోయుచున్నవారివలేఅతనిని అనుసరించారు. జాంబవదాదులు పరివేష్టించి కూర్చొన్నారు.

హనుమన్నా సీతాదేవిని ఏవిధంగా చూడగలిగావు. ఆమె ఏవిధంగా ఉన్నది. నీవు చాలా అదృష్టవంతుడవు. మా ప్రాణాలను నిలబెట్టినవాడవు. సుగ్రీవాజ్ఞను ఎరుగనివారెవరు అని ప్రశంశించారు

అంతట హనుమంతుడు" మీరంతా చూస్తుండగనే ఇక్కడ నుండి లంఘించాను. క్రింద అగాధం. భయంకరమైన మహాసముద్రం మీద అనంతమైన ఆకాశం మధ్యమార్గంలో మైనాకుడు కన్పించాడు. వానిని తప్పించుకొని వేగవంతుడనై ప్రయాణం సాగిస్తున్నాను. దేవప్రేరితమైన నాగమాతయగు సురస నాకు విఘ్నం ఆచరించ

దలిచింది. దానినతిక్రమించి గమనవేగాన్ని పెంచితిని. సింహికా అను ఛాయాగ్రాహిని నన్ను చంపచూచినది. ఆమెను సంహరించి, సాయం కాలానికి సువేల అనే పర్వతాన్ని చేరుకొని, శరీరం సంకుచిత పరచు కొని లంకలో ప్రవేశింపదలచాను. లంకాపాలిత నన్ను అడ్డుతగిలింది ఆమెను తల ప్రహారంతో లోబరచుకొన్నాను. రాత్రి అంతా లంకా నగారాన్ని అన్వేషించాను నాలుగు అంగులాల ప్రదేశమైనా విడువక గాలించాను. సీతా దర్శనం కలుగక పోవడంతో నన్ను నిర్వేదం ఆవహించింది. సమీపాన ప్రయత్నరక్షితమైన అశోకవనం కనబడిింది వనమంతా వెతికాను ఒక శింశుపావృక్షం క్రింద సీతాదేవిని దర్శించాను

మలినవాస, నిరానంద, పీతకౌసేయ వాసిని, నిరాభరణ ఏకవేణి, అతిదీన ఆమె వస్త్రగంధిని ఆభరణాలతో పడవేలనది. ఈమె ధరించిన వస్త్రఖండమే ఇప్పుడు అదే వస్త్రభాగం. ఈమె శరీరమున శోభిస్తున్నది. రావణుని దౌష్ట్యాన్ని భయపడి మర్తుశ్య కృతనిశ్చయై యున్నది.

ఆమెకు రాముని గుణగణములు వినిపింపచేశాను. ఆమె అనుగ్రహాన్ని సంపాదింప గలిగాను. ఆనవాలుగా శ్రీరామచంద్రుడొ సగిన అంగులీయకం సమర్పించాను. అంగులీయకం గాంచి స్వామి నన్నుహితునిగా తలంచినది. కుశలప్రశ్నల తరువాత ఇక్కడకు మరలి వచ్చుటకు ఆమె అనుమతిని వేడినాను. ఆమె ఆనవాలుగా చూడా మణిని స్వామికి సమర్పించుకొన్నది. ఒకనెల వరకే బ్రతికి ఉండ గలను. పిమ్మట నాకు మరణమే శరణ్యమని దీనంగా పలికింది.

ఆమెను ఓదార్చి అశోకవనం భగ్నం చేశాను. లంకంతా తగులబెట్టాను. తమనొన్ని ధ్యానికి వచ్చాను ఇక చేయుతగిని దానిని నిర్ణయించండి అన్నాను.

మైందద్వివిదులు అశ్వనీదేవతలు అంశకలవారు. అవధ్యులు. చాలాపరాక్రమవంతులు.వీరువెళ్లిసులువుగారావణునివానిపరివారాన్ని చంపి సీతాదేవిని తీసుకొని రాగలరు. నేనిదివరకు తగినంత రాక్షస బలాన్ని నాశనం చేశాను. (చూశాను) అని రామునికి చెప్పేదాని కంటే సీతను తీసుకువచ్చి సమర్పిస్తే బాగుంటుందని సలహాయిచ్చాడు ఆంజనేయుడు. చూసి వచ్చాము అన్నదానికంటే తీసుకొనివచ్చాము అన్నమాటే బాగుండును. వాలి అంతటి పరాక్రమవంతుడు అంగదుడు అతని పేరువినగానే రావణుడు భయక్రాంతుడౌతాడు. ఇక మన తాతగారు జాంబవంతుడు. తనబలం తనకే తెలియదు. చెట్టుముదిరి చేవతేరినట్లు మహా పరాక్రమశాలి ఈతనిని నిర్జించుట దేవదానవులకు అసాధ్యం. లేకపోతే అందరూ జయల్దేరి వినోదానికి వెళ్లినట్లు రావణుని రాక్షసులను సంహరించి సీతాదేవిని శ్రీరామచంద్రునికి సమర్పిద్దాం హనుమంతుని కదనం ఇలా సాగిపోతున్నది.

వానరులంతా మేమంటే మేమని పెళ్లికి బయల్దేరినట్లు లంకతో యుద్ధానికి ఉరకలువేయ మొదలుపెట్టారు. వానరులలో కోలాహలం, ఉత్సాహం పెరిగాయి.

జాంబవంతుడు వారించాడు. ఆగండి. ఆలోచించండి. మన ప్రభువైన సుగ్రీవుడు సీతాదేవి ఎక్కడున్నదో చూసి రమ్మన్నాడు. ఆ కార్యం హనుమంతుడు నెరవేర్చేడు. ఈ విషయం సుగ్రీవునకు, రామలక్ష్మణులకూ తెలియచేద్దాం. ఆపిమ్మట వారు ఎలా ఆజ్ఞాపిస్తే అలా నిర్వర్తించడం సమంజసం అనిపిస్తుంది. అని జాంబవంతుడు తన నిశ్చయాన్ని తెలిపాడు.

జాంబవంతుని మాట వానరులకు నచ్చింది, నరే పదండని హనుమంతుని ముందుంచుకొని వానరులంతా ఒక్కపెట్టున ఆకాశానికి ఎగిరారు. యంత్రంతో ఎగరగొట్టబడిన పర్వత శిఖరాల్లా ఉన్నారు.

మార్గమధ్యలో మధువనం కన్పించింది. ఆ తోటలో ద్రోణ మాత్ర ప్రమాణం గల తేనెపట్టులున్నాయి. దాని నుండి తేనె స్రవిస్తూంది. విప్ప, పనస, మామిడి, కొబ్బరి, అరటిచెట్లు దట్టంగా ఉన్నాయి. అన్నీ ఫలవంతాలే సుగ్రీవుడూ, వాలి, వారి పూర్వుల నుండి ఆతోటను సురక్షితంగా పెంచబడుతున్నది. దానికి దధిముఖుడనే వానర వీరుడు తన పరివారంతో ప్రాణప్రదంగా ఆ తోటను చిరకాలం నుండి రక్షిస్తున్నాడు. రామదండు పంట చేనులో మిడతల దండులా వెళ్లి పడ్డాది. అంగదున్ని అడిగారు ఈ తోటలో పండ్లు, కాయలు నిండుగా ఉన్నాయి. ప్రభూ నీ సెలవు అయితే .... ....

వీటిని తింటారంటారు. అయితే తినండి. అనుభవించండి అన్నాడు అంగదుడు.

వానరులలో సహజస్వభావం విజృంభించింది. కాయలు కొరికి పోశారు. కొమ్మలూపి పండ్లు నేల పడగొట్టారు. పండ్లు తినే వాళ్లు తింటున్నారు. తేనె తెట్టులు క్రిందికి పడతోసేస్తున్నారు. మధువు ఒలకపోసారు. దాన్ని దోసెళ్లతో జుర్రుకొంటున్నారు. ఒకరిపై నొకరు కాయలు, పండ్లువిసురుకొంటున్నారు. కిలకిలలు పకపకలు చెలరేగుతున్నాయి. చెట్లుకొమ్మల పై నుండి దుముకుతున్నారు. విరచి వేస్తున్నారు. ఉయ్యాల లూగుతున్నారు. భజన చేస్తున్నారు. భక్తి నటిస్తున్నారు. మదంచేత సోలుతున్నారు. నిద్రిస్తున్నారు. ప్రాలాపిస్తున్నారు. లేచి పడుతున్నారు. పరుగులు పెడుతున్నారు. కార్యనిర్వాహకులు నిరంకుశులై ఉంటారు. నిరంకుశులే కార్యాన్ని నిర్వహిస్తారు. కార్యనిర్వహన యొక్క ప్రాధాన్యాన్ని పట్టే వారి నిరంకుశత్వం అమోదయోగ్యంగా ఉంటుంది నాటోలు.

వనపాలురు సౌమ్యంగా వానరులను అధిక్షేపించారు. ప్రయోజనం కనబడలేదు. తిన్నంత తిన్నారు, తాగినంతా తాగారు,

ఇకపొండని ధధిముఖుడన్నాడు. వానరులు వినిపించుకోలేదు. వన పాలురు యుద్ధానికి సిద్ధపడ్డారు. ధధిముఖుడు వచ్చి నయానా, భయానా చెప్పాడు కానీ ప్రయోజనంలేదు. వనం భగ్నం అగుచునే యున్నది. దధిముఖుడు కూడా తన బలాన్ని ఉపయోగించాడు. వానరులలో వానరులకు చిన్నపాటి యుద్ధం జరిగింది,

దధిముఖుడు నలుగురు వానరులను వెంటబెట్టుకొని తన ప్రభువు సుగ్రీవుడున్న పర్వతాన్ని చేరుకొన్నాడు.

రామలక్ష్మణ సుగ్రీవులు దక్షిణ దిక్కునకు వెళ్లిన వానరులు జాప్యం చేసినందుకు కారణం ఆలోచిస్తూన్నారు. సమయం అతిక్రమించింది. వారు కార్యం నిర్వహించక తిరిగిరారు. వారి స్వభావం అట్టిదని అనుకొంటున్నారు.

ప్రభూ! వానరులు దక్షిణ దిక్కునుండి వచ్చి మన మధువనాన్ని నాశనం చేసేస్తున్నారు. ఎన్ని విధాల నచ్చచెప్పినా వినలేదు వారితో పోట్లాట జరిగింది. చాలావరకు వారలచే దెబ్బలుతిని పీడింపబడి తమతో మనవి చేసుకొనుటకు వచ్చామని దధిముఖుడు సుగ్రీవునితో చెప్పాడు. దానిని రామలక్ష్మణులు విన్నారు.

సుగ్రీవుడదివిని వారినిక్కడకు అతివేగం పంపిచు. వారు కార్యసిద్ధి పొందివచ్చారు. అయిందేదో అయింది. వార్ని ఇక్కడకు వచ్చేటట్లు త్వరపెట్టు అని దధిముఖునితో సుగ్రీవుడు పలికాడు.

అతడు వానరులను పంపించుటకు మధువనం చేరుకొన్నాడు.

శ్రీరామచంద్రా! సీతాదేవిని వానరులు చూచియే ఉంటారు. హనుమంతుడే ఇందులకు సమర్థుడు. చూసివచ్చిన సంతోషంతో మధు

వనం భగ్నం చేశారు. సందేహంలేదు. సీతాదేవిని హనుమంతుడు చూసియే ఉంటాడని సుగ్రీవుడు రామలక్ష్మణులతో మనవి చేసేడు.

కర్ణపేయములైన ఆ సుగ్రీవుని పలుకులు విన్నారు. రామలక్ష్మణులు. మనస్సులు ఊరట చెందినవి, మంచిగానీ చెడుగానీ హఠాత్తుగా వినినందునా, లేక చూసినందునా విషమ పరిణామం చెందుతుందికదా! ఊహ పొడముటయు అనంతరం నిజమగుట ఇదీ ఒకందుకు మేలే.

దధిముఖుడు హనుమజ్జాంబవదంగదాదులకు ప్రణమిల్లినాడు క్షమించండి మిమ్ములను ఎరుగక మీతో యుద్ధానికి తలపడ్డాను సుగ్రీవుడు త్వరగా మిమ్మల్ని తమవద్దకు రావాలసిందిగా చెప్పమన్నాడు. మీరాకకు ఎదురుచూస్తూ ఉంటారు అని సవినయంగా మనవి చేశాడు.

అదివిని అంగదుడు మనంవచ్చిన సమాచారం రామలక్ష్మణులకు, సుగ్రీవునకూ తెలిసింది. ఇంక ఇక్కడమనం జాగుచేయరాదని అన్నాడు.

వెంటనే వానరులు మింటికెగిరి పోయారు. హనుమంతుని జాంబవంతుని, అంగదున్ని ముందిడుకొని వానరులు కొన్ని నిమషాల్లో రామలక్ష్మణ సుగ్రీవ సన్నిధిలో నిలచారు. అందరూ ప్రభువుకు నమస్కరించారు. హనుమంతుడు వార్ల కువిశేషించి రామునికి సాష్టాంగ దండప్రణామం గావించి " దృష్టా సీతా " సీతాదేవిని చూసినట్లు మనవి చేశాడు.

అమృతోపమానములైన ఆ వాక్యములనువిని రామలక్ష్మణ సుగ్రీవులు సంతోషించారు. రామచంద్రుడు ఈ శుభవర్తమానం

తెలిపిన హనుమంతుని గాఢంగా ఆలింగనం చేసుకొని అభినందించాడు

సుగ్రీవుడు వానరులనుద్దేశించి సీతాదేవి ఎక్కడ చూడబడింది ఎటులున్నది? ఏం మాట్లాడినది. ఆమె క్షేమ సమాచారాలు తెలుపవలసినదిగా కోరాడు.

వానరులు హనుమంతుని ప్రోత్సహించారు.

అతడు రామలక్ష్మణులకు సమస్కరించి, సీతాదేవి ఉన్న దిక్కునకు నమస్కరించాడు.

ప్రభూ! శ్రీరామచంద్రా! సీతాదేవి క్షేమంగానే ఉన్నారు. రావణునిచే అపహరింపబడి అశోకవనంలో రాక్షసీగణ పరివృతయై నిరంతరం మిమ్మల్నే ధ్యానిస్తూ ఉన్నారు. అనిచెప్పి హనుమంతుడు ఆ తల్లి ఆనవాలుగా ఒసగిన చూడామణిని రామచంద్రునకు భక్తి పురస్సరముగా సమర్పించాడు.

రాముడు ఆ మణిని గ్రహించాడు సీత తన సమక్షంన ఉన్నట్లే భావన కలిగింది. ఆ మణిని హృదయాన చేర్చుకొని కనులు మూసుకొన్నాడు. ఆ కనులనుండి రెండు భాష్పబింధువులు జారినాయి అవి దుఃఖాశ్రులా? ఆనందాశ్రువులా మనకు తెలియదు. ఏమన్నది? ఎటులున్నది? సీత? అంజనేయా! చెప్పుము అని రాముడు ఉత్సుకతతో పలికెను.

ప్రభూ! శ్రీరామచంద్రా! నీయందు మనసు కలిగి ఉండుటచే వియోగవ్యథను సహించనిదై ప్రసక్తాశ్రుముఖి, దీననిరానందయై ఉన్నది, ఉపవాసకృశీభూత, ఏకవేణీధర, మలిన మలినాంబర ఏమి చెప్పుదును ప్రభూ! ఆ తల్లి విచారమును ఆనవాలుగా తమకంపిన

అంగుళీకమును సమర్పించాను. దానిని గ్రహించి పరమానందంచెంది కన్నులనద్దుకొని అశ్రువులను రాల్చినారు.

సర్వసమర్థులు మహాపరాక్రమ ప్రభావ సంపన్నులగు ప్రభువు ఒకనాడు నన్ను అవమానపరచినదనే కారణంచేత కాకిపై బ్రహ్మాస్త్రం ప్రయోగించారు. ఈనాడు ఈ రక్కసిమూకలో బాధపడుతూనీవేతప్ప ఇతఃపరంబెరుగనని ప్రార్థించుచున్న నన్ను రక్షించుటకు ఆ అస్త్రాన్ని ఏల ప్రయోగించరూ? అనంతాస్త్ర సంపన్నుడు ముల్లోకాల్లోనూ రామ బాణమునకెందునూ ఎదురులేదే? ఈ రక్కసిమూకను రావణుడు ఒక లెక్కలోని వారుకారే? అనువ్రతను ఈ దీనురాలిపై స్వామికి కరుణ కలుగుటలేదా ఆంజనేయా? నా దుర్భర చరిత నా ప్రభువుకు మనవి చెయ్యి. ఒక మాసంకంటే అధికం జీవించను. అతని దర్శన భాగ్యం లేని ఈ శరీరం ఇక నిలుపలేనని నా స్వామికి కరుణ కలుగునట్లు చెప్పుము. తననే నమ్ముకొన్న ఈ దీనురాలిని త్వరగావచ్చి సపుత్ర మిత్రభాంధవంగా రావణుని సంహరించి కాపాడవల్సినదిగా మనవి చేయుచున్నది.

అమ్మా! విచారింపకు తల్లీ నీ ఉనికి ఇంతవరకు తెలియదు. ఇప్పుడు నావల్ల తెల్సుకొని శ్రీరామచంద్రుడు లక్ష్మణ సమేతుడై నా భుజస్కంధముల నధిరోహించి రావణుని సంహరిస్తారు. నన్ను మించిన బలపరాక్రమశాలురు వానరకోట్లు సుగ్రీవాజ్ఞలే లంకలో ప్రవేశించి రాక్షసులను సంహరిస్తారు. సమస్తమైన లంకానగరం నాశన మౌతుంది. కలకంఠ కంఠకన్నీరు ఊరకే పోవునా? నీ ఉసురు తగిలి రావణుడు గతాసువు అవుతాడు.

దేవఋషి గణపూజితుడై శ్రీరామచంద్రుడు నిన్ను చెర విడిపించి గ్రహించి నీ దుఃఖాన్ని తొలగిస్తాడు. అచిరకాలంలోనే శ్రీరామచంద్రుడు అయోధ్యలో సామ్రాజ్య పట్టాభిషిక్తుడు కాగలడు

తల్లీ! ఆ సమయం ఆసన్నమైంది. రాముడు అయోధ్య వాసులకే కాదు త్రిజగత్ కల్యాణరాముడు ఆతన్ని దర్శించి ఆనందించేభాగ్యం కల్గుతుందని పరమపావని యగు పావని సీతాదేవిని ఊరడించి ధైర్యం కల్గించినట్లు శ్రీరామచంద్రునితో విజ్ఞాపనం చేసుకొన్నాడు హనుమంతుడు.

రాముడు పరమానందంతో అనంతర కరణీయమును గురించి సుగ్రీవునితో ప్రస్తావన చేసెను.

॥ ఇది పంచమ పుష్పం సమాప్తం ॥

# షష్ఠమ పుష్పము

## సాగర తీరం

సూర్యుడు నడిమింట ప్రకాశిస్తున్నాడు అయినా చల్లగానే యున్నది. సముద్రతరగల మీదనుండి గాలి మెల్లగా వస్తూ శరీరానికి హాయి కలిగిస్తున్నది. సుగంధాన్ని వ్యాపింపజేస్తూ పరిసర వన్య కుసుమాలు జల జల రాలుతున్నాయి. పక్షులు అవ్యక్త మధురంగా ధ్వనిస్తున్నాయి.

సింహ, శరభ, శార్దూలాది మృగాలు మేము వస్తున్నాము. రావణునితో యుద్ధానికన్నట్లు అవి రామునికన్న ముందుగనే దక్షిణ దిశకు పరువులు తీస్తున్నాయి. కొండలు నడచి వచ్చేస్తున్నాయా? అన్నట్లు మత్తగజాలు బయలుదేరేయి. సముద్రాన్ని మేమే దాటిం చేస్తాం అన్నట్లు ఘీంకరిస్తున్నాయి.

మిత్రమా! సుగ్రీవా మనమింకా ఆలసించవలసిన పనిలేదు మనం ఇప్పుడే బయలుదేరు తున్నాము. సైన్యాన్ని సన్నద్ధంచేసి దక్షిణదిశకు ప్రయాణం సాగించు. ఇవాల ఉత్తరఫల్గుణీ నక్షత్రం ఫాల్గుణీ పౌర్ణమి అభిజత్ లగ్నం దేశకాల పరిస్థితులు అనుకూలంగానే ఉన్నాయి. క్షేమ సూచకమైన శకునాలు అంతటా గోచరిస్తున్నాయి? అన్నాడు శ్రీరామచంద్రుడు.

" శుభస్య శీఘ్రం " అన్నారు పెద్దలు సుగ్రీవుని ఆజ్ఞచేత సకల వానరవాహిని, సాగరతీరాన్ని చేరుకున్నది. గజ, గవయ, గంధమాధన, శరభాదులు, వానర సైన్యానికి రక్షణగా నలుదిక్కులా నడుస్తున్నారు. మధ్య అపారమైన వానరబలం. దాని మధ్య జాంబవదంగద నీల ప్రముఖులు ఉన్నారు. వారి మధ్యభాగంలో రాముని తన భుజస్కంధాల నధిరోహింప చేసుకొని హనుమంతుడు, లక్ష్మణుని అధిష్టంపచేసి, అంగదుడు నడుస్తున్నారు. సింహనాదాలు చెలరేగు తున్నాయి. వానరులు గర్జిస్తున్నారు. దిక్కుల అదురునట్లు సఖ్రద్రౌం ష్ట్రియుధులైన వానరులూ ఉత్సాహంతో పెళ్లికి బయలుదేరునట్లు రాముని వెంట యుద్ధానికి బయలుదేరారు.

శతఘ్నిశత సంకులమైన లంకానగరం. వప్రప్రాకార సంయుక్తము. హస్త్యశ్వరథ పదాతి సమన్వితము. అనేక కోటి రాక్షస వీర విరాజతమైన లంకానగరం. రాక్షసబలాన్ని నాల్గవవంతు హనుమంతునిచే ముందుగా నాశము గావించబడ్డాది ఇక మహామహంతులు మిగిలింది. ఒక రామభాణానికే హతమారిపోతుంది. అను కుంటున్నారు వానరవీరులు.

వానరసైన్యంతో రామలక్ష్మణులు దక్షిణ దెసననుసరించి అడవి మార్గంలో బహుయోజనాలు గడచి సముద్రతీరాన్ని చేరారు. సైన్యం సుగ్రీవాజ్ఞచే ఆ ప్రాంతంలో విడిసింది. సంధ్యాకాలం

అయింది. మైందద్వివిదులు సైన్యంచుట్టూ తిరుగుతూ భద్రతను కలుగ చేస్తున్నారు. వన్య ఫలాదులు మెసవుచూ వానరులు సముద్రాన్ని దాటుట ఎట్లని తలపోస్తున్నారు.

సుగ్రీవుడు " రామచంద్రా! ఈ సముద్రుని అనుగ్రహం సంపాదించి మార్గాన్ని వడయుట కానీ, సేతువును, బందించిగాని, నీటిని శోషింపజేసిగాని సైన్యాన్ని లంకలో ప్రవేశపెట్టడం అసాధ్యమేమో అని తలుస్తాను " అన్నాడు.

రాముడు " నేనే సముద్రుని ప్రార్థించి అతని అనుగ్రహం సంపాదించడం. అవసరం ఆకాశానికి ఎగసే కెరటాలుతో లోతు ఎరుగరానిది, దరిచేరరానిది. ముత్యములు మొసల్లు, సర్పములు వీటితో కూడియున్నది. అనేక పర్వతాలు, ద్వీపాలు కలది. పగడములు, ముత్యములు, బహువిధరత్నములకు నిలయమైనది. ఆకాశాన నక్షత్రాలు, క్రింద సాగరనీటి తుంపరలు మిళమిళ మెరసిపోతున్నాయి. బంగారపురజనువలె ఇసుకతిప్పలు, చిరుచేపలకై మింటనెగయు జలపక్షులు కలది. ఈ అపారసాగరము రమణీయముగా ఉన్నది. శీతకిరణుడు వెన్నెల వెలుగు వెదజల్లుతున్నాడు. దక్షిణపవనుడు వీచుచున్నాడు. మనసున సీత మెదిలింది.

" లక్ష్మణా! ఈ వాయువు సీతను స్పృశించి ఇటు వీచుచున్నట్లున్నది. కనుకనే మనస్సును ఆకర్షించి రంజించుచున్నది అన్నాడు రాముడు.

అన్నయ్యా! అచిరకాలంలోనే జానకీ సాన్నిధ్యాన్ని పొందగలవు. ఈ సముద్రం లంఘనం గురించి ఆలోచించు అన్నాడు లక్ష్మణుడు.

లంకలో రావణుడు మంత్రిభట సామంతాదులతో కొలువు తీర్చినాడు.

సర్వసభ్యులారా! ఇప్పుడు మనం అత్యవసరంగా సమావేశం జరిపిస్తున్నాము. మీకుతెలుసు ఒక వానరమాత్రుడు ప్రవేశించి సాధ్యముకాని మన నగరంలో అర్ధరాత్రిమున చొరబడ్డాడు. సీతను చూచి సేమము అరచి లంకను తగులపెట్టాడు. చైత్యప్రాసాదాన్ని విరుగగొట్టేడు. పలువురు రాక్షసవీరులు అతనిచేత హతులైపోయారు. ఇదంతా హనుమంతుడు చేసేడు. తన లక్ష్యం నెరవేర్చి రాముని సమీపించాడు. సకల వానరపరివారంతో రామలక్ష్మణులు సాగర తీరాన్ని చేరినట్లు మన వేగులవల్ల తెల్సింది. ఇప్పుడు మనం చేయ వలసింది ఏమో చెప్పండి.

" మంత్రమూలం విజయం అంటారుకదా! రాముని సాధించు ఉపాయం ఆలోచించండి. మంత్రులు, మిత్రులు, బంధువులతో ఆలోచించి చేసేకార్యం విజయవంత మౌతుందన్నాడు రావణుడు.

ఆత్మమానినులై పరబలానవజ్ఞులైన రాక్షసులులేచి రావణేశ్వరా! మనవద్ద శూల, ముద్గర, పరశు, భిండివాలు, ముసల, ఖడ్గ ధమర్బాణాది ఆయుధాలున్నాయి. అనేక విధములైన మారణయంత్రాలున్నాయి. బహు అస్త్రముల శస్త్రములనెరిగిన మనవీరులుకలరు. మహాబలపరాక్రమంకల నీవు శత్రువునకు భయపడనవసరం లేదు. నాగులను, గుహ్యకులను, దేవతలను, దానవులను నీ పరాక్రమంచేత జయించావు. ఇప్పుడు వారందరూ నీకనుసన్నల మెలగుతారు. ఈశ్వరున్ని ఆరాధించి శస్త్రాస్త్రములు సాధించావు. నీకు అసాధ్యమేమున్నది ప్రభూ!

ఇంద్రుని జయించిన మేఘనాదుడొక్కడే నీకు విజయాన్ని

చేకూరుస్తాడు. చతురంగ బలాలతో మనం శత్రువుల్నిసునాయాసంగా జయించగలం అన్నారు సభలో రాక్షసులు.

సేనాధిపతి ప్రహస్తుడులేచి ప్రభూ! మనను హనుమంతుడు వంచించాడు. దేవదానవ గంధర్వాదులను జయించిన మీరు ఎవ్వరికి ఏవిధంగా భయపడనక్కరలేదు. ఆనాడు మన ఏమరపాటు గమనించి ఆ వానరుడు సీతా దర్శనంచేసి వెళ్లాడు. తమ సెలవైతే నేను ప్రపంచంలో వానరులు లేకుండా సంహరించివస్తాను అన్నాడు.

దుర్ముఖుడులేచి రాజా! ఈ పరాభవాన్ని సహించేది లేదు. ఈ క్షణంలోనే వానరులెచ్చట నివశించినా ఎందుదాగినా వార్ని చంపి వస్తాను అన్నాడు.

వజ్రదంష్ట్రుడు “ పరిఘ ” అను ఆయుదాన్ని గ్రహించి ప్రభూ! హనుమతో మనకేమిటి? రామలక్ష్మణ, సుగ్రీవులను ఈ “ పరిఘ ” తో సంహరించి వస్తాను. మనలో కొందరు కామరూపులను మనుష్యవేషంలో రామలక్ష్మణుల వద్దకు పంపి, భరతుడు నిన్ను తిరిగి రమ్మన్నాడని దూరంగా తీసుకువెళ్తాను. అప్పుడు మనవారు వివిధ ఆయుధాలతో వానరులను సంహరిస్తారు. పిమ్మట రామలక్ష్మణులు సులువుగా జయింపబడతారు అన్నాడు,

కుంభకర్ణుడు కొడుకు “ నికుంభుడు ” అనువాడు లేచి మీరంతా రావణునివద్ద ఉండండి. నేను వెళ్లి రామలక్ష్మణులను సుగ్రీవాది వానరులను మ్రింగివస్తానన్నాడు.

వజ్రహస్తుడను రాక్షసుడు తన నాలుకను చాపి నోరుతెరచి చూపుచూ, నేను అందర్ని మ్రింగివస్తానని అన్నాడు. మీరంతా మద్యపానాదులు సేవిస్తూ హాయిగా విశ్రమించండని అన్నాడు.

నికుంభుడు, రభసుడు, సూర్యశత్రుడు, సుక్తఘ్నుడు మహాపార్శ్వుడు, మహోదరుడు, అగ్నికేతుడు, దుర్ధర్షుడు, రస్మికేతుడు, ఇంద్రజిత్, ప్రహస్తుడు, విరూపాక్షుడు, ధూమ్రాక్షుడు అతికాయుడు, మహాకాయుడు ఇంకనూ ఎందరెందరో రాక్షసవీరులు తమతమ ఆయుధాలు పైకెత్తి వీర రసోద్రేకంతో సర్వంజయించి వచ్చినట్లు "రావణాసురునికిజై"! "లంకేశ్వరునికిజై"! అంటూ సభను ప్రతిధ్వనింప జేశారు.

విభీషణుడు తన ఆసనంనుండి లేచి, వీరులారా ఆపండి మీ వీరాలాపములు. ఒక్క వానరుడు వచ్చి లంకంతా నాశనం చేసినపుడు మీరంతా ఏమైనారు. మీ పరాక్రమాలేమైనాయి. మీరంతా నిద్రాపరవశలైనారా? మద్య మాంసాదులు మెక్కికై పెక్కి ఒడలు తెలియక పోయినారా?

ఆర్యా! విజయం సాధించాలంటే నాలుగు ఉపాయాలున్నాయి. సామ, దాన, భేద, దండోపాయాలు. ఇవి ఆ రామునిపట్ల పనిచేయవు. యుద్ధంవల్ల అసాద్యం అన్న విషయం హనుమంతుని వల్లనే తెలిసింది, మంచిమాటలతో రాముడు సీతను వదులుకొంటాడా? అందుకేకదా వాలినిచంపి సుగ్రీవునితో స్నేహంచేశాడు. వాని సాయంతోనే సీతను పొంద గలుగుతాడు. రామ సుగ్రీవులకు భేధం కల్పించటం అసాధ్యం. రామునిచేత రాజ్యం పొందాడు కనుక సుగ్రీవుడు సీతను అన్వేషిస్తానని శపథం చేశాడు. రాజ్యాలూ, ధన ధాన్యాలూ భోగ భాగ్యాలు ఆశచూపిద్దామంటే అయోధ్యనే విడిచివచ్చిన రాముని వద్ద ఇట్టిప్రలోభాలు పనిచేయవు. ఇంకా దండోపాయం అంటారా.

క్షణకాలంలో పదునాలుగువేల రాక్షసులను జనస్థానంలో సంహరించాడు. అసహాయసూరుడు ఇప్పుడు మిత్రబలం అంగబలం వానరబలం అంతా అతనకు సమకూరింది. సహజంగా అతను ధనస్సు

గ్రహిస్తే ముల్లోకాలూ కలత చెందుతాయి. ప్రమత్తుడు కాదు. పిక మనస్కులై శస్త్రశాస్త్రకుశలులై మనపై విజయం సాధించనున్నారు వారంతా. వారిని జయించడం మనకు అసాధ్యం కనుక సీతను శ్రీరామునికి సమర్పించడమే శ్రేయస్కరం అన్నాడు విభీషణుడు. పొద్దుకుంకుట చేత సభ వాయిదా పడినది.

మరుచటి ఉదయం రావణుడు సభా భవనానికి చేరనున్నాడు. దోషం దోషి హృదయాన్ని చెదపురుగులు కర్రను తినివేయునట్లు దొలచి తినివేస్తున్నది. దానితో అతడు నిలకడలేక, చేసినదేచేస్తూ, చెప్పినదేచెప్తూ మనఃశ్శాంతిని కోల్పోతాడు. కనుకనేమరలా రావణుడు సభాభవనానికి బయల్దేరినాడు.

పిశాచముఖం గల అశ్వాన్ని పూన్చిన రథాన్ని అధిష్టించాడు రావణుడు. ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలపై సమర్థులైన రాక్షసవీరులు వెంట బయల్దేరారు. కాలినడకనే కొందరు వస్తున్నారు. వివిధములైన వాద్యవిశేషాలు మ్రోగుతున్నాయి. చామర గ్రాహిణులు, ఛత్ర గ్రాహులు, బిరుదుపట్టములు ధరించువారు పలువురు రావణునితో వెనువెంట సభాభవనం చేరుకొంటున్నారు.

ఎక్కడనుండో ఒక గ్రద్ధ రావణుని కిరీటం తాకింది. అప్రయత్నంగా రావణుడు తలయెత్తి పైకి చూచాడు. కిరీటం తలనుండి నేలజారి పడిపోయింది. అంగరక్షకుడు దానినితీసి రావణునికిచ్చి ఇలా అన్నాడు. ప్రభూః గద్దలు రాబందులు రాజప్రాసాదాలపై వ్రాలుచున్నాయి. ఆకాశాన వికారంగా రొదచేస్తూ పరిభ్రమిస్తున్నాయి అన్నాడు. రావణుని రథం సభాభవన ప్రాంగణంలో ఆగింది.

వందిమాగధుల స్తోత్ర పాఠవాలతో రావణుడు సభాభవనం ప్రవేశించాడు. మంత్రులు, సామంతులు, సోదరులూ, భటులు,

పురజనులు, జానపదులు ఉచితాసనములను అధిష్టించారు.

ప్రభూ! మన యాగశాలలోని నిప్పంటుకొన్నది. ఉత్తర దిశనుండి లంక మళ్లీ తగులిడుతున్నది. భటులూ పరుగెత్తుకుని వచ్చి రావణునికీ విషయం నివేదించారు. మరియొకడు ప్రభూ! నక్కలు పట్టపగలు నగరులో ప్రవేశించి అరుస్తున్నాయి. ఏమిటో అన్నీ అపశకునాలే అన్నాడు. రావణునికి భయం స్థానంలో కోపంచోటు చేసుకొని ఒరే! వెళ్లండి. ఈ పిల్లి శకునాలకు నేను భయపడను. ప్రహస్తా! అవసరమైన విషయం ఈ సభ్యులకు తెలియజేయు అన్నాడు మనస్సులో ఆందోళనతో రావణుడుగ్రుడై!

ప్రహస్తుడులేచి ప్రభూ! సభ్యులారా నగరమంతా కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు చేయబడ్డాయి. కోట బురుజులపై శతఘ్నులు అమర్చబడ్డాయి. ద్వార రక్షకులు ఆయుధపాణులై అప్రమత్తులుగా ఉన్నారు. నగరిలోపల వెలుపల అంతటా భద్రతకై తగుచర్య తీసుకొనబడింది. ఇక కాగలకార్యం నిశ్చయం చేయవల్సి ఉంది.

అంతట లంకేశ్వరుడు లేచి సభ్యులారా! మనమిక్కడ సమావేశము ఎందుకైనామో మీ అందరకూతెలుసు రామలక్ష్మణులను మోసగించి జనస్థానం నుంచి సీత అపహరింపబడింది. ఆమె నావశమైతీరాల్సిందే. ఒక సంవత్సరం గడువు ఆమెకు ఇవ్వబడింది. ఇక మన ప్రత్యర్థులు నన్ను జయించలేరు. రావణ శబ్దానికి సార్థకమైంది. అఖండైశ్వర్యముంది. దేవదానవ తిర్యగ్మనుష్యాదులు నన్ను తేరి చూడలేరు. బలం, బలగం, సంపదా ఉన్నచోట లేనిదేమీలేదు. అంతా దానికై వశ్యమైనదనేనని మీకూ తెలియును.

తల్లీతండ్రీ అడవికి పంపేశారు, సోదరుడు రాజ్యాన్ని అతిక్రమించుకొన్నాడు, బంధుబలగం కూడా దూరమైంది కట్టుగుడ్డలతో

నట్టడివికి చేరుకొన్నట్టి రాముడు నన్నెట్లు జయిస్తాడు. కూటికి గుడ్డకు మొగముచాచి అడవిలో తిరుగుతూ, కోతుల సహవాసంచేసిన రాముడు సముద్రాన్ని దాటి వచ్చి నన్ను జయించలేడు. ఇక మీ అభిప్రాయం చెప్పండి. అన్నాడు రావణుడు.

కుంభకర్ణుడు అన్నకు నమస్కరించి అన్నయ్యా! ఇంత సైన్యం, ఇంతబలం, ఇంతబలగం, ఇంతైశ్వర్యముండీ ఈసమావేశం దేనికి, సీతాపహృతానికి ముందే ఈ ఆలోచన చేయవల్సింది. ఇందులో గుణదోషాలు విచారింపవల్సి ఉంటుంది. పరదారాభిమర్శనం దోషభూయిష్టమైంది. సరే గతజల సేతుబంధన మెందుకు. బ్రతికున్నంత వరకు శత్రువులతోపోరి నీకు విజయంకోసం నేను శ్రమిస్తాను అన్నాడు

మహాపార్శ్వుడు లేచి నమస్కరించాడు. ప్రభూ! ఎవరికి దేనికి, ఎందుకూ భయపడాలి. సీత తమ ఆధీనంలోనే ఉన్నది. ఎవరూ తేరచూడలేరు. ఆకలికొన్నవాడు అమృతం దొరికినపుడు అనుభవించా ల్సిందేకానీ ఇన్ని అనుమానాలెందుకు. కుక్కుటవృత్తి అవలంబించు నిన్నెవరు అడ్డగలరో చూస్తాను అన్నాడు.

అంతట రావణుడు నీవు చెప్పేది సరే కానీ దానికొక అవరోధముంది. బ్రహ్మ సమీపానికి వెళుతున్న పుణ్యకస్థల అను అప్సరసను బలాత్కరించాను. అది తెల్సి బ్రహ్మ అంగీకృతిలేని అతివను బలాత్కరిస్తే తల వెయ్యి ముక్కలౌతుందని శపించాడు, కనుక ఆ శాపభీతిచేత సీతను సమీపించలేక పోతున్నాను.

విభీషణుడు లేచి అన్నయ్యా! వీరంతా మిత్రరూపంలో ఉండే శత్రువులు. నీ సర్వనాశనానికి ఇట్టి ఉపాయాలు చెప్పటకు కారకులౌతున్నారు. నాడు హనుమ వచ్చినపుడు వీరంతా ఏమైనారు. వీరి యుక్తి శక్తులు ఏమైనాయి.

విషదంష్ట్రలు కలిగి పంచశీర్షములతో అలరారు కాలాహి ఈ సీత. దీనిని మర్యాదగా రామయ్యకి పంపివేయుటయే క్షేమము.

చతుర్దశ భువనాలలోను, రాముని జయించేవారులేరు. ఆతని వాడిగల వేడి బాణములు లంకపై పడకముందే సీతను సమర్పించు. శస్త్రాస్త్రకోవిదుడు కోదండపాణి రాముడు. లక్ష్మణుడు అట్టివాడే. తన బలమును ఎదిరిబలమును తెలిసి మాటాడవలెను. కాని మనవారు ఎట్టి ప్రతాపవంతులైనను కొండను గొర్రెలు "ఢీ" కొన్నట్లు అవుతుంది. ధనుర్ముక్త బాణములు రాక్షసరుధిరమును ఆస్వాదించక ముందే సీతను సర్వాభరణభూషితను చేసి రామునికి సమర్పించు అన్నాడు విభీషణుడు.

ఇంద్రజిత్తులేచేడు " తండ్రి ఈ చిన్నాన్న మనవంశానికి చెడ బుట్టేడు. మన పేరు ప్రతిష్టలు పౌరుషపరాక్రమాలు మంటకలిపేసాడు. శత్రువులను భట్టులాగ పొగడతున్నాడు ఈశ్వరుని మెప్పించేతపస్సు శక్తి ఇంద్రుని జయించే ప్రతాపశక్తిగల నన్ను మరిచాడు కాబోలు శస్త్రాస్త్రాలు రామునికే కాదు మనకు తెలుసును. నీకు చేత కాకపోతే ఇంటకూర్చో నేవెళ్లి విజయాన్ని సాధిస్తాను " అన్నాడు విభీషణునితో

అంతట విభీషణుడు " మేఘనాధ నీవు బాలుడవు. లోకాను భవంకాని యుద్ధానుభవం కాని చాలదు. కదనరంగంలో రాముని ఎదుర్కొనడం అంటే పిల్లలాటకాదు. కాలదండోపములైన రామబాణాలను ఎదుర్కొవడం కాలకంఠునికి కూడ వశముకాదు. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే లాభం ఉండదు అన్నయ్యా! సపుత్ర మిత్రామాత్యకంగా సర్వం నాశనంకాక ముందే రామునికి సీతను సమర్పించు " అన్నాడు నిశితంగా విభీషణుడు.

రావణునకు కన్నులు ఎఱ్ఱబడ్డాయి. శరీరము కంపిస్తున్నది.

కన్నులు అగ్నిజ్యోతులవలె గోచరిస్తున్నాయి. రజోగుణ సముద్భవమైన కామము నెరవేరని పక్షంలో క్రోధంగా పరిణతి చెందుతుంది. అది క్రోధాన్ని నాశనము చేయక విడవదు. రజోగుణాన్ని అతిక్రమించి సత్వగుణము సత్వరజోగుణముల నతిక్రమించి, తమోగుణము ఒక దానిని మించి వేరొక్కటి వృద్ధిచెందుతు ప్రాణిని లోకములో మేలు కీడులకు లోనుచేస్తుంటాయి. నిస్త్రైగుణ్యుడైతే విముక్తిని పొందుతాడు.

అంతట రావణుడు విభీషణా! నీటికి నాచుతెగులు కులానికి జ్ఞాతితెగులు నీవు జ్ఞాతి ధర్మాన్ని పాటిస్తున్నావు. లోకంలో జ్ఞాతికంటే వేరే కాల్చడానికి అగ్ని అక్కరలేదు అంటారు. పైని మిత్రునిగా కన్పించి లోనశత్రువునిగా ఉంటాడు జ్ఞాతి. ఆత్మీయులకు హానికలిగితే ఆనందిస్తారు జ్ఞాతులు. గోవులయందు సంపద, బ్రాహ్మణులయందు నిగ్రహము, స్త్రీలయందు చాపల్యము, జ్ఞాతులయందు భయము లోకప్రసిద్ధమైనదే. జ్ఞాతులు గోముఖ వ్యాఘ్రాదులు పయోముఖ విష కుంభాలు వీరుతో సాంగత్యము కూడదు. పుష్పములోని మకరంధము గ్రోలి పువ్వును విడిచి పోతుంది తుమ్మెద, పద్మములోని మంచు బిందువులుపడి దళములను సిథిలపరుస్తుంది. ఏనుగు నీటమునిగి బురద పోసుకుంటుంది. మేలుపొంది కీడు ఆచరిస్తాడు జ్ఞాతి. నీవు నాకేమి సోదరుడవు. ఈ క్షణం నుండి నీతో సోదర్యం నశించింది. అని రావణుడు ఛీత్కారంచేస్తూ కోపసంయుక్తనయనుడై పలికేడు. కాలిన ఇసుక మైదానంవలే కణ కణ లాడి అగ్నికణముల మీద వలే నిలువలేక విభీషణుడు తననలుగురు మంత్రులతో మింటికిఎగసిపోయినాడు అవమానం భరించలేక.

అన్నయ్యా నిన్ను తండ్రిగా భావించేను నీ మేలుకోరి హితము ఉపదేశించాను. రోగికి ఔషధము రుచించదు. మరణం ఆసన్నమైన వానికి ఆప్తవాక్యము వినబడదు. అంధులకు వెలుతురు

కనబడదు. అప్రియమైనప్పటికి శ్రేయోవాక్యము పలికేవాడు వినే వాడుఉండడు. నేనునీకు భ్రాతనుకానప్పుడు నీవునాకుఎట్లు భ్రాతవగు దువు. ఇదిగో వెళ్లుచున్నాను. నువ్వు నీ వారలతో బాగుపడు అని విభీషణుడు ఆకాశం మీదనుంచి పలికి గగనమార్గమున సముద్రము దాటి అంతరిక్షమునుండె రామలక్ష్మణులను దర్శించాడు. అపారమైన సేనాపరివృతులైన రామలక్ష్మణులు దివి నుండి భువికి అలంకరించిన సూర్యచంద్రులవలే ప్రకాశిస్తున్నారు.

## శ ర ణా గ తి

అనుకూలమైన సంకల్పం. ప్రతికూలమును విడిచిపెట్టుట రక్షించగలరని విశ్వాసము, రక్షకుని కోరుట. ఆత్మనిక్షేపణము కృప ణత్వము, అనుశరణాగత లక్షణములు గల విభీషణుడు ఆకాశము నుండే రాముని శరణాగతి చేస్తున్నాడు ప్రభూ! నన్ను రక్షించు రక్షించు అని.

విభీషణుని సుగ్రీవుడు చూసేడు హనుమదాదులు కూడా చూసారు. వారంతా సంభ్రమాశ్చర్యాలతో నిగ్రహించ దలచారు.

కవచకుండల మకుటమండితుడు, గదాహస్తుడు, చతురా మాత్యసమన్వితుడు అగు విభీషణుడు చేతులు జోడించి, వానర వీరు లార నేను లంకేశ్వరుని సోదరుడను. విభిషణుడను వాడను రామునికి సీతను సమర్పించమని చెప్పినందువల్ల అన్నయగు రావణునిచే అవమానింపబడినాను. సర్వలోక శరణ్యుడైన రాముని శరణు వేడు తున్నానని శ్రీరామచంద్రునకు నారాకను మనవి చేయండి అని సవిన యనంగా ప్రార్థించాడు విభీషణుడు.

సత్వరంగా సుగ్రీవాదులు రామలక్ష్మణులను సమీపించారు

రా: రావణుని సోదరుడు విభీషణుడు. తమను శరణువేడుతున్నాడు
వీనిని నమ్మరాదు. ఆకృతిచేత, జన్మచేత రాక్షసుడు మాయావి
ంచి రావణుని తమ్ముడు. మనలను భేదించడానికి వచ్చి ఉంటాడు
ఋుము అరసి చంపుతాడు కూడ వీనిని చేరనివ్వకూడదు. నిగ్ర
నవలసిందే. వీడి మాటలు విశ్వసించ తగిలేవు. రాక్షసులు రక్షింప
వారు ఎట్లవుతారు. అన్నాడు సుగ్రీవుడు.

రాముడు సుగ్రీవుని మాటలు విన్నాడు. సమీపస్థులగు
ర వీరులను చూచి, వీరులారా: సుగ్రీవుని మాటలు హేత్వర్థ
న్వితములు. విభీషణుని శరణాగత విషయములో మీ ఉద్దేశ్యము
గా తెలపండి

విచక్షణాదక్షులు, కార్యశూరులు, ధర్మార్థవిధులు, నీతిజ్ఞులు,
నిశ్చయాన్ని ఒక్కరొక్కరుగా తెలపండి అని వానరులను ఉద్దేశించి
రామచంద్రుడు ప్రశ్నించాడు.

రామచంద్రా: సర్వజ్ఞులైన మీకు తెలియనిది ఏమున్నది?
ఆజ్ఞను అతిక్రమింప జాలము అన్నాడు అంగదుడు. శత్రువు
గ్గరనుండి వచ్చాడు కనుక అన్నివిధాల శంకించ తగినవాడే
భీషణుడు. శఠ బుద్ధులు మోసగించి ముట్టిపెడతారు. వాని గుణదోష
ములు తెల్సుకొని గుణాధిక్యతకలదేని గ్రహించతగునని నాఉద్దేశ్యం
న్నాడు తారేయుడు.

చారులను పంపి సూక్ష్మబుద్ధితో వానినిపరిశీలించి యోగ్యత
లదేని మనలో చేర్చుకొనవచ్చునని అన్నాడు శరబుడు.

మనకు శత్రులైన రావణుని నుండి అతని ఆదేశముతో
వచ్చాడు. రాదగిన కాలములోను రాలేదు రాదగిన ప్రదేశములోనూ

రాలేదు వీనిని చేర్చుకొనుటతగదు అన్నాడు జాంబవంతుడు.

రావణుని గూర్చి వీభీషణుని ప్రశ్నించండి వాని మాటలు లోని భావాలను గ్రహించి చేర్చుకొన తగిన వాడయిన చేర్చుకొన వచ్చునని అన్నాడు మైందుడు.

బృహస్పతితుల్యుడు, బుద్ధిచేత సర్వసమర్థుడు, సర్వశక్తి సమన్వితుడు అగు అతడు " ప్రభూః మీ యందలి గౌరవంచేత నేను మనవి చేస్తున్నాను. ఆధిక్యత చేతకాదు విజ్ఞత చేతకాదు. ఆ విభీషణుడు దేశకాలమున అనుసరించే వచ్చాడు. ముఖంలో దౌష్ట్యం కానబడదు శత్రువునిచే పంపబడి వచ్చినవానిగాను శరబుద్ధిగా తలచుటకు వీలులేదు. తను రావణవధ శపదమును విన్నాడు. వాలి వధను విన్నాడు సుగ్రీవుని అభిషేకం కూడా గుర్తించాడు. ఖరాధిసంహారం కూడా తెలుసు. రావణుని మూర్ఖత, అసమర్థతను ఆలోచించి ఇక్కడకు వచ్చేడు తమవల్ల లంకారాజ్యాన్ని అభిలషించి బుద్ధిపూర్వకంగానే వచ్చాడు అని తలుస్తాను. అన్నాడు సవినయంగా హనుమంతుడు.

రాముడు మిత్రులారా నాయందు స్నేహాభిమానాలతోను ప్రస్తుత దేశకాల పరిస్థితిని గమనించి కర్తవ్యాకర్తవ్యాలను వివరించి చెప్పిన మాటలను విన్నాను. నా ఉద్దేశంకూడా తెలియజేస్తాను వినండి

ఇల్లు, ఇల్లాలు, బిడ్డలు, బంధువులు, ధనములు, మాణ్యములు సర్వం విడిచివచ్చి నీవే శరణని వచ్చినవారిని గ్రహించుటే ధర్మమని తలుస్తాను. వాడు దుష్టుడుకాని, శిష్టుడుకాని ఎవరైనను శరణువేడిన వాడిని రక్షించుటే కర్తవ్యము. ఒక పావురం శరణుపొందినంత మాత్రాన దానిని రక్షించుటకై తన శరీరమాంసమును డేగకు ఆహారంగా ఒసగి ఆ కపోతాన్ని రక్షించిన శిభి శరణాగత త్రాణము

ప్రసిద్ధమైంది. విభీషణుడే కాదు. శత్రుపగు రావణుడు వచ్చిన కూడా శరణు అన్నచో రక్షించుటయే నా వ్రతము. ప్రపన్నుడైనంత మాత్రాన సర్వభూతాలను రక్షించుటే కర్తవ్యం. కీర్తికరము. దురాచారుడైనను సదాచారుడైనను పాపియైనను నిష్పాపియైనను శత్రువైనను మిత్రుడైనను " త్వమేవ శరణం మమ '' అని శరణుకోరిన వారిని రక్షించుటయే నా కర్తవ్యం.

ధర్మాధర్మములు ఎరుగని ఒక పక్షియగు పెంటిపావురము తన భర్తను ఒక బోయవాడు వనమందు చంపివేశాడు. చలిచేతను ఆకలిచేతను పీడితుడైన ఆ బోయవానికి ఆ పెంటిపావురం చితుకులు తెచ్చి మంటవేసి అందుపడి వానిచలిని, ఆకలిని తీర్చిన చరిత్ర విన్నారుకదా!

కణ్వపుత్రుడైన కండు అనునాతడు శరణుపొందిన వానిని రక్షింపకున్నచో వాని సుకృతము కూడా నశించిపోతుంది. రక్షకుడై కాపాడిన యెడలా సకల శుభాలు పొందుతాడని పలికాడు. కనుక నేను ఆతని మార్గంననుసరించి విభీషణునికి అభయమిస్తున్నాను అని తన నిశ్చయాన్ని శ్రీరామచంద్రుడు తన శరణాగత త్రాణనిష్ఠను సువ్యక్తం చేశాడు.

హనుమదాదులు హర్షధ్వానాలుచేసి విభీషణుని తమలో చేర్చుకొనుటను అంగీకరించారు. సుగ్రీవాదులు సోదరభావాన్ని వ్యక్తం చేశారు.

స్వామి యొసగిన అభయప్రధానాన్ని గ్రహించి విభీషణుడు వినీతుడై ప్రాంజలియై రాముని పాదాంబుజములందు దృష్టినిలిపి నలుగురి మంత్రులతో ఆకాశంనుండి భువికి నిలచాడు. మంత్రులతో శ్రీరాముని చరణారవిందాలకు సాష్టాంగదండ ప్రణామం కావించాడు

రాముడు కరుణార్ద్ర దృష్టితో విభీషణుని చూశాడు. అమృత ప్రావితమగునట్లు విభీషణుడు తలచాడు.

శ్రీరామచంద్రా! సర్వభూత శరణ్యుడవైన నిన్ను శరణు పొందుతున్నాను. లంకాధిపతి యగు రావణుని సోదరుడను విభీషణుడనువాడ్ని మైథిలిని నీకు సమర్పించమని చెప్పినందున అన్నచే అవమానింప బడ్డాను. లంకను విడచాను. రాజ్యము. భార్యాబిడ్డలు ధన ధాన్యాదులు, సుఖములు చివరకు జీవితము సర్వశ్వం విడిచైనా నన్ను నీ సేవకు సమర్పించుకొన్నానని విభీషణుడు రామునికి విన్నవించుకొన్నాడు.

రాముడు సోదరదృష్టితో వీక్షించి సమీపమున అధివసింప జేశాడు. సుగ్రీవాదులు వారిని పర్యవేష్టించి యున్నారు.

సౌమ్యా! రావణుని యొక్క బలపరాక్రమాదులు తెలుపుమని రాముడు విభీషణునితో కోరాడు.

ప్రభూ! రావణుడు పితామహ వరప్రభావంవల్ల సర్వభూతాలకు అవధ్యుడు. అతని సోదరురు కుంభకర్ణుడు. వీడునూ వరప్రభావంచే దేవదానవులకు అభేద్యుడు సైన్యాధిపతియగు ప్రహస్తుడు కైలాసమందలి యక్షులను జయించి మణి భద్రుడ్ని లోబరచుకొన్నాడు. కుమారుడు ఇంద్రజిత్ అనేక యుద్ధాల్లో ఇంద్రుని జయించాడు. యుద్ధ సమయాల్లో జప, హోమతత్పరుడై ఆ బలంచేత మాయాయుద్ధం చేస్తాడు. అకంపనుడు పర్వతంవలే శత్రువులకు కదల్చశక్యం కానివాడు. మహోదర మహాపార్శ్వ కుంభ, నికుంభ అతికాయ, మహాకాయ, యక్ష, రాక్షస, విరూపాక్షాదులు మహాపరాక్రమశాలురున్నారు. పదికోట్లవేలు రక్షోబలముంది. అని విభీషణుడు రావణ బలాపరాక్రమాల్ని తెలియజేశాడు.

మిత్రమా! సపుత్రామాత్య మిత్రాదులతో రావణుని సంహరిస్తాను. చతుర్దశ భువనాలలో ఎందు చొచ్చిన అమోఘమైన నాశరములు ఆతన్ని పరిమార్చక విడువవు. నాచే రావణుడు సంహరింపబడిన వానినిగా తలచు. రావణ లంకారాజ్యానికి నిన్ను ఇప్పుడే రాజును చేస్తాను. ముమ్మాటికీ చెబుతున్నాను. నా సోదరునిపై ఒట్టు పెట్టి మరీ చెబుతున్నానని. శ్రీరాముడు తన నిశ్చయాన్ని విభీషణునికి తెలిపాడు.

ప్రభూ! యుద్ధ సమయంలో సర్వవిధాలా నీకు సహకరిస్తాను. ప్రాణమున్నంత వరకు నీ శత్రువుతో యుద్ధం చేస్తాను అని ప్రతిజ్ఞ చేసి అన్నాడు విభీషణుడు.

లక్ష్మణా! సముద్రోదకం తీసుకొనిరా ఇప్పుడే లంకా రాజ్యానికి విభీషణుని అభిషేకిస్తాను. అని రాముడు అజ్ఞాపించగానే లక్ష్మణుడు సముద్రోదకాన్ని తీసుకొనివచ్చాడు,

సకల వానరపరివాహినీ సమక్షంలో ఎల్లరూ జేజే ధ్వానాలు చేస్తూండగా విభీషణునికి లంకారాజ్యాధికారం చేశాడు రాముడు.

వాలిని చంపి సుగ్రీవునికి కిష్కిందారాజ్యం ప్రాప్తింపజేశాడు రాముడు. రావణున్ని చంపకయే విభీషణునికి లంకారాజ్యాభిషేకం చేయించాడు.

నిరుపమాన బలపౌరుష పరాక్రమాలు గలవాడును. సంకల్పమాత్రాన సృష్టిస్థితిలయాలు చేయగల మహాపురుషునకు రావణవధను గావించుట అనగా విభీషణునికి రాజ్యం ఒసగుటలోనూ ఆశ్చర్యమేమున్నది. అని అనుకొన్నారు అంతరిక్షం నుండి దేవతలు.

# సేతు బంధనము

పర్వతాల్లాగ ఉవ్వెత్తుగాలేచిన తరంగాలు అంతరాయం లేని ధ్వని కలిగి తీరానికి వచ్చేసరికి తెల్లని నురుగులను కూడి యున్నది సముద్రం జలచరాలతో కూడి, అఘాదమై, దూరానికి నీలిమకలిసిన నీరమువలే నీలివర్ణం కలిగియున్నది. సుదూరంలో చంద్రకిరణాలుపడి కరగపోసిన వెండిలా కొంతభాగం గోచరిస్తుంది.

సుగ్రీవుడు విబీషణునిచూచి మిత్రమా! ఈ వానరసైన్యం లంకలో ప్రవేశించాలంటే సేతుబంధనం అవశ్యమని తలుస్తాను.

ఈ సముద్రం సగరపుత్రులచే ఒకప్పుడు త్రివ్వబడ్డాది కనుక సాగరమని పిలువబడ్డాది. తత్వంశీయుడగు రాముడు ప్రార్థించినట్లైతే సముద్రుడు మార్గాన్ని చూపిస్తాడు. అని నా ఉద్దేశమని అన్నాడు విభీషణుడు.

రామునికి నివేదించారు సుగ్రీవ విబీషణులు. సంతోషించాడు రాముడు. వెంటనే వానరులచే తీసుకురాబడిన కుశలతో ఆస్తీర్ణము కలిపించి సముద్రుని అనుగ్రహం కోసం ప్రార్థింప నిశ్చయించాడు. దర్భాసనాశీనుడైన్నాడు రాముడు. వేదిగత మద్య అగ్నివలే ప్రకాశించాడు. సముద్రాభిముఖుడై ధ్యానవిష్టుడు కానున్నాడు.

ఇంతలో ఆకాశంలో కలకలం బయలుదేరింది. అంత తల ఎత్తి చూశారు. నలుగురు వానరులు రివ్వున ఆకాశానికి ఎగెరేరు. ఒక చిలకను పట్టుకున్నారు. ఇది ఎమి చిలుకా? చాలా పెద్దదిగా రెక్కలు అయితే ఉన్నాయి. ముఖం మాత్రం వికృతంగా ఉన్నది. ఇలాంటి చిలుకను ఎవ్వరు చూడలేదు. రాక్షసచిలుక రెక్కలు వానరులు పీకుతున్నారు. పిడికిలితో పొడుస్తున్నారు. మరి ఒకరు కాళ్లు పట్టుకొని

క్రిందకి గుంజుతున్నారు.

ఆ చిలుక బాధతో బాబోయి, నాయనోయి, చంపేస్తున్నారోయి రక్షించు రామ, రక్షించురామ అని ఆర్తనాదం చేస్తున్నది.

రాముడు గమనించాడు విభీషణుడు నవ్వుకున్నాడు. "వెధవకు తెగులు కుదిరింది" అనుకున్నాడు. సుగ్రీవుడు ఎవ్వరు నువ్వు? ఎందుకు వచ్చావు అని గర్జించాడు. వానరులు ఆ చిలుకను పిడికిలితో పొడుస్తున్నారు. అమ్మో బాబో మరిఎప్పుడు రాను రక్షించు రామా రక్షించు అని అరుస్తున్నది చిలుక

సుగ్రీవుడు ఎవ్వరు నువ్వు? దానిని అదమాయించాడు
"సుకుడను" రావణ ధూతను అన్నాది.
సుగ్రీవుడు "ఏం చెప్పాడు మీ రావణుడు" అని అడిగాడు

మీరు రాముడ్ని దిగవిడచి కిష్కిందకు వెళ్లిపొమ్మన్నాడు సీతను ఇచ్చేదిలేదు. వానరులను రాముని జయిస్తానని సీతో చెప్పమన్నాడు. అన్నాడు "సుకుడు" నన్ను వదలిపెడితే వెల్లిపోతాను మరిరాను అరిచాడు.

అంతట సుగ్రీవుడు "వెళ్లు బుద్ధిగా వెళ్లు మళ్లీ వచ్చావా ప్రాణాలతో వెళ్లవు" అన్నాడు.

లేదు బాబోయి లేదు మరి రాను అని మీదకు ఎగిరి పోయాడు "సుకుడు" మీద నుండె 'సుగ్రీవా! మా రావణునికి ఏమి చెప్పమంటావు' అని అడిగేడు

వాలికి రావణుడు మిత్రుడు. వాలి చచ్చాడు. నీవుమిగిలేవు నువ్వు కూడ రామునిచే చస్తావు. నాకు వాలి నువ్వు శత్రువులే బ్రతక

దలిస్తే సీతను అప్పగించుము అను అని చెప్పేడు సుగ్రీవుడు.

వీడు మన సైన్యాన్ని అంతా అంచనా వేయడానికి వచ్చాడు. పోనియ్యకండి. చంపండి. వీడేమి దూత రావణుని అనుచరుడు. వీడు ఇక్కడ చస్తే వానికి మనసంగతి ఎట్లు తెలుస్తుంది అని అన్నాడు అంగదుడు.

వానరులు మళ్లీ ఎగిరి పట్టుకున్నారు. బాబోయి చచ్చేను. రామా నన్ను వదమలను చెప్పు మరిరాను అని అరిచేడు.

రాముడు 'చే' సౌంజ్ఞచే వానరులను వారించేడు, వానరులు విడిచిపెట్టారు సుకుడ్ని. బ్రతుకు జీవుడా అనుకున్నాడు సుకుడు.

పదరా పక్షి లంకకు అక్కడ నిన్ను ఒదిలి పెడతాము అన్నారు వానరులు. సముద్ర తీరంలో సైకిత స్థలంలో ప్రాకు ఉదగ్రంగా ధర్భలు పరచాడు లక్ష్మణుడు. అందుపై సముద్రాభి ముఖంగా అధివసించాడు రాముడు.

అయోధ్యలో నివశించు దినాలలో నవరత్నకంకణకేయూర అంగుళీయకాది ఆభరణాలతో కూడి, రమణియ్యమైనది, కరి కరోప మానమై, బలీయ్యమైనది, అజానలంభితమైనది, పరిమళ రక్తచంద నానులిప్తమైనది, గో సహస్ర దానములు చేసినది. కుసుమశయ్యపై సీతాదేవికి ఉపదానభూతమైన శ్రీరాముని దక్షిణహస్తముమ మడచి తన శిరస్సునకు తలగడగా అమర్చాడు. నిమిలితాక్షుడై సముద్రా భిముఖుడై సాగరుని అనుగ్రహం కోసం ధ్యానిస్తున్నాడు.

సుగ్రీవుడు, హనుమంతుడు, లక్ష్మణుడు, జాంబవదాదులు రాముని పర్యవేష్టించారు. ఒకటి, రెండు, మూడు, అహోరాత్రాలు రాముడు సముద్రాన్ని ప్రార్థించాడు. సాగరుని దర్శనం కాలేదు.

లక్ష్మణా! ప్రార్థింబడిన సముద్రుడు దర్శనం మీయ్యలేదు గుణహీనునకు దయాదాక్షిణ్యాలతో పనిలేదు. శమము, దయయు శాంతి, తితిక్షయు పనిచేయువు. ప్రార్థనా అనునయాదులు అసలే పనికిరావు.

నన్ను అసమర్థునిగాను గతిలేనివానినిగాను గత్యంతరహితునుగాను తలుస్తున్నాడు. గర్వితుడై నిర్లక్ష్యత కలిగియున్నాడు సముద్రుడు. మత్తకరీంద్రమును అంకుశము చేతనే లోబరుచుకోవాలి వృషగార్ధబములు దండతాడనము చేతనే దారికి వస్తాయి అన్నాడు రాముడు. కన్నులు ఎఱ్ఱబడ్డాయి. లేచి నిలుచున్నాడు. తన చూపులతోనే సముద్రాన్ని శుష్కింపచేసేటట్లు ఉన్నాడు.

లక్ష్మణా ధనస్సు ఇలా తీసుకొని రా అన్నాడు రాముడు. లక్ష్మణుడు ధనస్సును అందించేడు.

ఆశీవిషోపమానములైన బాణములను కూడా తీసుకొని రా సముద్రాన్ని శుష్కింపజేస్తాను. మన వానరవాహిని సుగమంగా లంకకు చేరుకుంటుంది అని ధనుష్టంకారముచేసి చాపమునకు శరమును సంధించేడు.

ప్రళయకాలాగ్ని జ్వాలలువలె ప్రకాశిస్తున్నాడు రాముడు ఆకర్ణాంతము ఆకర్షించిన శరములు సముద్ర గర్భములోనికి విడిచేడు. నీటి మధ్యలో కొండపడినంత చప్పుడైయింది. నీటిలో నిప్పులుపుట్టి మింటికెగసాయి. ఆ ప్రాంతం నీరు శోషించి పోతుంది. కరి, మకర, కశ్చప, ఝషాదులు, చచ్చి తేలిపోతున్నాయి. తీవ్రమైన మారుతానికి సముద్రం ఘోషిల్లుతున్నది. సముద్ర ప్రాణులు భయంచేత ఘోషిస్తున్నాయి. రామునకు కోపం మితిమీరింది. ఇంత మాత్రంచాలదు బ్రహ్మాస్త్రాన్ని సంధించాడు ధనస్సుకు సకలలోకాలు

స్తంభించాయి. వాయువు చలించదు. దిక్కులు మూసుకున్నాయి. అంబరంలో గాఢాంధకారం వ్యాపించింది. సముద్రం పది యోజనములు వెనక్కి తగ్గింది.

అరవైవేల సగరపుత్రులచేత తమ పూజ్యులగు ప్రపితామహాదులచేత త్రవ్వబడే ఈ సాగరం ఒక్క బాణంచే శుష్కింపబోతుంది. "స్వస్త్యస్తు" అనిమహర్షులు ఎల్లలోకాలను శ్రేయస్సును కాంక్షిస్తున్నారు.

సముద్ర మధ్యగతుడైన సాగరుడు ప్రాంజలియై లేచేడు. రక్తవస్త్రుడు దివ్యభూషణ భూషితుడు మాలికామకుటము కలవాడు. నిటలగత అంజలియగు సాగరుడు మనుష్య బాణముతోనే రామా కోపమును ఉపసంహరించు అని ప్రార్థించాడు. ప్రభూ! సనాతనస్థితి నొందిన పంచ మహాభూతములను నశింప జేయవలదు. క్షమించు సముద్ర తరణమునకు ఉపాయం తెలియజేస్తాను అని సవినయంగా పలికేడు సముద్రుడు.

ముందుగా ఈ అస్త్రాన్ని ఎచ్చట ప్రయోగించాలో చెప్పు దీనిని భద్రపరచడానికి వీలులేదు అన్నాడు రాముడు.

ప్రభూ రామచంద్రా! సముద్రంలో ఉత్తరభాగాన ప్రయోగించు. అక్కడ పెక్కురక్కసులు ఉన్నారు. వారినివధించు అన్నాడు ఆ ప్రదేశాన్ని "ద్రుమకుల్య" అంటారు. అగాధమైనది ఆ ప్రదేశం అన్నాడు సముద్రుడు. శ్రీరామచంద్రుడు ఆ బాణాన్ని విడిచి పెట్టాడు సముద్ర గర్భంలో.

సముద్ర గర్భంలోకల ద్రుమకుల్యలోని ఉదకం శుష్కించి పోయింది జలరక్కసులు నశించారు. అది మరుకాంతారంగా ప్రసిది

చెందింది. అయినప్పటికి అక్కడ పశువులు ఆరోగ్యము కలిగి బహుక్షీరదములు అవుతాయి. వృక్షాలు నిరంతరం ఫలపుష్పాదులతో అలరారుతాయి. ఇది పవిత్ర ప్రదేశంగా వర్ఖ్యాతి పొందుతుంది అని వరం ఇచ్చాడు రాముడు.

అనంతరం సాగరుడు చేతులు జోడించి మీ సైన్యంలో విశ్వకర్మ కుమారుడు "నలుడు" అను వానరుడు కలడు వాడు తొలుత శిలాప్రక్షేపణము చేసినా నేను ధరించగలను. కనుక వానిచేత సేతువు కట్టించండి అని సాగరుడు సెలవు తీసుకొని అదృశ్యుడైనాడు

ప్రభూః రామచంద్రా నా తల్లితండ్రుల అనుగ్రహంవల్ల మీ ఆజ్ఞవల్ల "సేతువు" నిర్మిస్తాను నావల్ల రాళ్ళు నీటిమీద తేలుతాయి. ముందుగా నాకు నేనే చెప్పినట్లయితే నా ఘనత నేనే చెప్పుకున్నట్లు అవుతుంది. ఇప్పుడు సాగరుడు తెలియజేసాడు. సెలవు ఇవ్వండి నా తండ్రియగు విశ్వకర్మ నా తల్లికి వరం ఇచ్చాడు నీ కొడుకు నీటిలో వేసినరాళ్లు తేలుతాయి అని. వారు అనుగ్రహంచేత వారధి బంధిస్తాను అన్నాడు నలుడు.

రాముడు సరే అన్నాడు.

వానరులు వృక్షపాషాణ, పర్వత, పేశములు తెచ్చి ఇస్తున్నారు. నలుడు సేతువు నిర్మిస్తున్నాడు. అత్యుత్సాహంతో అత్యంత వేగంతో వారధి బంధనం జరుగుతుంది. వానరులు సూత్రపాతం చేస్తున్నారు కొందరు దండమును ధరించారు. మరికొందరు పర్వతాలు వృక్షాలు మోసుకువచ్చి సముద్రంలో పడవేస్తున్నారు.

మొదటిదినం పదునాలుగు యోజనములు కట్టేరు. రెండవ దినం ఇరువైనాలుగు యోజనాలు కట్టేరు. మూడవదినం ఇరువై ఒక్క

యోజనము నాల్గవదినం ఇరవైమూడు యోజనాలు. ఐదవదినం మిగిలిన యోజనములునిర్మించి సేతుబంధన కార్యక్రమం ముగించారు

వానరులు నిమ్నోన్నతాలు సవరిస్తున్నారు. వృక్షపాషాణ ఖండాలు వల్లీవ్రతతులతోనూ బంధించారు. మృతుపాషాణములతోనూ మసృణము గావించారు.

పది యోజనములు వెడల్పు నూరు యోజనాలు పొడవు గల సేతువు ఆకాశం మీద స్వాతిపధంవలె ప్రకాశిస్తున్నది. దేవతలు మహర్షులు సంతోషించారు. అన్యదుష్కరమైన ఈ సేతుబంధన కార్యక్రమము ఎల్లరును ఆశ్చర్య పరవశము చేసింది.

సుగ్రీవుడు శ్రీరాముని చూచి మీరు హనుమంతునిపై అధిష్ఠించండి. లక్ష్మణుడు అంగదునిపై అదిష్టిస్తాడు. శత యోజనములు కాలినడకతో గమ్యంచేరుట శ్రమాపాదకము అవుతుంది. నేను కొంత వానర సైన్యంతో ముందుంటాను. కొంత సైన్యం మద్యభాగంలో మరి కొంత రెండువైపులు విభీషణుడు తన మంత్రులతో సైన్యరక్షకుడై మనతో వస్తాడు అని మనవి చేసేడు.

వానర సైన్యం బయలుదేరింది. కొందరు ఆకాశంపై ఎగిరి వస్తున్నారు. కొందరు సముద్రాన్ని ఈదుకొని వస్తున్నారు. కొందరు నడచివస్తున్నారు.

రామ లక్ష్మణా, సుగ్రీవ, జాంబవదాదులు, క్రమక్రమంగా సకల వానర సైన్యంతో సముద్రందాటి దక్షిణతీరం చేరుకున్నారు. సువేల పర్వతం మీద వానరవాహినిలు ప్రతిష్టించారు. కొందరు వానరులు సాగరతీరంలో వృక్షపర్వతాదుల విశ్రమించారు. మరి కొందరు ఇంకా సేతువును దాటుతునే యున్నారు.

సుగ్రీవా! మనసైన్యాన్ని గరుడ విధానమును అనుసరించి వ్యూహపరచు. అంగదుడు, నీలుడు తోనూ కొంత సైన్యంతోనూ మధ్య ఉంటాడు వృషభుడు వానర వాహినితోకూడి దక్షిణ పార్శ్వంలో ఉంటాడు. గంధమాదరుడు కొంత సైన్యంతో వామభాగంలో ఉంటాడు మూర్ధస్థానంలో నేను లక్ష్మణుడును ఉంటాము. కుక్షిస్థానంలో జాంబవంతుడు, సుశేనుడు, మేఘదర్శి మున్నగు వానర వీరులు ఉంటారు. మిగిలిన వానరసైన్యంతో నీవు వెనుక భాగాన్ని రక్షిస్తావు. ఇదిగాక ఎవ్వరు ఎక్కడ నిలిస్తే శత్రు దుర్భేద్యంగా ఉంటుందో అలా నియమించండి అన్నాడు రాముడు.

వానర వాహినులను నాలుగు భాగాలుచేశారు. రాముని ఆజ్ఞచే వ్యూహ నిర్మాణం జరిగింది. వానరులంతా వృక్షపాషాణపానులై లంకపై పడుటకు ఎదురు చూస్తున్నారు. అందరూ రాక్షసులను సంహరించాలని ఆశక్తిగా యున్నారు.

ఇక విడిచిపెట్టండి ఈ సుకుడ్ని అన్నాడు రాముడు ఆ రాక్షస చిలుకను విడిచి పెట్టారు వానరులు.

పీడింపబడిన వాడైన సుకుడు మిక్కిలి భయంతో ప్రాణములు అరచేత పెట్టుకొని మీదకెగసి రావణుని సమీపించాడు.

## ఉద్యోగము

సుకుని చూచి రావణుడు కడుపు చెక్కలయ్యేలా నవ్వుతున్నాడు. ఎవరురా నిన్ను నీరెక్కలును లాగేశారు. తోకపీకేశారు అని నవ్వుతున్నాడు.

అంతట సుకుడు నవ్వండి ప్రభూ నవ్వండి ఏం చెయ్యను ఎలక్కి ప్రాణంమీదికివస్తే పిల్లికి చెలగాటంలాగ ఉంటుంది. మీమాట మీదవెళ్ళానా! వానరులు పట్టుకున్నారు. నన్ను చావగొట్టేశారు. రెక్కలు ఊడతీసేశారు. ఒళ్ళుహూణం అయిపోయింది. చావుతప్పి లొట్టపోయి నట్లుఆయింది నా బ్రతుకు. నవ్వండి నవ్వండి అని తలచుకొని అన్నాడు.

అంతట రావణుడు ఇంతకీ నామాట సుగ్రీవునికి చెప్పావా లేదా అని గర్జించాడు. "సుకుడు" చెప్పాను చెప్పాను చిత్తం మన మాట వినిపించు కోవడములేదు. ప్రభూ! సీతను వారికి ఇచ్చేయడం మంచిది. లేదా యుద్ధం చెయ్యండి అన్నాడు సుకుడు.

నీ బోడి సలహా ఎవ్వరికి కావాలిరా?
ఎవ్వడురా అక్కడ అని అరచాలు రావణుడు.

నేను ప్రభూ! "సారణుడను" అన్నాడు రాక్షసుడు.
రావణుడు "మీరిద్దరూ సముద్రం ఒడ్డుకు వెళ్ళండి. సైన్యం లెక్క పెట్టండి ఎవరు బలవంతులో వారు ఉద్దేశాలు ఏమిటో వారిఆయుధాలు తెలుసుకురండి అని అజ్ఞాపించాడు.

వెళ్లకపోతే రావణుడు చంపుతాడు వెళ్లితే వానరులు చంపుతారు. ముందు నుయ్యి, వెనుకగొయ్యి అనుకొని భయవిషాదులతో "శుకసారణులు" వానర రూపంతో సముద్ర తీరానికి చేరుకున్నారు అల్లంత (దవ్వు) దూరం నుండి లెక్కిస్తున్నారు. వానరులను ఒకటి, రెండు, మూడు ఇంకా వారధిమీద నుండి వచ్చేస్తునే యున్నారు. ఇక్కడ ఉన్నవారే లెక్కకు సాధ్యము కావడములేదు.

విభీషణుడు ఆయిద్దర్ని చూసేడు. వీరిద్దరూ వానరులుకారు

పట్టుకోండి అన్నాడు. వానరులు ఆయిద్దర్ని పట్టుకొని చావకొట్టేరు. జుత్తు పీకేశారు. ఒళ్లు కరిచేశారు. ఒళ్లు తెలియక సొమ్మశిల్లేటట్లు పడగొట్టేశారు. శుఖసారణులు రోధించడం తప్ప ఏమి చేయలేక పోయారు.

రాముడు అది గమనించి వానరులతో వీరిని విడిచిపెట్ట మన్నాడు. బ్రతుకుజీవుడా అనుకున్నారు శుఖసారణులు.

ఎవరు మీరు ఎందుకు వచ్చారు అని ప్రశ్నించాడు సుగ్రీవుడు.

రాజా! శుఖసారణులము రావణ ధూతలం ఆతని ఆజ్ఞచేత ఈ సైన్యాన్ని అంచనా వేయడాన్కి వచ్చేము అన్నారు భయపడుతూ.

అంతట రాముడు " మిత్రమా విభీషణా వీరిని మన సైన్యముతో అంతటా కలయు త్రిప్పండి మన బలం చూస్తారు. ఆ పిమ్మట ఒదిలేయ్యండి అని ఆజ్ఞపించాడు.

ఒకరి ఇద్దరూ వానర సహాయంతో శుఖసారణులు సైన్యంతో నలుమూలలు కలియతిరిగేరు. ఇక వెళ్లండి అన్నారు. వానరులు వారి ఇద్ధరికి నాలుగు తన్ని తగిలేశారు.

రావణుడు మహోన్నత ప్రాసాదశిఖరాన్ని అధిరోహించాడు. శుఖసారణులు వెంటనున్నారు. అక్కడ నుండి సముద్రపుటొడ్డు వానర సైన్యం. స్పష్టంగా కనబడుతుంది " ఇక చెప్పండి శత్రువుల పరాక్రమాలు, వారి సంఖ్య వారి వారి ఉద్దేశాలు " అని రావణుడు పలికేడు.

లంకేశ్వరా! అటు గమనించండి వేలాదిగ వానరవీరులతో తన చూపులతోనే లంకను కాల్చేలాగ చూస్తున్నాడు వాడే నీలుడు. ఆ ప్రక్కన కలడు అంగదుడు వాలి పుత్రుడు. వాలియంత బలపరాక్రమం కలవాడు వానిని అనుసరించి కోట్లకొలది వానరులు ఉన్నారు.

ఇతడు హనుమంతుడు మీకు తెలుసుకదా! మన లంకంతా కాల్చేసాడు. వీరిని అనుసరించి లక్షలాదిగ వానరులున్నారు.

అటు చూడండి వాడు నలుడు. ఇతనే వారధి బంధించాడు వాని వెంటకూడా కోట్లకొలది వానరులున్నారు. అక్కడ చూడండి. వాడు శ్వేతుడు. వీడు కుముదుడు వారు గోమతీవాసులు. అనగా ఆ నదీతీర అరణ్యాలలో నివసించేవారు. ఇతడు రంభుడు. వింధ్యసహ్య పార్శ్వ పర్వత ప్రాంతములకు ప్రభువు.

వాడా దూరంగా నిలబడుతున్న వాడు శరభుడు. పారియాత్ర పర్వత వాసులగు వానరులకు ప్రభువు. తన సుదీర్ఘ పుచ్ఛాన్ని నేల కొడుతూ తాటిస్తున్నాడు. ఇతడు వినతుడు. వాడు దూమ్రుడు. పర్వపాత్రికవాసులు సింహాల్లా గర్జిస్తున్నారు. రంభుడు. సుషేణుడు వీరి సైన్యంతో లంకను ఎగబ్రాకుతున్నారు. రాముని దగ్గరనే ఉన్నాడు విభీషణుడు. క్రోధనుడు, దుర్ధర్ముడు, గజుడు, గవయుడు గవాక్షుడు, గంధమాదరుడు, శతబలి, జాంబవంతుడు, సుముఖుడు వజ్రకర్ణుడు, ద్వివిధుడు మొదలగు వానర నాయకులు, రాముని ప్రక్కనే ధనుష్పాణియై లక్ష్మణుడు ఇంకా పేరుమోసిన పరిఖ్యాత బలపౌరుషాలు గలవారు దేవ గంధర్వ కిన్నెర బ్రహ్మ ఈశ ఇంద్ర సూర్యవరుణాది దేవతల అంశలతో పుట్టినవారునూ కలరు.

మహాభయంకర ఆకారులు, నఖ, దౌష్ట్రి, వృక్ష, పాషాణా శస్త్రాయుధులు ఫలమూలాసనులు నదీనద పర్వతారణ్య సముద్ర

వాసులు, భూమ్యాకాశాలు కలియకట్టగలరు. వారి బలపౌరుషాలు నిరుపమానాలు, దృఢకాయులు. దీర్ఘలాంగులాలు కలవారు, అనేక వర్ణములు కలవారు వీరంతా రామలక్ష్మణ సుగ్రీవుల అనుయాయులై లంకానగారాన్ని నాశనం చేయడానికి చూస్తున్నారు. సైన్యంయొక్క సంఖ్య లెక్కించలేము. అది అసాధ్యము. వారిని ఎదిరించలేము ముల్లోకాల్లోనూ ఎవరికీ సాధ్యంకాదు.

నూరువేల ఒకకోటి ఒక శంఖము.నూరుశంఖలు ఒక మహాశంఖము. ఇటులనే నూరుచేత గుణించుకుపోతే బృందము, మహాబృందము పద్మము, మహాపద్మము, కర్వము, మహాకర్వము, సముద్రము మహాసముద్రము, ఓఘము, మహాఘము ఇట్టి మహోఘ సంఖ్యలు గల అనేక వానరులను ఎవరు లెక్కింపగలరు? ప్రభూ! జానకిని రామునికి సమర్పిస్తే మనకన్ని విధాల శ్రేయస్కరమని పలికారు శుకసారణులు.

మీరు వానరులచేత పీడింపబడి విడువబడ్డారు. అందుకే ఇలా మాట్లాడుతున్నారు. నరవానరులంటే నాకొక లెక్కా! నా సరాక్రమము నిరుపమానమని పలికాడు రావణుడు.

ఓయీ శార్దూలా! నీవు నీ పరివారంతో వెళ్లి శత్రువుల బలాబలాలు తెల్సుకొనిరా! అని ఆజ్ఞాపించాడు రావణుడు.

సముద్రం యొక్క దక్షిణతీరంలో వెలసిన వానరవాహినిలో ప్రవేశించాడతడు.

విభీషణుడు గ్రహించాడు శార్థూలిడిని అతని అనుచరులను విభీషణుని సూచనతో పట్టుకొన్నారు వానరులు. చారులను పిడిచిపెట్టి శార్థూలుడ్ని వృక్షపాషాణాలతో పీడింపసాగారు. భాధకు తాళలేక

రాముని రక్షింపమని ప్రార్థించాడు శార్దూలుడు. స్వామి సూచనతో శార్దూలుని విడిచిపెట్టారు వానరులు. వాడు వెనుతిరగకుండా లంకకు పరుగెత్తాడు.

ప్రభూ! రావణేశ్వరా వానరులచేత పట్టుబడిపోయి రాముని చేత విడిపించబడ్డాను. ఆ సైన్యంఅనంతమైంది. వారిబలపరాక్రమాలు ఎవ్వరూ ఊహించలేరు. రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు ఊపలుసురా మనల్ని నాశనం చేయగలరు. ఒక్కరాముడేచాలు మనందర్ని సంహరించడానికి. వారుగరుడవ్యూహాన్ని పన్నారు. అదిదేవదానవులకు అభేద్యమైంది. వారికంట మనవారెవ్వరు పడినా రాముని అనుగ్రహంలేనిదే విడువరు. వారంతా అప్రమత్తులై ఉన్నారు. వారి అనుమతిలేనిదే ఒక్కడ కాలుమోపుటకు వీలులేదు. మనమాట వినేవారు గానీ చెప్పేవారుగానీ లేరు. ఏ క్షణంలో లంకపై పడతారో తెలియదు ప్రళయాన్నయినా నిరోధించవచ్చుగాని వానరులను నిరోధించలేము. ప్రభూ! లంకానగరానికి ప్రమాదం సంభవించకముందే జానకిని రామునికి సమర్పించండి. లేదా లంకా భవిష్యత్ భగవంతునికే తెలుసు అన్నాడు శార్దూలుడు.

సరే మీరు వెళ్లండి. అప్రమత్తులై మెలగండి. రాక్షస సైన్యాన్ని సమీకరించండి. యుద్ధానికి మన వారినందర్నీ సన్నద్ధులు చేయండి. అని రావణుడు రాక్షసులకు ఆజ్ఞఇచ్చాడు.

విద్యుజ్జిహ్వుని వెంటనిడుకొని అశోకవనంకు వచ్చాడు రావణుడు. విద్యుజ్జిహ్వుడు మహామాయావి. వాని నాలుక మెరుపులా మెరుస్తుంది. కళ్లు కొరివిల్లా మండుతుంటాయి. కాలాయశంలాంటి శరీరం, ముఖంలో ఎల్లప్పుడూ క్రౌర్యమూ గోచరిస్తుంది. రావణుని ఆదేశంతో రాముని శిరస్సువంటి శిరస్సును, ధనస్సువంటి ధనస్సును తీసుకొనివచ్చి మైథిలి సమీపంలో ఉంచాడు.

రావణుడు సీతను సమీపించి జానకీ! రాముడు అపారమైన వానరసైన్యంతో సముద్రందాటి వచ్చాడు. రాత్రి మా చారులు అంతటా మారురూపాలతో సంచరించారు. వానరులంతా నిద్రావశులై యున్నారు.

ప్రహస్తుడు ఖడ్గపాణియై నిద్రించిన వానరులందర్నీ సంహరించాడు. లక్ష్మణుడు మేల్కొని మా సైన్యాధిపతిని చూచి భయపడి వానరసైన్యంతో దిక్కుతెలియక ఎటో పరిగెత్తిపోయాడు. హనుమంతుడు, సుగ్రీవుడు కూడా సంహరింపబడ్డారు. చివరకు నిద్రావసునుడైన రాముడు కూడా సంహరించబడినాడు.

గతాయువు గూర్చి విచారిస్తే ఏమిలాభం సకల రాక్షస గణాలకు రాణివై నన్నేలుకో! నీ బంధువులిక్కడకు చేరలేరు. చేరినా ప్రాణాలతో వెళ్లలేరు. ఈ సమస్త సంపదలు స్వేచ్ఛగా అనుభవించు నీ తండ్రికి, చుట్టాలకు ఈ ధనరాసులతో తృప్తిపరచు. రామునిపై ఆశవీడి నాతో సుఖించు అన్నాడు మూర్ఖుడైన రావణుడు. సీతను ప్రలోభపరుస్తూ ఇదిగో నీభర్త శిరస్సు, ధనస్సు గమనించు అంటూ ఎదుట చూపాడు.

మాయాశిరస్సును ధనస్సును చూచి సీత ముఖం వైవర్ణ్యం చెందింది. గట్టుతెగిన ప్రవాహంలా కన్నులనుండి అశ్రువులు స్రవించాయి. శరీరం కంపించుకుపోతున్నది. అనిర్వచనీయమైన భవోద్వేగం చెందింది మనస్సు. కైక కోరిక తీరిపోయింది. కులవర్ధనుడు కూలిపోయాడు. ఆ తల్లుల గుండెల్లో చిచ్చురగిలి పోయింది. జనకుడు జామాత్రహీనుడైనాడు. కలలోకూడా స్త్రీ ఊహించని వైధవ్యస్థితిని కల్గించింది విధి. అయఃపిండ సదృశ హృదయం విదీర్ణంకాలేదు. రావణా పతి పతిని విడిచి జీవించలేదు. నన్ను కూడా చంపి రాముని శిరస్సుతో నా శిరస్సు, రాముని శరీరంతో నా శరీరాన్ని చేర్చ

పుణ్యంకట్టుకో ఈ మాత్రం మంచిపనియైన చేయి. అధర్మంచేత ధర్మం జయించబడితే అశుభం. ధర్మంచేత అధర్మం జయించబడితే శుభం. భర్తకు భార్యసగం శరీరంకదా! బహిః ప్రాణం వంటిదని పలికి జానకి దుఃఖాంబుధిలో మునిగి స్పృహతప్పి నేలకొరిగింది.

ప్రభూ! వానరసైన్యం లంకను ఎగప్రాకుతున్నది. ప్రహస్తుడు యుద్ధానికి అనుమతి కోరుతున్నాడు. తమరు వెంటనే రావలసిందని ప్రతీహారి రావణునితో పలికాడు.

రావణుడు వెళ్లిపోయాడు. మాయాశిరస్సు, ధనస్సు వారితోటే అదృశ్యమైంది. యుద్ధభేరి ఝాంకారాలు సైన్యాల కోలాహలాలు వానరుల సింహనాదాలు లంకను ప్రతిధ్వనింప జేస్తున్నాయి.

" అమ్మా! జానకీ! ధైర్యం వహించు అంటూ చల్లని నీరు ముఖంపై చిలకరించింది. వీవనంతో విసిరింది. సీత కన్నులు తెరచింది అమ్మా సీతమ్మా! నేను. భయపడకు తల్లీ! రాక్షస మాయకు భయపడకు అమ్మా. నేను సరమను. విభీషణుని భార్యను. నేను చెట్టుచాటునుండి రావణుని చేష్టను చూశాను, మాటలు విన్నాను. విచారాన్ని కన్నాను. రాక్షసులకు మాయలు పన్నడము, మారువేషాలు వేయడము, అసత్యాలు పలకడము, అహంకరించడము వారి స్వభావము. తమరు తాము అధికులమని అనుకోవడం అసమర్థతను కోపంతో సరిపెట్టుకోవడం స్వభావము. ఎదుటివారి ఔన్నత్యం సహించలేరు. రావణుడు వెళ్లిపోగానే అదిగో ఆ శిరస్సు, ఆ ధనస్సు మాయమైపోయాయి. అది విన్నావా! రాక్షసలోకంలో కళకళం. అదంతా యుద్ధసంరంభం. రాముణ్ని రావణుడు జయించలేడు. ముల్లోకాల్లోనూ ఆతన్ని జయించగలవాడు పుమ్మాటికిలేడు. రామ రావణయుద్ధం ఆసన్నమైంది. రావణుని చంపి రాముడు నిన్ను పరిగ్రహించి అయోధ్యకు తీసుకొనిపోయి పట్టాభిషేకం చేసుకొంటాడు ముల్లోకాలకు కళ్యాణరాముడౌతాడు "

అని సరమ సీతాదేవికి ధైర్యం చెప్పి ఓదార్చింది.

అమ్మా! సరమా! నా కష్టాలు తీరినట్లులేవు. మరెన్ని ఇడుములను అనుభవించవల్సి ఉన్నానో! సుఖదుఃఖాలను అనుభవించడానికి జీవి శరీరం ధరిస్తుందట. సుఖమనే మాటే శూన్యమైందినాపట్ల దుఃఖంతో దుర్భరమైన ఈబ్రతుకు ఎప్పటికి అంతముకాదు. నామీద నీకు దయఉంటే రావణుడు ఇప్పుడు యుద్ధోద్యోగంలో ఉన్న ఎడలా ఏమి చేస్తున్నాడో చూసి చెప్పగలవా? అని సీత పలికింది.

ఆ మాటలకు సంతసించి నగరంలో ప్రవేశించి కొన్ని క్షణాల్లో సరమ మరల వచ్చినది.

అమ్మా జానకీ! రావణుని యుద్ధ సంరంభం చూసి ఆతని తల్లియైనకైకసి, అవిద్ధుడు అనువృద్ధమంత్రి, పితృతుల్యుడైన "మాల్యవంతుడు" ఈ ముగ్గురూ సీతను రామునికి సమర్పించమని చెప్పారు ఖరదూషణాది రాక్షసవధ జ్ఞాపకం చేశారు. హనుమంతుని పరాక్రమం అభివర్ణించారు. సేతుబంధనం ప్రశంసించారు. ఇట్టి దుష్కర కర్మలను ఆచరించిన రామునితో యుద్ధం తగదన్నారు. సీతను ఇచ్చి సంధి చేసుకోమన్నారు. తనబలం ఎదుటిబలం ఊహించమన్నారు.

రోగికి ఔషదం రుచించనట్లు, చెవిటికి శంఖం వినబడనట్లు వారి మాటలు రావణునికి రుచింపలేదు, వినబడలేదు, లక్ష్యం చేయలేదు. అదిగో! శంఖ, కాహల, భేరి, ఝాంకారాలు వినవస్తున్నాయి. రామునికి తప్పక విజయం కాగలుగుతుందని సరమ సీతతో పలికింది.

లంకలో ఉత్పాతములు కలుగుచున్నాయి. గద్దలు, రాబందులూ మేడలపై నుండి ఎగురుచున్నాయి. కెంధూళి, కారుపొగ అంతటా వ్యాపించింది. అకారణంగా చెట్లు కూలిపోతున్నాయి. నక్కలు

రొదచేస్తున్నాయి. తీతువులు అరస్తున్నాయి. హవ్యకవ్యాల నిలచి పోయాయి. పురోడాసములు నక్కలకు, కుక్కలకు పాలైనాయి. గోవులు గాడిదలను సమీపించాయి. గుడ్లగూబలు ముూలుగుతున్నాయి సూర్యచంద్రులు గతులు తప్పారు, అనేక వర్ణముల పర్యవేష్టాల్ని కలిగి ఉన్నారు. నక్షత్రాలూ, గ్రహాలూ మాసిపోయాయి. ఉల్కలు పడుతున్నాయి వాతావరణం కలుషితమైంది. ఇవన్నీ లంకనాశనాన్ని సూచిస్తున్నవి. ఎవరు ఏమి చెప్పినా వినిపించుకోలేదు రావణుడు. వినాశనము విరచుకు పడుతున్నపుడు వీనులు వినబడవు. కన్నులు కనబడవు. బుద్ధి మొద్దుబారిపోతుంది.

రాముడు కోతులతో నన్ను జయించలేడు. విజయంనాదే. నా శక్తిసామర్థ్యముల ముందు రాముని ప్రభావం అభావమౌతుంది. మంత్రులతో సమావేశం చేశాడు. తన నిశ్చయానికి ఎదురులేదన్నాడు లంకంతటా తగు భద్రత ఏర్పాటు చేశాడు.

తూర్పుద్వారాన ప్రహస్తుడు, దక్షిణద్వారాన మహోదరుడు మహాపార్శ్వుడు, పశ్చిమాన ఇంద్రజిత్, ఉత్తరాన తాను, మద్యలో విరూపాక్షాదులూ యధోచితసైన్య సమన్వితులై నిలిచి యుద్ధం చేయుడానికి నిర్ణయించారు. ఆజ్ఞలు అందరికి అందాయి.

సముద్ర తరంగాలనుండి తీవ్రంగా గాలి వీస్తున్నది, ఆ గాలి ఝంఝూమారుతంగామారి లంకానగరాన్ని కూలద్రోసినట్లున్నది, మహావృక్షాలు సమూలంగా కూలిపోతున్నాయి. పర్వత శిఖరాలు జారి నేలపడి శకలీకృతాలైపోతున్నాయి.

సాయం సమయం. రక్తాకాశం ముందుకు దారుణ రక్తపాతాన్ని సూచిస్తున్నది. విహంగాలు వికృతంగా రొదచేస్తూ సూర్య

మండలంగా చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఏదో తినదగిన మాంసఖండరమని భావించి ఉంటాయి.

రాముడు, లక్ష్మణుడు, విభీషణుడు, సుగ్రీవుడు, అంగదుడు హనుమంతుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడూ మొదలైన వానర వీరులంతా సువేలా పర్వతశిఖరాన్ని అధిరోహించారు. ఆ ఎత్తైన కొండశిఖరంనుండి చూస్తే లంకసర్వస్వం గోచరిస్తుంది. మహోన్నత రాజప్రాసాదాలు నగరచతుష్పదాలు రాజవీథులు, ఉపవీథులు వనాలు—ఉపవనాలూ అంతటా ఆయుధపాసులై రాక్షసులు అప్రమత్తులై నిల్చి ఉన్నారు.

విభీషణుడు రాముని సమీపించి రామచంద్రా! మన వేగుల వారు అనలుడు, శరభుడు, శంపాతి, ప్రహస్తుడను వారలు ఇప్పుడే వచ్చి తెలియచేస్తున్నారేమంటే ఉత్తరద్వారాన రావణుడు, పశ్చిమ ద్వారాన ఇంద్రజిత్, దక్షిణద్వారాన మహోదర మహాపార్శ్వులు తూర్పుద్వారాన ప్రహస్తుడూ ప్రధానంగా నిలచి కోట్లకొలది రాక్షసులతో మనతో యుద్ధానికి నిశ్చయించినారు ముసల, ఖడ్గ, గదా బిందివాల, చక్రపాశ, శూల, ముద్గరాది ఆయుధాలతో రధ, గజ హయ వర్గాలతో యుద్ధకాంక్షులై నిలచిఉన్నారు. చండవిక్రముడైన రావణుడు ఎప్పటికపుడే సమావేశాలు జరిపి నిర్ణయాలు తీసుకొని నిమషాల్లో ఆచరణలో పెడుతున్నాడని మనవి చేశాడు విభీషణుడు.

విశ్వసృష్టి స్థితిలయాలను నిమేషాంతర మాత్రంలో నిర్వహించే నీవు ప్రతాపభానూదయ్యంతో రావణాంధ తమస్సునంతరించి పోయేలా చేయగలవన్నాడు విభీషణుడు.

నేను ఉత్తరద్వారమున, హనుమ దక్షిణద్వారమున, అంగదుడు పశ్చిమద్వారమున, నీలుడు తూర్పుద్వారమున నిల్చియుద్ధం

చేస్తారు. విభీషణుడు సైన్యమధ్యమందు నిలుస్తాడు. నలుడు సమర్థులగు వానరులతో సర్వత్ర సంచరిస్తాడు.

వానరులు కామరూపులైనప్పటికి యుద్ధ పరిసమాప్తి వరకు రూపములు మార్చుకొనరాదు. మానవరూపాన్ని ధరించకూడదు. ఈ నియమాన్ని యుద్ధకాలంలో పాటించవల్సిందేనని రాముడు నిశ్చయించాడు.

రాముని సైన్యాన్ని రావణుడూ, రావణుని సైన్యాన్ని రాముడూ గమనిస్తున్నారు. ఆకాశోన్నత సౌధరాజముపై నిలచి ప్రహస్తాదులతో రావణుడు తన ప్రత్యర్థిని పరివారాన్ని చూస్తున్నాడు

చామరగ్రాహిణులు చామరాల్ని వీచుతున్నారు. ఛత్రగ్రాహిణులు తెల్లగొడుగును పట్టినిలచారు. కవచకుండలకేయూర మకుట మాలికాలంకృతుడై రక్తచందన భూషితుడు, రక్తకేసేయవాసుడు ఐరావత అస్త్రాలని వ్రణకిణాంకభుజుడు, అంజన శిఖరాకారుడగు ణుడు కనపించాడు సుగ్రీవునికి.

ఒళ్లు తెలియలేదు. ఉద్రేకం ఆగలేదు. వెండికొండలాగ ఎగిరి నిర్భయంగా రావణుని శిరస్సుపై ఒక్కతన్ను తన్నాడు సుగ్రీవుడు

మకుటం నేల పడిపోయింది. కిరీటంలోని రత్నరాశులు నక్షత్రాల్లాగు తుళ్లిపోయాయి. మకుటం సౌధసోపానాలనుండి దొర్లుకుంటూ క్రింద పడిపోయింది.

ఈ హఠాత్సంభవానికి అదిరిపడ్డాడు రావణుడు. సుగ్రీవున్ని పట్టుకున్నాడు. బాహాబాహీగా పెనుగుతున్నారు. ముష్టాముష్టిగా పొడుచుకొంటున్నారు. హుంకారాలు, హంకారాలు చెలరేగుతున్నాయి.

నిట్టూర్పులు పాములు బుసలు కొడ్తుతున్నట్లున్నాయి. అంజన పర్వతము, హిమవత్పర్వతము పోరాడుతున్నట్లున్నది. సవ్యాప సవ్యములు పరిభ్రమిస్తున్నారు. మల్లచరచి ఔడుకరిచి జబ్బచరిచి వెనుకముందులాడుతూ పెనుగులాడుతున్నారు. పొట్టేళ్లలా దూరంగా పోయి దగ్గరౌతున్నారు. మేకల్లాగ తలలతో ఢీ కొంటున్నారు. డేగల్లాగ ఎగిరి గంతులేస్తున్నారు. పులులులాగ పరస్పరం అరచేతులతో చరచుకొంటున్నారు. క్షణక్షణం భీతావహంగానే ఉంది. అక్కడ ఉన్న రాక్షసులకు.

దగ్గరకు చేరితే ఎవరికి ఏలాటి ప్రమాదం మూడుతుందో నసే భయంచేత గజగజా వణికిపోతున్నారు రాక్షసులు.

రావణుడు మాయా యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఒక రావణుడు పదిమంది రావణులుగా కనబడసాగారు. రివ్వున ఎగిరిపోయాడు సుగ్రీవుడు. ప్రాసాదశిఖరాన్ని కలదన్ని, పడగొట్టి రాముడు సాన్నిధ్యానికి చేరుకొన్నాడు.

రాముడు సంభ్రమాశ్చర్యాలతో సుగ్రీవుని చూచి ఎంత పనిచేశావయ్యా! నాతో చెప్పకుండా ఆ రాక్షసులపై పడ్డావు. అక్కడ నీవు వానికి వశమైతే మేమంతా ఇక్కడ ఎందుకు ఉండాలి చెప్పు. నీవే లేకపోతే సీతా లక్ష్మణ, భరత శత్రుఘ్నులు, అయోధ్య సర్వం శూన్యమైనట్టే కదా అని ఆలింగనం చేసుకొన్నాడు.

రామచంద్రా! నీ భార్యాపహారియైన ఆ రావణున్ని చూస్తే నాకు కోపం ఆగలేదు. నీవుసూస్తే కొండమీద నిలిచావు. వాళ్లుచూస్తే రాజవైభవాలతో సౌధాగ్రాన్నలంకరించి మనవేపు చూస్తున్నాడు నీతో చెప్పాలని తోచలేదు. ఉద్రేకం ఆగనూలేదూ, నీయందు భక్తి

ఆభాషంచేత వానిని పరిమార్చాలనిపించింది. వెళ్లిపడ్డాను అన్నాడు సుగ్రీవుడు.

రాత్రి సువేలాపర్వతం మీద గడిపి మరునాడు అరుణోదయకాలంలో వానరులు యథాస్థానంలో నిలువ ఆజ్ఞాపించాడు. గాలి చొరబడుటకు వీలులేని భద్రత అంతటా కలిగింది. వృక్షపాషాణాలు పర్వతాదులు సమకూర్చుకున్నారు. చాలకపోతే కాళ్లుచేతులూ, పళ్లు-గోరలు ఉండనే ఉన్నాయి.

రాముడు, హనుమత్-జాంబవదంగద-నీల ప్రముఖులతో సంప్రదించి వాలి పుత్రుడైన అంగదునిర్దేశించి ఇలా అన్నాడు.

అంగదా! నిర్భయంగా రావణ సమక్షంలో నా మాటలు ఇలా తెలియజేయు. దేవతలకు, ఋషులకు, స్త్రీలకు విశేషించి నాకు చేసిన అవమానాన్ని పీడను పరిహరించేందుకు నిన్ను సపుత్ర మిత్రమాత్యకంగా సంహరిస్తాను. సీతను ఇచ్చి శరణుపొందితే నీ ప్రాణాలు మాత్రమే దక్కుతాయి. రాజ్యాన్ని విభీషణుడు పాలిస్తాడు. అధర్ములకు పాలించే హక్కులేదు. ఆత్మబలము అంగబలము ఆశ్రయించి వరప్రభావముల ఫలితంగా గర్వించి యుద్ధానికి సిద్ధపడిన నీకు మరణదండన విధిస్తున్నాను, లోకం అరాక్షసమౌతుంది. కనుక నీవే జీవప్రాయశ్చిత్తం చేసుకొని రణానికి కదిలిరా! కాలహరణం ఇక సహించేదిలేదు. దుష్టశిక్షణా కార్యక్రమంతోనే శిష్టరక్షణ జరుగుతుంది. జానకిని ఇచ్చి శరణుపొందు లేదా యుద్ధానికి సిద్ధపడు అని రావణునికి తెలియజేయమని అంగదునికి ఆజ్ఞాపించాడు రాముడు.

వెంటనే నిండుపేరోలగమునన్ను రావణ సమక్షమునకు ఎగిరి వచ్చాడు అంగదుడు.

ఓరీ! చోరాగ్రేశ్వరా! రావణేశ్వరా! నేను జగన్మాన్యుడైన శ్రీరాముని దూతను. అంగదుడను వాడను. నీచే అపహృతమైన సీతను మతిమంతుడవై శ్రీరామునికి సమర్పించి శరణుపొందుము. లేనిచో యుద్ధానికి సిద్ధపడు. యుద్ధంలోనే మరణిస్తే వీరస్వర్గం కలుగుతుంది. నీచ, నిర్భాగ్య జీవితుడవగు నీకు రాజ్యాధికారంలేదు. విభీషణుడు ఏనాడో అభిషిక్తుడైనాడు.

ఇలా పలుకుచుండగా అంగదున్ని పట్టుకొమ్మని దగ్గరున్న నలుగురి రాక్షసులకు ఆజ్ఞాపించాడు రావణుడు, కోపంచేత కన్నులు ఎర్రమందారాలైనాయి, పల్లు పటపటా కొరకుచున్నాడు. ముఖాన అగ్ని తాండవించింది.

నలుగురు రాక్షసులు అంగదున్ని పట్టుకొన్నారు గరుత్మంతుడు పామును కాల్లుతో ఇరికించుకొన్నట్లు ఆ నలుగురి రాక్షసుల్ని అంగదుడు చంకలో ఇరికించుకొన్నాడు. వాల్లు కాల్లుచేతులూ గిలగిలా తన్నుకొంటున్నారు. అంగదుడు రివ్వున మీదికి ఎగిరిపోయాడు.

రాక్షసులు చంకలో నలిగి ముద్దయిపోయినారు. ప్రాసాదము మీద కెగిరి అక్కడినుండి నేలపడేటట్లు నలుగుర్నీ విసిరేశాడుఅంగదుడు ఆ నలుగురూ క్రిందపడి తునాతునకలైనారు. అంగదుడు ఆ మేడను కాలితోతన్ని విరగకొట్టాడు పొగమంటలుకలిగి ఆ మహోన్నత సౌధము కుప్పకూలిపోయింది. దానికిర్రిందనే పడిచచ్చారు పెక్కురు రక్కసులు

అంగద రాయభారం విఫలమైనది.

## ముట్టడి

రామ లక్ష్మణ, హనుమ, సుగ్రీవ విభీషణ, జాంబవదంగదాదులు లంకను ముట్టడించుటకు వానరులకు అనుమతి నిచ్చారు.

వానరులు గోపురాలు, ప్రాకారాలు, ప్రాసాదమునకు ఎగబ్రాకు తున్నారు.

రావణుడు మంత్రిమండలితో ఉన్నత ప్రాసాదాన్నధిష్టించి అంతటా కలియచూశారు. అంతటా వానరవీరులే. నేలకనబడదు, నింగి కానరాదు. దిక్కులు కనబడవు. ఈ సైన్యాన్ని జయించుట సాధ్య మౌతుందా? అని క్షణకాలంలో ఆలోచించాడు. తన సైన్యానికి ఆజ్ఞనిచ్చాడు. సంకులసమరం ప్రారంభమైంది.

రాముడు ముహూర్తకాలం ధ్యానించాడు. జానకి తన కోసం ఈ లంకానగరిలో దుర్భరదుఃఖాన్ని అనుభవిస్తున్నది,

కోటానుకోట్ల వానరసైన్యంతో రామలక్ష్మణ సుగ్రీవాదులతో ఉత్తరద్వారాన్ని నిరోధించాడు. వీరబాహువు, నలుడూ, సుబాహుడు పదికోట్ల వానరులతో ప్రాకారం నిరోధించారు. ఇరవైకోట్ల వానరులతో అంగద దక్షిణద్వారం నిరోధించారు. కుముదుడు పదికోట్ల వానరులతో తూర్పు ద్వారాన్ని అడ్డుకొన్నారు.

" జయత్యతి మనోరామో లక్ష్మణశ్చ మహాబలాః
రాజాజయతి సుగ్రీవో రాఘవేణాది పాలితః "

వానరసైన్యం అంతటా రామలక్ష్మణ సుగ్రీవుల విజయాన్ని ఘోషిస్తున్నారు. ఆ ఘోష సముద్రఘోషని అతిక్రమించింది.

శంకభేరి ఝాంకారాలు యుద్ధభేరీనినాదాలు కాహళాలు అరుపులు పెదబొబ్బలు సింహనాదాలు రాక్షససైన్యంలో వ్యాపించాయి శరాలు, ముద్గర, శూల, కుఠార, గదపానులై రాక్షసులు కదనరంగ ములో వానరులను ఎదిరించ సాగారు. పర్వతాలు, వృక్షాలు,

శిలాఖండాలు, పాంశుపరాగాలు, నఖదౌష్ట్రాలు, సాధనంగా రాక్షసులతో వానరులు యుద్ధం ప్రారంభించారు.

అంగదుడు ఇంద్రజిత్‌తో ఈశ్వరుడు అంధకాశురునితో తలపడినట్లు యుద్ధం చేస్తున్నాడు. ప్రజంఘుడు శంపాతితో యుద్ధం చేస్తున్నాడు. హనుమంతుడు జంబుమాలితో తలపట్టాడు. మిత్రఘ్నునితో – విభీషణుడూ, తపసునితో – గజుడూ, నికుంభునితో – నీలుడూ సుగ్రీవుడు – ప్రహస్తునితో. లక్ష్మణుడు – విరూపాక్షునితో, రాముడు అగ్నికేతువు, దుర్ధర్ముడు, రశ్మికేతువు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు మున్నగువారలతో ద్వంద్వపోరాటం ప్రారంభించారు. వజ్రముష్టి మైందద్వివిధులతో యుద్ధం చేస్తున్నాడు. తీక్షణవేగులు – నలునితో సుషేణుడు – విద్యున్మాలితో మిగిలిన రాక్షసులు సమర్థులైన వానరులతో కలసి పరస్వరం ద్వంద్వయుద్ధం చేస్తున్నారు.

రావణుని జయంకోరి రాక్షసులూ – రాముని జయంకోరి వానరులూ యుద్ధం సాగిస్తున్నారు.

శిరస్సులు తెగిపడుతున్నాయి. మొండెము లెగురుతున్నాయి. రక్తనదులు ప్రవహిస్తున్నాయి. ఏనుగులు – రథాలూ, శస్త్రాలు విధ్వస్తమగు తున్నాయి. వానర–రాక్షసుల కోలాహలం భూనభోంతరాలు వ్యాపిస్తున్నాయి.

రామలక్ష్మణుల శరపరంపరచేత అసంఖ్యాకులైన రాక్షసులు హతమారిపోతున్నారు. ద్వంధ్వ యుద్ధంలో పరస్పర [illegible]చేత ప్రాణాలు నిర్లక్ష్యపరచి తెగించి పోరుచున్నారు. ఒకవైపు రాక్షసులు జయిస్తున్నారు. వేరొకయెడ వానరులు జయిస్తున్నారు.

సూర్యాస్తమయం అయింది. చీకట్లు వ్యాపిస్తున్నాయి.

రాత్రియుద్ధం ఆసన్నమైంది. విధి విరామంలేదు, మొదలు—తుది లేదు. "నేను వానరుడను – నేను రాక్షసుడను" అని చెప్పుకొంటూ యుద్ధం చేస్తున్నారు. రామ రాక్షస బాణాలు ఆ చీకటిలో మిణుగురు పురుగుల్లాగ సంచరిస్తున్నాయి. ఆయుధ ధ్వనులు విస్ఫులింగాలతో వ్యాపిస్తున్నాయి. దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి.

అంగదుడూ ఇంద్రజిత్ తీవ్రంగా యుద్ధం చేస్తున్నారు జాను ముష్టి తల ప్రహారాలతో ఇంద్రజిత్ రథం కూలిపోయింది. సారథి అశ్వములు నశించిపోయినాయి. వానరులలో ఆనందోత్సాహాలు చెలరేగాయి.

"జయత్యతి బలోరామో లక్ష్మణస్య మహాబలాః" అని నినాదాలు చెలరేగాయి. వానరవాహినిలో.

ఇంద్రజిత్ అంతరిక్షానికి ఎగిరిపోయాడు. మేఘాల మాటు నుండి ఆ కటికచీకటిలో మాయాయుద్ధం ప్రకటించాడు. రాత్రి మూడు ఝాములు దాటింది. చిమ్మచీకటి, ఎవరికి ఎవరూ కనబడరు. రాముడు, జాంబవంతుని, అంగదుని, మైందుని, ద్వివిదుని, సుషేణుని, శరభుని, వినతుని, వృషభుని ఆజ్ఞాపించాడు అంతరిక్షంలో ఇంద్రజిత్‌ని జయించమన్నాడు.

వృక్షపాషాణపాణులై వానరవీరులు అంతరిక్షానికి ఎగిరినారు ఇంద్రజిత్ కనబడలేదు. బాణపాతం జరుగుతునే ఉన్నది. ఇంద్రజిత్ నాగాస్త్రాన్ని సంధించి రామలక్ష్మణులను బంధించాడు. విరివిగా బాణ వర్షం కురిపించి ఇంద్రజిత్ క్షణంలో లంకలో ప్రవేశించాడు.

విభీషణుడు దుఃఖిస్తున్న సుగ్రీవునికి ఓదారుస్తూ యుద్ధంలో ఇటువంటి సంఘటనలు వ్యాకులత్వం కలుగుజేస్తాయి. వాటిని ధైర్యంతో

తట్టుకోవాలి. రామలక్ష్మణులు మూర్ఛితులు. భయపడవద్దు. మనుష్య జీవితంలో గెలుపు-ఓటమిలు, సుఖదుఃఖాలూ కలుగుతునే ఉంటాయి. వాటిని ధైర్యసాహసాలతో ఎదుర్కొంటూ జీవితంలో పయనం సాగించాలి. ఒకరినొకరు ధైర్యం చెప్పుకొంటున్నారు. కొందరు బేలలై విచారిస్తున్నారు. పన్నగశాయిని పన్నగములు బంధించుట విడ్డూరంగా లేదూ! అవి పన్నగములు కావేమో! భక్తిసూత్రాలు కనుకనే రాముడు కట్టుబడ్డాడు. వానరులు వంచతులైనారు.

ఇంద్రజిత్ రాక్షసులతో కొనియాడబడుతూ తండ్రికి నమస్కరించాడు. రావణుని ఆజ్ఞచేత సీతను త్రిజటను విమానంపై అధిష్టింపజేసి యుద్ధభూమికి తీసుకువచ్చి రామలక్ష్మణులను చూపించారు రాక్షసులు. " చూడు రాఘవులు ఏమయ్యారో అని "

నాగపాశబద్ధులై నిశ్చేష్టులైన రామలక్ష్మణులను చూచింది జానకి. గుండె చెదిరిపోయింది మనస్సు పగిలిపోయింది. రణభూమిన పడియున్న రాఘవులను గతాశువులుగా తలంచింది. చిన్ననాటి జ్యోతిష్కులు చెప్పిన, సాముద్రికులు బోధించిన తన సతీస్వభావ భాగ్యాదులన్నియూ అసత్యాలుగా తోచినాయి. ఏమి చేయగలదు? కుమిలి కుమిలి ఏడవడం తప్ప?

అమ్మా దుఃఖించకు. నీభర్త మూర్ఛితుడైయున్నాడు. అతడు మరణించినచో ఈ విమానంమీద ఉండజాలవు. దీని ప్రభావం అట్టిది. రామలక్ష్మణుల ముఖంలో వైవర్ణ్యంలేదు. వికాశం కలదు. గతాశువులైన పురుషులలో వారి ముఖాలు భయంకారాలుగా ఉంటాయి అబలవు. కష్టమెరుగవు. ధైర్యం వహించు. రామలక్ష్మణులు. స్పృహ కలిగి రాక్షసులను రావణుని సంహరించి నీకు ఆనందం కలుగజేస్తారు నేను నిజం చెప్తున్నాను. నామాట నమ్ము అని త్రిజట జానకిని ఓదార్చింది.

సీత చేతులు జోడించి నీవనునది నిజమగుగాక. అనగా విమానం మరళించి త్రిజట సీతను అశోకవనంకు చేర్చింది. చాలా దూరంనుండి గధాపాణియైన విభీషణుని రాకను వానరులు చూశారు అతడు ఇంద్రజిత్ అని అనుకొన్నారు. భయపడి పరిగెత్తుతున్నారు. సుగ్రీవుడు జాంబవంతుని పంపి అతడు విభీషణుడు ఇంద్రజిత్‌కాదని నమ్మపలికించి ధైర్యంచెప్పి పారిపోతున్న వానరులను నిలిపారు.

రామునికి తెలివి వచ్చింది. ముందుగా లక్ష్మణుని చూశాడు రాముని గుండె చెరువైంది. తనవలనే లక్ష్మణుడు ఘోరప్రమాదానికి గురి అయ్యాడని విచారించాడు. కౌసల్యాది మాతృమూర్తులు భరతశత్రుఘ్నుల్ని తలచి లక్ష్మణస్థితిని వారికేమి చెప్పేదని విచారించాడు. తననుండి ఎందరికో ఎన్నో విధాల కష్టాలుకలుగుతున్నాయో అని తలచి తలచి విచారించాడు.

సుగ్రీవుడు సుషేనుని పిలిచి, మనం ఇలా ఒకరినొకరు చూస్తూకూర్చొంటే ప్రయోజనంలేదు. నీవు రామలక్ష్మణులను కిష్కింధకు తీసుకొనివెళ్లి ఉపచారములు చెయ్యి. నేను సపుత్ర బాంధవంగా రావణుని సంహరించి సీతను తోడ్కొనివస్తాను అన్నాడు.

సుషేణుడు క్షతగాత్రుడైన రామలక్ష్మణులను వానరులను గమనించాడు. క్షీరసాగర సమీపంలో దివ్యమైన ఓషదులున్నాయి. సంజీవినీకరణి, విశల్యకరణి మున్నగు దివ్యౌషధాలు చంద్రద్రోణ పర్వతాలలో ఉన్నాయి. వాటిని హనుమంతుడు తేగలడు. అతనిని పంపించండి అని చెప్పాడు.

ఇంతలో తీవ్రమైన జంఝూమారుతం వీచింది. చెట్లు పెడపెడలాడుతూ విరిగిపోతున్నాయి. సుదీర్ఘమైన రెక్కలు కదిలిస్తూ గరుత్మంతుడు అక్కడకు వచ్చాడు. కాద్రవేయులగు పన్నగములు

వానిని చూసి వానరులను రామలక్ష్మణులను విడిచి సముద్రంలోకి ఇతరత్రా పారిపోయాయి.

గరుత్మంతుడు రామలక్ష్మణులను కూర్చోబెట్టాడు. వారిని హస్తాలతో శరీరాన్ని స్పృశించాడు. రామలక్ష్మణులు వ్యథారహితులైనారు. జవసత్వాలు పూర్వంవలే ఉన్నాయి.

ప్రభూ! నేను గరుత్మంతుడను. నీకు స్నేహితుడను. ఇక్కడి సంగతులు తెలుసుకొనుటకు వచ్చాను. మీకు అపూర్వ బలపరాక్రమాలు కలుగుతాయి. రావణుని జయించి సీతాసాధ్వితో అయోధ్యకు వెళ్ళగలవు. నాకు సెలవియ్యండి. అని చెప్పి రామునిచే సారవింపబడినారు.

రామలక్ష్మణులకు ప్రదక్షిణనమస్కారములు చేసి గరుత్మంతుడు ఆకాశానికి ఎగిరి పోయాడు. వానరులంతా ఆనందోత్సాహాలతో శ్రీరామచంద్రునికి జై అంటూ వృక్షపాషాణధరులై లంకలో ప్రవేశించారు.

వానరుల కలకలం కోలాహలం రామునుద్దేశించిన విజయధ్వానాలతో లంకానగరం ప్రతిధ్వనించింది. రావణుని గుండెలు జల్లుమన్నాయి. రామలక్ష్మణులు యుద్ధసన్నిద్ధులైనారు. వానరసైన్యాన్ని నిలుప సఖ్యంకాదు. దేవతలు, గరుడలు, గంధర్వులు, యక్షులు నాగులు ఇంతవరకూ ఎవరూ నాగాస్త్రబద్ధులై బ్రతికి బయటపడలేదు. కానీ ఈనాడు రామలక్ష్మణులు విముక్తులైనారు. వీరిని జయించుట అసాధ్యము. ఎవరక్కడ అని రావణుడు కేక వేశాడు. చిత్తం దేవ ధూమ్రాక్షున్ని అన్నాడు.

నీవువెళ్లి రామలక్ష్మణుల్ని వానరులను జయించిరా! అన్నాడు

రావణుడు. ధూమ్రాక్షుడు రావణునికి నమస్కరించి రథముపై వివిధ ఆయుధాలు సమకూర్చుకొన్నాడు. బలాధ్యక్షుని నుండి అసంఖ్యాకమైన రాక్షసబలాన్ని చేకూర్చుకొని పశ్చిమద్వారం నుండి బయల్దేరాడు. అక్కడ హనుమంతుడు అడ్డుతగిలాడు.

వానరులకు రాక్షసులకు సంకులమైన యుద్ధం జరిగింది. పెక్కురు రాక్షసులు వానరులచే సంహరించబడ్డారు. ధూమ్రాక్షుడూ హనుమంతుడు తీవ్రంగా పోరాడుతున్నారు. కదనరంగం రక్తసిక్తమైంది. పూచిన మోదుగల్లాగున్నారు ధూమ్రాక్షుడు-హనుమంతుడు పర్వతశిఖరాన్ని పెకలించి హనుమంతుడు ధూమ్రాక్షుని రథంపై పడవేశాడు గధాపాణియై రాక్షసుడు రథంనుండి క్రిందికి ఉరికివేశాడు పర్వతశిఖరం రథంమీద పడింది. సారథి, గుర్రాలు, ఆయుధాలు రథం అన్నీ ధ్వంసమైనాయి. పిడుగుపాటుగా వేరొకశిల ధూమ్రాక్షునితలపై పడింది. దానిక్రిందపడి నలిగిచచ్చాడు. రాక్షసులు భయభ్రాంతులై పరుగెత్తారు లంకకు హాహాకారాలు చేస్తున్నారు.

రావణుడు వజ్రదంష్ట్రిన్ని రామలక్ష్మణుల్ని జయించమని పంపించాడు. రాక్షసపరివారంతో రథములు, గజములు, గుర్రములు ఒంటెలు మున్నగునవి వెంటరాగా సమరోత్సాహంతో లంక నుండి బయల్దేరారు. ఒకగ్రద్ధ రథధ్వజాన్ని పడవేసింది. నక్కలు ఎదురొచ్చి అరవజొచ్చాయి. వాలి పుత్రుడైన అంగదునితో యుద్ధం సాగించాడు. రాక్షసులు వానరులూ జిగీషతో కదనం చేస్తున్నారు తలలు తెగి కబందాలు ఎగురుతున్నాయి. ఆయుధాలు వానరులు ప్రయోగించిన శిఖరాలను తగిలి నిప్పులు - మంటలు, పొగలు వెలరేగుతున్నాయి.

అంగదుడు సచక్రకూబరంగా వజ్రదంష్ట్రుని రథాన్ని ధ్వంసం చేశాడు. ఖడ్గప్రహారంచేత అంగదుడు వజ్రదంష్ట్రుని

శిరస్సుని తెగవేశాడు. వానరులు విజయోత్సాహంతో జయజయ ధ్వానాలు చేశారు.

" జయత్యతి బలోరామో – లక్ష్మణస్య మహాబలః "

లంకేశ్వరా! అని పిలచి తలలు దించుకొన్నారు రాక్షసులు

తెలిసింది అకంపనా! నీవు వెళ్ళు ప్రత్యర్ధి సైన్యాన్ని నాశనంచేయి. తగిన సైన్యాన్ని వెంటతీసుకొని వెళ్ళు అన్నాడు రావణుడు.

రావణుని అనుమతిపొంది తగినబలాన్ని వెంటనిడుకొని బయల్దేరాడు అకంపనుడు. వానరులలో యుద్ధోన్మాదం చెలరేగింది.

శిలా ప్రహారాలతోనూ తల ప్రహారాలతోనూ రాక్షసుల్ని ఎదుర్కొన్నారు. జాంబవంతుడు పర్వతశిఖరాన్ని తెచ్చి అకంపనుని పై పడవేశాడు. రథం నశించిపోయింది. ముసలములు గ్రహించి అకంపనుడు నేలకురికి హనుమంతునితో ముష్టియుద్ధం చేశాడు. ముసలం మూల పడిపోయింది. వృక్షపాషాణపానులై వానరులు రాక్షసులు పరస్పరం సంహరించుకొంటున్నారు. భూమిపై రక్తం ఏరులై ప్రవహించింది. తలలుతెగి నేలరాలిపోతున్నాయి. మొండె ములు ఎక్కడికక్కడే పడిపోతున్నాయి. నక్కలు – గద్దలూ కంక పక్షులు పీనుగుల్ని పీకుకొని తింటున్నాయి.

అకంపనుడు హనుమంతుడూ పరస్పరం జమెచ్చ చేత పోరాడుతున్నారు. గెలుపు ఓటమిలు కనబడవు. క్షణంలో మెరపు మెర్సినరీతి హనుమంతుడు అకంపనుడిపై ఉరికి పిడుగువంటి పిడి? లిపోటు గుండెమీద పొడిచాడు. అకంపనుడు ముఖంనుండి రక్తం

ప్రవహించింది, కన్నులు నాలుక వెలుపలికిరాగ ప్రాణం వదిలి [illegible]పోయాడు.

“ జయతియతి బలోరామః ” అని వానరులు జేజే ధ్వానాలు రావణునికి మనస్తాపం కలిగించాయి.

సైన్యాధ్యక్షుడగు ప్రహస్తుడిని చూశాడు రావణుడు. నీవల్ల విజయం కోరుతున్నాను. సాదారుణులవల్ల ప్రత్యర్థులు లొంగివచ్చా వాళ్ళుకాదు. నువ్వు నేను, కుంభకర్ణుడు, ఇంద్రజిత్ విజయం ఈ నలుగురివలనే సాధ్యమౌతుంది. నీవు ససైన్యంగా వానరులను రాములక్ష్మణుల్ని జయించు. అని రావణుడు ప్రహస్తునితో పలికాడు.

ప్రభూ! యుద్ధంఅంటే ఒకరికోసం పలువురు ప్రాణాలు కోల్పోవడం అన్నమాట. ఇది ఎవ్వరికీ శ్రేయస్కరంకాదు. సీతను ఇచ్చివేస్తే ఇట్టి మహోపద్రవం కలుగదుకదా.

సరే నేను వెళ్తున్నాను. అతికాయుడు, కుంభహాలుడు నరాంతకుడు వీరు తన అనుచరలు. అఖండ సైన్యంతో ఉరగధ్వజం రెపరెపలాడుతుండగా యుద్ధభూమికి చేరాడు.

రామచంద్రా! ఆ వస్తున్నవాడు ప్రహస్తుడు. అఖండ సైన్యాధిపతి. రావణునికి ప్రీతిపాత్రుడు. అప్రమేయ బలసంపన్నుడని వివరించాడు విభీషణుడు. రాముడు చిరునవ్వు నవ్వుకొన్నాడు.

సర్పధ్వజము మీద గద్దలు వాలుతున్నాయి. నక్కలు ఎదురొచ్చి అరుస్తున్నాయి. ప్రహస్తునికి ఎడమకన్ను అదిరింది అపశకునాలు మూఢనమ్మకాలు వీటిని విశ్వశించరాదను కొన్నాడు ప్రహస్తుడు.

వానరులు వృక్షపాషాణపాణులై రాక్షస సైన్యంమీద సముద్రకెరటాల్లాగ విరచుకుపడ్డారు. కుంభాహలునితో మైంధుడూ నరాంతకునితో పురాంతకుడూ, ప్రహస్తునితో నీలుడు యుద్ధం చేస్తున్నారు. నలుడు నరాంతకుని సాలవృక్షంతో మోది యుద్ధరంగం నుండి విముఖున్ని చేశాడు. కుంభహలుడు మైందద్వివిదులను గధాపాణియై తరిమికొడుతున్నారు.

అంగదుడు గమనించాడు. పర్వతశిఖరాన్ని తెచ్చి కుంభహలుని తలపై వేశాడు. కుంభహలుడు కూలిపోయాడు.

అగ్నిసుతుడైన నీలుడు సైన్యాధ్యక్షుడైన ప్రహస్తునితో యుద్ధం చేస్తున్నాడు. పాంశుపాషాణ వర్షం కురిపించాడు నీలుడు. ప్రహస్తుడు తనబాణ విద్యాప్రభావంతో ఆ శిలాఖండాలు తనమీద పడకుండునట్లుగా మధ్యనే మరలించాడు. నీలుడు మహావృక్షాన్ని పెకలించి ప్రహస్తునిపై పడవేశాడు. సైన్యాధ్యక్షుని రథం నాశనమైంది. గధ ధరించి నేలకురికి నీలుని భుజాల్ని తాడించాడు. నేర్పరి తనంగా ఆ గధ తనకు తగిలినా లక్ష్యంచేయక ఆతని మీదకురికి ఆతన్ని ఆక్రమించుకొన్నాడు. మేరుశిఖరంలాంటి పాషాణాన్ని పెకలించి తెచ్చి ప్రహస్తుని తలపై పడవేశాడు. తల నూరుముక్కలై నేలపడింది. ప్రహస్తుని శరీరం నుండి రక్తం పెళ్లుభికింది. రాక్షసులు భయభ్రాంతులై నలుదిక్కులా చెదిరిపోయారు. నీలుని వానరులు ప్రశంసించారు.

## ఇప్పటికి వెళ్లు

ప్రభూ! ప్రహస్తుడూ — అనుచరులూ — —

అంతా రాముని చేతుల్లో వానరవీరులతో పోరాడి మరణించారు అంటారు. అంతేనా.

దుఃఖం అంతలోనే క్రోధం కమ్మివేశాయి. ఇక ఒ ఘటలేదు నేనే కదనాన్కి కదలాలి అనుకున్నాడు. ఇంద్రజిత్, అతికాయుడు మహాకాయుడు, ప్రకంపనుడు, కుంభుడు, నికుంభుడు, కరుడు నరాంతకుడు మొదలగు ప్రముఖులు రావణునితో యుద్ధభూమికి బయల్దేరారు.

శంఖకాహలభేర్యాది యుద్ధనినాదాలు మారుమోగాయి. రాక్షసుల సింహనాదాలుచెలరేగాయి.

విభీషణా! అవచ్చే వీరులు ఎవ్వరూ అన్నాడు రాముడు.

రామచంద్రా! సింహపతాకలాంచనం గల రధం మీద ఇంద్రజిత్తు, ఏనుగుపై అధిష్టించిన వీరుడు ప్రకంపనుడు, అతి మహాత్రి శరీరము కలవాడు అతికాయుడు, వీరు ఇద్దరు కుంభనికుంభులు వీరు ప్రధానమైన వీరులు అన్నివిధాలా వీరలకు విరేసాటి. అదిగో అటుచూడు అతడే మా అన్న రావణుడు. కిరీటికుండల అంగద కేయూరహారుడు రథముపై ప్రచండతేజుడైన సూర్యుని లాగ ప్రకాశిస్తున్నాడు. దేవదానవులకు అజేయుడు. కుటిలబుద్ధి మాయావి పాపమే రూపుపొందినవారు అని విభీషణుడు ఆ వచ్చే నాయకుల గురించి పలికేడు.

నేటికి నాకంటపడ్డాడు రావణుడు. సీతా వియోగంవల్ల కలిగిన దుఃఖం వీనిని చంపి తీర్చుకుంటాను. అనుకొని రాముడు కోదండమును ధరించాడు. లక్ష్మణుడు సమీపించాడు. అన్నయ్యా! ఇంతకాలానికి తగినవానితో యుద్ధంచేసే అవకాశం కుదిరింది ఉండు అన్నయ్యా వీరిని పరిమార్చి నేను వస్తాను. ఈ చిన్న అవకాశాన్ని నాకు ఇయ్యి అన్నాడు లక్ష్మణుడు, రాముడుతో.

సరే నీ సరదాను నేను ఎందుకు కాదనాలి. కాని జాగ్రత్తా కూటయుద్ధ విశారదుడు కుటిలనీతి. ప్రబల పరాక్రమంగలవాడు అని అనుమతి ఇచ్చాడు రాముడు. అంగదుని భుజమున అధిష్ఠించి లక్ష్మణుడు రాక్షస సైన్యాన్ని తన బాణములకు ఎరచేస్తున్నాడు. హనుమంతుడు విద్యుత్‌వేగంతో తన కుడిచేయిని బిగించి ఒరే రావణా! నీకు దేవదానవ గంధర్వ యక్షరాక్షసులచేత చావులేకుండా వరం కోరుకున్నావు. వానరుల చేతిలో నీకు చావు కలదు. ఈ ముష్టి ప్రహారాన్ని కాచుకో అన్నాడు రావణుని ఉద్దేశించి

సరే నీవు ప్రహరించు కీర్తినిపొందు అన్నాడు రావణుడు క్రోధుడై.

నాచే చంపబడిన అక్షరకుమారుడుని జ్ఞాపకం తెచ్చుకో అని గుండెలమీద ఒకగ్రుద్దు గుద్దేడు హనుమంతుడు.

రావణుడు విహ్వలుడై అంతలో స్థిరపడి చాలా వీరుడవయ్యా అని శ్లాఘించాడు.

నన్నేం శ్లాఘిస్తావు. నా పిడికిలిపోటుకి నువ్వు యమసదనానికి పోలేదు అని విచారిస్తున్నాను అన్నాడు హనుమంతుడు.

అగ్నికల్పుడైన "నీలుడు" అమాంతంగా రావణుని రథం మీదకు ఎగిరేడు. భుజముల మీదకు, కిరీటంమీదకు, ధనస్సు మీదకు, చిత్ర విచిత్రగతుల ఎగురుతున్నాడు. పట్టుకుందామంటే దొరకటంలేదు. నీలుని ధైర్యానికి వానరులకు ఆశ్చర్యం ఆనందం కలిగింది. సింహాలులాగ గర్జించారు.

రావణుని కోపం మిన్నుముట్టింది. ధనుష్టంకారము చేస్తూ

వానరులను వేటుకి ఒకడిగా చంపుతున్నాడు. జాంబవంతుడు, నీలుడు ...డు, మేగదర్శి, మైందుడు, ద్వివిదుడు రావణుని రథంచూట్టూ ... వానరులు వృక్షపాషాణాలను కురుపిస్తున్నాడు. రావణుడు అందరకుతానై యుద్ధం చేస్తున్నాడు. రావణా! వానరులతో యుద్ధం ఏమి చెస్తావు? ఇదిగో రామానుజుడు యుద్ధానికి సిద్ధంగా యున్నాడు నాతో యుద్ధంచేయ్యి అని వాడిగల్ల బాణాలను రావణునిపై ప్రయో గించాడు లక్ష్మణుడు.

ఇంతలోరకు రావణుడు బాణాలు ఇతరులపై ప్రయోగించాడే ... తానువెప్పుడు ...బాణఘాతం ...తఘాదగా యుంటుందని ఎరుగడు అమ్మా! అమ్మా! అనుకొంటున్నాడు. గట్టిగా ఘాడంగా వాడిథ ...డిన రక్తాలు చిమ్మనట్లు లక్ష్మణుని బాణాలు తగులుతున్నాయి. ...అర్ధచంద్ర ...బాణాలు ప్రయోగించి, రావణుడు లక్ష్మణునిపీడిం చేసిం లక్ష్మణుడు వేగవంతుడై రావణునిరథాన్ని కూల్చి వేశాడు. శరాస నాన్ని భగ్నం చేసేడు. సారధిని చంపేశాడు. రావణుడు ఏరదుడై ...డు. "శక్తి" అనే ఆయుధాన్ని సమగ్రతరంగా అత్యంత వేగంతో లక్ష్మణునిపై ప్రయోగించాడు. లక్ష్మణుడు సమ్మోహితుడై ...పోయాడు.

రావణుడు లక్ష్మణుని రెండు చేతులతో ఎత్తి తీసుకొని ...దానికి ప్రయత్నించాడు. కాళ్లనేలదృఢంగా ఆనించేడు భుజబలం అంతా ఉపయోగించాడు. కాని లక్ష్మణుడు రవ్వంతయినా కదలలేదు.

ఆత్మనిని విష్ణువుయొక్క అంసగ తలచుటచేతనే రావణునకు కదల్చడాన్ని వశం కాలేదు. కైలాసాన్నే కదలించేసాను కదా! లక్ష్మణుడు ఎందుకు కదల్లేదు అనుకున్నాడు రావణుడు. ఇంతలో ...మీద పిడికిలితో హనుమంతుడు ఒక గుద్దు గుద్దేడు. రావణుడు దొంగిల్లా పడ్డాడు. ఈలోగా లక్ష్మణుని భుజం మీదకు తీసుకొని

హనుమంతుడు తీసుకుపోయాడు. వానరులు దైన్యం చెందారు.

రాముడు మూహూర్తం చింతించాడు ధనుష్టంకారము చేసి ముందుకు కదిలాడు. హనుమంతుడు లక్ష్మణుని దించి రాముని తన భుజముపై ఎక్కించుకున్నాడు.

రాముడు, రావణునకు అభిముఖుడై రాక్షసేశ్వరా నిలు నిలు నాకు అపకృతిగావించి నీవెందుపోగలవు. బ్రహ్మేంద్రాగ్ని యమ, శంకరాదుల నుండి తప్పించుకొనగలవు. కాని నా భాణముల నుండి తప్పించుకొనలేవు అని పలుకుతూ శ్రీరాముడు తీవ్రాతితీవ్రముతైన అశనికల్పములైనబాణములను ప్రయోగించాడు. రావణుడు ఆ బాణములను ఎదుర్కొనుచు హనుమంతుని వక్షమున తీవ్రమైన బాణాలను ప్రయోగించాడు.

రావణకృత ప్రవృత్తిని గమనించాడు రాముడు. కోపాక్రాంతుడై సచక్రకూబరముగా రథమును, గుఱ్ఱములను, సారథిని, పతాకమును, చేతిలోయున్న శూలమును, ఖడ్గం చేధించివేసేడు. వక్షస్థలమును ఘాఢముగా ఒక బాణమును నాటవేసేడు. కిరీటము నేల పడునట్లు ఒక నారాచమును ప్రయోగించాడు. రామబాణ పీడుతుడై విహ్వలత్వం చెంది దీర్ఘనిశ్వాసములు రావణుడు వదులుతున్నాడు. అగ్ని చల్లారినట్లు అయిపోయెను. పాములకు కోరలు విరిగినట్లు అయ్యెను. కిరణములు ఉపసంహరించిన సూర్యునిలాగ అయినాడు రావణుడు.

రాక్షసేశ్వరా! నీయొక్క శక్తిసామర్థ్యాలు చూపి చాలా అలసిపోయావు. లంకకు వెళ్లి విశ్రాంతి తీసుకొని మళ్లీరా. ఈమాటు వచ్చేటప్పుడు తగినబలం చేకూర్చుకొని ఆయుధాలు సర్వస్వము సమకూర్చుకొనిరా అప్పుడు నిన్ను యమసదనానికి పంపుతాను.

ఇప్పటికివెళ్లు అని పలికేడు రాముడు. రావణుడు గతశ్రీ యుడై సిగ్గువిడిచి లంకలో ప్రవేశించాడు. రామభద్రా ఎంతపని చేశా వయ్యా చంపతగిన శత్రువు చేచిక్కినప్పుడు ఎవ్వరయినా విడిచి పెట్టెస్తారా. ఇది మానవధర్మమా ఇది వీరునియొక్క ధర్మమా? ఏ ధర్మమైతేనేమిటి సింహం నోటినుండి జారిపడిన మాంసకబళము వలే తప్పించుకు పోయాడు రావణుడు. "అజేయపరాక్రముడు" లోక కంటకుడు, మానినీ మానప్రాణహరుడు, మహాపాపి, మహామాయావి వరగర్వితుడు. అటువంటి రావణుని దయతలచి శక్తి యుక్తి బలము తప్పకొని రమ్మని లంకకు పంపించేశావు. పరమకౄరుడు వాడు ప్రాణాలకన్నా మిన్నయగు నీ భార్యను అపహరించాడు. కదన రంగంలో కలియబడ్డాడు. నీ శరాగ్నిచే కాల్చి పారివేయక కరుణ చూపడము ఏమిః అంత మంచిపని?

రామచంద్రా నీవు పురుషోత్తముడవు. నీకు తెలియని ధర్మం నాకేమి తెలుస్తుంది నీవు సర్వజ్ఞుడవు. సర్వశక్తి సమన్వితుడవు అను కున్నాడు విభీషణుడు తన మనస్సులో. వానరులు కూడా అట్లానే తలంచియుంటారు.

రావణుడు లంకలో ప్రవేశించాడు. మృత్యువు ఆసన్న మైనదని తలంచాడు. తనవారిని యెల్లరని దగ్గరకు పిలిచాడు. తన ఆసనంపై అధిష్టించి ఇలా అన్నాడు.

జరగవలసినది జరగకతీరదు. బ్రహ్మవల్ల వరాలు కోరి నప్పుడు నరవానరులను తప్పించి ఎవ్వరివల్ల మృత్యు భయంలేన ట్లునా వరంపొందేను. ఇప్పుడు ఈ నరవానరులే నాకు మృత్యుకార కులగుచున్నారు. పూర్వము ఇక్ష్వాకువంశీయుడగు అనరణ్యుడు నాకు శపించేడు, నా వంశంలో పుట్టిన అతనే నిన్ను సపుత్రమిత్రా

మాత్యకంగా చంపుతాడని ఆశాపము ఇప్పుడు అనుభవములోనికి వస్తున్నది.

"వేదవతి" సీతగా జన్మించినది. ఆమె ఇప్పుడు నా ప్రాణం తియ్యడానికే లంకలో ప్రవేశించింది. "రంభ" శపించింది. నందీశ్వరుడు శపించేడు. వారుణకన్య శపించింది. ఉమాదేవికూడ శపించింది. అయినా ప్రయత్నం మానకూడదు కదా గతస్మృతులలో మరియొక అశ్వము ఆలోచన పథంలో ముందుకు వచ్చింది.

అది ఏనాటిమాట! అది కృతయుగంనాటిది. నాకు సనత్సుజాతుడు సూచించిన మార్గము. ఔను మరినాటికి దానవులందరూ శ్రీహరిచక్రాయుధం చేత సంహరింపబడి పునరావృత్తరహితమైన శాశ్వతత్వమును పొందారు.

ఈ యుగంలో సీతను అపహరించి అవతారపురుషుడగు రామునిచేత సంహరింపబడుట నా కోరికకు అనుకూలమైనది. అదే సమయము నాజన్మ సాఫల్యానికి ఆసన్నమైనది. దానికి అనువైన ప్రయత్నం చేయ్యాలికదా అనుకున్నాడు రావణుడు

కుంభకర్ణుడు నేటికి తొమ్మిది దినములనుండి నిద్రిస్తున్నాడు వాడిని లేపండి అన్నాడు రావణుడు.

## కుంభకర్ణాదులవధ

ఎటుచూసిన యోజనం ప్రయాణం కలది. ఆ గృహ. దానికి ఒక మహాద్వారం ఆ కక్ష్యనుదాటితే ఒక బంగారు వితర్దిక దానిపై శయనించాడు కుంభకర్ణుడు. ఆ చెవులు నిజంగా కడవల్లాగ ఉంటాయి

పదివేలమంది ఆతనిని మేలుకొలుపుటకు రావణాజ్ఞచే గృహలో ప్రవేశించారు. వారంతా మహాబలవంతులు అయినప్పటికి ఆ కుంభకర్ణుని నాశాగుహలనుండి వెలుపడిన నిశ్వాస వాయువులకు నిలవలేక గజగజ లాడిపోతున్నారు. గృహను ప్రతిధ్వనించేటట్లు గురకపెట్టి నిద్రిస్తున్నాడు కుంభకర్ణుడు.

భూపాలరాగంతో శహనాయివీణావేణువులు మోగుచుండగా మృదంగ ఢక్కభేరి వాయుద్యాలు కాంస్య తాళలయాన్వితములై మ్రోగుతున్నాయి. ఆ పిదప యుద్ధభేరి ఝాంకారాలు కాహళతూర్య ఘోషలు ప్రబలినాయి. ఒకరిద్దరూ పలువురు వందలు వేలు ఒక్కొమ్మడిగా ప్రభోదించి కుంభకర్ణుని మేలుకొలిపేరు పదివేలమంది ఒక్కమారుగ బిగ్గరగా అరిచారు. ఇంతచేసిన కుంభకర్ణునకు మెలుకువరాలేదు ముసల ముద్గర బిందివాలాది. ఆయుధాలతో పొడిచారు. కొట్టేరు గుఱ్ఱములు, ఒంటెలు, ఏనుగులు, ఎనుములు అతనిపైకి నడిపించారు. మెలకువరాలేదు. పదివేల కడవలనీళ్లు చెవ్వుల్లోపోసేరు. ఒక్కపెట్టున అరచాడు. వాద్యాలు మోగించారు. వృష, గార్ధబాలు, తోలించాడు. అన్నీ ఒక ముహూర్తకాలంలోనే జరిగాయి.

కుంభకర్ణునిలో "కదలిక" కలిగింది. కన్నులు మందంగా తెరువబడ్డాయి. ఆవలింతలతో నోరు తెరచుకుంది. ఒడలు విరుచుకొని అంతటా కలియచూశాడు కుంభకర్ణుడు.

గొఱ్ఱ, మేక, పంది, పోతు, మున్నగు జంతువుల మాంసాలు పెద్దతొట్లల్లో పెట్టి ఎదుట ఉంచారు. వేలకొలది సురాభాండాలు అక్కడ సిద్ధపరచారు.

కుంభకర్ణుడు లేస్తునేవాటిని ఆరగించి, త్రాగి ప్రాతఃకాల ఫలహారం అయింది. పర్వత గుహలాంటి తన నోటిని నాలుకతో

తాటించాడు. కళ్లు బండిచక్రాలులాగ త్రిప్పుతూ "ఎవరురా నన్ను లేపింది ఏమొచ్చింది వారికి? ఎవరికి చావు మూడింది అని అడిగేడు కుంభకర్ణుడు."

ప్రభూ! మీ అన్నగారు లేపమన్నారు. రామలక్ష్మణ సుగ్రీవాదులవల్ల మనకు ఉపద్రవం కలిగింది. వానరవాహిని లంకను ఆక్రమించింది. ప్రహస్తాదులు మరణించారు. తమ రాకకై మీ అన్నగారు ఎదురు చూస్తున్నారు. అని విరూపాక్షుడు ప్రాంజలియై నమ్రతతో పలికాడు.

వేలకొలది రాక్షసశ్రేష్ఠులు వెంటరాగా కుంభకర్ణుడు రావణుని సభామందిరానికి రాజమార్గంగుండా బయలుదేరాడు.

కిరీటకుండలాలాకృతమైన పర్వతశిఖర సదృశ్యమైనది రావణానుజుని తల ప్రమాణరహితమైనది. శరీరము చూచి వానరులు భయకంపితులైనారు.

రాముడు విభీషణుని చూచి అడిగాడు ఎవడు వీడు అని.

రామచంద్రా ఇతడు విశ్రవసుని కుమారుడు రావణుని సోదరుడు. కుంభకర్ణుడు. అప్రమేయ బలసంపన్నుడు. పుట్టుకతో సకలప్రాణులను మ్రింగుట ప్రారంభించాడు. ఐరావతదంతాన్నే ఊడబెరికి ఇంద్రుని చావమోదాడు. అపుడు దేవతలు భయపడి బ్రహ్మ దగ్గరకువెళ్లి ప్రభూ కమలాసనా నీ సృష్టినంతయును ఒక్క క్షణములో మ్రింగేటట్లున్నాడు. లోకమంతా భయం ఆవహించింది. రక్షించుము అని ప్రార్థించారు.

బ్రహ్మవానికి శాశ్వతనిద్ర కటాక్షించాడు. రావణుడు వేడు

క్రొన్న మీదట ఆరుమాసాలకొకమారు. మేలుకొంటాడు. కావలసినంత తింటాడు. మళ్లీ పడుకుంటాడు. మధ్య ఎవరైనా లేపారంటే ప్రమాదము తప్పదని బ్రహ్మ రావణుని సముదాయించాడు. ఇక వానరులు భయపడు తున్నారు. వారికి ఇది యాంత్రికమైన బొమ్మ అని చెప్పండని విభీషణుడు రామునికి తెలియజేసాడు.

నీలుడు సర్వత్రా ఇది యాంత్రికబొమ్మ అనిపించాడు వానరులు స్వస్థులైనారు. రాజమర్యాదలు, బంధుమర్యాదలు అయిన తరువాత కుంభకర్ణుడు రావణుడు ఒసగిన ఆసనంపై కూర్చుని ఏమిటి విశేషాలు అన్నాడు.

నరవానరులచేత లంకానగరం ఆక్రమించబడినది. వారివల్ల నాకు భయ, ఆందోళనలు కలుగుతున్నాయి. నువ్వు ఈ ప్రమాదం నుండి నన్ను లంకను కాపాడాలి. అందుకే నిన్ను పిలిపించాను అన్నాడు రావణుడు.

రాజా! చాలా పొరపాటు చేశావు. సీతను అపహరించటం ధర్మ విరుద్ధం. ధర్మహీనమైనది కూడా. తత్కృతపాపం ఎవరైనా అనుభవించతగినది. ఏ కార్యానికైనా ముందు మంత్రివృద్ధులతో యుక్తాయుక్తాలు ఆలోచించి మరీ చేయాలి. చేసిన తరువాత ఆలోచించడం తెలివైన పనికాదు. ధర్మాధర్మాలు సుఖదుఃఖాలకు కారణమౌతాయి. కామక్రోధాదులు వినాశనానికి దారితీస్తాయి. ధర్మసమ్మతమైన కార్యం వల్ల క్షేమం కలుగుతుంది. ఇదివరకే సీతాపహరణ దోషమైనదని తత్ఫలితం ఇపుడు అనుభవానికి వస్తున్నది అన్నాడు కుంభకర్ణుడు.

నువ్వు ఇప్పుడు గురువుగా బోధించ నక్కరలేదు. గడిచి పోయినది తిరిగి రాదు కదా! ఇప్పుడు ఈ భయంనుండి కాపాడమని పిలిపించాను అన్నాడు కర్కశంగా రావణుడు.

సరే! నాలో ప్రాణం ఉన్నంతవరకు వానరులను మ్రింగుతాను. రామ, లక్ష్మణ, సుగ్రీవ, జాంబవదంగదాదులను మ్రింగివేస్తాను.

నీభయం తొలగిస్తాను. ఇకనీవు నీవారు తిని త్రాగి సుఖించండి. అని చేత పదునైన శూలాన్ని ధరించి వానరసైన్యంలో ప్రవేశించాడు కుంభకర్ణుడు.

మహోదరుడు కుంభకర్ణుని నిలిపెను. జనస్థానకథ నీకు తెలుసునా? క్షణకాలంలో రామునిచేత 14వేల మహాబలులగు రాక్షసులు చంపబడ్డారు. నీవెంట నేను, ద్విజిహ్వుడు, సంహ్రాది, వితర్దనుడు వస్తాము. మనబలపరాక్రమ సదృశులైన రాక్షసశ్రేష్టులు కూడా వస్తారు రామలక్ష్మణులను జయించుట అంత తేలికయైన పనికాదు. మరి ఒక విషయం ఏమిటంటే రాజు ఆలోచించే సీతాపహరణం చేశాడు. కార్యం సిద్ధించాక సాధనములతో పనిలేదు. కనుక ధర్మాధర్మాల గురించి ఆలోచించ నక్కరలేదు. సాహసమే సర్వకార్య ప్రధానము అని ఇంకా ఏమేమో చెప్పబోతున్నాడు మహోదరుడు.

వాని మాటలను లక్ష్యపెట్టక కదనరంగంలోకి ప్రవేశించాడు కుంభకర్ణుడు. కాలవైపరీత్యంలో మహోత్పాతాలు తెలుసుకోవల్సిన అవసరం లేదు.

వానరులను భయపెట్టడానికి రావణుడు పంపిన "[illegible]" [illegible]యంత్రంతో నిర్దేశించబడిన సాలభంజిక నార త్రిప్పి పడవేశాడు [illegible] [illegible] అన్నాడు నీలుడు.

హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు, [illegible] [illegible]డు, గంధమాదరుడు మొదలగు వానరవీరులు పర్వతాలు వృక్షాలు పెకలించి కుంభకర్ణునిమీద పడవేస్తున్నారు. అవి వాని శరీరం

మీదపడి అయసఫలకం మీదపడిన వడగళ్లులాగ చూర్ణీకృత మౌతు న్నాయి. వానరులను ఒకరు ఇద్దరు, పదులు, వందలు, వేలుగా మింగేస్తున్నాడు కుంభకర్ణుడు.

హనుమదాదులు వానరులకు ధైర్యసాహసాలు కలుగుజేస్తు న్నారు. ప్రాణాలకు తెగించి కుంభకర్ణునితో పోరాడు తున్నారు. జయిస్తే కీర్తి, మరణిస్తే స్వర్గం ఇదీ వానరవీరుల నిశ్చయం.

సుగ్రీవుడు మేరు పర్వతంలాంటి శిఖరాన్ని కుంభకర్ణుని వక్షంపై పడవేసాడు. కోపోద్దీపితుడై కుంభకర్ణుడు. సుగ్రీవుని గదతో మోది మూర్ఛితున్ని చేశాడు. వెంటనే వానిని భుజములలో బంధించి లంకలోనికి పరిగెడుతూ ప్రవేశిస్తున్నాడు.

రాక్షసులు జేజే ధ్వానాలు చేశారు. సౌధాగ్రహమ్ముల నుండి పుష్పవృష్టి కురిపించారు రాక్షసాంగనలు. చల్లనిగాలికి పూలవాసనకు సుగ్రీవునకు తెలివివచ్చి ఇప్పుడేమి చేయ్యాలని ఆలోచించాడు.

కుంభకర్ణుని భుజాలనుండి జారి మీదకెగిసి ముక్కు కొరికే శాడు, చెవులు పీకేశాడు, ఒళ్లంతా రక్కేశాడు, రివ్వున ఎగిరి రామ సాన్నిధ్యానికి చేరుకున్నాడు సుగ్రీవుడు.

రక్తం స్రవిస్తు తెగినకర్ణనాసా వైభవంతో లంకలో ప్రవేశిం చుటకు సిగ్గుపడి కుంభకర్ణుడు మరల యుద్ధభూమికి మరలివచ్చి వానరులను మింగుతున్నాడు. రాక్షసులనుకూడా మ్రింగుతున్నాడు ఎవ్వరెదురైనా వారినే కబళించేస్తున్నాడు కుంభకర్ణుడు.

లక్ష్మణుడు నిశితమైన బాణవర్షం కురిపిస్తున్నాడు, వాటిని వదిలించుకొంటూ రామునివైపు వచ్చాడు కుంభకర్ణుడు.

" ఖరుడు, విరాదుడు, కబంధుడు కాదు " వీడు కుంభకర్ణుడు రామా! " అంటూ శూలంతో రాముని పొడవబోయాడు. వాయువ్యాస్త్రం ఉపయోగించి శూలంతో కూడిన కుంభకర్ణుని చెయ్యిని రాముడు తెగవేసాడు. వెంటనే కుంభకర్ణుడు వేరొక చేతితో పెను వృక్షాన్ని పెకలించి రామునిపై విసిరివేసెను. రాముడు నిశితబాణముతో భేదించి ఐంద్రాస్త్రంతో ఆచెయ్యినికూడా తెగవేసాడు. రాక్షసుడు పరుగెత్తుకొనివచ్చి రాముని మింగ బోయాడు. అర్ధచంద్ర బాణములతో రెండు కాళ్లు తెగవేశాడు రాముడు. కుంభకర్ణుడు యుద్ధభూమిలో దొర్లుతూ రాముని మీదకు వచ్చేస్తున్నాడు. కొండలాంటి వాడిశరీరం క్రిందపడి పలువురు వానరులు, రాక్షసులు మరణించారు.

రాముడు ధనస్సును సంధీకృతంచేసి ఐంద్రాస్త్రాన్ని ఆరిబోసి ఆకర్ణాంతం ఆకర్షించి కుంభకర్ణుని శిరస్సు తెగవేసాడు. తలపోయి కోటగోడకు ఢీ కొంది. మొండెం సముద్రంలో పడింది.

వానరులు సంభ్రమాశ్చర్యములతో "జయత్యతి బలోరామః" అని జయజయ ధ్వానాలు చేశారు. రాక్షసులు భయభ్రాంతులై లంకకు పరుగెత్తారు.

కుడిచెయ్యిలాంటి కుంభకర్ణుడు కూలిపోయాడు. రావణుడు విచారించక ఏం చేస్తాడు. " ఏషనారాయణః " లంకను నాశనం చేయక విడువడు. విచారిస్తున్నావా లంకాధిపతి బ్రహ్మదత్తమైన కవచఖడ్గాలు, కత్తిశరాసనాలు, వేయిఖరములు పూన్చిన రథము ఉంది. నీ బలం నీకు తెలియదు. ధైర్యం వహించు అన్నాడు త్రిశిరస్సు.

జయిస్తాననే ఆశ కల్గింది రావణునకు. అదీగాక ఓటమికల్గుతున్నకొద్దీ పట్టుదలపెరుగుతుంది. దానితోనే సర్వనాశనంజరుగుతుంది

త్రిశిరస్సు దేవాంతక నరాంతకులు యుద్ధోన్మత్తులు మత్తులు మహోదర మహాపార్శ్వులు రావణున్ని ధైర్యం కలుగజేస్తూ కదనరంగానికి వచ్చారు. వానరులు వృక్షపాషాణపాణులై ఎదురు తిరిగారు. హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు, నీలుడు నలుడు, గజుడు, గవయుడు నఖదంష్ట్రాయుధులై సంకుల సమరం చేశారు. రథాన్ని రథంతో విరగ్గొట్టిస్తున్నారు. ఏనుగును-ఏనుగుతోనూ గుర్రాన్ని-గుర్రంతో చంపుతున్నారు. సహజమైన చెట్లు, రాళ్లు విసిరి చంపుతున్నారు. రాక్షసులు తమతమ ఆయుధాలతో వందలు-వేలుగా వానరులను నాశనం చేస్తున్నారు. కదనరంగం రాక్షసవానర కళేబరాలతో కప్పబడింది. విధి బలీయమైంది. అధర్మం అప్రతిహతంగా సాగినంతకాలం సాగిపోతుంది. మహావీరులైన వానరశ్రేష్ఠుల చేత రాక్షస నాయకులు హతమారిపోయారు రావణునికి విచారం తప్పలేదు కోపం తగ్గలేదు పట్టుదల సడలలేదు.

ధాన్యమాలి సుతుడు అతికాయుడు నేనువెళ్లి రామలక్ష్మణులను వానరసైన్యాన్ని నాశనం చేస్తానని బయల్దేరాడు. అతనివెంట మృత్యువుచేత ఆహ్వానితులైన పెక్కురు రాక్షసయోధులు వెంట పడ్డారు.

కుంభకర్ణుడు చచ్చి మళ్లీ బ్రతికి వచ్చాడు కాబోలు అనుకొన్నారువానరులు. రామా! బ్రహ్మదత్తమైన అభేద్యకవచకుండలాలు బలం కలవాడు ఈ అతికాయుడు. వీనితో అప్రమత్తులై యుద్ధం చేయాలి అన్నాడు విభీషణుడు.

లక్ష్మణుడు శర శరాసనములను గైకొని అతికాయునితో యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఇరువురి భాణపాతం చేత యుద్ధభూమి అంతయూ బాణమయమై పోయింది.

వానరులు వృక్షపాషాణాలు తెచ్చి మీద పడవేస్తున్నారు. ఐంద్ర, ఐశీక, ఆగ్నేయ, వాయువ్య సౌరాస్త్రాలు పరస్పరవధార్థులై ప్రయోగించుకొన్నారు. అతికాయుడు, లక్ష్మణుడు వీరిలో గెలుపు ఓటమిలు కనబడలేదు.

లక్ష్మణా! బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించు అని వాయువు చెప్పాడు. బ్రహ్మాస్త్రం ప్రయోగించబడింది. వివిదాస్త్రములు ప్రయోగించి వారింప చూశాడు. అతికాయుడు చివరకు బ్రహ్మాస్త్రపాతంతో కదనరంగంలో కూలిపోయాడు.

రావణుడు లెక్కించాడు. ఎందరో మహావీరులు రాముని బాణంచే మడిసిపోయారని, తన జీవితంపై కూడా నిరాశ కలిగింది.

ఇంద్రజిత్ తండ్రికి నమస్కరించి యుద్ధభూమికి బయల్దేరాడు. మాయావియగు మేఘనాధుడు మేఘమండలగతుడై బాణవర్షాన్ని కురిపించాడు. వానరులు తేరిచూడడానికి కూడా అశక్యమైనది నేల రక్తవాహినిలు ప్రవహించాయి. వాటిలో వానరరాక్షస కళేబరాలు కొట్టుకపోతున్నాయి. మధ్య మధ్య మేఘోమద్యాన్ని గుట్టలు గుట్టలుగా ఇసుక తిప్పలవలె కనిపిస్తున్నాయి. పలువురిని పీడించిన ఇంద్రజిత్ లబ్దవిజయుడై మరల లంకకు చేరుకొన్నాడు.

సముద్రపు ఆటు-పోటువలె మానవజీవితాల్లో మహత్తర కష్టాలు వస్తాయి. ఆపై సుఖాలు కలుగుతాలు. సుఖదుఃఖాలకు అతీతంగా మానవ మనుగడ సాగించాలి. శరీరం సుఖదుఃఖాలను అనుభవించడానికే కలుగుతుంది.

దానిద్వారానే లక్ష్యాన్ని సాధించాలి. ఇదే రాముడు మనకు చెప్పిన గుణపాఠం. చేసి చూపించిన ఆదర్శం.

ఉదయాన్న ఐదవ ఝామునరికి ఇంద్రజిత్ బ్రహ్మాస్త్రం చేత రామలక్ష్మణులతో పాటు వానరవాహిని అంతయూ సమ్మూర్ఛితులను చేశాడు. ఈ అస్త్రంలు ప్రయోగించువాని మనఃస్థితిని బట్టి ప్రవర్తిస్తుంటాయి.

బ్రహ్మాస్త్రానికి బద్ధుడుకాని హనుమంతుని దగ్గరకు విభీషణుడు వచ్చాడు. చేతులో వెలుగుతున్న కరదీపిక సాహాయంతో అందర్ని పరిశీలిస్తున్నాడు, కొందరు మృతులు. కొందరు మృతకల్పులు. జాంబవంతుని సమీపించాడు.

తాతా! తెలివికలిగియున్నావా! అన్నాడు విభీషణుడు.

అవును. కన్నులు తెరవలేను. నీవు విభీషణుడవేనా! హనుమంతుడు తెలివికలిగి యున్నాడా? అని ప్రశ్నించాడు జాంబవంతుడు అతడు తెలివికలిగియుంటే మనము బ్రతికేమన్నామాట. అతడే తెలివి కోల్పోతే మనమంతా బ్రతికున్నప్పటికీ చచ్చినవారితో సమానమే. అంటున్న జాంబవంతునికి హనుమంతుడు తనపేరు చెప్పుకొని పాదాభివందనం చేశాడు.

నాయనా! హనుమన్నా! త్వరగావెళ్లి సాగరందాటి కైలాస వృషభపర్వతాల నడుమ ఓషది పర్వతం ప్రకాశిస్తుంది. దానిపై నాలుగు ఓషదులు మెరుపుతీగలవలే కనబడతాయి. ఒకటి సంజీవనీ కరణి. రెండవది విశల్యకరణి. మూడవది సావర్ణకరణి. నాల్గవది సంధానకరిణి వీటిని తీసుకొని వచ్చిన మనవారంతా బ్రతుకుతారు. ఆలస్యం చేయకు అన్నాడు జాంబవంతుడు.

హనుమంతుడు జాంబవంతునికి, రామలక్ష్మణులకు నమస్కరించి అమృతహరణార్ధం గరుత్మంతునిలాగ అకాశానికిఎగిరిపోయాడు

దీ నదాలు, పర్వతాలు, అరణ్యాలు, ఆశ్రమాలు దాటి హిమవంతు చేరి కైలాస వృషభ పర్వతాల నడుమ మేరుపర్వతంలాగ ఉన్న షధీ పర్వతాన్ని హనుమంతుడు చూశాడు. దానిమీద ఓషదులు ర్శనమే ఈయలేదు. ప్రార్థించాడు. ప్రయోజనం లేదు. భుజము తో పర్వతాన్నే పెకలించి అరచేత నిడుకొన్నాడు. వేరొకచేత మేఘ ండలాన్ని చీలుస్తున్నాడు. నోరుతెరచి సింహనాదం చేస్తున్నాడు క సింహపుచ్ఛంవలే, కాలసర్పంవలె మీదికి నిలిచి యున్నది. ఆ ర హనుమంతున్ని చూచి దేవతలు, ఋషులు ఆశ్చర్యపడ్డారు ఆశీర్వదించారు. ప్రార్థించారు. జయ వీరాంజనేయా అని భూతగణం ప్రశంసించింది.

హనుమంతుడు ఆ పర్వతాన్ని వానరసైన్య మధ్యన నిలిపాడు. ఓషదులు విద్యుత్‌వంతములై దివ్యంగా ప్రకాశించాయి. వాటినుండి వెలువడిన వాయువులచేత రామలక్ష్మణులతోపాటు సకల వానరగణం నిద్రనుండి మేల్కొన్నట్లు లేచి కూర్చొంది. పూర్వంవలే బలపౌరుషాలు వారికి ప్రాప్తించాయి. రామ లక్ష్మణులతోపాటు వానరులంతా హనుమంతుని ప్రశంశించారు.

రావణుని ఆజ్ఞచేత లెక్క తెలియడం కోసం యుద్ధం మొదలైన మొదటి దినంనుండి చచ్చిన రక్కసులను సముద్రంలో పడవేసిన కారణం చేత వారికి బ్రతకడానికి అవకాశం లేకపోయింది.

రామరామానుజుల అనుమతితో ఓషధీపర్వతాన్ని యధాస్థానంలో ఉంచివచ్చాడు హనుమంతుడు.

సుగ్రీవుడు సమర్థులైన వానరులకు ఆజ్ఞాపించాడు. మీరంతా ఉల్కాహస్తులై లంకను తగులబెట్టండి అని.

వానరులు ఆ రాత్రికి రాత్రి కరదీపికలను ధరించి లంకలో నలువైపులా అగ్ని రగులకొలిపారు. ఛటఛటారవాలతో అగ్ని వాయుచోదితమై లంకను తగులపెడుతున్నది.

ఆకాశాన్నంటే అగ్నిజ్వాలలతో దేవతలు శిశిర వసంతాల మధ్య చలికాగుతున్నారు. అగ్ని తృప్తిచెంది తేంచునట్లు గలగల ధ్వనులు వినబడుతున్నాయి. ఆయుధశాలలు కూలిపోతున్నాయి. జంతుశాలలు మండిపోతున్నాయి. ప్రాసాదాలు పేలిపోతున్నాయి. స్త్రీ, పురుషులు భీతిచెంది ఆహాకారాలతో ఆర్తనాదాలతో మంటల్లోపడి మండిపోతున్నారు. వివిధ వర్ణాలతో, వివిధ ధ్వానాలతో మంటలు చెలరేగి ప్రళయ కాలవేళను సూచిస్తున్నాయి. ఆ మంటలు సముద్రం నీటిలో ప్రతిఫలించి రక్తసముద్రంలాగున్నది. కాలిపోతున్న లంకకు దర్పణమైంది.

రావణాజ్ఞచే కుంభకర్ణసుతులు కుంభుడు, నికుంభుడు, విరూపాక్షుడు, ప్రజంఘుడు, అకంపనుడు, శోనితాక్షుడు అను రాక్షసులతోకూడి ఆ రాత్రి వానరులతో యుద్ధం చేశారు. సంకుల సమరంలో వానరరాక్షసులు సంహరించబడ్డారు. అంగదుడు కుంభనికుంభులను హనుమదాదులు శోనితాక్ష విరూపాక్షులను సంహరించారు.

ఖరపుత్రులైన మకరాక్షులు, విరూపాక్షులు రావణచోదితులై తమ తండ్రిని చంపిన పూర్వవైరం స్మరించి రామునితో యుద్ధానికి సిద్ధపడ్డారు. సింహాన్ని చూచి లేళ్ళులాగ మఖరాక్షుడుని చూచి వానరులు భయభ్రాంతులై అటు-నిటు పరుగెత్తారు.

సుగ్రీవుడు రాక్షసులను నిలువరించాడు. అంగదాదులు వృక్షశైలాలను పడవైచి విరూపాక్ష, మకరాక్ష రథాలను నాశనం చేశారు. మేఘాల్లోన్ని మెరుపుల్లాగ వానరులు ప్రకాశిస్తూ వజ్రవిచ్ఛేద

పర్వతాల్లాగ రాక్షసులను నేల పడవేస్తున్నారు. తిరస్కారాలు పురస్కారాలు పరస్పరం ఒకరినొకరు పలుకుచూ పోరాడుచూ హుంకారాలు చేయుచూ ఆరాత్రి యుద్ధం సకలప్రాణి భయంకరంగా ఉంది.

రాముని మకరాక్షుడు బాణములతో పీడిస్తున్నాడు. రాముడు పుంఖాను పుంఖాలుగా బాణాలు ప్రయోగించి చివరకు రాముని పావకాస్త్ర ప్రయోగంచేత మకరాక్షుడు నేలకూలాడు.

సుగ్రీవుడు విరూపాక్షున్ని సంహరించాడు. మిగిలిన రాక్షసులను వానరవీరులు హతమార్చారు.

## ఇంద్రజిత్తు

రజోగుణ సముద్భవమైన కామమే క్రోధమునకు కారణము క్రోధాగ్నిచే దహించబడుచున్న రావణుడు. పుత్రుడు, మిత్రులు బంధువులు అమాత్యులు అంతా నశించి పోయారు. అతని కన్నుల నుండి నిప్పులు కురుస్తున్నాయి. పళ్లు పటపటా ధ్వనిస్తూన్నాయి. చేతులు విదల్చబడుతున్నాయి. ఒళ్లు కంపిస్తున్నది.

మేఘనాథా నరవానరుల యందు నీకు ఏల అంతదయ వారిని చంపి రావల్సింది. దృశ్యుడవై కాని, అదృశ్యుడవై కాని సకల శస్త్రాస్త్రములను ప్రయోగించు. నరవానరులను చంపి నీవే నా హృదయ వేదనను తొలగించగలవు. వెళ్లు అని ఆజ్ఞాపించాడు రావణుడు.

ఇంద్రజిత్తు తన యజ్ఞశాలలో ప్రవేశించాడు. రక్తోష్ణీష ధారులైన స్త్రీలు ఋత్వికులై పరిచర్య చేస్తున్నారు. శస్త్రాస్త్రములతో

అగ్నిని అలంకరించారు. నల్లని మేకను స్వయంగా వధించి ఆజ్యము తోను, రక్తమాంసములతోను, అభిచారిక హోమం గావించేడు. అగ్ని వలె జ్వలిస్తూ ఆకాశానికి ఎగిరి మేఘమండలాల చాటు నుండి బాణ వర్షం కురుపిస్తున్నాడు.

ఆకాశం బాణాలు చేత ఆచ్ఛాదితమైనది. ధూమచ్ఛిన్నమైన యుద్ధభూమిలో అంధకారము ఆవరించినది. బాణవృష్టి కురుస్తున్నది ఎట్టి ప్రయత్నం చేసిన మేఘనాథుని యొక్క ఉనికిని గమంచిలేకున్నారు వానరులు.

రామునకు కోపం వచ్చింది. ధనుష్టాంకారం చేసి శరములు విడిచిపెట్టి రావణకుమారుని చంపదల్చారు. ఇది గుర్తించి ఇంద్రజిత్తు లంకకు పారిపోయాడు.

నాల్గుగు వీధులకూడలిలో గల చైత్యవృక్షం క్రింద గల నికుంభిని నిలయం ప్రవేశించి అగ్నిని వ్రేల్చుచున్నాడు. మంటలు మింటికి ఎగిసిపోతున్నాయి. ఒక విధమైన ఉన్మాదము వానిచే క్షుద్ర శక్తులు అనదగిన వరబలంగా భావించాడు. ఇంద్రజిత్తు.

ఇప్పుడు పశ్చిమద్వారం గుండా యుద్ధభూమికి చేరేడు. తన రథంమీద మాయాసీతను నిలిపెను. హనుమదాదులు ఇంద్రజిత్‌ని ఇంగితము అరసి నిజమగు సీతగా భావించి సకల వానరవీరులు ఋక్షశైలాదులు ఇంద్రజిత్తు రథంపై కురిపించారు.

వానరులారా! మీరు చూస్తుండగానే సీతను చంపుతున్నాను. మీ ప్రయత్నం వ్యర్థమైపోతుంది. రామలక్ష్మణులను మిమ్మలను సంహరిస్తాను అని చెప్పి వానరవీరులను మోహపరవసులను చేస్తూ నిశితమైన ఖడ్గాన్ని గ్రహించాడు. " రామ రామ " అని

అక్రోశించుచున్న మాయా సీతను శిరోజములను పట్టి ఖడ్గధారచేత నిలువన తెగవేసాడు ఇంద్రజిత్తు. వానరులు ప్రాణాలను తెగించి యుద్ధం చేసారు. ప్రెక్కురు వానరులను పరిమార్చి ఇంద్రజిత్తు లంకకు చేరిపోయాడు.

అశ్రుపూర్ణముఖులైన వానరవీరులు దైన్యము రూపొంది నట్లుయున్నారు. హనుమంతుని కన్నులనుండి అశ్రువులు జలపాతంల్లా ప్రవహిస్తున్నాయి. ఎందునిమిత్తం యుద్ధం ప్రారంభించారో ఆ సీత నిష్కారణంగా పాపియైన ఇంద్రజిత్తుచేత చంపబడ్డాది. రామునికి ఈ సమాచారము తెల్సింది. మూర్ఛితుడైనాడు. వానరులు అంతా పర్యవేష్టించి యున్నారు.

లక్ష్మణునకు కోపం వచ్చింది. అన్నయ్యా! ధర్మం! ధర్మం అంటూ ఇన్ని అగచాట్లు పడుతున్నావు. ప్రాణముల కంటే మిన్నయైన సీత చంపబడ్డాది. ఏది నీ ధర్మం ఏది అధర్మం రెండూ అబద్ధాలే, ధర్మం జయించాలి. అధర్మం నాశనం చేయ్యాలి. కాని రావణుడు వృద్ధి పొందుతున్నాడు. ధర్మాత్ముడవైన నీవు సర్వవిధాలా కృంగిపోతున్నావు. అర్ధవంతుడే సర్వగుణ సంపన్నుడు కంటికి కానరానీ ధర్మాధర్మాలు చింతించరాదు. ప్రత్యక్షములు అయినచో పంచభూతములవలె స్థావర జంగమాదులవలె గోచరించాలి కదా.

అనుమతించు. సర్వరాక్షస సంహారం చేస్తాను. బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి ప్రపంచంలో అరాక్షసం గావిస్తాను. అన్నాడు లక్ష్మణుడు.

లక్ష్మణా! శాంతించు ఒకరిదోషాన్కి పలువరును పరిమార్చ కూడదు. యుద్ధం చేయనివాని, కనబడనివాని, శరణాగతులగువారిని

పారిపోవువానిని, ప్రమత్తుని చంపడం యుద్ధ ధర్మంకాదు.

గధాపానియగు విభీషణుడు అక్కడకు అరుదెంచాడు. ఎందుకు ఇలా మీరంతా దైన్యం చెందియున్నారు. అటు రాక్షసులు యుద్ధరంగంలో ఆయుధపానులై కోలాహలం చేస్తున్నారు అని ప్రశ్నించాడు.

యుద్ధారంభం వ్యర్థమైంది. సీతను ఇంద్రజిత్తు మేము అందరము చూస్తుండగానే చంపివేసాడు. రామలక్ష్మణులు దుర్భర దుఃఖాక్రాంతులై యున్నారు. అని సుగ్రీవుడు చెప్పాడు.

అంతా మోసం, మాయా, రాఘవులారా! మనలను మోహ పరుచుటకే ఆ మూర్ఖుడు అలా చేసాడు. సీత సంహరింప బడదు సముద్రం ఎప్పుడు ఇంకిపోదు. సూర్యుడు తెగిరాలడు. అగ్నిచల్ల గుండదు. మోహమును విడిచిపెట్టండి ఇది రాక్షసమాయ. అదిగో అటు చూడండి. ఇంద్రజిత్తు రాక్షసులను అంతటా నిలిపి అభేజ్యంగా చేసాడు. చతుష్టతంలో మఱ్ఱిచెట్టు క్రింద నికుంభిలా సమక్షంలో క్షుద్ర మైన యాగం చేయుదల్చాడు. వాడిని అక్కడకు చేరనివ్వకూడదు. యాగం జరుగనివ్వకూడదు. జరిగితే వాడిని జయించుట అసాధ్యం. బ్రహ్మవర ప్రభావంచేత బ్రహ్మశిరము అను అస్త్రాన్ని ధరించి అదృశ్యుడై మనలను నిలువనిస్తాడు. జయిస్తాడు కూడా నాతో వెంటనే లక్ష్మణుని పంపండి సమర్థులైన వానరవీరుడు శాత్రవవ్యూహా న్ని ఛ్ఛేదించాలి. లక్ష్మణుడు ఇంద్రజిత్తుని సంహరిస్తాడు ఆలసించ కండి అని విభీషణుడు ఇంద్రజిత్తు మోసాన్ని క్షుద్ర సంకల్పాన్ని వారిని జయించే ఉపాయాన్ని చెప్పి వేగిరపరచాడు.

రాముని దుఃఖం ఉపశమించింది. లక్ష్మణుడు కవచ, ఖడ్గ ధారియై ధనుస్సు తూణీరములను ధరించి అన్నగార్కి ప్రదక్షణంగా

పాదాభివందనం చేసాడు.

రాముడు లబ్ధవిజయుడవై రమ్మని ఆశీర్వదించాడు. మెరికలవంటి వానరులు వృక్షపాషాణపానులై నఖ, దౌష్ట్రాయుధులై రాక్షసవ్యూహం మీద విరుచకపడ్డారు.

వానర రాక్షసులకు తుములమైన యుద్ధం జరిగింది. రాక్షసులు చెదిరిపోయినారు. తెరపిచూసుకొని లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై వాడిబాణములను ప్రయోగించాడు. సైన్యం చెదరిపోవుట చేత లక్ష్మణుని బాణవేగాన్ని సహించలేక ఇంద్రజిత్తు మఱ్ఱిచెట్టును చేరలేక పోయాడు రథమును అధిష్టించి కదనరంగంలో లక్ష్మణునితో యుద్ధం చేస్తున్నాడు. అప్పుడు కనిపించాడు విభీషణుడు ఇంద్రజిత్తుకి.

నీవు పినతండ్రివా? విభీషణా నీచుడవు. శత్రువులలో చేరిపోయిన అసమర్థుడవు. రాక్షసకులంలో పుట్టి విశ్రవసు వంశానికి అప్రతిష్ట చేసావు. అగౌరవం కల్గించావు. నిన్ను మాత్రం రాముడు చంపకపోతాడా అని నిందించాడు ఇంద్రజిత్తు.

విశ్రవసు బ్రహ్మవంశీయుడవైన నీవు, నీతండ్రి చేసిన ఘనకార్యం ఏమిటి? పరధారాభిమర్శనం, పరద్రవ్యాపహరణము ప్రజాకంటకత్వం ప్రాణిమారణము ఇదే నా ఆ వంశస్థులకు ధర్మము కులంకంటే గుణం ప్రధానం ధర్మాధర్మాలు నీకేం తెలుసు? నన్ను అధిక్షేపించినంత మాత్రాన్న యోగ్యుడవు కాలేవు. వీరుడవై లక్ష్మణునితో యుద్ధంచేసి వీరస్వర్గాన్ని అలంకరించు అన్నాడు విభీషణుడు

పినతండ్రి మాటలకు కోపోద్రిక్తుడైనాడు. లక్ష్మణా! గత రాత్రి యుద్ధంలో మీరంతా ఏమి అయినారో జ్ఞాపకం చేసుకో ఇక మీదట నా తీక్షణసాయకములతో నిన్ను నీ అన్నను చంపగలను

గణాసులైన మీరు ఏమి చేయగలరు అని పలికిన ఇంద్ర
చూసి అదేదో చెయ్యదలచుకున్నది చెయ్యి. దర్పములు ప
మాటలులోకాదు చేతల్లో చూపించు. దొంగచాటున యుద్ధం చే
కూడ ఒక ఘనతేనా? ఇప్పుడు నాముందు నిల్చేవు. ఇక
పోలేవు అన్నాడు లక్ష్మణుడు.

ఇంద్రజిత్, లక్ష్మణుడు బాణయుద్ధం చేస్తున్నారు. పు
పుంఖాంగా బాణాలు ఉభయత్రపడి చీకట్లు అవరింపచేశాయి.
మన్ను కానరావడం లేదు. లక్ష్మణుడు ఇంద్రజిత్ కవ
ధనస్సుని రథాన్ని విరుగకొట్టాడు. తుములమైన యుద్ధంలో
లకు కానరాకుండా తప్పుకొని ఇంద్రజిత్ వేరొక రథంమీద శ
యుద్ధభూమిలో ప్రవేశించాడు.

లక్ష్మణా ఆలసించకు ఇంద్రజిత్ మరణిస్తే మ
వీరులులేరు ఒక్క రావణుడు తప్ప. సాయం సమయమౌతు
అప్రమత్తుడవై ఇంద్రజిత్‌ను సహరించు అన్నాడు విభీషణుడు

యుద్ధం ముమ్మరంగా లోకభీకరంగా సాగుతున్నది
రిక్షంలో దేవతలు, గరుడగంధర్వాదులు, ఋషులు, తిలకిస్తు
ఈ యుద్ధాన్ని.

గజుడు, గవయుడు, గంధమాదనుడు, మైందుడు
జిత్ రథం మీదకు ఉరికారు. రథం విధ్వస్తమైంది. రామా
ధనస్సును సజ్జీకృతం చేశాడు శరమునకు ఐంద్రాస్త్రాన్ని
మంత్రించి సంధించాడు. శ్రీరామచంద్రుడు " ధర్మాత్ముడు
సంధుడైనచో ఈ శరముతో ఇంద్రజిత్ మరణిస్తాడనితలచి
ప్రయోగించాడు ఆబాణం మింటమంటలు రేపుతూ అని వార్య
వచ్చి ఇంద్రజిత్ శిరమును కిరీటకుండలో జ్వలితమైన

నేలపడగొట్టెను. శరీరం భూమిపై పడిపోయినది. దేవతలు సంతోషించి " స్వస్త్యస్తు " అని లక్ష్మణున్ని ఆశీర్వదించారు. వానరులు లక్ష్మణునికి జయజయ ధ్వానాలు చేశారు. వాయువు సుగంధ భరితమై నలుగడలా వ్యాపించింది.

లబ్ధవిజయుడైన లక్ష్మణుడు శ్రీరామచంద్రునికి సమస్కరించాడు. లక్ష్మణ విజయాన్ని ఇంద్రజిత్‌వధని విభీషణుడు రామునికి తెలిపాడు.

సోదరున్ని ఆలింగనం చేసుకొన్నాడు రాముడు. రావణుడు ఇక జయింపబడినట్లే నీవు నాకు, లోకానికి, మహోపకారం చేశావు. అని అభినందించాడు రాముడు.

సుషేసుని పిలిచి క్షతగాత్రులైన వానరులకు చికిత్స గావింపమని చెప్పాడు. సంజీవకరణాది ఓషధీ ప్రభావంచేత వానరులకు సుషేణుడు చికిత్స చేశాడు. సకల వానరసైన్యం సంతోష బల ధైర్యాలు కలిగి మరల యుద్ధకాంక్షులై వృక్షపాషాణాలు సమకూర్చుకున్నారు. రావణునికి ఇంద్రజిత్ వధ తెలిసింది. వజ్రంచేత కొట్టబడిన కొండలా కుప్పకూలిపోయాడు. దుఃఖంచేత మతి భ్రంశమైంది కొడుకు గుణగణాలను పరితాప సామర్థ్యాలను తలచి తలచి దుఃఖించాడు. తనవారంతా హతులైపోయారు దుఃఖం క్రోధంగా మారిపోయినది.

క్రోధాగ్ని శిఖలు నేత్రముల నుండి నాశికం నుండి, నోటి నుండి వెలువడుతున్నాయి. ముఖంవికృతమై భయాన్ని కల్గిస్తున్నది కటపులదురునట్లు పళ్లు పటపటా చప్పుడు చేస్తున్నాయి. ఒళ్లు గాలికి తీగెలాగ ఊగిపోతున్నది. వెంటనే కత్తి మొలనుండి తీసాడు రావణుడు " ఈ మహాసంగ్రామ సంక్షోభానికి సీత కారణమని తెలిసి ఆమెను

అంతమొందించడానికి బయల్దేరాడు. సీతను చంపుతాను. పీడ వదిలి పోతుంది అంటున్నాడు. మతితప్పిన మదగజంలాగ ఘీంకారిస్తూ అశోకవనానికి చేరుకొన్నాడు. ఎందరెందరో అడ్డువచ్చి వారించినా అనివార్యుడై వెళ్లిపోతూ సీతను సమీపించాడు.

అంతట సుపార్శ్వుడు వచ్చి " ప్రభూః విశ్రవసు వంశంలో పుట్టావు. సాంగవేదాధ్యయన పరుడవు. రాజనీతిశాస్త్ర పారంగతుడవు. పరమేశ్వర భక్తుడవు. ఆడదాన్ని చంపుట ధర్మవిరుద్ధం. ఆకోపాన్ని రామునిపై చూపించు. పిమ్మట సీత నీవశం కావచ్చు. ఇవాల ఫాల్గుణబహుళ చతుర్దశి రేపు అమావాస్య రేపటి యుద్ధంలో విజయం సాధిస్తావు. అని మందలించాడు సుపార్శ్వుడు. సీత తన భవిష్యత్ తలంచుకొనే లోపలనే రావణుడు లంకకు చేరి సింహాసనాన్నలంకరించాడు.

వెళ్లండి రామున్ని జయించండి మూలబలం అంతఒక్కటి అయి కదిలివెళ్లి రామలక్ష్మణులను చంపండి అదేశించాడు రావణుడు తన వారలతో.

ఒక ఏనుగు, ఒక రథము, మూడు గుర్రాలు, ఐదుగురు సైనుకులు కలసి పత్తి అనబడుతుంది. మూడు పత్తులు ఒక సేనా ముఖం. మూడు సేనా ముఖములు ఒక గణం. మూడు గణములు ఒక వాహిని. మూడు వాహినులు ఒక పృతన, మూడు పృతనలు ఒక చెమువు అని చెప్పబడుతుంది. పదివేల ఏనుగులు, పదివేల రథాలు పద్దెనిమిదివేల గుర్రాలు, రెండువందల వేల కాలిబలం రామునితో యుద్ధానికి తలపడింది.

మండలీకృతచాపుడై రాముడు శరవర్షమును కురిపించి గాంధర్వాస్త్రమును ప్రయోగించాడు. అందరకు అందరిరాములుగా

గోచరించి పరస్పర యుద్ధంచేసి పగటి ఎనిమిదవ కాలంలో సంహారింపబడ్డారు. చావగా మిగిలినవారు రావణుని దగ్గరకు పరుగెత్తారు రావణునికి ఈ దుర్వార్త తెలియజేసారు.

రావణునకు శోక, క్రోధాలు ఇనుమడింపగా చింతాక్రాంతుడై నాడు. సర్వం నశించింది. బంధుపులు—మిత్రులు, అమాత్యులు—సోదరులు, బలగం అంతా నశించింది. రక్షోబలం నశించినవార్త స్త్రీ లోకానికి తెలిసింది. స్త్రీలు, తమతమ పుత్రులను, మిత్రులను భర్తలును, పితరులను, అన్నదమ్ములను, బంధుజనులను గూర్చి మరణం పొందినట్లు విని దుర్భర దుఃఖాక్రాంతులైనారు.

చిత్రాంగియైన శూర్పనఖ మూలంగానే జనస్థానం హతస్థానమైంది. లంకానగరం హతస్థానమైంది. మనం అనాథలం. దిక్కులేనివారలమైనాము అని రోధించారు.

వారి రోధనలు రావణుడు విని క్షణకాలం ఆలోచించి కోపంతో దంతములతో ఓష్ఠములను కొరికాడు. ముఖం వికృతమైంది, కనులు బొమలు వికృతం చెందాయి. సమీపస్థులగు రాక్షసులను చూసి మన నగరిలో ప్రతియింట గల మగపురుగును సహితం యుద్ధానికి ఆయుత్త పరచండి అని పలికాడు. రథంపై శస్త్రాలునింపి ధృఢమైన ధనస్సునుచేత ధరించి రథారోహకుడై ఉత్తరద్వారానికి చేరుకొన్నాడు రావణుడు. ధనస్సు నుండి విరివిగా బాణాలు ప్రయోగిస్తున్నాడు. వానరులు యథాశక్తిగా పోరాడు చున్నారు. యుద్ధరంగం బీభత్సముగా, భయానకంగా ఉంది. కంక, గృధ్ర, గోమాయువులు, మాంస శోణితాలను భుజిస్తూ వికృతంగా అరుస్తున్నాయి. ఆయుధాలను ధరించిన కబంధాలు ఎగురుచున్నాయి. రక్తవాహినులలో కళేబరాలు కొట్టుకుపోతున్నాయి.

రావణుని ఎడమభుజము, నేత్రం అదరుచున్నవి. ఎదురు గాలివీచి ధూళికన్నుల చెదరగొట్టుచున్నది. పక్షులు వికృతంగా అరస్తున్నాయి. శకునాలను ఆలోచించే సమయం కాదిది. కంటబడిన ప్రతి వానరవీరుని బాణప్రహారములతో నొప్పిస్తున్నాడు రావణుడు.

శ్రీరాముడు కోదండపాణియై అంతట తానే అయి రాక్షస సైన్యాన్ని నాశనం చేస్తున్నాడు. జాంబవంతుడు బల్లూకాదులతో రక్కసుల నుక్కడగించు చున్నాడు. విభీషణుడు తన అనుచరులతో రాక్షసుల్ని హతమారుస్తున్నాడు. లక్ష్మణుడు వానరవీరులతో కూడి మహోదర, మహాపార్శ్వ, అతికాయ, మహాకాయుల రాక్షసవీరుల తలలు తాళఫలముల్లాగ తన బాణములతో నేలపడవేస్తున్నాడు.

రావణుడు ధృడమైన రథాన్ని అధిరోహించాడు. జవనాశ్వములను సారథి నేర్పుగా నడుపుతున్నాడు. మనుజ ముఖకేతనం రథంమీద ఎగురుచున్నది. పరశు, ఖడ్గ, కుంత, ముసల, ముద్గర శక్తి, తోమర. గదాద్యాయుధాలు రథముపై నిడుకొనిధనుర్ధారియై రావణుడు శరవర్షాన్ని వానరవీరులపై కురిపిస్తున్నాడు.

లక్ష్మణుడు ఎదురు అయినాడు. క్రూర నారాచములను ఒకరిపైనొకరు పుంఖాను పుంఖముగ కురిపిస్తున్నారు. విభీషణుడు వానరుల ప్రోత్సహించుట రామలక్ష్మలకు సహకరించుట రావణునకు సహింపరానిదైనది. "ముందు వీడ్ని పట్టుపెడితేగాని కార్యం కాదు" అని నిశ్చయించాడు. విభీషణునిపై బాణ ప్రయోగం చేస్తున్నాడు. లక్ష్మణుడు తన శరములతో వారిస్తున్నాడు. రావణుడు తన రథమునుండి తీవ్రమైన 'శక్తి' అనే ఆయుధమును తీసి విభీషణుని ఉద్దేశించి ప్రయోగించాడు. లక్ష్మణుడు వేగవంతుడై దానిని నడిమికి విరిచివేసాడు,

రెట్టించిన కోపంతో రామానుజునిపై వడిగల వేడిబాణములు ప్రయోగించాడు రావణుడు. ఉచ్ఛ్వాస నిశ్వాసములకు కూడ అవకాశములేని ఆ బాణముల తాకిడి సహించలేక పోయాడు లక్ష్మణుడు. వెంటనే శ్రీరామచంద్రుడు తన కోదండమునుండి క్షుర అర్ధచంద్ర భల్లాది బాణముల ప్రయోగించాడు. రావణుని ధ్వజం కూలింది. రథం భగ్నమయింది. అశ్వములు నశించాయి. అష్టఘంటాసమన్విత మైన వేరొక శక్తిని లక్ష్మణునిపై ప్రయోగించాడు రావణుడు. వివిధ శరములతో అవరోధము కలుగచేసినను ఆ శక్తి శగలురేపి మంట లెగసి ఘంటాధ్వనులుకలిగి సకల భూతభీతావహంగా లక్ష్మణుని వక్షస్థలము తాకింది. సమ్మోహితుడై కదనరంగమున పడిపోయాడు.

శ్రీరాముడు లక్ష్మణుని అవస్థను గాంచినాడు క్షణకాలం మనస్సున చింతించాడు. వేగవంతుడై అసనికల్పములైన భాణములు ప్రయోగించాడు. రావణునికి యుద్ధరంగంలో కాలు నిలువలేదు. ఊపిరి అడలేదు. సంధులు శిధిలాలైనాయి. ఇక నిలుపలేకపోయినాడు రావణుడు లంకకు పరుగెత్తినాడు.

సకల వానరవీరులు రామలక్ష్మణులను పరివేష్టించారు. లక్ష్మణుని అవస్థచూచి రామునికి కన్నీరు మున్నీరైంది. తన జీవితములో తను, తనను అనుసరించిన వాళ్లుపడిన కష్టాలన్ని జ్ఞాపకానికి వచ్చాయి. ఏమి చేయగలడు. మనుష్యమాత్రుడు చేయతగిన, సహించదగిన వీర్యస్థైర్యాలుచూపి నిస్పృహకులోనవుతునాడు హతాసుడౌతునాడు

లోకంలో భార్యలు బంధువులు అంతటా లభిస్తారు. ఏ దేశములోనైనా రక్తస్పర్శ కలిగిన సోదరులు లభించరు.

సౌమిత్రి విషయమై ప్రశ్నించిన తల్లులకేమి సమాధానం చెప్తాను? బహిఃప్రాణంవంటి ఈ లక్ష్మణుని దురవస్థనెట్లు సహించు

గలను? ఇలా విచారిస్తున్నాడు రాముడు.

సుషేణుడూ, విభీషణుడూ, లక్ష్మణుని పరిశీలించి ప్రభూ! విచారించకండి. యుద్ధాలు ప్రాయఃకష్టనష్టాలు స్వపక్ష, శత్రుపక్షాలకూ కష్టనష్టాల్ని కలిగిస్తుంటాయి. తమకు తెలియనిదేముంది? లక్ష్మణుని ప్రాణాలు పోలేదు. ముఖం వికాసంగానే ఉంది. గుండెలు కొట్టుకుంటూనే ఉన్నాయి. తగిన చికిత్స కావాలి అన్నాడు సుషేణుడు. రాముడు వెంటనే ఆంజనేయుని మరలా సంజీవిని తీసుకొని వచ్చి ఈ విపత్సముద్రాన్ని దాటించమని పలికాడు. వెంటనే స్వామికి నమస్కరించి వేగవంతుడై బలవంతుడగు హనుమ హిమవన్నగము చేరి అక్కడనుండి కైలాస – వృషభ పర్వతముల నడుమనున్న ఓషధీ పర్వతాన్ని సునాయాసంగా తీసుకొని వచ్చి స్వామిమ్రోల నిలిపాడు. సుషేణుడు సంజీవ, సంధాన, విశల్య, సాకర్ణ్యకరుణులను ఓషధుల గ్రహించి లక్ష్మణునికి చికిత్స గావించాడు. లక్ష్మణుడు తన కన్నులు తెరచి సమీపానగల అన్నను వానరవీరులను చూశాడు. రాముడు ఆనందముతో లక్ష్మణుని ఆలింగనం చేసుకొన్నాడు. సుషేణుని శ్లాఘించాడు

అన్నయ్యా! నేటి సూర్యాస్తమయం లోపల రావణుని చంపుతానని ప్రతిజ్ఞ చేయుము. రావణుని తల నేలపడినగాని వానరులకు, సీతకూ–నాకూ ఎవరికీ శాంతిలేదు. ఆలసించకు ఇక రావణుడు కదన రంగంలో మరణించితీరాలి. అని పలికిన లక్ష్మణుని మాటలాలించి శ్రీరామచంద్రుడు ధనుర్ధారియై నేటి సూర్యాస్తమయం లోపల రావణుని సంహరించి అందరికీ శాంతిని చేకూరుస్తానని ప్రతిజ్ఞచేశాడు.



# పౌలస్త్య వధ

సముద్ర ధ్వనివంటి ధ్వని ఆకాశము నుంచి వినిపించింది. క్రమంగా అది ప్రావృట్కాల ఘూర్జాను కారియైంది. వానరులు రామలక్ష్మణులు ఆకాశంవంక చూశారు.

తొలుత చిన్న నక్షత్రంలా కన్పించి పిమ్మట ఉదయ సూర్యునిగా ప్రకాశించింది చివరకు సహస్ర కిరణాలు గల సూర్యునిగా తోచింది ఆ రథం పచ్చని గుర్రాలు పూన్చబడ్డాయి. వైజయంతీ ధ్వజశోభితమైంది. స్వర్ణకాంతులచే అది దిక్కులను ప్రకాశింప చేస్తున్నది. ఛత్రచామరాలంకృతమైనది. శరాసన, శక్తి, కుంత, తోమరాద్యాయుధాలు కలిగి మాతలిచేత సమానీతమైనది ఆ రథం.

ప్రభూః శ్రీరామచంద్రాః నేను ఇంద్రసారథిని మాతలిని. ఇంద్రుడు ఈ రథాన్ని ఆయుధాల్ని పంపించాడు. దీనిని అధిష్టించి శత్రువగు రావణుని జయించండి. అని వినయంతో ప్రాంజలియై మాతలి పలికెను.

రాముడు సంతసించి ఆచమించి రథమునకు ప్రదక్షిణ నమస్కారం గావించి స్యందనము నధిరోహించాడు. కార్ముకాన్ని సంధించాడు ఎదుట రథస్థుడైన రావణుడు కన్పించాడు.

రావణునికి తనకు జీవితం సార్థకమగు సమయం ఆసన్నమైనదని తలంచాడు. శౌర్యపరాక్రమాలు నిరూపిస్తూ రథవేగం గల రావణుడు రాముని ఎదుర్కొన్నాడు.

రాముని ఆజ్ఞచేత మాతలి రథాన్ని రావణ రథానికి అపసవ్యముగా ప్రదక్షిణ గావింపజేసినాడు. తక్షణమే రావణ రథంపైన

రక్తపుజల్లులు కురిసాయి. ధ్వజంపై కంక, గుధ్ర మండలాగ్రమునే ఎగురుతున్నాయి. గురర్రములు అశ్రువులు చిందించాయి. భూమి చలించింది.

రథస్తులైన రామ రావణులను చూచి సకల భూతకోటి సంచలించింది. విశాఖ నక్షత్రాన్ని అంగారకుడు ఆక్రమించాడు. వాయువు స్థంభించింది. వానర రాక్షసులు చిత్రార్పిత ప్రతిమల్లాగ యుద్ధంమాని రామ రావణ యుద్ధం చూస్తున్నారు.

ఓరీ రావణా! నేను లేనిసమయాన జానకిని తోడ్కొని వచ్చిన చోరుడవు నీవు శూరుడవెట్లుకాగలవు? అబలలపై అత్యాచారము జరిపిన ప్రమత్తుడవు నిన్నుచంపి ముల్లోకాలకు మేలుకలుగ జేస్తాను. దేవర్షిసంఘములు, సాధుసత్పురుషులు గోబ్రాహ్మణులు సుఖిస్తారు. ఇక మీదట పరాక్రమించి నీ యుద్ధకౌశలాన్ని ప్రకటించు. అని ములుకులవంటి వాడియైన మాటలు పలికి రాముడు రావణునిపై శరవర్షం కురిపించాడు.

రావణుడు వజ్రతుల్యములైన బాణములు ప్రయోగించి రాముని నొప్పింప చూస్తున్నాడు. రామ రావణుల శరపరంపర చేత ఆకాశము ఆచ్ఛాదితమైనది. అంధకారం వ్యాపించింది.

రౌద్రాస్త్రాన్ని ప్రయోగించాడు రావణుడు అదిమింటను మంటలను వ్యాపింపజేస్తూ సింహ, శరభ, శార్దూల, వృక, వృశ్చిక ర్పముఖ, ఉల్కాముఖ, బడబాముఖ, పిశాచముఖ, కంకముఖాది ణాలు అంతటా వ్యాపించాయి.

సౌరాస్త్రం ప్రయోగించి రాముడు ఆ అస్త్రాన్ని వారించాడు ని మంటలు రేపుతూ అగ్నిలోని మిడుతల్లాగ రాక్షసులు నుసి నుసి

అయిపోయారు. వరుణ, వాయు, అగ్ని, ఇంద్ర, గరుడ, గంధర్వాది అనేక అస్త్రాలు పరస్పరం జయేచ్ఛ చేత రామ రావణులు ప్రయోగించుకొన్నారు. అవి అంతటా పొగలు, మంటలు, మినుగురులు, గాలి వ్యాపింపజేశాయి. రావణుడు శూలాన్ని చేత ధరించాడు. అది బహు గంటా సమన్వితమై ధ్వనిస్తున్నది. కాలాగ్ని జ్వాలా సదృశమై దేవదానవ తిర్యగ్మనుష్యాదులకు అనివార్యమైన దానిని రావణుడు రామునిపై ప్రయోగించాడు.

రాముడు సమర్థమైన బాణములను ప్రయోగించి వారింప చేస్తున్నాడు. హాహా కారాలు చేస్తూ ఆ శూలం రాముని మీద పడబోతున్నది. రథస్థమైన ఇంద్రదత్తమైన శక్తిని గ్రహించాడు రాముడు.

వెంటనే దానిని ప్రయోగించాడు. శూలము వమ్ము అయింది. రావణుడు మండిపడ్డాడు రామునిచే ప్రయుక్తములైన నారాచములు రావణునిపై పడుతున్నాయి. రావణుడు బాణపాతాన్ని సహించలేక రథస్తంభాన్ని ఊతగాగొని చేష్టనుడిగి నిలచిపోయాడు. సారధి రథాన్ని వేగంగా రణరంగంనుండి వెనుకకు మరలించాడు. రక్కసులు భీతులైనారు. రావణునికి స్పృహ కలిగింది. రథం రణభూమి నుండి తొలగించబడింది.

సారథీ! రథాన్ని యుద్ధభూమి నుండి తప్పించి సన్నసమర్థుని చేశావు. నా శౌర్యపరాక్రమాలకు అవమానం కలిగించావు. నాకు యుద్ధతృష్ణ తీరలేదు. వెంటనేరథం రణభూమికి మరలించు అన్నాడు రావణుడు ఉద్వేగంతో.

ప్రభూ! సారధి ధర్మాన్ని పాటించాను. రథికునకు కష్టంకల్గినపుడు స్పృహ తప్పినపుడు కాపాడడం సూతధర్మం. మిమ్ములను

అసమర్థునిగా తలంచలేదు ప్రభూ అన్నాడు సారథి వినయంతో. సంతోషం.

ఇదిగో ఈ రత్నకంకణం గ్రహించి రథం త్వరగా మరలించు యుద్ధభూమికి అన్నాడు రావణుడు.

రథం మరల యుద్ధభూమికి చేరుకొంది. యుద్ధభూమిలో సుగంధ భరితమైన చల్లగాలి మెల్లమెల్లగా వీస్తున్నది. రాముని మనస్సున ఉల్లాసం కలిగింది. అగస్త్యుడు సాక్షాత్కరించాడు.

రామా: ఇది ఆదిత్య హృదయం దీనిని జపించి రావణుని జయించు అని ఉపదేశించాడు అగస్త్యుడు.

రాముడు సుచియై మూడు పర్యాయములు ఆచమించి చేతులు జోడించి మనస్సును సూర్యునిపై లగ్నం చేశాడు.

" నమః పద్మప్రభోదాయ మార్తాండాయ నమోనమః "
" బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాదిత్యాయ వర్చసే "

ఇత్యాది మంత్రములు జపించాడు. ఆపదలందు, అడవులందు, కష్టములందు, నష్టములందు, శత్రువిజయమందు ఈ ఆదిత్యహృదయం జపించువానికి సకల శుభాలు కలుగును. సకల బాధలు తొలుగుతాయి అగస్త్యోపదిష్టమైన ఆదిత్య హృదయం జపించాడు రాముడు.

అంతరిక్షం నుండి సూర్యుడు రామునుద్దేశించి రావణుని జయించి విజయం పొందుము అని ఆశీర్వదించాడు. రాముడు ఇంద్రదత్తమైన శరాసనాన్ని ధరించాడు. రామరావణులు తిరిగి యుద్ధాన్ని ప్రారంభించారు. వారి యుద్ధం నిరూపమానమైంది. సముద్రానికి సముద్రమే ఉదాహరణము ఆకాశమునకు ఆకాశమే

ఉదాహరణము. వేరొక దృష్టాంతంలేదు. అటులనే రామరావణ యుద్ధం రామరావణ యుద్ధంలాగే ఉంది.

" స్వస్తిగోబ్రాహ్మణేభ్యస్తు లోకాతిష్టంతు శాశ్వతాః " జయతాం రాఘవసంఖ్యే రావణం రాక్షసేశ్వరం " అని దేవతలు ఋషులు, గరుడ గంధర్వ, కిన్నెర, కింపురుషాదులు ఆకాశం నుండి పలుకుతున్నారు. యుద్ధం దిదృక్షాతత్పరులై సకలభూతాలు రూపు కట్టి నిరీక్షిస్తున్నాయి.

రావణ ప్రయుక్త శరపరంపరలకు రాముడు రక్తసిక్త గాత్రుడై పూచిన మోదుగులాగ కన్పిస్తున్నాడు. సవ్యాప సవ్యము లుగా బాణములు ప్రయోగిస్తున్నాడు. ఆకర్షణ, వికర్షణ సంధాన ప్రయోగములు తృటిలో జరిగిపోతున్నాయి. రావణ శరీరం నుండి రక్తం ధారాపాతంగా ప్రవహిస్తున్నది. అయిన బాణ ప్రయోగం జరుగుతునే ఉన్నది.

రాముడు తీవ్రశరము నొక దానిని ధనస్సునకు సంధించి ఆకర్ణాంతం ఆకర్షించాడు. రావణుని కంఠం లక్ష్యంచేసి ప్రయోగిం చాడు, జ్వలిత మకుటకుండల మండితమైన రావణుని మస్తకం సకల వానరరాక్షసులు చూస్తుండగా తెగి క్రింద పడిపోయింది.

ఆ కంఠంపైనే వేరొక శిరస్సు మొలచింది. అది వికటాట్ట హాసం చేస్తున్నది. వేరొక తీక్షబాణంతో రాముడు దానినికూడా ఛేదిం చాడు. తక్షణమే మరియొక శిరస్సు మొలచింది. నిశిత సాయకంతో దానిని కూడా తెగవేశాడు. వెంటనే మరల మరియొక తల మొలచి హట్టహాసం చేసింది.

రాముడు నిర్విణ్ణుడైనాడు. ఎల్లరు ఆశ్చర్యము పొందు

తున్నారు. రాముని శరీరంలో స్వేదం పొడచూపింది.

మాతలి రామునికి నమస్కరించి ప్రభూ! ఆలసించకండి. బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించండి అని పలికాడు. రాముడు ధనస్సునకు శస్త్రాన్ని సంధించాడు. బ్రహ్మాస్త్రాన్ని సవైదికంగా అభిమంత్రించాడు. బ్రహ్మనిర్మితము, అగస్త్యదత్తము, త్రైలోక్యమారకము హరిభయంకరము అగుదానిని శ్రీరామచంద్రుడు రావణుని ఉద్దేశించి ప్రయోగించాడు. అది జ్వాలామాలికలా నలుదిశలా వ్యాపింపజేస్తున్నది. ప్రళయాగ్ని సదృశమైనది. సకల లోకభయంకరమైనది ఆ బ్రహ్మాస్త్రం. రావణుని వక్షస్థలాన్ని ఛేదించింది. పాతాళంలో ప్రవేశించింది. అంతవేగంతో మరల రాముని తూణీరంలో ప్రవేశించింది.

రావణుడు ప్రాణాలను కోల్పోయినాడు. రథంనుండి భూమిపై పడిపోయినాడు. రాక్షసులు భయంతో పరుగెత్తారు. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. చల్లని గాలులువీచి శరీరానికి సుఖస్పర్శ కలిగించాయి. దిక్కులు ప్రకాశించాయి. మహర్షులు " స్వస్థ్వస్థు " అని పలికారు. సకల ప్రాణులు సంతోషించాయి.

సకల వానరులు సుగ్రీవాంగద జాంబవద హనుమదాదులు రాముని పరివేష్టించి శ్రీరామచంద్రునికి జయమని జేజే ధ్వానాలు చేశాయి. దిక్కులు విదిక్కులు, పర్వతములు రామునికి జై అంటూ ప్రతిధ్వనించాయి. సాగరంకూడా విజయధ్వానం చేసింది. అంతటా పుష్పవర్షం కురిసినది.

విభీషణుడు అన్న మృతదేహాన్ని సమీపించాడు. అతని హృదయంలో దుఃఖకెరటం ఉవ్వెత్తుగా లేచింది. తత్ఫలితంగా కన్నులనుండి అశ్రువులు స్రవించాయి. ఎంతయినా అన్న కదా! రక్తస్పర్శ దుఃఖోద్వేగాన్ని భరించ లేకపోయినాడు. " అన్నయ్యా! " అని

బిగ్గరగా రోధిస్తూ అతనిపై పడిపోయాడు.

త్రైలోక్యసంపదలను అనుభవించావు. త్రిదశులలోగొన్నావు సకల ప్రాణుల శాసించావు. తపస్సుచే పరమేశ్వరుని, పరిమేష్టిని మెప్పించావు. సకల వరాలు పొందావు కానీ నారీచౌర్యం, పరహింస మోసం, త్రాసం, వీటితో బ్రతుకంతా వెళ్లమార్చావు. అందువల్ల త్రిలోకకంటకుడవయ్యావు. నేనుచెప్పిన మాటలను ఆలించక పరదారా హరణంచేసి ప్రాణంమీదికి తెచ్చుకొన్నావు. లోకంలో స్త్రీకృతమైన వైరం ప్రాణాపాయం కలుగజేస్తుందని విలపించాడు.

రాముడు విభీషణుని సమీపించాడు. మిత్రమా! వీరమరణం చెందిన రావణునకు ఉత్తర కార్యములు చెయ్యవలసిందని ఆజా పించాడు. వార్త అంతఃపురం చేరింది.

రాక్షసస్త్రీలు ముక్తమూర్ధజులై రోధిస్తూ ఉత్తరద్వారం నుండి వెలువడ్డారు. రణభూమిలో ప్రవేశించారు. అంతటా పీనుగుల పెంటగా ఉంది. రావణుని సమీపించారు. ముగ్ధకంఠులై బిగ్గరగా రోధిస్తున్నారు. రావణుని గుణగణాలను శౌర్యప్రతాపాలను స్నేహాభి మానలకు పలవించి పలవించి దుఃఖించారు. సుత, భ్రాత, పిత బంధువుల యుద్ధంలో వీరమరణాన్ని పొందిన వారిని గూర్చి రోధించారు.

మండోదరి మూర్తీభవించిన శోకదేవతలా పరుగెత్తుతూ వచ్చి రావణుని మృతశరీరంపై తెగిన లతవలె పడిపోయింది. రావణునితో సర్వసుఖాలు పంచుకొన్నది. దుఃఖం ముంచుకొచ్చింది. ఏడ్చింది గుండెలు మోదుకొంది.

ముల్లోకాలు జయించిన రావణుడు, మనుష్యమాత్రుని చేత

చంపబడ్డాడు. ఎంతటి శక్తివంతుడైన, పరదారాభిమర్శనం మరణానికి కారణమన్న మాట.

" నేను, విభీషణుడు, కుంభకర్ణుడు, మాల్యవంతుడు, ఎవరు ఎన్ని విధాల చెప్పినా నీ దుష్కృత్యాన్ని విడువలేకపోయావు. సీత మహాసాధ్వి. ఆమె పాతివ్రత్యం నిన్నింతకు తెచ్చింది. జనస్థానకథ మారీచ-సుబాహులవధ, దేవాంతక - నరాంతకుల వధ, కుంభకర్ణవధ చేసిన రాముడు మనుష్యమాత్రుడు కాదు. మనుష్యరూపం దాల్చిన శ్రీమన్నారాయణుడు. శిష్టరక్షణ దుష్టశిక్షణ కోసం లక్ష్మీనారాయణుడు సీతారాములై అవతరించారు. గరుడ-గంధర్వాదులు, వానరభల్లూక రూపాలతో ప్రభవించారు.

నీవు మరణించగ రాక్షసులు యుద్ధంలో కూలిపోవగా దేవతలు, ఋషులు, సత్పురుషులు, సాధుపుంగవులు సంతోషించారు. ధర్మం నిలదొక్కుకుంటుంది. ఇంత తెలిసిన నేను ఎన్ని విధముల చెప్పినా వినిపించుకోనక మాకు ఇట్టి దురవస్థను కల్గించి వీరస్వర్గాన్ని అలంకరించావు. ఎవరిసన్నా ఏమి ఫలితముంది? " శుభకృతు శుభమాప్నోతి, పాపకృత్ పాపమశ్నుతే '' ఎవరుచేసిన సుకృతదుష్కృతములకు వారు అనుభవించితీరాల్సిందే.

ఈ విధంగా దుఃఖిస్తున్న మండోదరిని రాక్షసస్త్రీలు అనునయించ వలసినదిగానూ అనంతకరణీయం గావించ వలసినదని రాముడు విభీషణునికి తెలిపాడు.

రామచంద్రా! వీడు ధర్మభ్రష్టుడు, క్రూరుడు, స్త్రీలోలుడు పరమపాపి అగు ఈతడు పూజార్హుడుకాడు అని విభీషణుడు రామునితో విన్నవించెను.

విభీషణా "మరణాంతాని వైరాణి" వీనియందు వైరబుద్ధి తగదు. మహాపరాక్రమవంతుడు వేదవేదాంగ నిష్ణాతుడు వీరమరణం చెందాడు. కనుక వీనికి ఉత్తరక్రియలు నిర్వర్తించు అని రాముడు ఆదేశించాడు.

విభీషణుడు స్త్రీ జనాన్ని అనునయించి రావణుని మృత దేహాన్ని శిబికయందుంచి చందనకాష్టాదులతో చితినిపేర్చి సమంత్రకంగా దహనం చేశారు. అనంతరం తిలలు దర్భలుచేత గ్రహించి రావణునికి ఊర్ధ్వగతికిని ఆత్మశాంతికి తర్పణాదులు గావించాడు. అంతఃపుర అవరోధజనాన్ని నగరిలోకి పంపించాడు. అర్థ్రవసనుడై రామలక్ష్మణుల సాన్నిధ్యానికి చేరుకొన్నాడు విభీషణుడు.

దేవతలు, ఋషులు, గరుడ, గంధర్వ, కిన్నెర కింపురుషాదులు యుద్ధదర్శన లాలసులై వచ్చిన వారంతా వారివారి విమానాలమీద తమతమ లోకాలకు వెళ్లిపోయారు. దారిలో రామ రావణ యుద్ధ విశేషాదులు, హనుమదాదుల శౌర్యపరాక్రమాలు విభీషణుని సౌచివ్యాన్ని, లక్ష్మణుని పరాక్రమాన్ని మెచ్చుకొంటూ వెళ్లిపోయారు.

మాతలిని గౌరవించి దివ్యరథాన్ని తిరుగ ఇంద్రునికి పంపించారు. సుగ్రీవుని, విభీషణుని అభినందించాడు రాముడు. స్వామి లక్ష్మణుని చూసి పరమోపకారుడు, భక్తుడు, మహనీయుడగు విభీషణుని లంకకు చేర్చి మంత్రిపౌరజన సమక్షంలో పట్టాభిషేకం గావించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

లక్ష్మణుడు వానరవీర సహాయంతో సముద్రోదకముల సువర్ణకలశలతో రప్పించి విభీషణుని దివ్యసింహాసనంపై అధిష్ఠింప చేసినాడు. రామాజ్ఞచేత పౌరజన సమక్షంలో మంత్రి పురస్సరంగా

లంకానగరానికి రాజుగా అభిషేకించాడు. పౌరులు, మంత్రులు సామంతులు, విభీషణునికి జేజే ధ్వానాలతో అభినందించారు. ఎల్లరు విభీషణునిచేత సర్వవిధాలా సత్కృతులైనారు.

మాల్యగంధ, మోదకాక్షతాదుల, బంగరు పళ్లెరంనింపి సకల పరివారంతో విభీషణుడు శ్రీరామచంద్రునికి సమర్పించాడు. వానరుల హితమునుకోరి వాటినన్నింటిని రాముడు ప్రతిగ్రహించాడు పిమ్మట హనుమంతుని చూచి.

హనుమన్నా వైదేహికి మన విజయాన్ని తెలియజేయుము రావణవధ, విభీషణుని పట్టాభిషేకం జరిగినట్లు తెలుపవలెను. అని రాముడు హనుమంతునితో పలికెను.

భక్తాగ్రేశ్వరుడైన హనుమంతుడు లంకానగరిలో ప్రవేశించాడు. సకలరాక్షసులు తన్నుపరివేష్టించి అభివందనాలు చేస్తున్నారు

## అయోధ్యాగమనం

హనుమంతుడు అశోకవనం చేరకొన్నాడు. వృక్షచ్ఛాయలో సీతాదేవి నిరానందయై దర్శనమిచ్చింది. ప్రాంజలియై నమస్కరించాడు హనుమంతుడు.

అమ్మా! జానకీ! కుశలీ రాముడు లక్ష్మణ సమేతుడై నీ క్షేమాన్ని కోరారు. విభీషణుని మంత్రాంగమున సుగ్రీవునిసహచర్యాన లోకోత్తరుడైన శ్రీరామచంద్రుడు రావణుని కదనరంగంలో సంహరించాడు. వానరుల సహాయంతో సముద్రానికి సేతువుకట్టి సకలవానర వీరులతో రామలక్ష్మణులు లంకలో ప్రవేశించారు. తీక్షమైన బాణాలతో రక్కసిమూకను సంహరించాడు. రావణ, ఇంద్రజిత్, కుంభకర్ణాదులను

సంహరించి విజయుడైనాడు శ్రీరామచంద్రుడు.

లంకానగరానికి విభీషణుని అభిషిక్తుని చేశాడు. ఈ శుభ వర్తమానం తమకు తెలియజేయ వల్సినదిగా స్వామి నన్ను పంపించారని హనుమంతుడు సీతాదేవితో మనవి చేశాడు.

సీతాదేవి వార్త విన్న వెంటనే లేచి నిలబడింది. అవాక్కయి కన్నుల భాష్పాలు రాల్చింది.

అమ్మా! నేను రామదూతను. నాతో ఎందుకు మాట్లాడవు? అచిరకాలంలోనే శ్రీరామచంద్రుని దర్శించ గలవు. నీ దుఃఖం ఇంతటితో అంతమైనదని హనుమంతుడు పలికాడు.

నాయనా! హనుమన్నా! నీవు తెలిపిన వార్తకు సంతోషం పట్టలేకపోయి నోట మాటరాలేదు. నా ఆనందం అవధులు తప్పింది. నీవంటి లోకోత్తరచరిత్ర ఎవరికి ఉంటుంది. నా ప్రాణాలను నిలిపి దుఃఖసాగరం నుండి దరిచేర్చావు. నీవు చేసిన ఉపకృతికి ప్రత్యుపకారము ఏమి చేయగలను. దయ, దాక్షిణ్యం, పౌరుషం, పరాక్రమం సమయస్ఫూర్తి, విద్య, విజ్ఞానం, జవసత్వాలు ప్రపంచంలో నీకు తప్ప ఎవరికీ లేవు. గ్రహణం, ధారణం, మరణం, ప్రతిపాదనము ఊహ, అపోహ, విజ్ఞానము, తత్వజ్ఞానము, వాచకములై ఈ ఎనిమిది అంగములు కలిగి మనస్సునకు ఆనందం కలిగించేటివంటి నైపుణ్యం నీకే కలదు. ధనధాన్యాది సంపదలు త్రిలోకాధిపత్యం సర్వస్వం నీకు ఒసగినను నీవు చేసిన మహోపకారానికి ప్రత్యుపకారం కానేరాదు ఇలా సీత పలుకుచునే ఉన్నది.

అమ్మా! నీవు సెలవిచ్చినవన్నీ శ్రీరాముని సాన్నిధ్యంలోనే లభిస్తాయి తల్లీ. నాకింకేమి కావాలి. సెలవియ్యి. ఇంతవరకు నిన్ను

పీడించిన ఈ రక్కసిమూకను చీల్చి చెండాడుతాను అన్నాడు అక్కడ ఉన్న రాక్షస పరిజనాన్ని చూస్తూ ఆంజనేయుడు.

నాయనా! వద్దు వద్దు. వారి తప్పేమియులేదు. రాజాజ్ఞ పాలించారు. కష్టాలను అనుభవించవల్సిన నా దురదృష్టంచేత అనుభవించాను. సహజంగా వారురక్కసులు వారిస్వభావమే అంత. పైగా రావణుని ఆజ్ఞ స్వభావాన్ని దోషంగా పాటించ నక్కరలేదు. వారి యందు దయ చూపడమే ఉత్తమమైన ధర్మం అని పలికిన సీతాదేవి దయాదాక్షిణ్యాలను మెచ్చుకొన్నాడు హనుమంతుడు.

స్వామిని దర్శించ కుతూహలం కలిగియున్నదని సీత హనుమంతునితో పలికెను.

హనుమంతుడు త్వరితుడై వచ్చి శ్రీరామచంద్రునికి నమస్కరించి జానకి కుశలమై ఉన్నదని తమ దర్శనం అపేక్షించుచున్నారని తెలియజేసెను. ఈ యుద్ధమంతా ఆమె చెరవిడిపించుటకే కదా! ఆమెను అనుసయించుట కర్తవ్యంగా మనవి చేస్తున్నానని అన్నాడు హనుమంతుడు.

రాముడు ముహూర్తకాలం ఆలోచించాడు. విభీషణుని ఉద్దేశించి మిత్రమా! సీతకు స్నానాదికం గావింపజేసి వస్త్రాభరణాదులను అలంకరించి ఇక్కడకు రప్పించవలసినదని ఆజ్ఞాపించాడు.

విభీషణుడు ససంభ్రమముగా రాముని ఆజ్ఞను సీతకు తెలియజేసి స్నానాదులు గావింపచేసి ఉత్తమవస్త్రాభరణాలు అలంకరింపజేసినాడు. పల్యంకిక పై అధిష్టింపజేసి వనితాజనంచే ఆమెను రాముని సాన్నిధ్యానికి రావింపజేసెను.

జగదేక మాతయగు సీతాదర్శన కుతూహలులైన వానర రాక్షసులు తండోపతండములుగా ముందుకు వస్తున్నారు. వారిని దగ్గరకు రాకుండునట్లు వేత్రహస్తులచేత వారింప జేస్తున్నాడు విభీషణుడు.

విభీషణా! వారిని వారించకు. వారందరూ నావారలే. వివాహ సమయమున, యుద్ధసమయాన, యాత్రాసమయాన, మరణ సమయాన విశేషించి నా సమక్షంన రాజస్త్రీలు అవకుంఠనాధులను పాటించనక్కరలేదు. అందరు సందర్శింపవచ్చు అన్నాడు రాముడు సీతాదేవి పల్యంకిక నవరోహణమొనర్చి కృతావకుంఠనయై రాముని దర్శించుచూ ఆనందోత్సాహములతో స్వామి దివ్యముఖ కమలముల వీక్షించింది. ఆర్యపుత్రా! అని సంబోధించింది. కన్నుల ఆనంద భాష్పాలు మంచిముత్యాలవలే రాలాయి.

రాముడు క్షణకాలం మౌనమును ఆశ్రయించాడు. సీతాదేవిని వక్రంగా చూశాడు. దీర్ఘనిశ్వాసములను విడిచాడు.

భద్రే! దైవకంగా మన ఎడబాటు జరిగింది. దుష్టుడగు రావణుడు అపహరించాడు పౌరుషంతో విభీషణ వానర సహాయంతో రావణుని చంపి నీచెరవిముక్తి గావించాను. తద్వారా ఇక్ష్వాకుల కీర్తి ప్రతిష్టలకు కళంకము రాకుండా కపాడుటయే కర్తవ్యంగా భావించాను.

మోహోపచేతస్కుడైన రావణుని వీక్షణంచేత చూడబడి అపహరించబడి కాముకుడై, బాలిసుడైన రావణుని అధీనంలో సంవత్సరకాలం ఉన్న నిన్ను నేను ప్రతిగ్రహింప జాలను. యధేచ్ఛగా నీవు చరించవచ్చు. లక్ష్మణుడు, భరతుడు, విభీషణుడు సుగ్రీవుడు ఎవ్వరియందైన ప్రీతికలదేని వారితో వర్తించు సుఖించు

అన్నాడు రక్తాంతలోచనుడైన రామడు.

సీతాదేవి నెత్తిన పిడుగుపడినట్లైంది. జల్లున దుఃఖాశ్రువులు కన్నుల నుండి రాలినవి. కంఠం రుద్ధమైంది. శరీరం వణికింది. నోట్లో తడి ఆరిపోయినది.

ఆర్యపుత్రా! ప్రాకృతులు, ప్రాకృతస్త్రీని పలుకునట్లు పలుకుట ధర్మంకాదు. జనకుని వంశంలోపుట్టి వివాహసమయాన సహధర్మచారిణిగా ప్రతిజ్ఞచేసి మనోవాక్కాయకర్మల భక్తి శ్రద్ధలతో సేవించు నా శీలంను శంకించుట నా దురదృష్టము. సూర్యచంద్రులు నక్షత్రములు, పంచభూతాల సాక్షిగా హృదయాన నిన్నువినా ఎవరినీ స్మరించి యుండలేదు. అట్టి అనువ్రతనగు నన్ను శంకించుట భావ్యంకాదు.

రాముడు మాటలాడలేదు. సీతకు ఆవేగం అణగలేదు.

లక్ష్మణా! సకలలోకజ్ఞుడైన ఆర్యపుత్రునిచే శంకించబడిన ఈ శరీరాన్ని ధరించలేను. చితిని పేర్చుము. అందులోపడి ఈ దేహం నశించుగాక! అని సీతాదేవి పలికినది. లక్ష్మణుడు నిర్విణ్ణుడైనాడు. రాముడు కనుసన్న చేశాడు. లక్ష్మణుడు చితిని పేర్చాడు. అగ్నిని రగిల్చాడు. జ్వాలలు వ్యాపించాయి. శ్రీరామునికి ప్రదక్షిణ నమస్కారము చేసింది సీత. "అహోరాత్రులు, పంచభూతాలు, సూర్యచంద్ర గ్రహతారకాదుల సాక్షిగా నా హృదయాన శ్రీరామచంద్రుని విన అన్యుని తలంచనట్లైతే అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక" అని సీతాదేవి జ్వలితాగ్నియందు పూర్ణాహుతివలె ప్రవేశించింది. జ్వాలా మాలికలు అనుకరములు సాచిగ్రహించినట్లు సీతను అగ్ని తనయందు చేర్చుకొన్నాడు.

ఆకాశాన అష్టదిక్కుల నుండి ప్రతిధ్వనిస్తూ విమానాలు భూమిపై నిల్చాయి. వెన్నెల వెలుగులు నలువైపులా వెదజల్లబడ్డాయి. అంతటా హాహాకారాలు చెలరేగాయి అంతలోనే సంభ్రమాశ్చర్యాలు వానర రాక్షసులు పొందారు.

బ్రహ్మ, ఇంద్ర, అగ్ని, యమ, వరుణ, కుభేర, ఈశానాదులు, పలువురు దేవతలు, ఋషులు శ్రీరామచంద్రునికి నమస్కరించారు.

రామభద్రా! సాధ్వియు సకలలోక జననియగు జానకిని అగ్నిలో ప్రవేశించుచుండగా ఉపేక్షించుట తగదు. ఎంతపని చేశావు? ఆమెను పాప్రకృతవనితగా తలచి ప్రాకృతునివలే ప్రవర్తించావు. నీవు సాక్షాత్ శ్రీమన్నారాయణుడవు. సీత జగదేకమాత. శ్రీమహాలక్ష్మి లోకకంటకుడైన రావణ సంహారం చేశావు. లోకాల్ని ఉద్ధరించావు ప్రభూ! అని దేవతలు ప్రార్థించారు. సీతాదేవి అగ్నిప్రవేశం సముచితంకాదని పలికారు.

దేవతలారా! నేను దైవమునా? దశరధ పుత్రుడను. రాముడనువాడను. మానవమాత్రుడను నాకింతే తెలియును. అని చేతులు జోడించి రాముడు పలికాడు.

ఏ ప్రభో! జగదాధారా! జగద్రక్షణార్థం ధర్మరక్షణ కొరకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొరకు మనుష్య రూపమునవతరించిన శ్రీ మహావిష్ణువు నీవు. లక్ష్మిదేవియే సీత. నీవు ఆదిమధ్యాంత రహితుడవు అవాఙ్మానసగోచరుడవు. ఉపనిషత్ప్రతి పాద్యుడవు. జగచ్ఛరీరుడవు సూర్యచంద్ర గ్రహతారకాదులు యజ్ఞయాగాదులు స్వాహాస్వధవషట్ మంత్రపల్లవములు యాగఫలితాలు ప్రణవము, ప్రపంచము అంతా నీవే. నీవు లేనిదే లేనేలేదు. జగదీశ్వరా! జగద్రక్షకా! రక్షించు

మమ్ములను సర్వమునూ రక్షించు అని సకల దేవమునివర్యులు ప్రార్థించారు శ్రీరామచంద్రుని.

అగ్నిహోత్రుడు జ్వాలలనుండి తప్త చామీకరాభాసయగు సీత మహాసాధ్విని సర్వాభరణ భూషితను, రక్తకౌసేయవాసను శ్రీమహాలక్ష్మిని పరమాత్మయగు శ్రీరామచంద్రునికి సమర్పించాడు.

ప్రభూ! శ్రీరామచంద్రా! ఈ సీత త్రిజగత్పావని. ఈమెను స్మరించినంత మాత్రమున సకల పాపౌఘములు నశించిపోతాయి. త్రిజగత్కళ్యాణిని ప్రతిగ్రహించి, మమ్ములనను గ్రహించు అని రామునికి అగ్నిహోత్రుడు సీతాదేవిని సమర్పించాడు.

సకల దేవతలారా! మహాశ్రేష్ఠులారా! వానరరాక్షస పుంగవులారా! ఈ సీత చరిత్ర పవిత్రమైనది నాకు తెలుసును. కానీ లోకం భూత భవిష్యత్కాలాలందు ఎట్లు విశ్వసింపగలదు. కనుకనే అగ్ని పరిశుద్ధియగు ఈమెను ప్రతిగ్రహిస్తున్నాను. సూర్యునికాంతి విడిచి ఎట్లుండగలదు? నిత్యానపాయిని ఈ సీత అన్న రామచంద్రుని మాటలను అందరూ హర్షించారు.

ఎంతపని చేశావయ్యా! ఆయమ్మ అగ్నిలో ప్రవేశిస్తుంటే చూస్తూ ఊరుకొన్నావు. ఆమెపై తగనినిందలు వేశావు. ఇప్పుడేమో నాకంతా తెలుసు అంటావు. ఆ తల్లి మనస్సు ఎంతతల్లడిల్లిపోయిందో నీకేమి తెలుసు? మేమెంతగా బాధపడ్డామో గమనించావా? ఇప్పటికైనా యతార్థాన్ని గుర్తించి మమ్ముల్ని పునీతులను చేశావు అని వానరులు రాక్షసులు అనుకున్నారు.

రామచంద్రా! వీర్ణ ప్రతిజ్ఞుని గావించిన నీ తండ్రి దశరథ మహారాజు ఇంద్రలోకం నుండి విమానం మీద వచ్చారు. అతనికి

నమస్కరించు అన్నారు దేవతలు.

ఉదయ సూర్యునివలె విమానం పై ప్రకాశిస్తున్న తండ్రిని సీతారామ లక్ష్మణులు నమస్కరించారు.

దశరథుడు రామలక్ష్మణులను కోడలును చూసి నాయనలారా దేవతలంతా రావణవధార్థం కైకచేత ఈ వరమును కోరినట్లు చేసారని గ్రహించాను. నన్ను సత్యప్రతిజ్ఞుని గావించావు. సీత లోకోత్కృష్ట గుణములు కలిగినది. మన వంశాన్ని సముద్ధరిస్తుంది. భరతుని తల్లులను, పౌరులను, ఆనందపరచవలసినదిగా కోరుతున్నాను. పట్టాభిషిక్తుడై ఆయురారోగ్య భాగ్యములు కలిగి వర్ధిల్లున్నట్లుగా దశరథుడు సీతా రామలక్ష్మణులను ఆశీర్వదించి, స్వర్గమునకు చేరుకున్నాడు.

రామచంద్రా: లోకకంటకుడైన రావణుని సంహరించి సకల లోకాలకు ఆనందాన్ని కల్గించావు. ధర్మసంస్థాపనచేసి దేవఋషి సాధు సత్పురుషలకు సంతోషాన్ని కల్గించావు. జగత్ కళ్యాణరాముడవై పట్టాభిషిక్తుడవై చిరకాలము రాజ్యపాలన గావించి ప్రజలను రంజింపజేయుము. నీకు మేము ఏదైనా ఒక వరమును ఇవ్వదలిచాము కోరవలసినది అని దేవతలు శ్రీరామునితో పలికేరు.

దేవతలారా: సకల వానరభల్లూక గోలాంగులాదులు నాకై యుద్ధంచేసి ఆలుబిడ్డల ఆశత్యజించి గెలుపు నందించారు వారందరూ పునర్జీవితులై జవసత్వములు కలవారుగ ఆయురారోగ్యములు పొందునట్లుగా వరము ఇవ్వండి. వారు నివసించుచోట ఏ కాలము లందైనను ఫలమూలాదులు సమృద్ధిగా ఉండునట్లు రుచ్యమైన నీటి వనరులు కలుగునట్లు వరమును కటాక్షించండి అని రాముడు కోరినాడు.

దేవతలు "తథాస్తు" అని పలికి రామునికి నమస్కరించి తమ తమ విమానముల మీద స్వస్థానాలకు చేరుకొన్నారు.

రామభద్రా! నా ఆతిథ్యమును గ్రహించి కృతార్థునిచెయ్యి నీకు నేను ప్రేష్యుడను భక్తుడను కరుణించు అన్నాడు విభీషణుడు.

విభీషణా! నీచే సత్కారము పొందినట్లే సంతసిస్తున్నాను. ఈ వానరవీరులెల్లా సర్వవిధాలా సత్కరించు నేను భరతుని చూడ దలచుకున్నాను. తల్లులను సంతోషపరచాలి. ఇక్కడనుండి వేగముగా అయోధ్యకు చేరు ప్రయత్నము వెంటనేచెయ్యి అన్నాడు రాముడు

ప్రభూ! ఇదిగో పుష్పక విమానము కుబేరుని జయించి మా అన్న సంపాదించాడు. దీనిపై అధిష్టించి సత్వరంగా అయోధ్యకు చేరగలవు అని విభీషణుడు మనవి చేశాడు.

కామగమనము, మనోవేగము కలిగిన దివ్య విమానమగు పుష్పకమును తీసుకు రాబడినది. సీతా రామలక్ష్మణులు అందు అధిష్టించిరి. సుగ్రీవాదుల కిష్కంధలో సుఖముగా ఉండు మనియు విభీషణుని లంకానగరపాలకుడవై సుఖమునొంద వలసినదిగా పలికి అయోధ్యకు చేరుటకు సిద్ధపడిరి.

విభీషణ సుగ్రీవాదులు నమస్కరించి శ్రీరామచంద్రా! మేము కూడ అయోధ్యకువచ్చి పట్టాభిషిక్తుడవైన నిన్ను దర్శించి, రాజ మాతలకు నమస్కరించి, వెళ్లగలము. తమతో మారాకను అనుమతించవలసినదిగా ప్రార్థించారు.

శ్రీరాముడు సంతోషించి సుగ్రీవాది వానరులను విభీషణాధి రాక్షసులను విమానముపై అధిష్టింప చేసుకున్నాడు ఆపుష్పకవిమానం

రాముని అనుమతిని బడసి మధురమైన ధ్వని చేయుచు ఆకాశమునకు ఎగిరినది. అయోధ్యాభిముఖి అయినది.

జానకీ! కైలాసశిఖర ప్రఖ్యాతములైన త్రికూటములపై లంకానగరము తత్పరిసరకాననములు చూడుము ఇది స్కంధావారము ఇది సువేలా పర్వతము అటుచూడు అక్కడ లోకకంటకుడు రావణుడు సంహారింపబడ్డారు. ఇదిగో ఇక్కడ ఇంద్రజిత్తును లక్ష్మణుడు సంహరించాడు. ఆ ప్రదేశములో కుంభకర్ణుడు కూలిపోయాడు. అటు గమనించు సాగరమధ్యమున సీమంతంవలే కనబడుచున్నది. అదియే సేతువు వానరులు దానినుండి సుగమంగా లంకానగరం చేరినారు. ఇక్కడ మహాదేవుడగు సముద్రుడు ప్రసన్నమైనాడు ఈ ప్రదేశంలో విభీషణునితో సఖ్యం చేశాను. వాని సఖ్యముచేతను రావణ వధ సుగమం అయింది. అదిగో అది సుగ్రీవ పాలితమైన కిష్కింధ. ఇక్కడ వాలి సంహరింపబడ్డాడు. ఆ కనబడుచున్నదే ఋష్యమూకము అని రాముడు సీతాదేవికి యుద్ధవిశేషములు మార్గవిశేషములు తెలియజేస్తున్నాడు.

ఆర్యపుత్రా! సుగ్రీవాది వానరవీరుల భార్యలను కూడ నాతో తీసుకొని వెళ్లదల్చాను. అని జానకి పలికింది.

విమానం నిలుపబడ్డది. సుగ్రీవాదులు కిష్కింధలో ప్రవేశించారు. తమ తమ భార్యలను అయోధ్య నగరమునకై ప్రయాణము చేశారు. సత్వరముగ తార, రుమ, మొదలగు వానరస్త్రీలు బయలుదేరి విమానము దగ్గరకు వచ్చారు. సీతాదేవికి సమస్కరించి విమానమును అధిష్టించారు. విమానం గగనమార్గానికి ఎగిరిపోయింది.

ఇది మతంగాశ్రమం ఇక్కడ శబరినిచూసాము. అది జనస్థానం అక్కడ ఖరదుషణాదులు సంహరింపపడ్డారు. ఇది పంచవటి.........

ప్రభూ! మరి చెప్పకండి. ఇక్కడనే నేను పరిలోభానికి లోబడ్డాను. నా ప్రారబ్ధం ప్రబద్ధలైంది. కష్టాలకు కారణమైంది. అన్నది సీత.

అది యొక పీడకల దానిని మరచిపో అన్నాడు రాముడు. ఇటుచూడు ఇది అత్రిమహర్షి ఆశ్రమం, అల్లది చిత్రకూటం ఆ ప్రవహించునది గంగానది. ఇది శృంగిబేరపురము ఇది సరయునది అదిగో అయోధ్యానగరము నమస్కరించు అన్నాడు రాముడు. అందరూ నమస్కారము చేశారు.

చైత్రశుద్ధ పంచమి సరికి భరద్వాజాశ్రమ ప్రాంగణానికి చేరుకున్నది పుష్పక విమానము. సీతా రామలక్ష్మణులు భరద్వాజునకు నమస్కరించారు. మహర్షి పరమానంద భరితుడైనాడు. ఎల్లరకు తగు విందు ఒనర్చాడు.

## పట్టాభిషేకము

" యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితం "

వాల్మీకి ముఖోద్ధితమైన ప్రథమ శ్లోకము యొక్క ద్వితీయ పాదము ఇది.

ఇంతవరకు జరిగిన వాలివధ రావణవధ కల లోకోత్తర రామచరిత్ర కామమోహితుడైన వాలి, రావణుడు. ఎందరెందరి స్త్రీల మాన ప్రాణాలతో చెలగాటం ఆడేరో! ఎన్ని కుటుంబాల్లో చిచ్చుపెట్టి నవ్వుకున్నారో! మానిషాదునిచేత సంహరింపబడిన క్రౌంచపక్షి బోలు వాలి రావణ జగత్కంటకులు. కనుకనే శ్రీరామచంద్రుని కీర్తిప్రతిష్టలు ఆ చంద్రార్కం దిగంతాల వ్యాపించి నేటికిని వెన్నెల వెలుగులు

పాలనురుగులు అమృతపుజల్లు కురిసి జగదానంద సంధాయకమైనది రాముని జగత్ కళ్యాణరాముని చేసింది. భావికాలంలో రాముడే దేవుడు అనుకున్నాడు భరద్వాజ మహర్షి.

అది నందిగ్రామం భరతాశ్రమంలో జటావల్కలధారులైన భరత శత్రుఘ్నులు శ్రీరాముని పాదుకలను నవరత్న సింహాసనమున ఉంచి, ఆవాహన, ఆశన, అర్ఘ్య, పాద్య, ఆచమనీయాదులతో షోడశోపచార పూజలు గావించారు. తమకువలె నారచీరలు ధరించి కంఠలగ్న తులసీ నళినాక్షమాలికాధారులు. సధూర్ధ్వ పుండ్రధారులైన రామభక్తులు అభిషేక పాదోదకమును స్వీకరించారు. అర్చితకుసుమాలను కన్నులకు అద్దుకొని శిరసా ధరించారు.

రామా! నీ దర్శనభాగ్యము శీఘ్రముగా కటాక్షించు అని ప్రార్ధిస్తున్నారు. పదునాలుగు వత్సరాలు నేటికి గడిచి పోతున్నాయి మా జీవితాలు నీ దర్శనంచేసి ధన్యంకావలదా? అని పరిపరి విధాల ప్రార్ధిస్తున్నారు.

అదిగో ఆ మహాపురుషుడే భరతుడు భక్తిభావ భరితుడు. రామభక్తియే మూర్తీభవించినట్లు యున్నాడు. ఆ ప్రక్కన శత్రుఘ్నుడై ఉంటాడు మిగిలినవారు రామభక్తులు.

భాతృభావన, భక్తితత్పరత, లోకోత్తరమైనది అన్నదమ్ములలో గంగాతీరంలో శృంగిభేరిపురంలో గుహుడు తెల్పిన లక్షణములు అన్నియూ ఈ ఇరువరిలో కనబడుతున్నాయి. అతడు ఎంతటి భక్తుడు? రాముని ఆగమనంవిని ఒళ్లు పులకరించగా కన్నులు అరమూడ్చి ఆనందభాష్పములు రాల్చినాడు ఆ గుహుడు.

ప్రభూ! రాఘుచంద్రా ఇటగల ప్రజలుపశుపక్ష్యాదులు సైతము

రామరామ అనుచున్నవి. ఇది రామభక్తిసామ్రాజ్యం హనుమంతుడు పులకిత తనువై అనుకొంటున్నాడు.

" ఎవరునాయనా! సాక్షాత్ శంకరుని వలే గోచరిస్తున్నావు. మా అన్న ఇక్కడలేడు నాకింక ఆతని దర్శన ప్రాప్తి లేదు. అగ్ని ప్రవేశమే కర్తవ్యము. నాకిక మనుగడలేదు అని భరతుడు ఆవేదన చెందుతున్నాడు.

" దాసోహం కోసలేంద్రస్య " శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణ సహితుడై మీ క్షేమం కోరుతున్నాడు. ఆ మహనీయుడు రావణ సంహారమొనర్చి ఎల్లరిచే పూజింపబడి భరద్వాజాశ్రమంలో ఆతని అనుమతిచే అచట నిలిచాడు నాపేరు హనుమంతుడందురు

అన్నగారి ఆగమనవార్తకు భరతుడు ఆనందపరవశుడైనాడు. ఎంతటి శుభవార్త. అమృతప్లావితమైనది ఆతని మనసు.

హనుమంతుని ఆలింగనం చేసుకొని అన్నా: హనుమన్నా: ఈ శుభవర్తమానం చెప్పి మా ప్రాణాలు నిలిపావు. ఈ క్షణమెంత మంగళకరమైనది. రాముని సీతాలక్ష్మణుల చరిత్ర సవివరంగా చెప్పి నన్ను ధన్యుణ్ని చెయ్యి. అన్నాడు భరతుడు.

అంతటా హనుమంతుడు చిత్రకూటము నుండి రాముడు బయల్దేరింది మొదలు రావణ సంహారంవరకు జరిగిన సకలవృత్తాంతం భరతునికి మనవి చేశాడు.

వెంటనే భరతుడు శత్రుఘ్నుని పిలిచి అయోధ్యలోగల వారందరికి, తల్లులకు, మంత్రులకు, పురోహితులకు తెలియజేసి రామ దర్శనలాలసులైన వారంతా ఇక్కడకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు

నిమ్నోన్నత ప్రదేశాలు సమీకరించాడు. రథ, గజ, హయపదాతులు వందిమాగదులు వీణా వేణు ఆదివాద్యబృందాలు అందరూ నంది గ్రామంలో సమావేశమైనారు. తల్లులు దయచేశారు. అయోధ్యాలో గల ఆబాలగోపాలము వచ్చేసారు. పత్రపుష్పఫలమాల్య మోదక హస్తాలతో సీతారామ లక్ష్మణులకు స్వాగత మీయడానికి ఎదురు చూస్తున్నారు.

భరతుడు రామ పాదుకలు శిరస్సు ధరించాడు. శతృఘ్నుడు ఛత్రం ధరించాడు. కొందరు చామరాలు వీస్తున్నారు. స్వామి రాకకై ఎదురు చూస్తున్నారు. వివిధ వాయిద్య విశేషాలు మోగుతున్నాయి. అదిగో పుష్పక విమానము.

అందరూ తలలు పైకెత్తారు. ఉదయ సూర్యునివలే ప్రకాశిస్తున్నదావిమానము. అందు అధిష్టించిన సీతా రామలక్ష్మణులు దర్శనమిచ్చారు. ఎల్లరూ ఆనందోత్సాహాలతో నమస్కరించారు. శ్రీరామచంద్రునికి జై అని జేజే ధ్వానాలు చేశారు.

భరత శతృఘ్నులు ఉన్మాదులవలె పరుగెత్తారు. హంస యుక్త విమానం భూమిపై నిలచింది. భరత శత్రుఘ్నులు సాష్టాంగ దండప్రణామం చేశారు.

రాముడు విమానం నుండి అవతరించాడు. భరత శత్రుఘ్నుల్ని ఆలింగనం చేసుకొన్నాడు. అన్యోన్యం పర్వసులై ఆనంద భాష్పాలు రాల్చారు. జానకి పాదాభివందనాలు గావించారు భరత శతృఘ్నులు. లక్ష్మణుడు భరత శత్రుఘ్నులకు అభివాదనంచేశాడు పౌరులెల్లరూ సాష్టాంగ నమస్కారం చేశారు. సీతా రామలక్ష్మణుల దర్శనంచేత అయోధ్య పునీతమైపోయింది.

లోకోత్తరమైన ఆ అన్నదమ్ముల కలయిక సౌభాత్రము ఎల్లరకు ఆనందాశ్చర్యాలలో నిమగ్నులను చేసింది. శ్రీరామ చంద్రుడు సీతా లక్ష్మణ సహితుడై మాతృమూర్తులకు, వశిష్టాది గురువర్యులకు పాదాభివందనం గావించాడు. భరతుడు రత్నపాదు కలను శ్రీరామచంద్రుని పాదములకు యోజనం చేశాడు.

అన్నయ్యా! ఇంతవరకు నీ రాజ్యమును ఆ పాదుకలు నిర్వహించాయి, కోశాగారము పదిరెట్లు వృద్ధి చేయబడ్డాయి. ఇక సర్వస్వం నీవే నిర్వహించు అని భరతుడు రామునికి విన్నవించు కొన్నాడు.

పుష్పక విమానం కుభేరునికి పంపబడింది. మంత్రి భట సామంత పురోహిత పౌరజనసమక్షంలో భరతుడు చేతులు జోడించి శిరస్సునుంచు కొన్నాడు.

శ్రీరామచంద్రా! నీ వనవాసాధి నిర్వాహణచేత నా తల్లి గౌరవించబడ్డాది. చిత్రకూటంలో రాజ్యం నాకిచ్చావు. నీకు తిరిగి సమర్పించు కొనుచున్నాను. ప్రతిగ్రహించు బలిష్టమైన బలీవర్దనము వహించవలసిన భారమును లేగదూడ మోయలేదు. నీకు నాకు హంస కాకములకున్నంత అంతర్యము కలదు. నేను రాజ్యమును భరించుటకు అసమర్ధడను. ఆ చంద్రార్కం సర్వం సహచక్రాన్ని నీవే పాలించు ప్రజలను మమ్ముల్ని రక్షించు అని భరతుడు భక్తితత్పరుడై ప్రార్ధించెను.

శ్రీరాముడు అంగీకరించాడు నిర్వికారుడై

శత్రుఘ్నుని ఆదేశంచేత సుఖహస్తులగు క్షురకులు రామ లక్ష్మణుల జడలు శోదించారు. సుగ్రీవ విభీషణాదుల కెల్లరకు

అభ్యంగనాదులు గావించారు. వస్త్రాభరణ మాలికాదులను అందరూ అలంకరించుకొన్నారు. రాజమాతలు సీతాదేవికి అభ్యంగవాదులు నిర్వర్తించి అలంకరించారు. వానర పత్నులకందరికి తగు శ్రద్ధతో స్నానాధికాలు గావింపజేశారు. వారి మాంగల్యబలమే శ్రీరామునికి రక్షయై విజయం చేకూర్చిందని ఆతల్లి తలంచింది. వస్త్రాభరణాలు అలంకరించారు.

వశిష్ట, సుమంత్ర విజయ అశోకాదిమంత్రులు అయోధ్య చేరారు. రాముని వృద్ధికొరకు, ప్రజాశ్రేయస్సుకొరకు మంత్రాలోచన చేశారు. పట్టాభిషేక కార్యక్రమాలు నిశ్చయించారు.

నగరమంతా అలంకరింపబడ్డాది. భవన ప్రాసాద చైత్య దేవాలయాలు అలంకరించారు. బలిపూజా విధానాలు గావింప చేశారు. అన్ని మార్గాల పతాకధ్వజ తోరణాలంకృతమైనదిగా అలంకరించారు. అయోధ్య అమరావతి శోభనుమించింది సప్తాశ్వరథము వలె ప్రకాశించు కాంచరథాన్ని సూతుడు తీసుకు వచ్చాడు. సీతారాములు రథాన్ని అధిష్టించారు. భరతుడు అశ్వముల పగ్గములు పట్టుకొన్నాడు లక్ష్మణుడు ఛత్రం ధరించాడు. విభీషణ, శత్రుఘ్నులు చామరాలు ధరించారు. రథము మందగమన సుందరంగా అయోధ్యాపుర వీధుల నడుపబడుచున్నది. వీణావేణు విపంచికలు కళ్యాణిరాగం ఆలపిస్తున్నాయి. శంఖకాహళములు మోగుతున్నాయి. పురంధ్రీజనులు సౌధాగ్రంనుండి పుష్పవృష్టి కురిపిస్తున్నారు. పౌరులు రామకథాకదన శ్రవణతత్పరులై వెంట అనుసరిస్తున్నారు.

సుగ్రీవాది వానరవీరులు నరరూపధారులై తొమ్మిదివేల ఏనుగులపై నధిష్టించి వస్తున్నారు. దేవతలు, ఋషులు గరుడగంధర్వాదులు అదృశ్యులై అనుసరించారు.

రథము రాజప్రాసాదముగశాల ఆగింది. సీతారాములు రథావరోహణము చేశారు పురంధ్రీమణులు నీరాజనాలు సమర్పించారు రాముడు రాజభవనాన్ని ప్రవేశించాడు. ముగ్గురు తల్లులకు నమస్కరించాడు. పితృమందిరాన్ని సుగ్రీవునికి విడదిగాయియ్య బడింది వశిష్ఠాది మునుల ప్రోత్సాహంచేత సుగ్రీవుని ఆజ్ఞచేత రామపట్టాభిషేక నిమిత్తము 500 మహానదుల జలం వానరులచే సేకరించబడ్డది.

సుషేణుడు తూర్పు సముద్రంనుండి, వృషభుడు దక్షిణ సముద్రం నుండి, గవయుడు పశ్చిమ సముద్రం నుండి, నలుడు ఉత్తర సముద్రం నుండి బంగారు కలశలతో సముద్రోదకాలు తీసుకొచ్చారు.

అయ్యోధ్య అభిషేక మండపము సహస్రస్తంభ నిర్మితము అందనేక కాంచనవేదికల లంకరింపబడి ఉన్నాయి. కుడ్యాలందు మహ్యాదిప్రాచీన చక్రవర్తుల ఆలేఖ్యములు వ్రేలాడుచున్నాయి సమశీతోష్ణస్థితి కలిగియున్నదా మండపం. సుదూర దర్శనశ్రవణాన్కి అనుకూలత కల్గిఉన్నది. వివిధ విధాసనాలు కలవు. మణిమయ దీపాలంకృతమై యున్నది. వివిధవర్ణ చిత్ర విచిత్రకౌసేయ వస్త్రాలంకృతమైన ద్వారములు వాతాయనములు కలవు. చూతపల్లవ మౌక్తిక తోరణాలంకృతమైంది, ద్వారాలకిరు పార్శ్వముల పూర్ణకుంభాదిశోభితమైంది ఆ అభిషేక మండపము.

వశిష్టవారు దేవనారధ జాబాలికాశ్యపాది పురోహితులు పౌరులు, జానపదులు, మంత్రులు, సామంతులు, బంధువులు మిత్రులు యథాస్థానాలలో అధిష్టించి యున్నారు. లాజాక్షత కుశుమ పల్లవ ధధిక్షీరఘృతాదులు సేకరించబడ్డాయి, కృష్ణాజనము, వ్యాఘ్రాజినము, కుశాస్తరణం సింహాసన సమీపానకలవు. వాటిపై వశిష్టాదులు

కూర్చుని యున్నారు. వివిధ వాద్య విశేషాలు శ్రావ్యంగా మ్రోగు తున్నాయి.

రత్నమయ సింహాసనమును సీతారాముల నధిష్టింపజేశారు పురోహితులు ఓషధిపురస్కృతములై పంచత్వక్ పంచిపల్లవశోభిత ములై మంత్రితమున సువర్ణ కలశలతో సముద్రోదకములతోనూ నదీ ఉదకాలతోనూ మునుముందుగా వశిష్టాది పురోహితులు గాయత్ర్యాది ఛంధములతో "మిత్రోసి, వరుణోసి, ధృవంత" ఇత్యాది వీర్యవంతములైన మంత్రాలు పఠిస్తూ సీతారాములకభిషే కించారు దేవతలు దేవేంద్రునికివలె ఋత్విక్కులు సీతారాములకు అభిషేకించినపిదప, కన్యలు, మంత్రులు, సామంతులు యోధులు తక్కంగల పెద్దలు పసన్నములై సుగంధభరితాలైన తీర్థములను అభిషేకించారు.

బ్రహ్మచే నిర్మితమైనది మన్వాది సామ్రాట్టులు ధరించినది నవరత్న నిర్మితమైన కిరీటాన్ని బంగరుపళ్లెరము నుంచి పూజించి "ఆయుర్ధదాతీతి" మంత్రమునుచ్ఛరిస్తూ వశిష్ఠుడు శ్రీరాచంద్రుని మస్తకము నలంకరించాడు. "శ్రీరామచంద్రునికి జై" అంటూ ఎల్లరూ జై జై ధ్వానాలు చేశారు. సుగంధభరితమైన చల్లని గాలి వీచింది. పుష్పవృష్టికురిసింది. దేవదుంధుభిలు మ్రోగినవి గంధర్వులు గానం చేశారు. అప్సరసలు నాట్యం చేశారు.

ఇంద్రచోదితుడైన వాయువు శతసువర్ణ పుష్పమాలికను శ్రీరామునికి కానుకగా సమర్పించాడు.

శ్రీరామ పట్టాభిషేక మహోత్సవ సమయంలో భూమి సస్యపతియైనది. పాదపములు ఫలవంతములైనవి. పుష్పములునూ సుగంధ భరితములైనవి.

లక్షలాది ఆవులు, గుర్రములు, వృషభములు, స్వర్ణాదులు బ్రాహ్మణుల కిచ్చారు. మణి విగ్రహంతో కూడిన స్వర్ణహారమును సుగ్రీవునకొసగినాడు. వజ్రవైడూర్యములతో కూడిన అంగదములు అంగదునికి బహుకరించాడు. మణులతో కూడిన ముత్యాలహారాన్ని సీతాదేవికొసగినాడు శ్రీరామచంద్రుడు.

సీతాదేవి రత్నములతో కూడిన మౌక్తికహారమును చేత ధరించి శ్రీరామచంద్రుని ముఖమునవలోకించినది. ఇంగితజ్ఞుడైన శ్రీరామచంద్రుడు "బలపౌరుషాలచేత శక్తిసామర్థ్యాలచేత నీవు ఎవనియందు సంతుష్టిచెందినావో వానికొసగుమని" పలుకగా వెంటనే ఆ హారమును వాయుపుత్రుని కొసగెను.

వస్త్రాభరణమాల్యాదులు, ఎవరికి ఏమి యొసగిన సంతుష్టి నొందెదరో వారికవి అన్ని శ్రీరామచంద్రుడొసగి సత్కరించాడు. సుగ్రీవాది వానరులు, విభీషనాది రాక్షసులు, సఫలీకృతమనోరథులై పరమానందం నొందారు.

ఎల్లరూ, ఎల్లకామ్యాలూ ఒడసి సీతారామ లక్ష్మణులకు నమస్కరించి అనుమతిని ఒడసి తమతమ దేశములకు వెళ్ళిపోయారు విభీషణుడు ఇక్ష్వాకుల నుండి కులదైవమైన రంగ మందిరాన్ని ప్రతిగ్రహించి లంకానగరానికి వెళ్లాడు.

యువరాజ్య పదవినందు లక్ష్మణుడు అంగీకరించని కారణమున భరతుడు అన్న ఆజ్ఞననుసరించి యువరాజ్య పట్టాభిషిక్తుడైనాడు. శ్రీరామచంద్రుడు శతాశ్వమేధావి క్రతువులాచరించి ప్రజారంజకుడై పదకొండు వేల సంవత్సరాలు రాజ్యపాలన చేసినాడు.

ఆ స్వామి పరిపాలనా కాలంలో స్త్రీలు వైదవ్యదుఃఖమును రుగరు వ్యాళ, వృశ్చికాది భయములులేవు. వ్యాధి, చోర, దుర్భి ?దులు లేవు. సకల ప్రజలు ఆయురారోగ్య భాగ్యములతో అలరారి ారు. దివ్యసుందరమూర్తులై సర్వాభరణ భూషితులై విలసిల్లినారు ందరు, అందరిని రామునిగా తలచి హింసావిదూరులై ఆనందంతో ప్పియున్నారు. వృక్షములు నిత్యము ఫలపుష్పాదులచే రమణీ యుంగా ఉన్నవి. సకాలమున వర్షములుపడి పుడమి సకల సస్యములు లింప చేసినది. వివిధ వర్ణములవారు వారి వారి వృత్తులందు ంతుష్టులై నిర్వర్తించేవారు. ఎల్లరూ సకల సౌఖ్యములు పొందిరి.

రామరాజ్యం జగద్విఖ్యాతమై అలరారింది. అద్యాపి ానవ మాతృనిచేత అభిలషించి బడుచున్నది. హర్షమైన శ్రీరామ చరిత్ర పఠింపబడి పూజింపబడి సకల సంపత్కరమై అలరారు చున్నది. ఎల్లవిఘ్నములు ఎల్లకష్టములు తొలిగి ఐహిక ఆముష్మిక ఫలప్రదమైనది. జగన్మంగళ కారకుడగు కళ్యాణరాముడు జగదభి రాముడైన సీతారాముడు నామమాత్రస్మరణ చేత సకలారిష్టములు తొలగించి సర్వశుభములొసగ గలడు,

॥ ఇది షష్టమ పుష్పము సమాప్తము ॥

సర్వేజనాః సుఖినోభవంతు

తత్సత్



# ఇతర రచనలు

ఆదర్శజీవి

హయగ్రీవ శతకము

శ్రీసూక్తము ఆంధ్రీకృతం

మాయావతి

పుష్పాశయం

ప్రగతి

సీత

సీతాకల్యాణం

పురుషోత్తముడు

సల్లాపముది

బడిపిల్లలు

సీతారామసుప్రభాతం

ఆంధ్రరాష్ట్రం

ద్వాదశాక్షరీస్తోత్రం

ఛాందోగ్యోపనిషత్

హాటకేశ్వర విలాసం

అభ్యుదయం

కర్మభూమి

ఈశావాస్యోపనిషత్

పాంచరాత్రం

భారతీయ మతవాహిని



రచయిత - దంపతులు

చామర్తి కూర్మాచార్యులు

చామర్తి అలివేలమ్మ